దనయాజ్ఞ మీఱిన దాసులమీఁదఁ
గనలి భూపతి దండు గదలినపగిదిఁ
దమకించి నీయాజ్ఞ దాఁటె నిచ్చలును
దమయిచ్చఁ దిరుగు నాత్మల విలోకించి
పనిబూని వీరి నేర్పడఁ బట్టితెత్తు

( 20. శ్రీరామకృష్ణాద్యవతార తత్త్వము. )

నని రామకృష్ణ ముఖ్యావతారముల
నవతరించియుఁ గొన్నియాత్మలఁ గరుణ
నవనంబు సేసి యిట్లరుగు దెంచితివి 430

నిఖిలజీవుల నెన్న నీశేషభూతు
లఖిలజీవులకు నీ వయ్య వట్లయ్యుఁ
గొందఱ విగతదుఃఖులఁ జేసి మఱియుఁ
గొందఱ విహితదుఃఖులఁ జేయఁ దగునె
జాడతో దేవర సకలజీవాళి
నీదేర్చువిధము నా కెఱిఁగింపుమయ్య
యన విని శేతన వ్వానసాబ్జమున
ననలొత్తఁ దనప్రాణనాయికఁ జూచి
యల్లనఁ దనకేల నాపద్మహస్త
పల్లవం బానఁగూర్చి బళి బళీ యనుచుఁ 440

దలిరుఁబోఁడిరో నీవు తలఁచినగతినె
తలఁపులో నేనును దలఁచుచున్నాఁడ
ననయంబు నీవు న న్నడిగినందులకు
వినుము చెప్పెద నది వివరంబు గాఁగ

( 21. భగవత్ప్రత్యుత్తర క్రమము. )

సిరి పద్మ! యే నేమి సేయుదు మున్ను
ధరలోన నానావతారముల్ దాల్చి

యున్నట్టి నన్నొక్కకానొకఁ డాత్మలోన
నన్ని బ్రహ్మంబుగా నెఱిఁగి భజించుఁ

( 22. ప్రాకృతజన స్వరూపము. )

గొందఱు శత్రుగాఁ గోరియుండుదురు
కొందఱు మిత్రుగాఁ గోరియుండుదురు 450

కొందఱు రాజుగాఁ గోరియుండుదురు
కొందఱు బాలుగాఁ గోరియుండుదురు
అందఱు నాచంద మరయరు వారి
నిందఱ నేరీతి నీడేర్తు నింకఁ
దనుఁగొల్వ మని యాత్మఁ దలచి యాత్మలకుఁ
దనువు లింద్రియములుఁ దాన యిచ్చితిని
ఇచ్చిన నవి దాల్చి హీనభావముల
నిచ్చలో నామూర్తి నెఱుఁగంగలేక
మొనయ నిధ్మములఁ దే నిచ్చినకత్తిఁ
గొని యాలతోఁకలు గోసినరీతిఁ 460

దనుఁ గొల్వనిచ్చిన తనువులు దాల్చి
యనయంబు పరవిషయాసక్తు లగుచు
నాసురప్రకృతులై యనిశ మనాది
వాసనామూఢులై వంతలఁ జిక్కి
గొనకొన్న రాట్నపుగుండ్రలకరణిఁ
బనిబూని ఘనకర్మపరతంత్రు లగుచు
నరకంబులందు జన్మంబులయందుఁ
దిరుగుచు నిట్లు వర్తిలెడుజీవులకు
నెలనాగఁ! యే నెట్టు లీడేర్తు నైన
గలదు నుపాయ మొక్కటి విను మింకఁ 470

దలపోసి వారి కంతర్యామి నగుచుఁ
దెలిసి శ్రీరంగాది దివ్యదేశముల

( 23. అర్చావతార మహిమ. )

నర్చావతారంబు లంగీకరించి
యర్చనాసుముఖుండ నగుచు నుండెదను
జేనంటి యింటఁ బెంచినయిఱ్ఱిఁ జూపి
కానలో నిఱ్ఱులంగైకొన్నకరణి
నరయ సజాతీయు లగువారిచేతఁ
జిరజీవతతుల వశీకరించెదను
గావున ధరలోనఁ గమలాయతాక్షి !

( 24. శ్రీభూమీనీళాయుధ పారిషదాది భూలోకావతార హేతుక థనము. )

నీవు విశ్వంభర నీళావధూటి 480
ధర చక్రశార్ఙ్గనందక గదా నాగ
వరవైనతేయ విష్వక్సేనముఖులు
శ్రీవత్సకౌస్తుభాంచిత నిత్యవరులుఁ
గోవిదు లగు చండకుముదాది ఘనులుఁ
దక్కు నిత్యులును భూస్థలిఁ బ్రవేశించి
పెక్కు వర్ణంబులఁ బెంపొందఁ బొడమి
పెక్కుదేశముల సంప్రీతి వర్తిలుచుఁ
బెక్కుభాషలు నేర్చి పెక్కుశబ్దములు
సర్వాధికారముల్ సకలవేదాంత
నిర్వాహకంబులు నిగమరూపములు 490
నతులసద్గుణ వర్ణనాలంకృతములు
నతులముల్ ద్రవిడభాషానురూపములు
గేయముల్ నిత్యసంకీర్తనాత్మకము

లాయతరస పోషణానుభావ్యములు
నగుచు నొప్పంగఁ జేసి యలవానిచేత

( 25. బాహ్యసిద్ధాంత నిరాసపూర్వక భక్తిప్రపత్తిస్థాపనోపాయకథనము. )

జగతిపై దుష్టదర్శనపరాయణుల
ననయంబు బాహ్యరాద్ధాంతతమిస్ర
మునఁ జెంది మోహితాత్ములు నైనవారి
నరయంగ సంసార మనుకాననలోనఁ
దిరిగెడు కరులపొందిక నున్నవారిఁ 500

గట్టుకంబంబులఁ గదియంగఁ జేర్చి
కట్టు నేనుంగులకరణి మీరలును
బదరక భక్తిప్రపత్తిమార్గములఁ
బదవుల నొందించి భవము లడంచి
పరమార్థ మగుపరాత్పరుఁ డని నన్ను
నరయంగఁ జేయుఁడా యని నియోగింపఁ
వనజాతవాసిని వనజాక్షుఁ జూచి
యనియె దేవర మమ్ము నలధరాస్థలిని
పొడమి ద్రావిడ వాక్యములఁ బ్రబంధంబు
లొడఁగూర్చు మనుటకు నుచిత మింకెద్ది 510

నావుఁ డానందించి నారాయణుండు
శ్రీవనజాక్షి వీక్షించి యిట్లనియెఁ
గలుషసంతతులరాకాసి నాఁ గాశిఁ
గలుగఁగఁ జేసిన గంగచెంగటను
హరపార్వతీ వివాహముఁ జూడఁ గోరి
సురలు మునీంద్రు లచ్చోటి కేతేర
నాభారమున నుత్తరాశావకాశ
భూభాగ మెడల నొప్పున గ్రుంగ నపుడు

బొమ్మరపోయి వేల్పులమూఁక వేల్పుఁ
గమ్మరిఁ బిలిచి యుత్కజము చూచితివె 520
యురుతరం బగు దీనియొరఁగు దిద్దంగ
వెరవు గల్గిన మాకు వినిపింపు మనినఁ
జెప్పిన నామాటఁ జేసెద రేనిఁ
జెప్పెద నని సురశ్రేణి కట్లనియె
నమితతపోధనుం డగుకుంభ తనయుఁ
గ్రమమొప్ప వలదిక్కు కడకుఁ బంచినను
సమరీతి నొప్పా రసాచక్ర మనినఁ
దమకించి యాకుంభతనుజన్ముఁ డలిగి
నులివెచ్చనూర్చి కన్నుల కెంపు నెఱయఁ
దలఁపున నెలకొన్న తాల్మి వోవిడిచి 530
కనలుచు నావిశ్వకర్మ నీక్షించి

( 26. పార్వతీపరిణయోత్సవ హేతు వర్ణనము. )

యనియె నీవక్రోక్తు లాడ నేమిటికిఁ
బనిఁ బూని పార్వతీపరిణయోత్సవముఁ
గనఁ గోరి యంతరంగమున నెంతయును
లలిమీఱఁ బెక్కుకాలములనుండియును
గలుషాత్మ! యిచ్చటఁ గాచియుండంగఁ
జెనఁటివై విఘ్నంబు చేసితో లేదో?
యని కనలుచుఁ దావకాన్వయులకును
బని యధికంబు నల్పము కూలి యగుచుఁ
జనుఁగాక యని ఘనశాపంబు నిచ్చె 540
నిచ్చిన ననయంబు నిచ్చలోఁ బొగిలి
క్రచ్చఱ నావిశ్వకర్మ యి ట్లనియెఁ
గటకటా! సకలోపకారంబు గాఁగ

నిటఁ బిల్చి నను సురలెల్ల బ్రార్థించి
యడిగినందుల కుపాయంబుఁ జెప్పుటకు

( 27. విశ్వకర్మశాపవర్ణనము. )

నుడికి నీ వీగతి నుచితంబుఁ దప్పి
శపియింపఁ దగునె యోచపలాత్మ ! యనుచుఁ
గుపితుఁ డై యమ్మౌని కోపించి పలికె
నీవు తాల్చినయట్టి నిగమసంతతులు
ద్రావిడరూపముల్ తాల్చుఁగా కనుచు 550

శపియింప నిరుపురజగడంబుఁ జూచి
యపుడు వారలకోప మమరులు మాన్చి
పనిబూని కుంభసంభవుఁ బెక్కుగతుల
వినుతించి దక్షిణోర్వికిఁ బంపుటయును
జని ఖిన్నుఁడై కలశజమౌనిశిలకుఁ
డనుపమం బగు మలయాద్రిమీఁదటను
హిమవారి మునిఁగి వెయ్యేన్లు దివ్య
సమములు ననుఁ గూర్చి సవరించెఁ దపము
నత్యంతసంతోష మడర నే నపుడు
ప్రత్యక్షమై వేఁడు ఫల మిత్తు ననిన 560

వినతుఁడై మునియు వేవేలచందముల
వినుతించి తనపూర్వవృత్తంబుఁ దెలిపి
యావిశ్వకర్మశాపాయత్తమైన
ద్రావిడత్వము వచ్చెఁ దనవేదములకు
నేమి సేయుదు నింక నిందిరానాథ !
యీమనోవిగ్రహం బెట్లు మాన్పెదవో ?
యనినం బ్రసన్నుండనై ద్రావిడత్వ
మొనరిన శ్రుతులె సర్వోన్నతత్వంబుఁ

గలిగి మదీయభక్తశ్రేణిచేత
వెలయునట్లుగఁ జేసి వివరింతు నేను 570
నని వరం బిచ్చితి నదికారణమున
మును మిమ్ము ద్రావిడముఖ్యదేశముల
నవతరింపుఁడ యంటి నారీతి మీరు
నవతరింపుఁడు వేగ నాదేశములను
అని వారి నియమించి యారమానాథుఁ

( 28. భగవదచ్చావతారహేతుకథనము. )

డనుపమంబైన శేషాచలంబునను
శ్రీరంగముఖ్యవిశేషదేశముల
ధారుణి నర్చావతారరూపములు
ధరియించి భక్తసంతతులఁ బ్రోచుచును
బరిపూర్ణవిభవసంభరితుఁడై యుండెఁ 580
గాంచనరత్నప్రకాశితజాల
కాంచితం బగు లెనయందంబుఁ గాంచి
యనిమిషుల్ ముక్తిత్రోయజనేత్ర కాంచి
యన నొప్పుచును గాంచి యనుపేరఁ బరఁగి
గరిమ నే డగుముక్తికరము లైనట్టి
పురములలో నెల్లఁ బొగడొంది యపుడు
వనజకల్హార జీవనవతి కడలి
ననబోఁడు లెంతెమన్నన సేయునవతి

( 29. కాంచీనగరస్థ వేగవతీనదీ వర్ణనము. )

విమలాంబుపూర సంవిజితభోగవతి
కమనీయసురభి సంఘాతభోగవతి 590

యమలకారండవ హంసపూగవతి
సుమితపున్నాగ ఖర్జూరపూగవతి
వరుణమందిరరాగవతి పక్షిరాజ
వరవేగవతి వేగవతి యనునేఱు
చుట్టును విలసిల్లుచుం దనుఁదానె
పెట్టనికోటయై పెంపొందుచుండ
నుత్తరోత్తరవృద్ధి నొదవించు బ్రహ్మ
యుత్తరవేదినా నొప్పు నప్పురిని

( 30. కాంచీనగర వర్ణనము. )

యురుతర వరదోత్సవోద్యన్మృదంగ
బిరుద గంభీరద భేరీరవంబు 600

విని యకాలమునందు వేడ్కనెమళ్ళు
ఘననాద మనుచుఁ గేకాధ్వను ల్సేయు
నమితమై యగ్రహారాధ్వరధూమ
మమలాంబరంబున నమరి చూపట్టఁ
గాదంబినీపంక్తి గాఁ దలపోసి
నాదించి వెండియు నర్తింపుచుండు
బయలేఱు నెల శిరోభాగదేశముల
నయమూర భోగిసంతతిమండనమ్ము
లగుచున్న సౌధంబు లలయామ్రనాథుఁ
డగు నాగకంకణు హాసి ఘంపుచుండుఁ 610

( 31. కాంచీపురకామినీమణి సౌందర్య వర్ణనము. )

గాముబాణము లనంగా వేఱె కలవె
కామించి వీరల కన్నులే కాక
కనకసూనము లనంగా వేఱె కలవె
సనుపారు వీరలనాసలే కాక

ఘనమైనవిరు లనంగా వేఱ కలవె
కొనలు మించిన వీరిగుబ్బలే కాక
కమ్మదామర లనంగా వేఱ కలవె
ముమ్మాటికిని వీరిమోములే కాక
కనకపత్రిక లనంగా వేఱ కలవె
చెనకమించిన వీరిచెక్కులే కాక 620

కంబుపోతము లనంగా వేఱ కలవె
కంబుకంఠుల మించుగళములే కాక
గగనఖండము లనంగా వేఱ కలవె
నగవుమోముల వీరినడుములే కాక
కదళికాతరు లనంగా వేఱ కలవె
యుదుటుమీఱిన వీరియూరులే కాక
కడఁగుతాఁబే ళ్ళనంగా వేఱ కలవె
కడు మించు వీరిమీఁగాళ్లులే కాక
అనిమిషాదులు గొనియాడంగఁ జక్కఁ
దనమెల్ల జగములోఁ దమసొమ్మె యనఁగఁ 630

బసిఁడి సలాకలో భావజువింటి
కుసుమాస్త్రములో యనఁ గోమరు దీపించి
పరమలావణ్య సంపదచేత జనుల
నరు దందఁ జేయు తోయజనిభాననలు

( 32. బ్రహ్మాత్మక్షత్రియ వైశ్యాదిగుణ మహిమ. )

నిఖిలశాస్త్రాగమ నిపుణులైన బుధులు
నఖిలేశచరణ సంయతులైన యతులు
హరికోటిసమ తేజులైన రాజులును
హరహితునకు ఘను లగు వైశ్యజనులు

హరిభక్తిమతిభద్రము లైన శూద్రములును
హరినీలమణిచారులైన తేజులును 640

ఘనబల విజిత దిక్కరులైన కరులు
ననుపమజవజిత హరులైన హరులుఁ
గవులును రసికపుంగవులునుం గలిగి
యవిరళశ్రీలచే ననువొంది యుండు

( 33. కాంచీవరదరాజ దివ్యాలయవర్ణనము. )

నరయ నన్నగరిమధ్యమున నసంత
సరసిచెంగట హస్తిశైలాంతరమున
బంగారుబోదుల పొలిండ్లఁ బోలు
బంగారుకుండలపస మించి మింటి
కాఁపురంబులవారు కని సన్నుతించు
గోపురంబులు వజ్ర కురువింద నీల 650

లలితంబులైన జాలముల జాలములు
మలయజ విద్రుమ మణిమంటపముల
ధళధళం బోలుచు కుందనపువాకిళ్ళ
చలవ నిచ్చలపుఁ బచ్చలతోరణముల
సురనీలవిరచిత సోపానతతుల
గురుచంద్రకాంతపుఁగోణిగెచూరులును
జలువన్నెతావులు సారెకు మలయు
మలయమారుతముల మలయుమాళిగలఁ
గళుకుకంబముల బంగారుబోదియలఁ
జిలుకలచాలు దీర్చినవలీకముల 660

నింపొంది మఱియు ననేకచిత్రములఁ
బెంపొంది లోచనప్రీతి రెట్టింప
నంచితం బగు సదనాంతరసీమ

మించిన శేషవల్మీకంబు చెంత
మదిరి పసిండిచే నొనరించినట్టి
మది రె చేతులవయ్యు మాళిగెమీఁద

( 34. పుణ్యకోటివిమాన మహిమ. )
శ్రీవరదరాజ దివ్యమూర్తి వైభవము.

నోట నొక్కొకమాఱు నొడివినం బుణ్య
కోటి నిచ్చుచుఁ బుణ్యకోటి నా వెలయు
బంగారుమేడలోపలభూమిఁ గల్గు
సింగార మొకకుప్ప చేసినరీతిఁ 670

జెందమ్మి రేకులఁ జెనకుపాదములఁ
జెఁదిన పసిఁడి గజ్జియలు నందియలు
చుట్టిన కెలఁకులఁ జుంగులువాఱఁ
గట్టిన హేమాంశుకంబు చూపట్ట
నురుతరంబుగ గద యూనుహస్తంబు
వరున భక్తులఁ బ్రోచు వరదహస్తంబు
పాటి మీఱినయట్టి పద్మభవాండ
కోటికోటుల నించుకొన్న బొజ్జకును
వదలకుండఁగఁ గట్టువైచినరీతి
నుదరబంధం బెంతయును నొప్పుచుండ 680

జడియని బాహుపాశములచేఁ గట్టు
వడిన సోమార్కబింబముల చందమున
నలరక్కసులమిత్తి యగుచుట్టుఁగత్తి
వలమురియును నెంతె వలనొప్పుచుండ
విన్నువై గ్రొమ్మించు వెన్నెలసోగ
యున్నకై వడి సిరి యురమునఁ జెలఁగ
నలరమాదేవి సౌభాగ్యంబు రత్న

కలశంబుకై వడి కౌస్తుభం బలరఁ
బంటవలంతి గుబ్బల మీఁదనొత్త
నంటిన మకరరేఖాంకంబు లనఁగఁ 690

గులుకుముద్దులనక్ర కుండలాకృతులు
తళుకొత్తు చెక్కుటద్దముల మైనిండి
భాసిల్లఁగా వపాపరిమళోల్లాస
వాసితాధరపల్లవమున లేనగవు
నిగుడంగ సంపంగి నెఱిచూపునాస
తెగగల తెలిదమ్మిఁ దెగడుకన్నులును
గోపు వంచినవింటికొమరై నబొమలు
నాపూర్ణ సోముని హసియించుమోము
నిటలభాగంబున నెలవంకలైన
కుటిలకుంతలములు కొమరు దీపింప 700

నిఖిలయౌవనపద్మినికి గుడి కట్టి
శిఖర మెత్తినయట్లు జీవరత్నముల
రీతిఁ జూపట్టుకిరీటంబుఁ గలిగి
పాతకాభీలజంబాలసూర్యుండు
దేవరాయఁడు రమాదేవితో భక్త
సేవితుండై తలఁచినవారి కెల్ల
వరము లిచ్చుచు దేవవరమునీశ్వరులు
వరదరాజనుచు భావన సేయ నజుని
హోమగుండంబులో నుదయించి యిష్ట
కామంబు లిచ్చు నెక్కాలంబునంబు 710

రమణమై యతనియగ్రంబున హేమ
కమలాకరం బొండు గల దందులోన

( 35. పాంచజన్యాంశముగా కాంచీపురములో ప్రథమయోగిశావతారక్రమము. )

నసమాన పాంచజన్యాంశంబు వచ్చి
పసిఁడినెత్తమ్మిగర్భముఁ బ్రవేశింప
భాసిల్లఁ నానాఁటఁ బ్రబలి చూపట్టెఁ
గాసారలక్ష్మికి గర్భచిహ్నములు
గాటంపుతమ్మి మొగ్గలచన్ను మొనలఁ
దేఁటిక ప్పొదవెఁ బూఁదీవె నెమ్మేను
పలుకఁబాఱెను గనుపట్టె నంతటను
పలనొప్పు నల్లగల్వలబంతి యారు 720

తెలిదమ్మి నెమ్మోము తెలతెలఁబాఱె
నొలయులేనురువు చిట్టిములు బిట్టయ్యెఁ
దరఁగలవళులు మందంబులై తనరె
సరసమృత్తికలవాసనలె యింపయ్యె
నలఁగి తిన్నటియంచనడలు జాగయ్యె
నల మహాచామీకరాబ్జియందు

( 36. ఆశ్వయుజ శ్రవణదినములో [పోయ్గై యాళ్వార్ నామక] ప్రథమయోగిశావతారవర్ణనము. )

హరినాభినుదయించు నజునిచందమున
హరితార నాశ్వయుజాఖ్య మాసమునఁ
గాంచనపంకజ గర్భంబునందుఁ
బాంచజన్యాంశ ముద్భవ మయ్యె నప్పుడు 730
నాయోగి రవి యుదయం బైనకతనఁ
గాయజాజ్ఞానాంధకారంబు లణఁగె

( 37. పుష్పవృష్ట్యాదిశుభశకునవృత్తాంతము. )

దివినుండి మొఱసెను దేవదుందుభులు
దివిజకామినులు నర్తించి రందంద

సురలు వర్షించిరి సూనవర్షములు
సొరిదిఁ దక్కినయట్టి శుభసూచకములు
శౌరి దేవకియందు జన్మించునప్పు
డారయ నేరీతి నారీతి నుండెఁ

( 38. శ్రీ హరికటాక్షవీక్షణాదివైభవము. )

కమలాక్షుఁ డపుడు దిగ్గన నేగుదెంచి
కమలవాసినియైన కమలయుఁ దాను 740

భ్రమరపంక్తుల సరవణులతోఁ దూఁగు
రమణీయమైన సారసపుఁదొట్టెలను
వేదనాదంబుఁ గావించు బాలకుని
మోదంబుతోఁ జూచి మురవైరి గదిసి
చేతఁ గైకొని చెంత సిరిపువ్వుఁబోఁడి
చేతికి నిచ్చె నిచ్చిన లోకమాత
తనయుపైఁ గూర్మి నంతయుఁ బాలు గుబ్బ
చనుదోయి గురియంగ సందిటం గ్రుచ్చి
నయమార నాలింగనము నేసి శిరముఁ
బ్రియమార మూర్కొని పెరిమెఁ జన్నిచ్చి 750

యెలమి శౌరియుఁ దాను నిట్లు పోషింప
జలజనివాసిని చనుబాల పుష్టి
వనజాస్త్రకోటి లావణ్యంబుతోడఁ
గనుపట్టె యయ్యోగికంఠీరవుండు
సరసిజాలయ పదాబ్జములపైఁ శౌరి
చరణాంబుజములపైఁ సాగిలి మ్రొక్కి
నుతియింప నతని సన్నుతులకు మెచ్చి
శతపత్రనేత్రుండు సారసనిలయ

సజ్జీవసత బహుసత్త్వయోగమును
ముజ్జగంబులతాపములఁ దీర్చ్చగరిమ 760

( 39. సరోయోగీశాఖ్యనామకరణక్రమము. )

యనుపమగాంభీర్య మమృతమూర్తియును
నొనర సరోనామ మొసఁగి యాతనికి
నమితమై దుష్ట మైనట్టిసంసార
తమములోపలఁ జిక్కితముఁ గానలేని
జీవుల నెల్ల రక్షించి వేదంబు
త్రోవకుఁ దెమ్ము నేరుపున నోతనయ!
నీయంద మేమును నిలిచెదమనుచు
నాయోగి హృదయంబునందు వసించి
యుండి రంతట సరోయోగి డెందమున
నిండారువేడ్కతో నిఖిలదేశములఁ 770

బరయోగి సామ్రాజ్య వైభవం బెసఁగఁ
జరియించుచుండె నిజ్ఛావిహారముల

( 40. ఆశ్వయుజ ధనిష్ఠాదినములో ద్వితీయయోగీశావతారవర్ణనము.)
మల్లాపురములో [తిరుక్కడల్మల్లై] కౌమోదకాంశముగా
తదవతారకథనము.

ఘోరనక్రగ్రాహ కూర్మాదిలస ద
పారపారావార పారంబునందు
ముల్లోకముల సమమును మించు లేని
మల్లాపురం బను మహనీయపురిని
ముక్తిపోషుండు కౌమోదకీ దివ్య
శక్తిమయుం డైన సన్మౌనివరుఁడు
మును వచించినమాసమున నసుతార
ననుపమ నీలోత్పలాంతంబునందు 780

జనియించె నిందిరాసహితుఁ డై శౌరి
చనుదెంచి కడుసంతసమున నీక్షింప
వనరాశితనయ క్రేవల నున్నతనయుఁ
గొనకొన్న ప్రేమఁ జేకొని యెదం జేర్చి
పతిచేతి వలమురి పా లిడఁ బూని
కుతుకంబుతో సత్త్వగుణ మనుపాలు
హరిభక్తి యనుస్నేహ మందంద కలిపి
పరిపూర్ణమతి యోగిపతి కడుపునకుఁ

( 41. భూతనాథాఖ్య [భూతత్తాళ్వార్] నామకరణవర్ణనము. )

బోసి పోషించె నొప్పుగ దానవారి
యాసమయమున భూతాభిధానంబు 790

నతనికి నొసఁగి నీ వవనిపై భూత
తతిని సంసృతిసముద్రముఁ దరింపఁగఁ
జేసెదు గాన నిచ్చితి మిట్టినామ
మాసురప్రకృతిచే నజ్ఞానులగుచు
మమ్ముఁ గానకున్న యాత్మల నాత్మవిద్య
మము నెఱుంగఁగఁ జేయు మాపుత్త్ర యనుచుఁ
వోడు నీడై ముకుందుఁడు పద్మ యతని
తోడనె తిరుగంగఁ దొడఁగి రంతటను

( 42. మయూరపురములో [మైలాప్పూర్] నందకాంశము గా
తృతీయ యోగీశావతారకథనము. )

నలమాసమున సముద్రాగారతీర
నలఘు మయూరపురాహ్వయపురిని 800

దళుకొత్తు లతికాప్రహ్లాదం బనుపేరఁ
గలకొలంకున రత్నకైరవాంతమున

శ్రీనందకాయుధు చె న్నగ్గలించి
శ్రీనందకాంశమై చెలువొందు యోగి
జనియించె నప్పు డాజగదేకమాత
వనజాక్షుఁడును గారవములు వైవాఁ
గడుఁ బెద్దయగుకూర్మి కడలి నోలార్చి
లిడుదనెయ్యములోన నిగుడఁ బోషించి
తద్దయు మెచ్చి పెద్దలకెల్ల నీవ

( 43. మహాహ్వాయ [పేయాళ్వార్] సాధుకరణావతారవర్ణనము. )

పెద్దవై జగతి దీపించెదు తనయ! 810

యనుచు మహాహ్వాయం బతనికి నొసఁగి
యనుఁగు నెక్కొనఁగ నయ్యాదిదంపతులు
సకలంక మైనట్టి యయ్యోగిహృదయ
వికచాంబుజంబుఁ బ్రవేశించి రంత
మురవైరి నాఁబాల్యమున నుండి చిత్త
సరసిజాంతరములఁ జక్కఁగా నిలిపి
పరిపూర్ణచిత్తులై బ్రహ్మవిన్యస్త
భరులైన యయ్యోగివరులు మువ్వురును
దముఁ బోలినట్టి యుత్తము లైనయోగి
తము లెవ్వ రని దేవతామందిరముల 820

నదుల దేశముల నానాతీర్థములను
వెదకుచు నొక్కచో వీసమంతయును
నాసక్తి లేక సాయంగేహు లగుచు
భాసిల్లుచుండిరి పంకజోదరుఁడు

( 44. వామనక్షేత్ర [తిరుక్కోవలూర్] దేహళిలో యోగిత్రయసంమేళనక్రమము. )

వారల నిజమహత్త్వంబు నిమ్మేదల
వారని తనపరత్వంబు మోకముల

నొగడించి యజ్ఞాననికర మోహాంబు
లగలింతు నని యెన్ని యాయోగివరుల
ముగురి నాకస్మికముగ దేవనగరి
నగుచుండు శ్రీవామనక్షేత్రనగరి 830

నొనఁగూర్చ బయటఁ బురోపకంఠమున
ననికిగా నల్లంత నున్న యత్తఱిని
ననుపమంబైన మహానిశివేళ

( 45. మహావృష్టిప్రాదుర్భావము. )

వనదోదయము లేనివానఁ గల్పింప
నప్పు డాపెనువాన యశనిపాతముల
చప్పుళ్లతోడ ఝంఝామారుతమున
వడగండ్లతో నలవడి వడి మీఱి
సుడిగొల్పు రవళితో జో రని గురియఁ
జడిముడి మొగ మడఁచినఁ గానరాక
కడుఘోర మగు నంధకారంబు వొడమ 840

నొకనికిఁ గూర్చుండి యుండఁగఁ జాలు
నొకచిన్న గేహాళి యుండఁగఁ జూచి
యాయోగివరులలో నాదియోగీంద్రుఁ
డాయెడఁ జనుదెంచి యచ్చోట నిలిచె
నంత రెండవయోగి యట కరుదేర
నంతరంబున నున్న యామునీశ్వరుఁడు
చనుదెంచి తేటి కీసంకటస్థలికిఁ
జనుదున కోడి యాసీనుండ నగుచు
నేనుండి తిరువ్వుర మిటమీఁద నిలిచి
యైన నుండుదము రమ్మని చేరఁబిలిచి 850

యున్నతి నమ్మానియును దాను నచట
నున్నయత్తఱి మహాయోగి యేతేర
నొకనికి శయనించి యుండరా దిచట
నొకరీతి నొదుగుచు నొదుగుచు మేము
యీలోన నున్నార మిరువుర మిప్డు
డీలోనఁ జనుదెంచి తీవు నిచ్చటికి
నెక్కొన్న వానలో నిలువక రమ్ము
కక్కసం బైన యిక్కడ నీవు మేము
నొండొరులకు మన యొద్దికై సదరు
గొండము రమ్మంచుఁ గూడి ముప్వురును 860

నుండి రాగేహాళి నురుతరవృష్టి
దండి మై గురియ నత్తఱి నేగుదెంచి
యుల యోగిహృదయంబు నరసెద ననుచుఁ
దలపోసి తపసిడెందపుసందడీఁడు
కడుఁ గక్కసమున నక్కడ నున్నవారి
నడుమ సొత్తెంచి లేనవ్వు నవ్వుచును
గణియంబు లోలిఁ బ్రక్క లనున్న చెఱకు
గణికల నొత్తడిఁ గావించుపగిది
నొత్తున మొదలనే యొదిగెడువారి
నొత్తడి సేయ నయ్యోగీంద్రవరులు 870

మనము ముప్వుర మిందు మసల నెన్నడముఁ
జనుదెంచి తనరూపుచందంబు డాఁచి
యిఱికెడి నడుమ వీఁ డెవ్వఁడో వీని
తెఱఁగు తెల్లంబుగాఁ దెలియుద మనుచు
నచ్చెరు పడుచుండి రయ్యాదియోగి
నిచ్చలం బగుభక్తి నిలిపి డెందమున

( 46. భగవత్ప్రత్యక్షవర్ణనక్రమము. )

పరమయోగికల్పిత మంగళాశాసనవర్ణనము.

ధరణి పంతియు సముద్రంబులు నేయి
యరుణు దీపముఁ జేసి యరుణాంశుతతుల
గారాబుచక్రంబుకైఁ బూన్చినట్టి
నీరజాక్షున కిచ్చి నీరాజనంబు 880

నంత రెండవయోగి యతనిపైఁ బ్రేమ
పంతియు మితి లేనిభక్తియే చమురు
నానందభరితహృదబ్జంబె వత్తి
గానొనరించి వికాసమై యాత్మఁ
దిర మొందుజ్ఞానంబు దీపంబుఁ జేసి
పెరిమె నారాయణార్పితముఁ గావించె
బంధురజ్ఞాన దీపప్రకాశమున
నంధకారం బెల్ల నణఁగె నవ్వేళ
ననుపముఁడైన మూడవయోగి శౌరి
తనదుముందరను బ్రత్యక్షమై నిలువ 890

సిరిఁ గంటిఁ జెన్ను మించినమేను గంటిఁ
గర మొప్పు వదనవికాసంబుఁ గంటి
సల్లలితావనీ స్తనకుంభశుంభ
పల్లవంబులఁ బోలుపాదము ల్గంటి
సరసిజ హాల శంఖ చక్రాంకుశాంక
చరణముల్ జగదేకశరణముల్ కంటిఁ
దరణిబింబముచాయఁ దరళించు కనక
సురుచిరాంశుకము నంశుకముఁ గన్గొంటి
(శ్రీ) మించుకటితట శ్రీసతీవరణ
దామముల్ మేఖలాదామము ల్గంటి 900

వాత్సల్యజలధికై వడి నోప్పుచున్న
వత్సంబుఁ గంటి శ్రీవత్సంబుఁ గంటిఁ
జుట్టుఁ గైదువు వలచుట్టుశంఖంబు
పట్టిచూపట్టిన బాహువుల్గంటి
శాంతాశుమండల శతకోటికోటి
రీతిఁ జూపట్టు కిరీటంబుఁ గంటి
మలఁగులై తెల్లఁదామరలఁ దామరలఁ
గలహించు నిడువాలుఁగన్నులఁ గంటి
మకరకుండలబాల మార్తాండరుచుల
వికసించు వదనారవిందంబుఁ గంటి 910

( 47. విశ్వరూపప్రదర్శనమహిమ. )

అందాదియాఖ్య యోగిప్రబంధమాహాత్మ్య వర్ణనము.

నని నుతింపఁగఁ జూచి యయ్యురువురును
వినుతింపఁ దలఁచి రవ్విష్ణు నీక్షించి
యాపూర్ణమతులకు నావేళ విశ్వ
రూపి యప్పుడ విశ్వరూపంబుఁ జూప
నాసర్వమయురూప మవలోకనంబు
చేసి మ్రొక్కుచు మునిశేఖరు ల్మఱియు
నానంద నుతరూప మపుడు సేవించి
యానందపరవశు లగుచు నుప్పొంగి
యంతాదు లనుపేర నలరుప్రబంధ
చింతామణులు ముక్తిఁ జేర్చునిచ్చెనలు 920

వేదరూపములు గావించిరి మూఁడు
వేదాంతవేద్యుఁ డావిశ్వమయుండు
నంటున నయ్యోగినాథుల మతులఁ
దొంటిచందమున నస్తోకుఁ డై యుండె

యోగినాథులు దివ్యయోగసామ్రాజ్య
భోగులై భువిఁ జరింపుచునుండి రనుచు
నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి 930
నంకితంబుగను శ్రీహరిభక్తనికర

( 48. గ్రంథసమర్పణము, కవికావ్యప్రశంస. ప్రథమాశ్వాసపరిసమాప్తిక్రమము. )

పంకజార్యమ తాళ్ళపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాద సంసేవకాబ్జ
సదనావధూలబ్ధ రసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాస కృతిని
యతులితంబుగఁ బ్రథమాశ్వాసమయ్యె. 940



# పరమయోగి విలాసము.

## ద్వితీయాశ్వాసము.

( 49. శ్రీవేంకటేశ దివ్యమహిమా వైభవము. )

[ ద్విపద ]

శ్రీశ్యామసరోజాంగ ! యలమేలుమంగ !
జీమూతసంకాశ ! శ్రీవేంకటేశ !
మునిశాలి కాసారముఖ్యభక్తాళి
వనమాలి ! యవధారు వరదానశీలి !
పుడమిం గాంచికిం దూరుపునం బయోరాశి
పడమట సర్వసంపదం జెన్నుమీఱు
సకలభూస్థలము నాస్థలమును బ్రహ్మ
యొకనాఁటు త్రాసున నునిచి తూఁచుటయు
ధరణితలం బెల్ల దానితోఁగూడ
సరితూఁగకునికి యాసరసిజాసనుఁడు 950
జగతిపై నిది మహీసారాభిధాన
మగుఁగాక యని యన్న నది యాది గాఁగ

( 50. మహీసార [తిరుమళిశై] క్షేత్రప్రశంస. )

మహి మహీసార నామమునం జెన్నొందు
బహుపుణ్య కైవల్యఫలద మై యెపుడు
నందును సకలలోకారాధ్యుం డైన
యిందిరాపతి వసియించి చెన్నొందు

వసధివేష్టిత ధరావలయ పావనము
వనము మహానీంద్రజీవనము తత్పురము
సరసను శోభిల్లు చైత్రరథంబు
గరిమలు చపచపంగాఁ జేయురమణ 960

( 51. భార్గవమునితపః ప్రకారము. )

నావనంబున వీక్షితాత్ముఁడై లోక
పావనుండైనట్టి భార్గవమౌని
పుడమిపైఁ బోఁక యాపోఁకపై నూది
యిడి దానిపైఁ బాద మిసుమంత యూఁది
యాననం బెత్తి కరాబ్జము లోమ్మడ్చి
భానుమండలముఁ దప్పక విలోకించి
పదిలుఁడై దేవతాభావపూర్వముగ
మదిలోన మంత్ర మేమఱక యెన్నుచును
మడువులలోన హేమంతకాలమున
వడఁ జల్లుతఱిఁ బంచవహ్నిమధ్యమున 970

నారూఢచిత్తుఁడై యహరహం బిట్లు
ఘోరతపంబు గైకొని చేయుచుండ
వడి మీఱి తత్తపోవహ్నులకీల

( 52. దేవేంద్రభయప్రస్తావము. )

లడరి వాసవలోక మంటె నంటుటయు
విసుమానమంది యవ్వేళ దేవేంద్రుఁ
డసమానభీతిచేనందంద వడఁకి
పూని యీక్రూరతపో వృత్తి నెట్టి
మానవుండ వని సమానవేశ్వరతఁ
గోరి డెందమునఁ గైకొనియెనో కాని
యేరీతి నుండునో యిది యంచుఁ దలఁచి. 980

సంచితమన్యుఁ డై శతమన్యుఁ డపుడు
పంచాస్త్రమోహనబాణంబుకరణిఁ

( 53. ఇంద్రప్రేషిత కనకాంగినామక సురకామిన్యాగమనము. )

గనుపట్టు నచ్చరఁ గాంచనవర్ణి
యనుపేరిచెలువ నొయ్యనఁ జేరఁ బిలిచి
ధరలోన భార్గవతాపసుం డిప్పు
డురుఘోరతపము సేయుచునున్నవాఁడు
చపలాక్షి ! నీవిలాసముచొక్కుఁజల్లి
తపసి కూర్చిన తపోధనముఁ గైకొనుము
మదవతి ! నినుఁ గన్నమానవుఁ డింద్ర
పద మేలఁ దలఁచు నెవ్వగిదినంబేని 990

రమణి ! నీయరుణాధరముఁ గ్రోలువాని
కమృతంబు మై నేల యాసలుపుట్టుఁ
గాంత ! నీకుచములుఁ గనువాని కమర
దంతికుంభములపైఁ దలఁ పేల కలుగు
సతివ ! నీబాహుల కగపడువాఁడు
మతిఁ గల్పలతికల మఱి యేల యెన్నుఁ
బడఁతి ! నీపలుగెంపుపసఁ గన్నవాఁడు
తడవునే యాత్మఁ జింతామణిఁ దలపఁ
దెఱవ! నీతోడిపొందికఁ గల్గువాఁడు
మఱియేల దేవసామ్రాజ్యంబు వెదకు 1000

నని తన సేయుకార్యప్రకారమున

( 54. భార్గవముని తపోవనశోభావర్ణనము. )

కనుగుణంబుగఁ బల్కి నమరేశ్వరునకుఁ
బ్రణమిల్లి తదనుజ్ఞఁ బడసి యాలేమ
గణుతింపఁ దగుహేమకళికలో యనఁగఁ

గనుపట్టు దేవతాకామినీమణులు
తనుఁ గొల్వ మేదినీస్థలి కేఁగుదెంచి
స్వర్గోపవనవికాసముఁ గ్రించుపఱచు
భార్గవమునివన ప్రాంతంబుఁ జేరి
పుట్టతొఱ్ఱలలోని భుజగబాలకులఁ
బట్టి యొయ్యన జోలఁ బాడునెమళ్ళు 1010

నెలమిఁ జెంతన నాడు నేణపోతములఁ
బిలిచి మచ్చికఁ యుగ్గుఁ బెట్టు బెబ్బులులుఁ
బలుమఱుఁ గరములం బట్టి లాలించి
కలభసంతతి ముద్దు గావించుహరులు
నలమి ప్రక్కలలోన నందంద పొదివి
మెలుకపిల్లలకుఁజ న్నిచ్చుపిల్లులును
గలిగి యన్యోన్యరాగములతో వైర
ములు మాని సురవనమును గేలి గొనుచు
సారసభవు బోలె శంభునిం బోలె
శారదోద్యచ్ఛివాసంయుతం బగుచు 1020

సురనాయకుని బోలె సుగ్రీవు బోలెఁ
గరిరాజ వనచర కమనీయ మగుచు
నాగలోకముఁ బోలె నలినాస్త్రుఁ బోలె
భోగీంద్రరతికుచభూషితం బగుచు
వనరాశిఁ బోలె దిగ్పాలయంబుఁ బోలె
ననుపమాండజవిబుధాకీర్ణ మగుచుఁ
బనసభూజాతముల్ పారిజాతములు
ఘనసారపూగముల్ కనకపూగములు
చిరిబిల్వవారముల్ సింధువారములు
సరస రసాలముల్ చక్రసాలములు 1030

పొదలుజాతులు బహుపుష్పజాతులును
పొదిగొన్న మల్లెలు బొండుమల్లెలును
చందనంబులు గలచందనంబులును
గుందహింతాలముల్ కురువతాలములుఁ
గోలకుంజములు నంకోలకుంజములుఁ
బాలమ్రాఁకులును రెప్పాలమ్రాఁకులును
గనుపట్టురావులు గంగరావులును
గొనబైన తేకులు గుముదుతేకులును
గలుగొట్టురేఁగులు గంగరేఁగులును
దలుకొత్తు నిమ్మలు దాడినిమ్మలును 1040

గుదిగొన్న జువ్వులు కొండజువ్వలును
ముదిరినమోదుగుల్ ములుమోదుగులును
మొదలైన తరులతాముఖములఁ గలిగి
పదివేలతెఱఁగులఁ బ్రబలి యెంతయును
స్వర్గంబువనములఁ జౌక పుట్టించు
భార్గవువనములోపలి కేఁగుదెంచి
యచ్చరపూఁబోఁడి యచ్చట నిలిచి

( 55. సురకామినీ శృంగారాలంకార ప్రకారము. )

వచ్చిన తనతోడి వనితలు మెచ్చఁ
గట్టాణిముత్యాలఁ గనుపట్టుచున్న
బొట్టు మిక్కిలి నొఱపుగ సవరించి 1050

నటనగాఁ జిన్నారినామంబుఁ దీర్చి
బటువుగాఁ బచ్చలపతకంబుఁ జేర్చి
కొనబుగాఁ గప్పురుకొప్పుఁ గీలించి
మినుకుగా మేదీఁగె మృగమదం బలఁది
యొఱపుగాఁ గుచ్చెల నొరయంగఁ గట్టి

మెఱుపుగా మొలనూలు మీఁద నమర్చి
కళుకుగాఁ జౌఁజులకమ్మలు దాల్చి
తెలివిగా మొగపులతీవె లంకించి
విన్నాణముగరాలపెండెంబు వెట్టి
వన్నియగా సేల వలెవాటు వైచి 1060

డాలుగాఁ బసిఁడియొడ్డాణంబుఁ బూని
మేలుగా వజ్రాలమించులుఁ బూని
కాంతిగాఁ గెంపులకడియము ల్దొడిగి
వింతగాఁ గప్పురంబు విడియంబు చేసి
యొసపరి బాగుగా నుద్దాలు మెట్టి
యసమసాయకుని మోహనకాండ మనఁగ
థళథళఁ దులగించు తాటంకరుచులు
తళుకొత్తు చెక్కుటద్దములమై నిగుడ
నెఱబేడిసలజాడ నిగుడ నేత్రముల
మెఱుగారుచూపుల మిన్నెల్ల మెఱవ 1070

నఱవిరిగతుల నొయ్యన మూఁపుమీఁద
నఱజాఱువేనలి యల్లాడుచుండ

( 56. శృంగారచేష్టాప్రదర్శన క్రమము. )

ఝల్లుఝల్లని మునిస్వాంతంబు గలఁగ
ఘల్లుఘల్లని పాదకటకముల్ మొఱయ
గీటాడుగుబ్బల గికురించుకాంతు
లూటాడుపయ్యెదయోర డాలింప
నెరు లేరుపడి నిగనిగ చిదిరించు
మురువైన నచ్చెల మొరమొర మెఱయఁ
గడు మించు మరువేఁట గంటలపోల్కి
నడిదారముల గంట లుయ్యాల లూఁగ 1080

ధగధగ మించురత్నముల పెంపెసఁగ
మొగపుల కటిసూత్రములు వెడజాఱి
మెఱుఁగుఁ బవ్వరుసక్రొమ్మించుతో మోవి
చిఱునవ్వువెన్నెల చిందులాడంగ
వేఁగాఱుగుబ్బల వ్రేకంబుతోడ
తేఁగానుదీవియ లివలివలాడ
ముంగేలికంకణంబుల పంజరంబు
చెంగటి ముద్దురాలుక లాలించి
తమ్ముఁ బెట్టెద రామ తమ్మ నాముద్దు
గుమ్మ మాటాడ రా కోటుః కొట్టు మనుచుఁ 1090

జిలుక నొయ్యన ముద్దుచిలుక నందంద
పిలిచిన తన్నదైన బింబోష్ఠమునకు
నొడిసిన రాచిల్క యొడుపు దప్పించు
బెడఁగున నొకవింతబెడఁగు చూపుచును
భావజు మదదంతిపగిది నాలేమ
యౌవనాంతరమున కరుదెంచి యచటి
ఘనతపోరాశి భార్గవమానివర్యుఁ
గనియుఁ గాననిదానిగతిఁ జేరవచ్చి
యులయుచు సొలయుచు నతనిముంగిటను
బొలయుచు మేనివల్పులు గుబాళించి 1100

పన్నీటి యివము కప్రముమీఁది చలువ
వెన్నెలలో శీతు వెడనవ్వుకొనుచు
మట్టమై తలిరుజొంపములతో నొక్క
పొట్టమై లో నెండపొడపడకుండఁ
దలిరించి కడు నివతాళించుచున్న
మొలమావిక్రిందటి కేతెంచి నిలిచి

చరణంబు పై నొక్కచరణంబు నిలిపి
గురుకుచంబుల తళుకులు పిసాళింపఁ
దలిరుకెంగేలఁ గెందలిరాకుగొమ్మ
నలవోకఁ బట్టి యొయ్యారంబు నిగుడ 1110

మెఱుఁగువేనలి మూఁపుమీఁద నల్లాడ
నొఱపులు గులుకంగ నొకచిందువాడి
చెలికత్తెమూఁపుపైఁ జేయిఁ జేర్చుచును
జిలుకకు బుద్ధులు చెప్పి నవ్వుచును
దళుదళుక్కన గండతల మొలయించు
నొలయించి కెంకేల నొయ్యన మాటు
మీఱుపాలిండ్లపై మెఱుఁగుగాఁ జెరఁగు
జాఱించు జాఱించి చక్కఁగా నొత్తుఁ
జిఱునవ్వువెన్నెలజిగి నెఱయించు
నెఱయించి మోవివెన్నెల సొళగించు 1120

నల్లన నయనతోయజము లల్లార్చు
నల్లార్చి ఱెప్పల నడ్డంబు సేయు
నటన మూపునఁ గొప్పు నటియింపఁ జేయు
నటియింపఁ జేసి క్రన్ననఁ జక్కదిద్దుఁ
గరమూలయుగళి బంగరుసుంకురాల
విరిబంతి కెంగేల వికసింప మఱియు
జెలికత్తియలపిండుఁ జేరఁజీరుచును
గిలగొట్టి యంతలోఁ గేరి నవ్వుచును
నలయుచు సొలయుచు నందంద నొసలఁ
జిలుకులేఁ జెమటఁ గెంజేత నూర్చుచును 1130

గఱివంకబొమలు నిక్కంగ సంపంగి
నెఱతావి నెరయంగ నిట్టూర్పు లిడుచుఁ
దగఁ బచ్చపదకంబు తళుకుల మెఱుఁగు

బిగిచున్నుగవచుట్టుఁ జేరెంబువాఱి
రంగైన కంకణరాగంబుతోడ
నుంగరంబుల కాంతు లుప్పరం బెగయఁ
బసిఁడివన్నియఁ గ్రిందుపఱచునెమ్మేని
పసనిచాయలు వలిపముఁ జౌకళింప
గుబ్బిగుబ్బలమీఁది కస్తూరిపూఁత
గొబ్బున మెఱసి దిగ్గున సోడుముట్ట 1140

ధరలోని విరహిసంతతి నెలయింప
మరుఁడు పంటినయట్టి మాయామృగంబు
కరణిఁ జూపట్టె భార్గవహానిచిత్త
సరణిఁ బ్రవేశించుసరవిఁ జింతించి
పలుమఱు దనహావభావవిలాస
ములు చూపుచుండ నమ్మునివరేణ్యునకు

( 57. మునిచిత్తవికారక్రమము. )

నంతరంగము చిందులాడంగఁ దొడఁగె
నంతట రవిమీఁద హత్తినచూపు
రాజాస్య తాటంకరవలమై నిగిడె
నోజ దప్పక విధియుక్తమంత్రంబు 1150

నుడివెడి జిహ్వా కన్నుల కల్కినామ
మడుగ నుద్యోగించె ననురాగ మెసఁగ
హృదయాంబుజంబుపై నెనసిన బుద్ధి
మదిరాక్షిపాదపద్మములమైఁ దగిలె
జపమాలికాసంఖ్య సవరించువ్రేళ్లు

( 58. భార్గవమునిమోహప్రకారము. తపోభంగక్రమవర్ణనము. )

చపలాక్షి రమ్మని సన్నఁ గావించె
నప్పుడామునినాథుఁ డంతరంగమునఁ

గప్పిన కామాంధకారంబుతోడ
నయము పోవిడిచి మానముఁ గట్టిపెట్టి
నియమం బుడిగి మనోనిగ్రహం బేది 1160

జపమాల సడలించి జప ముజ్జగించి
తప మోసరించి లోధైర్యంబు డించి
యచ్చటఁ జెలువొందు నచ్చరలేమఁ
గ్రచ్చరఁజూచి దగ్గఱ కేగుదెంచి

( 59. మునిసంభాషణక్రమము. )

కమలాయతాక్షి జగన్మోహనాంగి
భ్రమరకుంతల దేవభద్రేభయాన
నీ వెవ్వ రబ్జాస్య నీకుఁ బే రేమి
దేవకన్యకవో భూదేవకన్యకవో
రాజకన్యవో భోగిరాజకన్యకవో
నీజాడ యెఱిఁగింపు నేఁడు మా కనిన 1170

నీతఱిఁ జిక్కెఁబో యితఁ డంచుఁ జొప్ప
నాతిక్రైవడి నలనాతి యిట్లనియె

( 60. కనకాంగిప్రత్యుత్తర విధము. )

ననఘాత్మ వినుమయ్య యమరకన్యకను
గనకాంగి యనుపేరు గలిగినదాన

ధర బావనాశ్రమస్థలములయందుఁ
జరియింపుచుందుదు సఖులతోఁ గూడి
మీవంటిఘనుల కర్మిలితోడ సేవఁ
గావింపఁ గోరి యీగతి సంచరింతు
నోవకానికులవర్య యొంటి మీ కిట్లు
భామలతోఁ గూడి భాషింపఁదగదు 1180

చిపురుబోఁడులు తపశ్శిలవృత్తులకు
వివరింపఁగా వేరువిత్తులు గారె?
మదిలోన నొక్కటి మాటాడు టొకటి
మదిరాక్షులకు నియమంబు సంశయము
వావులు నహి నైజవర్తనల్ సున్న
భావసంసిద్ధి యెప్పాటను లేదు
వేచందమున గృపావివశుండై యీశుఁ
గాచినపిదపఁ గుక్కల కిచ్చినట్లు
ఘనతపోధన మెల్లఁ గడపట నొక్క
వనిత కై యేటికి వఱదవుచ్చెదవు 1190

పరమతపోరాజ్యపట్టబద్ధుండ
వరయ నీ కిది యేల యని కేలు మొగిచి
పోయివచ్చెద నని పోవ నుంకింప
నాయెడ భార్గవుం డనియె నచ్చెరువుఁ

( 61. భార్గవమునికృతమోహభాషణము. )

గలకాల మెల్లను గానలో నాకు
నలములుఁ దిని తిని యలయ నేమిటికిఁ
బరమసౌఖ్యం బైన భామలపొందు
మరుగనివాని జన్మంబు జన్మంబె
పరికింపఁగా మున్ను పార్వతీసతికి
హరుఁ డిచ్చె సగముదేహం బన వినవె 1200

యదియునుగాక తోయజభవుం డేల
వదనపంకేజంబు వాణికి నిచ్చె
వార లట్లుండ నీవనజాక్షుఁ డేల
శ్రీరమాదేవిఁ దాల్చెను వక్షమందు
నన్నియు నన నేల యిహసౌఖ్యవితతు

లన్నియు నిచ్చువా రన్నుల కారె
విపరీతముగ నన్ను విడనాడ నేల
తపము పండినమీఁదఁ దాల్తురే జడలు
చపలాక్షి నీతోడిసంగంబు గలుగఁ
దప మేల జప మేల తక్కిన వేల 1210

నన వీని తనకు లోనగుటఁ జింతించి

( 62. మునిప్రార్థనాసంమతిప్రకారము. )

కనకాంగి మానివాక్యము సమ్మతింప
మునినాథుఁ డప్పు డామోదకుంజముల
వనజాస్త్రబాణవిహ్వలచిత్తుఁ డగుచుఁ
దొలుత నా గాధిసుతుండు మేనకను
గలసినకరణి నాకనకాంగిఁ గూడి
సరససల్లాప హాసవిలోకనముల
మరుకేళిఁ దేల్చి పిమ్మట విచారించి

( 63. భార్గవముని కలితతత్త్వ విమర్శనము. )

యిచ్చలో నిది తగు నిది తగ దనక
యిచ్చట నే నుండి యేమి చేసితిని 1220

యెచ్చటి సురలోక మెచ్చటి తపము
నెచ్చటియచ్చర యిట కేల వచ్చె
వచ్చెఁబో యే నేల వనజాక్షిచూపు
మచ్చువేసిన నిట్లు మరు లేల కొంటిఁ
గడుచిత్ర మిది గాదె కడలిలో మప్పు
నడవిలో నుసిరికాయయుఁ గూడినట్టు
తే వీటి కనకాంగి యేవీటి మౌని
యీవిధి వాటిల్లె నేమికారణమొ

యది చూడవచ్చిన నట్టిద కాదె
ముదితలయెడ నున్నమునివర్యుఁ డైన 1230

జడియక యెట్లుండుఁ జర్పింప వహ్ని
కడ నున్నయీానెన్న కరుఁగ కేలుండు
నచ్చెరుపడి వేయు నన నేల నొకరి
యిచ్చ గా దెన్నిన నిది దైవకృతము

( 64. పరమవిరక్తికారణము. తీర్థయాత్రాగమనము. )

అని యాత్మవిద్యావిహారి యై యాత్మ
వనజోదరుని పాదవనజముల్ దలఁచి
పరమవిరక్తుఁ డై వభముక్తుఁ డగుచు
నరిగె నంతటఁ దీర్థయాత్రానురక్తి
నాయెడ మునిఁ గూడినంతనే దేవ

( 65. దేవకామినీసద్యోగర్భధారణ క్రమము. )
సుదర్శనాంశ చతుర్థయోగీంద్రావతార వర్ణనము

తోయజవదన సద్యోగర్భ యగుచుఁ 1240

గమలాక్షుదివ్య సంకల్పంబువలన
దమితదైతేయ సుదర్శనాంశజుని
నఘుమహారు యోగీంద్రు నతులలగ్నమున
మఘతారకను బౌష్యమాసంబునందుఁ
గని తనవచ్చినకార్య మంతయును
ననుకూల మయ్యెఁ బొమ్మంచు గర్వించి
వనజాసనేంద్రాదివంద్యుఁ డౌవాని
మనుజమాత్రుని గాఁగ మది విచారించి

( 66. వేత్రకుంజములో అద్భుతకుమారదర్శనము. )

గుమిగొన్న యొకవేత్రకుంజంబులోనఁ
గొమరుని నునిచి గ్రక్కున నేఁడె దివికి 1250

మానినందనుఁడు నిర్మానుషంబైన
కానలో బెగ్గిలి కావు కా వనుచు
విలసిల్లఁగా సామవేదనాదముల
నెలుఁగెత్తి యేడ్వ నయ్యెడఁ గరుణించి
యామహీసారనాయకుఁడైన శౌరి

( 67. మహీసారక్షేత్రనాథానుగ్రహవిధము. )

భగవదంతర్ధానప్రకారము.

యామౌనిసుతుఁ డున్నయట కేఁగుదెంచి
వనధిమేఖల గారవమున లాలించి
తన కటాక్షామృతధారలచేతఁ
దనివి నొందించి యంతట సేదదేర్చి
తనరించి యంత నంతర్ధానమైన 1260

జలజాక్షువిరహంబు సైరింపలేక

( 68. భార్గవమునికుమారాభివృద్ధిప్రకారము. )

యెలుఁగెత్తి యాబాలుఁ డేడ్చిన త్రచిని
మలయంగ నెడ దుప్పిమై నోరగాఁగ
మొలత్రాటఁ జెక్కిన మోటకత్తియును
గొనసిగతోఁ గూడి కురు లొకయంత
గనుపట్టఁ జెరివిన గన్నెరాకమ్ముఁ
గొనల వెల్వడుపుట్టగోఁచియు నెరులు
బెనఁగొన్న నునుదబ్బపేఁచు డాకేల

నెడనెడ జివ్వాడు వెదురుసలాక
యొడమచే బొటవ్రేలి యినుపయుంగరము 1270

నడరంగ యడమెట్టి యగుగొడ్డుటావుఁ
బిడిముక్కుతోడునఁ బెనచి రాఁబట్టి
తనతోడిజోడు మేదరులు సోదరులు

( 69. వేణులావకాగమనము. హరిదాసనామకరణము. )

వెనువెంటఁ జన నొక వేణులావకుఁడు
హరిదాసుఁ డనుపేరియతఁడు భూసార
పురవాసుఁ డవ్వనభూమి కేతెంచి
కఱి కెక్కి చిట్టెలు గిట్టిలో మునిఁగి
కుఱుచలై వంకరకొంకరల్ వోక
సల్లలై చక్కనై సవరనై పెరిఁగి
వెల్లవోవని పండువెదురులు చూచి 1280

నఱికి కుప్పలు వైచి నయముగాఁ జివ్వి
ముఱియించి కుదియించి మోపులు గట్టి
యూరికి మరల నుద్యోగించుతఱిని
వారికి నాచెంత వనవీధి నున్న
బాలురావము వినఁబడిన వా రప్పు
డాలించి మార్జాల మని సంశయించి
పొక్కుపా క్కని తమభాషఁ జెప్పుచును
గ్రక్కున నటకు డగ్గఱి నేగుదెంచి
యలమానిసుతుఁ డుస్సు యట్టికుంజంబు
వలచుట్టియుండిరి వలచుట్టినట్లు 1290

హరిదాసుఁ డనుపేరియతఁ డేగుదెంచి
దరుల మేదలుల సోదరుల నీక్షించి
బాలురావం బేమొ పరికింపుఁ డనుచు

( 70. మునికుమారతేజోవిలాస మహిమ. )

నాలోని కేతెంచి యమితతేజమున
భానుకోటిస్ఫూర్తిఁ బ్రహసింపుచున్న
మానినందనుఁ గాంచి మది సంతసించి
పిల్లిగా దోరి జాబిల్లి గాఁబోలుఁ
జల్లనివెన్నెల చల్లుచున్నాఁడు
అనుచు నబ్బాలు రెప్పార్ప కెంతయును
గనుఁగొని వేడుకకడలి నోలాడి 1800

యానందబాష్పంబు లానవాబ్జంబు
మైనిఁడి దిగువాఱమై గరుపారఁ
బెన్నిధిఁ గన్నట్టి పేదచందమున
నున్నతోన్నతుఁడైన యోగినందనుని
దనయులు లేమి నాదరమున నెత్తి
కొని కూర్మితోడ నక్కునఁ జేర్చి వేడ్కఁ
గొనకొని యానేత్రకుంజంబు వెడలి
తనవార లెల్ల నెంతయుఁ జోద్యపడఁగ

( 71. వేణులావకగృహములో భార్గవమునికుమారాభివృద్ధిక్రమము. )

మునిపుత్త్రుఁగొని పురంబున కేగుదెంచి
తనయాలిచేతి కెంతయుఁ బ్రేమనొసఁగ 1810

నరవిందనాభుఁ గన్నట్టి యశోద
కరణి సుప్పొంగి యాకాంతాలలామ
యనువొందఁగా బోరు కాడించి కూర్మి
యినుమడింపంగఁ జన్నిచ్చి నిచ్చుటయు
నామహీసారనాయకుఁ డైనయట్టి
హేమాంబరుఁడు తనయెదుట నిల్చుటయు
హరిపదధ్యానామృతాహారలహరిఁ

బరితృప్తిఁ జెంది యాభార్గవాత్మజుఁడు
చనుఁగ్రోలఁ డయ్యెనాజాడనే పెక్కు
దినము లుండంగ నంతే వెఱఁ గంది 1320

మగనితోఁ బలికె నమ్మగువ దూఱుచును
నగుబాటు చేసి తింతలోనఁ దనకుఁ
గటకటా! వీన్ని నెక్కడనుండి తెచ్చి
తిటువంటి పసిబిడ్డఁ డెందైనఁ గలఁడె
చనునోటఁ బెట్టండు చనుఁగ్రోలకున్న
మినుకంత యుగ్గైన మ్రింగఁడేమవఁడు
ఆఁకొన్నచంద మింతైనను లేదు
తేఁకువ చెడఁ డొందుదిక్కుఁ గన్గొనఁడు
ఆరయ వీఁడు దయ్యము గాని భూమి
వారిబిడ్డలవంటివాఁడె? చూడంగఁ 1330

( 72. మునికుమారాశ్చర్య చర్యాప్రకారము. )

జిక్కండు నలుగండు చెలు వగ్గలించి
యొక్కచందంబున నున్నాఁడు గాని
యనుచు నిద్దఱు నరు దంద నావార్త
జను లాలకించి యాశ్చర్యంబు నొంది
యాబాలగోపాల మట కేగుదెంచి
యాబాలుఁ జూచుచు నరుగుచుండంగ
నానగరినె వృద్ధుఁ డగునట్టిపుత్త్రి
హీనుఁ డొక్కరుఁడు పెక్కేండ్లనుండియును
సంతానకాముఁడై సతియును దాను
నంతరంగమున శోకార్తుఁడై యుండి 1340

యావార్త విని వెఱఁగంది డెందమున
భావించి యితఁడు తప్పదు దేవుఁ డనుచు

( 73. వృద్ధదంపతిదత్తక్షీరస్వీకరణము. )
మునికుమారయోగనిద్రాద్యాశ్చర్యచరిత.

నత్తపోధనుఁ జూచునభిలాష నటకు
రిత్తచేతులఁ బోవ రీతి గాదనుచు
నొకసోలనెయి, పాలు నొకచేరెఁడన్ని
యకలంకమతినిచ్చి యది కేలఁ బూని
యనురాగవల్లిక యంతరంగమున
ననలొత్త నటకుఁ గ్రన్నన నేగుదెంచి
హరి మున్ను నందగేహములోన నున్న
వరుస నావేణులావకునింటిలోనఁ 1350

బసని మాయావటపత్రతల్పమున
వసియించి నిదురించువాఁడనం బోలె
బాగొప్పఁ దొట్టెలపైఁ బవ్వళించి
యోగనిద్రాసక్తినుండు నమ్మానిఁ
గని చేత నున్నదుగ్ధము యోగిరాల
నునిచి సన్నుతిచేసి యోగీంద్రవర్య!
నాకేశసన్నుత! నాచేయుభక్తిఁ
గైకొని నను నీవు కరుణింపవలయు
సీరిసోదరుఁడు కుచేలునియటుకు
లారగించినరీతి నవధారు దేవ! 1360

భక్తవత్సల! కృపాపారీణ! నాదు
భక్తిఁగైకొమ్మని పదములఁ వ్రాల
నతనిభక్తికి నాత్మ ననయంబు మెచ్చి
యతివేగమునను బద్మాసనం డగుచుఁ
గరుణాపయోరాశి కాన నామౌని
వరుఁడు తత్క్షీర మాస్వాదించె నపుడు

జనులెల్లఁ జేయుపూజలు లెక్కఁగొనని
ఘనుఁడు నాసేవ నిక్కము మెచ్చె ననుచు
మనమున నుప్పొంగి మగుడి యారీతి
దినదినంబును బాలు దెచ్చుచునుండి 1370

యంతట నొక్కనాఁ డావృద్ధవ్రతుఁడు
కాంతయుఁ దాను నక్కడి కేగుదెంచి
ప్రతివారమును దెచ్చుపగిది దుగ్ధంబు

( 74. భుక్తావశిష్ట క్షీరసమర్పణము. )
వృద్ధదంపతిశరీరములో యౌవనావిర్భావము.

నతనికి నర్పింప నాయోగివరుఁడు
నగ మారగించి నిశ్చలదయాదృష్టి
నగము వారలకుఁ బ్రసాదింప నతఁడు
తనసతియును దాను తత్ప్రసాదంబు
ననురక్తిఁ బ్రాసించె నంతలోపలనె
తరుణభావంబులు దాల్చి యిద్దఱును
బరమానురాగసంభరితులై యోగి 1380

( 75. తదనుగుణగర్భధారణము. )
కణికృష్ణాఖ్యకుమారావిర్భావము.

యనుమతంబున నింటి కరిగి రంతటను
మునినాయకునివరమున నవ్వధూటి
గరు వొంది భవ్యలగ్నంబునం జక్ర
పరిచరాంశజు లోకపావనమూర్తిఁ
గణికృష్ణుఁ డనుపుత్త్రుఁ గాంచెన యోగి
మణియైన భార్గవమౌనిశేఖరుఁడు
పరతత్త్వమయ్యు గోపాలుచందమున
హరి నందగేహంబునం దుండుకరణిఁ

గారియెవ్వారికిఁ గానరాకుండ
నీఱు గప్పినయట్టి నిప్పుకమాడ్కి  1390
కీర్తికెక్కిన నిజాకృతి డాఁచి ధరణి
వర్తించుచున్న సంవర్తుచందమున
ననుపమయోగీంద్రుఁడయ్యు సమ్మాని
తనరూపు డాఁచి మేదరివిధంబునను
సరవిమై నమ్మహాసారంబునందుఁ
గరమొప్ప శూర్పవిక్రయము సేయుచును

( 76. మునికుమారరచిత హరిధ్యానసంతోషాదికథనము. )

గమలేశ పాదపంకజయుగధ్యాన
సమధికామృతముచే సంతుష్టుఁ డగుచుఁ
గడునల్ల నగుదివిఁ గనుపట్టుసూర్యు
పడుపున వేణులావకునిగేహమునఁ  1400
దేజరిల్లుచుఁ గొన్నిదినములమీఁద
నోజఁ బెంపెసఁగెడు యోగానురక్తి
భాసిల్లు నాయోగిభర్తగుహాధి
వాసుఁడై నియమితవాసరుం డగుచు

( 77. అష్టాంగయోగరచనాప్రకారము. )
పింగళసుషుమ్నాపూరకాది.

యమనియమప్రముఖాష్టాంగపూర్తు
లమరంగ విహితపద్మాసనుం డగుచు
భౌతిగా నస్థికపాల భౌతియును
ధౌతిసేతియు నౌళిత్రాటనం బనఁగఁ
బాలుపొందు షట్కర్మముల నాచరించి
సలలితోడ్డీయాణజాలంధరములు  1410

మొదలైన దశమహాముద్రలం జక్కఁ
గదియించి యిడయుఁ బింగళయు సుషుమ్న
యాపూరణము మొదలై యెన్నఁదగిన
లో పదునాల్గునాళుల వివేకించి
శీతలభ్రమరిభస్త్రికమూర్ఛ కేవ
లాతతరవిభేదనాదినామములు
గల యష్టవిధకుంభకముల నేర్పెఱిఁచి
కల కేవలపుకుంభకమునఁ గుంభించి
లీల మై నాసనలింగహృన్నాభి
తాలుమూలలలాటతలములయందు 1420

( 78. మణిపూరకాదికరణము. )

సాధారమణిపూరకాదినామముల
సాధారణంబులై సరవిఁ జేర్కొనఁగఁ
బదిలమై నాల్గాఱు పది పది రెండు
పదియాఱు రెండునై పరఁగుపత్రముల
ననువొందుచుండెను నారుదామరల
ననిలునిచేత నొయ్యన మేలుకొలిపి
నాభిపంకజముక్రిందటను ముమ్మూల
శోభిల్లు బాహ్యాండశోభితంబైన
గంభీరనాళికాకందంబులోనఁ
గుంభించి వాయువుఁ గొనిదానిచేత 1430

సాధారకమలమధ్యత్రికోణాంత
రాధీనరేఫాక్షరాంతరవహ్ని
వెలుఁ గొందఁ జేసి పర్విన గాలితోడ
మిళితంబు చేసి యెన్మిదివదనములఁ
బలువుగా నాక్రింది పశ్చిమనాళి

తలక్రిందుగాఁ జుట్టి తలకనిభుజగి
వదనగహ్వరము చువ్వన దాఁటఁజేసి
చెదరనికడఁక్రఁ బశ్చిమనాళిఁ జొనిపి
వెనకఁ జొప్పడుసేకవింశతిమణుల
బెనఁగొని సంతతాభేద్యమై తనరి 1440

( 79. గ్రంథిత్రయభేదనాది యోగసామ్రాజ్యకలనము. )

జలజాసనేశకంజదళాక్షునామ
ములు గల్గి వజ్రంబుమురువున నున్న
యామీఁది గ్రంథిత్రయంబు భేదించి
యామీఁది యూర్ధ్వముఖాంబుజాతంబు
తలక్రిందు సేసి యందలిసుధారసము
నలరెడుహృదయతోయజములోనించి
మండితయోగసామ్రాజ్యసౌభాగ్య
మండనుం డగుచు నమ్మానివర్యుండు
పావనవన సప్తపర్వతగుహాల
నీవిధి నేడునూఱేఁడునూఱేండ్లు 1450

( 80. కణాదగురుభట్టాదినానాసిద్ధాంతపరిచయము. )
తత్పూర్వపక్షకథనము. విష్ణుతత్త్వసర్వోత్కృష్టతత్త్వస్థాపనము.

వేర్వేఱ వసియించి విమతంబు లైన
సర్వసిద్ధాంతముల్ చర్చించి చూచి
కాణాద గురు భట్ట కపిలాక్షపాద
పాణిని మిథ్యాప్రపంచశాస్త్రముల
లక్షించి చూచి యల్పము లని పూర్వ
పక్షము ల్చేసి యభంగవిస్ఫూర్తి
శుద్ధాంతరంగుఁ డై శుభకరవిష్ణు
సిద్ధాంతమూర్ధాభిషిక్తుఁ డై పొలిచి

తలఁపుఁదామరలోని తామరకంటి
చెలువంబునకు నెంతె చిక్కిచొక్కుచును 1460
దలఁచుగా నందునఁ దగిలి బాహ్యంబు
మఱచి హరిధ్యానమగ్నుఁ డై యుండె

( 81. విశ్వరూపదర్శనము. భక్తిసారనామధేయప్రఖ్యాతికరణము. )
హరిధ్యానాసక్తిప్రశంస.

నాపావనునిభక్తి కలరి యావిశ్వ
రూపి యప్పుడు విశ్వరూపంబుఁ జూప
నామూర్తిఁ గనుఁగొని యాత్మ నుప్పొంగి
వేమాఱు నుతులు గావించె విష్ణుండు
నల యోగివరు డెంద మనుతమ్మిలోని
మెలదేఁటి యై యుండె నెంతయుం బ్రీతి
ముక్తరాగుం డదిమొదలుగా జగతి
భక్తిసారుం డనఁ బ్రఖ్యాతి నొంది 1470

యట పీడుకొని యొక్కయటపీతలమున
ఘటితపద్మాసనకమనీయుఁ డగుచు
నత్తపోధనుఁడు శ్రీహరిపదాయత్త
చిత్తుఁ డై హృతలోకచిత్తుఁ డై యుండె
గుబ్బెతనునువాడిగుబ్బలం దెగడు

( 82. పార్వతీశంకరాగమనప్రస్తావము. )

గుబ్బగొమ్మలుసోగ కఱుచవీనులును
గగనగంగోత్తుంగ కల్లోలలోల
మగుగంగడోలుఁ జెన్నుగుజల్లితోఁక
నిడువెడఁ దగువెన్ను నెఱిగుజ్జుమెడయుఁ
గడుదొడ్డపిఱుఁదు చక్కనిముద్దునడలుఁ 1480

గదలుమూఁపురము డాకాలిను పురముఁ
గుతుకైనగిన్నెబాగులగోరిజలును
బస మించుమువ్వలుం బసిఁడిగంటలును
బసిదిండిగంతయుఁ బాపపట్టెడముఁ
దెలిమించుముకుఁద్రాడు చిన్నినెమోము
గలిగి తేజీకూనగతి నొప్పు మీఱి
యడరుగబ్బున ఘణిల్లన అంకె లిడుచు
నడతెంచు కైలాసనగ మననొప్పు
వెలిగిబ్బ నెక్కి యవ్విధుఖండమౌళి
వలిగుబ్బలితనూజ వలిగుబ్బ లిఱియఁ 1490

గౌఁగిటఁ దను బిగ్గకరముల నొక్కి
వీఁగుచు సంతోషవివశుఁడై పొంగి
యావేళ నిచ్ఛావిహారియై మింటఁ
బోవుచు నుండునప్పుడు శైలతనయ
ధరనున్న భార్గవతనుజాతుఁ జూచి

( 83. భక్తిసారతపోనిరతత్వప్రశంస. )

వరుఁ జూచి యత్తపోవనవీథియందు
ఘనతపోనిష్ఠ నొక్కఁడు శంక లేక
వినిమీలితాక్షుఁడై వెలితలం పుడిగి
నరునిచందమున నున్నాఁడు తత్తేజ
మరుణకోటుల కెక్కుడై చెలంగెడిని 1500

యితఁ డెవ్వడో మనమిమ్మహామహుని
గతియుఁ దన్మహిమయుఁ గనిపోవవలయు
నని నంది వాగెయు నందంద గుదిచి
వినుతించి పలుమాఱు వేడుకొనంగ
నామెడఁ దనప్రియురాలి వాక్యములు

త్రోయఁజాలక నిల్చి తుహినాంశుధరుఁడు
వృషభంబుడిగి మహానివృషభుని జేరి
విషకంఠుఁ డనియె సవినయవాక్యముల

( 84 వరప్రదానసుముఖత్వ వర్ణనము. )

నుడురాజమౌళి నేనోమహానిచంద్ర!
యడుగు మిచ్చెద వరం బనఁ గన్నుఁ దెఱచి 1510

యిగురొత్తువేడుక నెదుట నున్నట్టి
నగసుతాపతిఁ జూచి నగుచు నఘ్యోగి
తనచెంత నున్నబొంతను మును మున్నె

( 85. భక్తిసారకలితలజ్జాకరవరప్రార్థన, శంకరరోషావేశాని. )

చొనిపియుండినయట్టి సూది చేబూని
దారంబు నంది యీదారంబు సూది
ద్వారంబునందు సంధానింప నిప్పుడు
వర మిమ్ము నీవు దేవర వైతి వేని
హర! మాకు నిది మనోహరము నాఁబుఁడును
భవుఁడు రోషావేశభరితుఁడై యలిగి
యవు రౌర! నాతోడనా కేరడంబు 1520

తెఱుఁగవే పురముల నెఱియించువార్త
మఱచితే తారకు మర్దించుకథఁక
వినవె? నాకథలు భూవిదితంబు లిప్పు
డన నేల? తొంటివి యని చెప్ప నేల?

( 86. శంకరనేత్రవహ్నిజ్వాలాప్రసారణము. )

యిదె తపోధనుఁడ వైతేని యీక్షణము
కదలక నాదుముంగల నిల్వు మనుచుఁ
గ్రచ్చుఱఁ జిచ్చుఱకన్ను విచ్చుటయుఁ

జిచ్చుఱకోలలేర్చినరీతిదెసల
మింట మంటలు జంట మెఱయఁ దారకలు
గెంట నద్రులు పెల్లగిలి కూలి వ్రాలఁ 1530
జిటచిటధ్వనులతో శిఖకోటి వెడలి
పటుతర బ్రహ్మాండభాండంబు నిండ
ఖద్యోతకాంతు లొక్కట లెక్కగొనని
ఖద్యోతబింబంబుకరణి నమ్మాని
హరనేత్రవహ్నికి నడ్డంబు గాఁగఁ

( 87. ప్రత్యస్త్రప్రేరణాక్రమము. )
భక్తిసారచరణవహ్నిజ్వాలాప్రసారణాధిక్యము.

జరణాంబుజాతంబుఁ జూచెఁ జూచుటయు
నందుఁ జూపట్టె నత్యర్కాగ్నికోటి
చందంబు గలుగులోచనకోటియందుఁ
బొడముమంటలు భుగ భుగ నాకసంబుఁ
బుడమియు నిండి నిప్పులు గుప్పళింప 1540
గడ గడ ధరణి గ్రక్కదల మిన్నగల
నుడుపంక్తి లాజలయోజమైఁ బెటల
వెలిపింపఁగాఁ బోయి వెలిచినకరణిఁ
గరకంఠుఁ డానేత్రఘనవహ్ని కులికి
తలఁచిన ధారాళధారాధరములు
బలువిడి గర్జనప్రభలతో నిగుడి
గుడిగొని జడివట్టి కురియంగఁ దొడఁగెఁ
దొడఁగిన మానినాథుఁడు లెక్కగొనక
దేవకీసుతుఁడు లోఁ దెలి వొందియున్న
గోవర్ధనంబు బాగుగ నున్నఁ జూచి 1550
శర్వుండు మిగుల నాశ్చర్యంబు నంది
శర్వాణి కమ్మునీశ్వరుఁ జూపి పలికెఁ

గంటివే యొనలేక కనలేదుకంటి
మంట సాహసుతిగొనుమంటఁ గల్పించె
నే నెంత యతఁ డెంత యెన్నిచూడంగ
శ్రీనాథుభక్తు లజేయు లెవ్వరికి

( 88. శంకరకృతభక్తిసారవైభవప్రశంస. )

సురవర్యుఁడైన భూసురవర్యుఁడైన
నరనాథుఁడైనఁ గిన్నరనాథుఁడైన
నారయ హరిదాసు లధికులు గాన
వారలతోడ గర్వము పని లేదు 1560

అంబుజనేత్ర! యెట్లంటేనిఁ దొలుత
నంబరీషుఁడు గెల్వఁడా యత్రిసుతుని
హరిదాసు లఖిలలోకైక పావనులు
హరిదాసు లపగతాహంకారమతులు
హరిదాసు లగువార లధికుల కధికు
లరయ వారలకంటె నధికులు లేర
యనుచుఁ గపర్ది సంయమినాథుఁ జూచి
వినుతవాక్యంబుల వేమాఱుఁ బొగడి
సోమవానికులనాథ! యోగీంద్రచంద్ర!
నీమహామహిమ వర్ణింప శక్యంబె 1570

యింతవాఁడని నిన్ను నెఱుఁగమిఁ జేసి
తింతకార్యంబు నేనిట్టినేరంబు
మఱచి మమ్మిరువుర మదిలోన నెప్పుడు
మఱవకు మనుచు నుమామనోహరుఁడు
నక్కాంతతోడ మిన్నంది యున్నంది
నక్కైలాసాద్రి కేగె నాతనికి

( 89. అక్షపాదనామాంతరప్రాప్తిక్రమము. )

నక్షులు పాదంబునం దున్నకతన
నక్షపాదాహ్వయం బమరె నంతటను
జెదరకుండఁగ భవజీర్ణవస్త్రములు
పొదివిమాయాసూత్రమునఁ గాలసూచి 1580

నొడలిబొంతలు కుట్టుచున్నమాయావి
వడువున నవమ్మానివసుధేశ్వరుండు
తఱచు కుట్టులుఁ బడఁ దనబొంతపొంత
కుఱువాఁడిసూదిచేఁ గూర్చుచున్నంత

( 90. కొంకణసిద్ధనరాగమనము. శార్దూలవాహనగతినిరోధము. )

గగనమార్గమునఁ గొంకణుఁ డనుసిద్ధుఁ
డగణితదివ్యమంత్రాదిసిద్ధుండు
చిఱుతకెంజడలమై సింగినాదంబు
నెఱసినమేనివన్నెలబూదిపూఁత
బెత్తంపుమొలత్రాట బిగిసిచూపట్టు
గుత్తంపుగోఁచి చిక్కులకుట్లబుఱ్ఱ 1590

నిగనిగ మెఱయుమానికపుఁగాపూత్తు
లోగి ఫాలమున నొప్పుచున్నరుద్రాక్ష
మొగసిరిమసిబొట్టు మొనసంకుబేర్లఁ
తగిలినపెనుజన్నిదపు రుండమాల
కప్పెరసట్టంబుఁ గక్షఫాలయును
నొప్పుగాఁ బిగిసినయోగపట్టెయును
గలిగి డాకాలిమైఁ గాలు సంధించి
నలువొందు నురము నెన్నడుము నిక్కించి
కేలిమైఁ గేలు నొక్కించి మోకాలి
కేలిక్రిందట నిఱికినబాగు చూపఁ 1600

బొలుపొందులాతంబు పులికళాసంబుఁ
గలిగి సిద్ధుఁడు శరద్ఘనఘనం బనఁగఁ
గనుపట్టె గగనమార్గమున శార్దూల
మనిలవేగంబున నట వచ్చి వచ్చి

( 91. భక్తిసార తేజఃప్రసార వైభవము. )

ధర నున్న భార్గవాత్మజుదివ్యతేజ
మురుతరబ్రహ్మాండ మొరసి క్రిక్కిఱిసి
యిలకును మింటికి నేకంబు గాఁగఁ
దలుపువై చినరీతి దట్టమైపొదల
నావరతేజంబు నలవృమై దాఁటి
పోవంగలేక బెబ్బులివాపురంబు 1610

గ్రక్కున నిలిచి వేగము దక్కి వెనుకఁ
ద్రొక్కుచునున్న సిద్ధుఁడు కోపగించి
హాగియబిగు వింత వదలి దాఁటించి
రాగేలు బిగియించి రవళి ధే యనుచుఁ
దర మిడి కేలి బెత్తపుఁదర యెత్తి
చురుకుట్టవై చిన స్రుక్కుచు నదియు
నడుగు ముందఱ కిడ కందంద బెగడి
మడిదోఁక పెట్టుచు మాటిమాటికిని
వెనువెన్కకే వచ్చి వెస ముందు సాగి
చనకున్నఁ జూచి వేసరి కొంకణుండు 1620

గాలి డెందముఁ గల్చుగతుల శార్దూల
మేలకో చని చని యిటుఁ బోక నిలిచెఁ
జిట్టకంబున నొండుసిద్ధుండు తెరువుఁ
గట్టెనో కాక వాకట్టెనో లేక
యున్నతోన్నతుఁ డైన యోగీంద్రవర్యుఁ

డున్నాఁడో యీచక్కి యుర్వీభాగమున

( 92. యోగీశకలితభక్తిసారనుతిప్రార్థనాది. )

నని దెసల్ పరికించి యాచెంత యోగి
జననాథుఁ డగుభక్తిసారు నీక్షించి
పసిడిండి డిగ్గి తాపసవర్యుపాద
కిసలయయుగళి నాగిలి వ్రాలి నిచ్చి 1630

యోగీంద్ర! మౌనిజాతోత్పలచంద్ర!
భాగవతోత్తంస! భక్తాబ్జహంస!
విజితారిషడ్వర్గ! విహితసన్మార్గ!
నిజకృపాభరితాంగ! నిగమాంతరంగ!
యపరాధ మపరాధ మని సన్నుతించి
కృపణుఁడై మానీంద్రుఁ గృపవుట్టఁ బలికి
యింతవానికి నీకు నిట నూదిఁ బూని
గంత బొంతయుఁ గూర్పఁ గారణం బేమి?
యణిమాదిసిద్ధుల కధిపతి వీవు
ప్రణుతింప మునిసార్వభౌముండ వీవు 1640

నీయట్టివానికి నీచకృత్యంబు
సేయుట దగునే? యోసిద్ధమానీంద్ర!
యనుచుఁ జాఁ దొడిగినయట్టిమానికపుఁ
గొనబుకుచ్చులవింతకుచ్చులిగంత

( 93. దివ్యఘుటికరచనాద్యాశ్చర్యచర్య. )

పటుకక్షపుటిలోని పారదదివ్య
ఘుటికయు నయోగ్యాగికులచక్రవర్తి
ముందఱ నిడి కేలు మొగిచిన మోవి
చెందలిరాకుమైఁ జిఱునవ్వు నెఱయఁ

గొంకణుదెసఁ జేరకొని మాధవాంఘ్రి
పంకజయుగళలగ్నభావుఁ డిట్లనియె 1650

నిది యేమిఫల మిచ్చు నెట్లు గైకొంటి
వివరింపుమా మాకు వీనిచందంబు
లనిన సిద్ధుఁడు భార్గవాత్మజుఁ జూచి
వినతుఁడై వేర్వేఱ వివరింపఁదొడఁగెఁ
దనువున నీకంథ ధరియించినట్టి
మనుజుఁ డందఁడు జరామరణదుఃఖములు
ఘోసఁగెడురసములఁ జోసి శోధించి
రసపంచకమును బరము లెన్మిదియును
భాసిల్లి ధృతిబీజపక్వరత్నముల
గ్రాసంబు లొసఁగి సాంగంబుఁ గావించి 1660

షదియునెన్మిదియు నై పరఁగుసంస్కృతులఁ
బదిలంబు గాఁగ నీపగిది నొనర్పఁ

( 94. తపోమహిమ సామర్థ్యకార్యరచనావర్ణనము. )

బటుతపోమహిమలఁ బడసినయట్టి
ఘుటికోత్తమము దీనిగుణము నీతోడ
నేటికి నీఁక దాఁప నిది సోఁకినంతఁ
గోటిలోహము మంచికుందనం బగును
అన విని యలఁతిన వ్యాసనాబ్జమున
నన లెత్త సమ్మౌనినాయకోత్తముఁడు
తనమేన రవికోటిఁ దలకించుకాంతిఁ
గనుపట్టు మణికంచుకంబుఁ జూపుచును 1670

( 95. మునిపాదపరాగమహిమ. )

ఆ జగత్త్రయసేవ్య మగు నిజపాద
రాజీవరేణుపరాగంబుఁ దిగిచి

పలుమాఱుఁ బాషాణబాధలఁ జెంది
కలకాల మెల్లను గానలఁ దిరిగి
తడయక దేశ మంతయుఁ ద్రవ్వికొనుచుఁ
బొడివోసికొని పొట్టుపొర లొచు వేఁగి
పుడమి నెందులకైనఁ బుటములు వెట్టి
కడపట నీ విట్లు ఘటియించుఘుటిక
యినుము బంగరు సేయు టేమియాశ్చర్య
మనుచుఁ బాధానీత మగుదానిఁ జూపి 1680

పాటింప నిది లోహపాషాణకోటి
కోటులు గావించు కుందనంబుగను
ఇల నెవ్వఁ డిది ధరియించు నాతనికిఁ
దలఁచినపని యెల్లఁ దనుతానె యగును
ఇందును నందును నెదురు లే దరుణు
నిందును నగుకాంతి నెనసి యాఘనుఁడ
యగణితాయుష్మంతుఁ డై యక్షుకలిమి
నగుచుండ మృత్యువునకు బొమ్మ వెట్టుఁ
జరచర బెట్టు నిర్జరభావ మొందుఁ
దరుణీకదంబకందర్పుఁ డై యుండుఁ 1690

జెనఁటి యీభవవార్ధిచే యీఁత నీదుఁ
వనజాసనేంద్రాది నందృృఁ డై యుండుఁ
నతనివశం బగు నఖిలలోకంబు
లతఁడు లోకోత్కృష్టుఁ డగుసిద్ధవర్యుఁ
డరయ నీరెండు లక్ష్యమె లోకులకును
సిరివరు దాసు లిచ్చినఁగాని లేవు
పనివడి నీతోడఁ బలుమాఱు వేయు
నననేల ? నే నిచ్చినట్టి యీఘుటిక

ప్రతి చూడు మని యోగిపతి ప్రసాదింప
నతిభక్తిఁ గొంకణుం డవనతుం డగుచు 1700

నరుదంది నిజవాహనారూఢుఁ డగుచు
సరభసగతిఁ జని చని యెక్కుచోట
మునుభార్గవాత్మజముని యిచ్చినట్టి
తనకేలిఘుటికచందముఁ జూతు ననుచు
దూరంబు చనక శాదూలంబు డిగ్గి
ఘోర మై మిన్నులతోడ రాయుచును
జిత్రకూటంబులఁ జె న్నగ్గలించు
చిత్రకూటం బనుశిఖరిశేఖరము
చెంతకుఁ జని ముని శ్రీపాదపంక
మంతయుఁ బూని యయ్యద్రిపై వైవ 1710

నలదేవతలు మింట నాశ్చర్యమంది
కలిగెఁబో రెండవకనకాద్రి యనుచు
నది భానుమండలం బగలించుకాంతిఁ
బదియాఱువన్నె యపసిఁడి యై యొప్పె
నప్పుడు కొంకణుఁ డంతరంగమున
ముప్పిరిగొనుమోదమున వెఱఁ గంది
యనుపమం బైన యీహేమాద్రి యిచట
నునిచిపోతినయేని యుర్విమీఁదటను
గ్రయవిక్రయములు భంగంబు లై పోవు
నయ మేది యంతరాంతరములు దక్కఁ 1720

గ్రతుదానభోగముఖ్యములందు మిగుల
నతిశయం బగుచున్నయట్టి కాంచనమె
యితరలోహములతో నెనయైనఁ గార్య
గతి దప్పు నిధిబుద్ధి గాదురా యనుచుఁ

( 96. జనియోగశక్తికార్యాది. )

దనయోగశక్తిచే ధరణీతలంబు
ఘనతరవివరంబుగాఁ జేసి యందు
సురగిరితోఁ నీడుజోఁ డాడుహేమ
గిరిశేఖరంబు నిక్షేపంబు సేసి
తెఱియ రొప్పులపొడనీలని నెక్కి
మఱియు వచ్చినత్రోవ మగుడి యేతెంచి 1730

యపరిమితానుకంపామృతాసారు
నపగతసంసారు నాభక్తిసారుఁ
గని భక్తిఁ బాదపంకజముల వ్రాలి
వినుతించి హస్తారవిందముల్ మొగిచి
యే మనువాఁడ బ్రహ్మేంద్రాదు లైన
నీమహామహిమ వర్ణింప నోపుదురె?
శ్రీరామపదపద్మరేణువు సోఁకి
ధారుణిమై శిల తరుణి యై నిల్చె
నన వింటి మున్ను ప్రత్యక్షంబు నేఁడు
కనుఁగొంటి నీపాదకమలరజంబు 1740

సోఁకినఁ బరుసంబు సోఁకినయినుము
నీఁక శైలము హేమవిజితాద్రి యయ్యె

( 97. భక్తిసారాపారవైభవప్రశంస. )

హరికన్న హరిభక్తు లధికులే యనుట
యరయంగ నిపుడు తథ్యం బయ్యె నయ్య
వినఁ జెప్పఁ జోద్య మై వివరింప నెట్టి
ఘనులందు లేని నీఘనదివ్యమహిమ
మీఱి యెన్నఁగఁ వశమే? మూఁడుమాట
లాఱుతప్పులు మిమ్ము నభినుతింపంగ

నిన్నెవ్వఁడు గణుతింప నే నెంతవాఁడ
వేయినోళ్ళును రెండువేలజిహ్వలును 1750

గలుగువానికిని శక్యమె ? పదివేలు
గలవు నా నేరముల్ క్షమియింపు మనుచు
వినతుఁ డై పులి నెక్కి వినువీథిఁ జక్కఁ

( 98. భక్తిసారయోగ నిరగత్వవిధానము. )

సరోభూతయోగివరాగమనము.

జనియె భార్గవమునీశ్వరుఁ డంత నొక్క
గిరిగుహాంతరసీమఁ గృతనిష్ఠుఁ డగుచు
నిరుపమనిజయోగనిరతుఁ డై యుండె
నానమయమున విహారేచ్ఛతోడ
నాసరోభూతమహాయోగివరులు
చనుచుండి యాభక్తిసారు తేజమునఁ
గానఁగొన్న యాశైలగుహకు నల్లంత 1760

దవ్వులఁ జనుచుండి తమయోగదృష్టి
మువ్వురు భార్గవమునితేజ మరసి
యున్నతోన్నతుఁ డైనయోగీంద్రుఁ డొక్క
డున్నాఁడు వాఁడె లేకున్న నిబ్భంగి

( 99. పరస్పరానందాదివైఖరి. )

శీతశీతాంశుతేజముల గెలుచు
నీతేజ మొరులకు నేల సిద్ధించు
నని సంతసం బంది యందఱొ నిరుపు
రనురాగమున భార్గవావాసమునకు
జలజాతబాంధవచంద్రులకరణి
వెలచుట్టుకొనుచు నవ్వల దాఁటి చనిరి 1770

భాసురం బైన తత్ప్రభఁ జూచి యంత
నాసరోయోగీంద్రుఁ డచ్చెరువంది
చారుయోగాధ్వసంచారుఁ డౌ భక్తి
సారుఁ డున్నట్టియచ్చటి కేగుదెంచి
యతనిడగ్గఱ కేగి యభినుతి సేయ
హితమతి నాతండు నెదు రేగుదెంచి
యనయంబు మెచ్చుచు నాత్మబంధువులఁ
గనుఁగొన్నగతి వేడ్కఁ గడలి నోలాడి
యానసేందుప్రభ లడరుచందమున
నానందబాష్పంబు లందంద దొరఁగ 1780

నొండొరు నుతులు సేయుచు ధర సాగి
దండంబు లిడుచు నెంతయుఁ బ్రియం బెసఁగ
నాలింగనక్రియ లాచరింపుచును
గేలు కేలున బిగ్గఁ గీలించుకొనుచుఁ
జెలఁగి యిద్దఱు సుఖాసీను లై ప్రేమ
గులుకంగఁ దమతమకుశలంబు లరసి
యత్తపోధను లంత హరిపదాయత్త
చిత్తు లై విగళితచిత్తు లై కూడి
కూత్తి పాయనియట్టి యానందలహరి
మత్తు లై నిరతాప్రమత్తు లై యచట 1790

గరిమమై క్షీరోదకన్యాయ మెసఁగ
నిరవుగ నుండి రనేకకాలంబు
తదనంతరమున నత్తపసు లచ్చోటు

(100. మయూరాఖ్యపురప్రాప్తికథనము. యోగరచనావిధానము.)

గదలి పర్వతనదీగహనముల్ గడచి
యలపూర్వజలరాశి యపరభాగమునఁ

పొలుచు మయూరాఖ్యపురము చెంగటను
గైరవకంజాతకలిత మైనట్టి
కైరవతీర్థంబుకడఁ గల్పకంబు
పోలు పొందు కేసరభూజంబుక్రింద
నిలిచి యోగసమాధినిరతిఁ జెంపొంది 1800

యిరువు ర-చ్చోట ననేకకాలంబు
పరతత్త్వభజనానుభవమునఁ దేలి
యు డి రంతట సరోయోగినాయకుఁడు
దండ భార్గవమౌనిధరణీశుఁ జూచి
యింతకాలము మన మెనసి యొక్కింత
యంతరంగంబున నరమర లేక
జోడుకోడియల మై జోఁక దోఁ దోడు
నీడల మగుచు నన్నిటఁ గూడిమాడి
డాయక పాయక తలఁపు లేకముగఁ
దోయజాతునిపాదతోయజాసక్తి 1810

నన్నదమ్ములు వోలె ననగి పెనంగి
యిన్నాళ్ళు నుండితి మెర వింత లేక

( 101. భక్తిసారహరిక్షేత్రప్రాప్తిక్రమము. )

గణన మించిన యింతకాలంబు నొక్క-
క్షణ మయ్యె నాకు నీసంగతి నింక
ధరమీఁద నర్చావతారరూపమున
హరి యున్న నిలయంబు లచటితీర్థములు
సేవించి మఱియు నీశ్రీదివ్యమూర్తి
సేవింప మఱలివచ్చెద నంచుఁ బలికి
ప్రణమిల్లి ప్రణమిల్లి భక్తిసారుండు
ప్రణుతించి యానంద బాష్పముల్ నించి 1820

యుక్కుననిఱిచియుంగ నలమి యమ్మౌని
నక్కడనుండి పాయనికూర్మితోడ
మరలిచూచుచు మందమందయానమున

( 102. యోగవిద్యాభ్యాసప్రభావము. )

నరిగె నంతటిమీఁద నతఁడు పాదుండు
నమపమయోగవిద్యాసక్తిఁ గొన్ని
దినము లచ్చోట వర్తిల నొక్కనాఁడు
తఱచుగా నామముల్ ధరియించుకతన
మఱి ధరింపఁగఁ దిరుమణి లేక యున్న
నిపు డూర్ధ్వపుండ్రవిహీనత నుండి
జపతపోముఖ్యముల్ సలుపఁ గాదంద్రు 1830

తలపోయ నిది కృష్ణధారుణి యిచటఁ
దెలివొందు ధవళమృత్తిక యిఁక నెట్లు
గలిగెడు ననుచు హృత్కమలంబులోనఁ
దలఁపుచు యోగనిద్రాసక్తుఁ డైన

( 103. శ్రీవేంకటేశదివ్యశరీరసౌందర్యవర్ణనము. )

బంగారుగజ్జెలుఁ బసిఁడియందియలుఁ
జెంగావిచాయ మించినపైఁడివలువ
మొగపులమొలనూలు ముత్యాలకుచ్చు
బిగిసి చూపట్టుముప్పిడికటారంబుఁ
గటి సంఘటించిన కరపల్లవంబుఁ
బటువరంబుల నిచ్చుపాణిపద్మంబు 1840

వలమురినెఱవాఁడి వలయపుఁగత్తి
బలసి చూపట్టెడుపాణియుగ్మమును
బొడ్డుమానికము కెంపులబిటారించు

నొడ్డాణమును మించు నుదరబంధంబు
భుజకీర్తులును బాహుపురులు తాయతులు
భుజగభూషలతట్టు పుణుఁగు మైపూఁత
యక్కునవెలకొన్న యలమేలుమంగ
యక్కజం బగువైజయంతిసరంబుఁ
దారహారములుఁ బుత్తడిజన్నిదములుఁ
జారుమౌక్తికకంఠసరము బేరురముఁ 1850

గంబుకంధరమును గౌస్తుభమణియు
బింబాధరంబు నొప్పెడికపోలములు
మందస్మితంబును మకరకుండలము
లిందుబింబము హసియించునెమ్మోముఁ
దెలిదమ్మికన్నులుఁ దిలనాసికంబుఁ
దెలిమించునాణిముత్తియపునామంబుఁ
గనకపిప్పలదళకలితపట్టంబు
ననుపమమణిమయం బగుకిరీటంబుఁ
గలుగు శ్రీవేంకటగ్రావాధినాథుఁ
డలముని స్వప్నంబునందు వేంచేసి 1860

వొడకట్టి తనకరంబుల మేను నిమిరి
వడదేర్చి లాలించి వరదుఁడై పలికె

( 104. ఊర్ధ్వపుండ్రాహార్యమృత్తికాప్రదానము. )

వలవంత వలవ దోవత్స ! నీచింత
జలజాకరాంతరస్థలి సుధాకాంతి
నాయాజ్ఞచేఁ దిరునామ మింపొందు
నాయింద్రముఖులకు నది యలభ్యంబు
అరయంగ నది యణువంత ధరించు
నరుఁడొందు సురల కందఁగరానిపదము

నది నీవు గైకొను మనునంతలోనె
ముదమంది భార్గవముని మేలుకాంచి 1870

యంతరంగంబున నాదేవదేవు
నెంతయుఁ దలపోసి యింపు రెట్టింపఁ

( 105. శ్రీవేంకటేశస్తుతిప్రకారము. తిరుమణిసంగ్రహణము. )

గరిరాజపాలన ! కమలాక్ష ! భక్త
వరద ! రమానాథ ! వాత్సల్యజలధి !
ననుఁ గన్నతండ్రి ! క్రొన్ననవిల్తుతండ్రి !
యని సన్నుతించుచు నాశ్చర్యమంది
పదిలుఁడై కొలనులోపల డిగ్గి తనదు
మదికి జోడగు జలమధ్యభాగమున
దండి మై పూర్ణిమా తారాధినాథ
మండితం బగుతిరుమణి సంగ్రహించి 1880

మానీంద్రమణి తిరుమణి రమణీయ
మైనది యని యాత్మ నచ్చెరు వంది
తటమున కేతెంచి తత్తరుచ్ఛాయ
ఘటితతకంజాసనకమనీయుఁ డగుచు

( 106. ద్వాదశోర్ధ్వపుండ్రవైభవధారణక్రమము. )

నది క్రమంబునఁ గేశవాదినామములఁ
బదిరెండు నుడువుచు భక్తిపూర్వముగ
నుచితస్థలంబుల నూర్ధ్వపుండ్రములు
రచియించి తదనంతరమున నయ్యోగి
యలచోటు వాసి సోయగముల మించు
నలకాంచితం బైన యలకాంచిఁ గాంచి 1890

యచటికేతెంచి తదంతరసీమ
నచట భోగీంద్రపర్యంకంబునందుఁ

జెలఁగి సరస్వతీసింధుబంధనము
సలిపెడు సేతువుసరణిఁ జెన్నొంది
యవిరళశుభమూర్తియై లచ్చిఁ గూడి
పవళించి యున్నట్టి పద్మాక్షు నత్రు
సేవించి ప్రణతులు సేసి సన్నుతులు
గావించి యంతరంగమున భావించి
యచ్చట తైలధారాచ్ఛిన్న మగుచు
నచ్చినభక్తి నన్నగరంబునందు 1900
భోగితల్పుని మనమునఁ బాదుకొల్పి
యోగవిద్యాసక్తి నుండె నుండుటయు

( 107. భక్తిసారమునిదివ్యమహిమప్రశంస. )

జనలోకనుతభక్తిసారునిచరిత
మనిశంబు విని విని యాశ్చర్య మంది
యాదటఁ గణికృష్ణుఁ డఖిలవేదాంత
వేదియై హరిపాదవిహితాత్ముఁ డగుచు
భక్తిసారమునీంద్రు పదపంకజాను
రక్తుఁడై యితరవిరక్తుఁడై యిపుడు
తనపాలిగురువును దైవంబు గాఁగఁ
దనయాత్మఁ గోరి యాతని జూడఁ గోరి 1910
జగతిఁ దన్మౌని సంచారపూతంబు
లగునట్టి దేవాలయముల శైలముల
నదులఁ దీర్థముల నానాదిగంతముల
వెదకుచు వచ్చి దైవికమున నచట
భోగీంద్రవరతల్పభోగి యోగాను
యోగియై యున్న యయ్యోగి నీక్షించి

( 108. కణికృష్ణరచితసేవాభక్త్యాది. )

తనతల్లిఁ గన్నునందనునిచందమున

ననయంబు హర్షించి యడుగుల కెరఁగి
పరఁగెడి యానందబాష్పపూరములఁ
జరణాంబుజముల మజ్జనము గావించి 1920
పోఁడిమి నీమూర్తి పొడఁగనం గలిగె
నేఁడు నా నేత్రముల్ నేత్రంబు లయ్యెఁ
బరమపావన నిన్ను భజియించుకతన
ధరఁ గృతార్థుఁడ నైతి ధన్యుండ నైతి
నిదె యేను మ్రొక్కఁ బోయినయట్టిదేవుఁ
డెదురుగా వచ్చిన ట్లేగుదెంచితివి
ఏయుపాయమున బ్రహ్మేంద్రాదిసురలు
సేయని భాగ్యంబుఁ జేసితి నేఁడు
దలఁప భవత్ప్రసాదంబుచే మునుప
యలదృఢవ్రతునకు నాత్మజుఁ డైతిఁ 1930
గణికృష్ణుఁ డనుపేరు గలిగినవాఁడ
గణుతింప నీడుక్కింకరుఁడఁ జుమ్మనుచుఁ
బ్రణుతింప నెలమితో భక్తిసారుండు
కణికృష్ణు నంతరంగంబునఁ జేర్చి
యితనిచే లోకంబు లీడేరు ననుచు
మతి విచారించి యమ్మహాముని శేఖరుఁడు
సరస నొప్పెడి హేమసారసాకీర్ణ
సరసి యందులఁ గృతస్నానుఁ గావించి
పొంకంబుగాఁ దనపూర్వాంకపీఠిఁ

( 109. పరమమంత్రాద్యుపదేశక్రమము. )

బంకజాతాసనభాసితుం జేసి 1940
పరమగురుండైన పద్మేక్షుహృదయు
సరసిజాంతరసీమఁ జక్కఁగా నిలిపి
కరము వేడుక మస్తకముమీఁద తనదు

కర మూఁది దక్షిణకర్ణంబులోన
స్వరవర్ణ చరణార్థజాతాదివిధుల
సరణు లేర్పడఁగ నిశ్చలదయాదృష్టి
సరవిమై కృతపురశ్చరణంబు మంత్ర
వరము యోగమును సర్వముఁ దేటపడఁగ
నుపదేశమొసఁగి సర్వోన్నతు గాఁగఁ
గృపచేసె నక్కణికృష్ణు వర్ధిష్ణుఁ 1950
డను నటుకొనువారు తనయంతవార
లనుమాట జగతిఁ దథ్యము చేసె నతఁడు
కృతకృత్యుఁ డగు కణికృష్ణుఁ డామౌని
పతిపదాబ్జములకు భక్తిమై వ్రాలి
భజియింప నర్మిలి భక్తిసారుండు
నిజశిష్యుతోడ నన్నికటంబునందు
సకల కయోగవిద్యాభ్యాసుఁ డగుచు

( 110. యోగాహాగుహాప్రవేశము. యోగవిద్యాభ్యాసస్వరూపము. )

వృద్ధసారికృతపూజోపచారాది.

నొకగుహాంతరసీమ నుండె నయ్యోగి
విదితచారిత్రము లివ్వని విని యొక్క
ముదుసలి తద్గుహాముఖముఁ బ్రత్యహము 1960
నలికి ముగ్గులు వెట్టి యక్షత గంధ
ఫల పుష్ప ధూప దీపముల నర్చించి
వినుతించి మ్రొక్కి యవ్విధమునఁ బూజ
లొనరింపుచుండ నయ్యోగి పంకేజ
దినమణి యొకకొన్ని దినములు చనఁగఁ
గను విచ్చి చూచి యోగసమాధిఁ దెలిసి
ముంగిలి నున్న యమ్ముదితతోఁ బలికె
నంగనా! నీచేయునట్టి యీభక్తి

కిచ్చుమెచ్చితి వర మేమి కామించె
దిచ్చెద నీవచ్చు నీరాదు నాక 1970

( 111. యౌవనవరయాచన. వరప్రదానము. )

వినుపింతు నొకమాట విను మింకఁ దుదిని
వనజభవాండ మవ్వలను లోపలను
నిది యడుగఁగవచ్చు నిది రాదటంచుఁ
గొదుకక వర మేరికొను మిత్తు ననిన
ననురాగమునఁ బొంది యప్పు డాజరతి
మునిసాధునకుఁ గరములు మోడ్చి పలికె
బలుముల పగ దాయపగటుల పచ్చు
చెలువంబునకు గొంగ జిగిబిచ్చుఁగొఱవి
నీటులమిత్తి వన్నెలవేఱువిత్తు
పాటించిచూడ రూపము పాలి మాలి 1980
తలఁపులరోంత రోఁతలవీడుబట్టు
ఖాలుపొందు నిజభోగములవీడుకోలు
నగుబాటుగని జవ్వనపుముక్కుఁగొయ్య
యగునట్టి ముదిమి వాయఁగఁ జేసి నన్ను
లలితరూపవయోవిలాసము ల్గలిగి
విలసిల్లఁగాఁ జేయవే మౌనిచంద్ర!
యనుఁడుఁ బ్రసన్నాత్ముఁ డై భక్తిసారుఁ
డనుపమకరుణాకటాక్షవీక్షణము

( 112. వరసంపాదితసౌందర్యప్రశంస. )

నెలఁతమై నిగుడించె నిగుడించుటయును
నలరోమపదరేణు వంటినయంత 1990
శిల చట్టురూపేది చెలువమైనట్టు
చెలువమెల్లను బ్రోది చేసినకరణి

వనజనేత్రునిపాద వనజంబు సోఁకి
తనరుచుఁ గుబ్జ సుందరి యైనకరణి
వెలఁది చల్లని నిండువెన్నెలనీటఁ
బులుకడిగినకల్వపూఁదూపు వోలెఁ
బరమయోగీశ్వరాపాంగసంగమున
జరతోడఁ బాసి నిజాకారభామ యగుచు
నూరునిర్జితరంభయును నాసికాప్త
తారుణ్యజితతిలోత్తమయును జరణ 2000

మంజీరరవజితమంజుఘోషయును
రంజితతనులతారమణతావిజిత
చిత్రరేఖయు నౌచుఁ జెన్నుగ్గలించి
చిత్రంబు గాఁగ నచ్చిగురాకుఁబోఁడి
బెడఁగులై బెళకక బెళకుకన్నులును
గుడిగొని కలుకక కలుకుగుబ్బలును
నలువొంది నవ్వక నవ్వునెమ్మోము
మెలపున మెదలక మెదలువేనలియు
సన్నమై జడియక జడియునెన్నడుము
మిన్నయై మెఱవక మెఱయుమైదీఁగె 2010

తోరమై తొలకక తొలకుపిఱుందు
చారుచేలంబు మించక మించుతొడలు
తెగడి కెందమ్ములఁ దిట్టక తిట్టు
చిగురులచాయ మించినపదంబులును
జిగితేనె చిందక చిందుపల్కులును
సొగసులై సొలయక సొలయుభావములఁ
గలిగి యొప్పారు జగన్మోహనాంగి
చెలఁగి యమ్మౌనీంద్రుశ్రీపాదములకు

నతు లొనర్చుచు హస్తనళినముల్ మోడ్చి
నుతియింపఁ దొడఁగె నమ్మునిలోకనాథు 2020

( 113. మునీంద్రమహామహిమప్రకటనము. )

నల సురాసురులకు నందంగరాని
చెలువంబు నీకృపచే నాకుఁ గల్గె
మునీంద్ర ! మీమహామహిమాతిశయము
నేను వర్ణింపంగ నెంతటిదాన
నన విని హర్షించి యాకోమలాంగిఁ
గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింపఁ
దరళాక్షి మత్ప్రసాదంబున నింక
నిరుపమసంపదల్ నినుఁ జెందఁగలవు
పరికింపఁగాఁ బట్టబద్ధకామినులు
పరిచారములు సేయుభాగ్య మందెదవు 2030
నీమానసంబున నీలాహివేణి
రామకథ్యానంబు మఱువకు మనుచు
ననిచినఁ దదనుజ్ఞ నయ్యిందువదన
తనయింటి కరుగు నత్తఱి దైవికమున

( 114. కాంచీభూపాలమనోవికారప్రాప్తికథనము. )

నాపట్టణం బేలు నవనీవిభుండు
భూపాలనికర మింపుగఁ జేరి కొలువ
నెఱమించు గురిగింజనీలని నెక్కి
మెఱయుచు నావేళ మృగయానురక్తి
నరుగుచుఁ దనవచ్చినట్టిమార్గమున
నరుదెంచుచున్న యయ్యతివ నీక్షించి 2040
మరుబారిఁ జిక్కి వేసఱు సొక్కిచొక్కి
యరు దంది మఱియు ఱెప్పార్పక చూచి.

తళదళుకుక్కన ధరాతలమున మెఱసి
నిలిచిన మెఱుఁగొ మానికములగనియొ
బంగారుప్రతిమయో భావజుకేళి
చెంగల్వచిలుకో పూచినకల్పలతయొ
కన్నెకయ్యమునకుఁ గాలుద్రవ్వుచును
జెన్నొందు మరునిరాచిలుకవావురమొ
యని తేజి డిగ్గి తోయజనేత్రఁ జేరఁ
జనిగారవించి యచ్చన లాడువేడ్క 2050

నాసతిఁ జతురంతయానాధిరోహఁ
జేసి తోకొనుచుఁ దేజీ నెక్కి మగుడి
యకన్యారూపంబునందునం దగిలి
చిక్కి తత్కులగోత్ర శీలనామముల
నరయంగ మఱచి నిజావాసమునకు

( 115. సుందరీపరిణయప్రకారము. )

నరుదెంచి శుభవేళ నాకోమలాంగి
సిరి మించ దివిజు లచ్చెరు వంది చెలఁగ
వరవైభవముల నుద్వాహమై యంతఁ
బొలుపుమైఁ గప్పురవల్లులు సోడుముట్ట
నలరుటిండ్లను మణిహర్మ్యవాటికల 2060

భువనజాకరముల భువనేశ్వరముల
నవిరళచంద్రశాలాంతరస్థలుల
నాలేమతోఁ గూడి యంగజకేళిఁ
దేలి తేలించియెంతే సొంపు మెఱసి
తద్దయు నింతిపైఁ దగిలినప్రేమఁ
బ్రొద్దుగ్రుంకులు పొడుపులు రాత్రి పగలుఁ
దెలియ కీసరణిఁ దత్తిలి రతికేళి

నలువుచుఁ బెక్కేండ్లు చనినపిమ్మటను
గోమరుబ్రాయం బను కోమ రైనచెలిని
నమలినపిప్పి నా నరసె వెంట్రుకలు 2070

పొడిబొడి నెరులతో బొమదోయిబిగువు
సడలినవిం డ్లనా జాతె నొక్కింత
మున్ను పి న్నెరుగక ముదితతోఁ గూడి
కన్ను గాననిరీతిఁ గప్పెను బొరలు
ఫలియించి రస మింకువంటుచందమున
పొల పై ననెమ్మేను స్రుక్కిళ్ళువారెఁ
దుదిని గామాంధునితోఁ బోదురోసి
వదలినగతి నింత వంతె ద్విజాళి
ముత్తరంబున వచ్చుముదిమిక్రొమ్మొగ్గను
లొత్తినగతి మీస లొక్కింత నరసె 2080
ముదుకఁ డై యిట్లు కాముకబుద్ధితోడ

( 116. జరాప్రాప్తిప్రశ్నక్రమము. )

నడవడఁ జెందు యయాతిచందమున
జనపతి యొకనాఁడు సతి విలోకించి
ననియె నేకాంతహర్మ్యంబులో నుండి
కటకటా! భూమి నెక్కడ లేనివింత
యిటఁ గల్గెఁ గంటివే యేణాయతాక్షి !
ముదిత నాథునికంటె మునుమున్నె ముదియు
ముదితకంటెను బతి ముదియునే మున్ను
అరయ మజ్జనభోజనాదులు వయసు
లిరువురకును సమం బెన్న జూచినను 2090

దన కేల వచ్చె వార్ధకము నీ వేల
యినుమడించినచేవ నెనసి నానాఁటఁ

జెందినజిగితోడఁ జెట్టుసడిగిన
పిందియకరణిఁ గాన్పించెద విపుడు
నెరు లింత నెరయవు నమ్మోముచాయ
తఱుఁగదు చనుదోయి తరల దింతైన
వారిజనేత్ర! నీవయ సెక్కువచ్చు
కారణం బేమి నిక్కము చెప్పు మనిన
నొఱపుగాఁ బరపుపై నొకకరం బూది
చిఱునవ్వు మోవిపైఁ జిందులాడంగఁ 2100

117. సుందరీప్రత్యుత్తరప్రదానశైలి. భక్తిసారమునివైభవప్రశంస. )

బయ్యెద యరజాఱఁ బాలిండ్లమీఁద
నొయ్యన హారంబు లుయ్యెల లూఁగ
నునుసిగ్గునిగ్గుకన్నుల నామతింపఁ
గొనగోళ్ళ వెడజాఱుకురులు దిద్దుచును
వినయ మేర్పడఁగ నవ్విభుదిక్కుఁ జూచి
యనియె నచ్చెలువ నెయ్యంబు రెట్టింప
భక్తిసారుం డనఁ బరఁగెడు భక్తి
ముక్తిదాయకుఁడైన మునివరేణ్యుండు
నగరాంతికమునఁ బన్నగభోగిశాయి
నగరిచెంగట గుహాంతరసీమ నుండు 2110

( 118. తచ్ఛిష్యకణికృష్ణప్రసిద్ధిప్రశంస. )

నతనికిఁ గణికృష్ణుఁ డనుశిష్యుఁ డతఁడు
నతనియంతటివాఁడె యాకృష్ణయోగి
కవిసార్వభౌమవిఖ్యాతిఁ జెన్నొందు
భువనత్రయంబునం బురుడు లేదనఁగ
బాగొప్పు నచ్చోట భక్తిసారుండు
యోగవిద్యాసక్తి నుండు నవ్వేళ
మునుకొని తద్గుహాముఖముఁ బూజించి

కొనియాడ నాయోగికులవరేణ్యుండు
కారుణ్య మెసఁగ నాకడఁ జూచి దివ్య
తారుణ్య మీగతి దయచేసె నాకు 2120

( 119. మునిపాదవందనచోదనము. )

నది యోగివరదత్తమైనది కానఁ
జెదర దెన్నటికి నోక్షితిపాల! నీవు
వలసిన నయ్యోగివల్లభుపాద
జలజముల్ చేరి నిర్జరభావ మొందు
మనుఁడు రాజసము నహంకార మెసఁగ
మనుజనాథుఁడు సభామంటపస్థలికి
నరుదెంచి సింహాసనారూఢుఁ డగుచు
బరిచారకులదెసఁ బరికించి పలికె
ఫణిశాయిమందిరప్రాంతంబునందుఁ
గణికృష్ణుడనుపేరి కవి యున్నవాఁడు 2130

( 120. కణికృష్ణాహ్వానము. )

మతిలోన మీరనుమానింప కరిగి
యతని నేఁ బిల్చెద నని తోడితెండు
అని పిల్చి పంచిన నాపరిజనులు
చని కణికృష్ణు నచ్చటఁ బొడఁగాంచి
తనయున్నచోటికి ధరణివల్లభుఁడు
నిను దోడితెమ్మని నియమించె మమ్ము
ననఘాత్మ విచ్చేయు మనవుడు గురుని
యనుమతిఁ గణికృష్ణుఁ డవనీశుకడకు
నేతేర రాజసం బెసఁగ భూనాథుఁ
డాతని నుచితాసనాసీనుఁ జేసి 2140

కర మర్థిఁ బలికె నోకణికృష్ణ! మాకు

( 121. గురూత్తమసత్కవితాప్రశంస. )

గురుతరుఁ డగు భవద్గురుని సేవింప
వేడు కయ్యెడి నిదె వేవేగఁ బోయి
తోడి తెమ్మనుచు నందుల కేమి వినుము
కవిత నీవలెఁ జెప్పఁగా రా దటంచుఁ
గవు లెల్ల నినుఁ బెక్కుగతుల వర్ణింప
విని విని యిటకు రావించితిఁ గవిత
వినఁగోరి యిప్పుడు విఖ్యాతి గాంగ
సిరి మించుసొమ్ములు చీనాంబరములు
హారులదంతులతో రహత్తుగా నిత్తు 2150
వరరసరీతి భావవ్యంగ్యముఖ్య
పరిపూర్ణ శుభశబ్దబంధంబు గాఁగ

( 122. నిజవైభవవర్ణనప్రార్థన. )

ననయంబు నీనేరు పంతయు మెఱసి
తనమీఁద నొక్క పద్యముఁ జెప్పు మనిన
నానీచనరపాలుఁ డాడువాక్యములు
వీనుల నిడక యవ్వేళఁ దాసుఁడు
నెరుసరికరిఁ జూచి నిగుడి కోపించు
తెలుఁగునఁ గనలి గద్దియ డిగ్గనుఱికి
శ్రీమనోహరపదాశ్రితచక్రవర్తి
మామకగురుఁడు సామాన్యుఁడే తలఁప 2160

( 123. కణికృష్ణవర్ణితభక్తసారమహిమాతిశయము. )

నీరధు లాపోశనించినయతఁడు
కారించి యరకాలఁ గనుచూపినతఁడు
కడగంట నమృతాంశుఁ గన్నట్టియతఁడు
కడలిఁ ద్రావెడువహ్నిఁ గ్రక్కినయతఁడు

పుట్టి యేగినవారు పుట్టినవారు
పుట్టనుండినవారు భువి క్రింద మీఁద
నక్షపాదునిఁ జెప్పినట్టి-చోఁ బూర్వ
పక్షంబు లగుదు రెప్పాటునన్నైనఁ
దోయజభవశివాదుల లెక్కఁగొనఁడు
నీయున్నచోటికి నేఁ డేల వచ్చు 2170

రూపింపఁ జక్కెరరుచి గొన్నయతఁడు
వేఁపచే దడుగునే వివరించిచూడఁ
గమలసంభూత శంకర ముఖ్యసురల
కమితంబులైన బ్రహ్మాండకోటులకు
నేలిక యగుశౌరి నెన్నఁడు నాదు
నాలుక నిను నెన్ను నా? దుర్మదాంధ!
నీవు లక్ష్యమెనాకు? నీ విచ్చునట్టి
యీవి లక్ష్యమె? తుది నిచ్చితివేని
యలవి ననిత్యంబు లసుఖంబు లైన
శిలలు లోహంబు లిచ్చెద వింతెకాని 2189

యిభరాజపాలకుఁ డిచ్చినయట్టు
లుభయవిభూతులు నొసఁగ నోపుదువె?

( 124. కాంచీభూపాలప్రార్థనానిరాకరణము. )

దానవాంతకుఁ దక్కఁ దక్కినయట్టి
మానవాంతరమున మానవాంతరము
వేఱైన భజన గావించుట వినుతి
సేయుట నా కన్న చెలియలివావి
నరనాథ! నీమీఁద నను జెప్పుమంటి
హరి హరి! యెట్లనో ధరాడె నీ కనిన

( 125. భూపాలకోపావేశాది. )

భీషణుఁ డగుచు విభీషణుమీఁద
రోషించుదశకంఠురూపు దీపింప 2190

బొమముడి గదుర చూపుల నిప్పు లురల
భ్రమితాక్షుఁడై యోష్ఠపల్లవం బదర
మోమెల్ల జేవురుముద్దచందమున
ఘోమించఁ గణికృష్ణుఁ జూచి యిట్లనియెఁ
దద్దయు నిన్ను నాదరమునఁ బిలిచి
పెద్దచేసిన నేల ప్రేలెదు నన్ను
నిప్పాటఁ బొగడుకవీంద్రులలోన
నెవ్వరిఁ బోలుదు రీవు నీగురుఁడుఁ
బేరిమెఁ బోనిమ్మని ప్రియము గావింప
నరిమీఱి పల్కె దున్మత్తుచందమున
నీ వసఁగా నెంత నీగురుం డెంత 2200

( 126. కణికృష్ణబహిష్కారకథనము. )

నీ వేల యతఁడేల నీవు నాతఁడును
దండిపై తన యేలుధారుణిలోన
నుండక చనుఁ డింక నుండితిరేని
దండింతు ననుఁడు నత్తాపసోత్తముఁడు
మండుచుఁ బలికె నమ్మనుజాధమునకుఁ
గావించు తపమెల్లఁ గనలినఁ జెదరుఁ
గావున శపియింపఁ గా దని కాక
నీచేనితనమును నిన్ను నీక్షణమ
నీఱు సేయఁగ నోపనే యింక నేల 2210

నిన్నుఁ గన్గొనరాదు నీ వేలుధరణి
నున్నఁ బాపము చెందు నోరి పాపాత్మ!

( 127. తడవలోకననిరాసప్రస్తావము. )
భూపాలదురాలోచనానివేదనక్రమము.

యని వానిఁ జూడక యచ్చోటు వాసి
దినకరబింబంబు దిక్కుఁ గన్గొనుచు
సరభసగతి భక్తిసారుఁ డున్నెడకు
నరుదెంచి తత్కుమా బంతయుఁ దెలిపి
యీపాపమతి యేలు నిలలోన నున్నఁ
బాపంబు చెందు నోపరమమునీంద్ర!
యున్నతి మీపాదయుగళంబు నాత్మ
నెన్నుచు నిటమీఁద నెచ్చోటికైనఁ 2220
బనివినిమొద నంచుఁ బదముల కెరఁగి
వినుతించు శిష్యుని వీక్షించి పలికెఁ
దనయ! నీ వొల్లనిస్థల మిది యేల
నినుఁ బాసి యుండంగ నేర్తునే యేను
ఏ వత్తు నీవెంట నే వచ్చినంత
నావెంటనే వచ్చు నాగేంద్రశాయి

( 128. భక్తిసారకృతహరిప్రార్థనాక్రమము. )

యతనివెంబడి వత్తు రఖిలదేవతలు
నితరంబుఁ దలపోయ నేల నీకనుచు
గ్రక్కున నచ్చోటు గదలి యుగ్రంపుఁ
జక్కి నొప్పెడి శేషశాయిసన్నిధికి 2230
నేతెంచి యాయిందిరేశ్వరుఁ గాంచి
నాతండ్రి! జగదేకనాథ! గోవింద!
భక్తవత్సల! కృపాపరతంత్ర! భుక్తి
ముక్తిదాయక! జగన్మోహనాకార!
ఫణిశాయి! నీభక్తభక్తుఁడైనట్టి

కణికృష్ణుఁ డిచటిభూకాంతుతో నలిగి
యరిగెడు నిటఁ బాసియతనితో నేను
నరిగెద నింక నీయహిశయనంబు
మడఁచి బాహాదండమధ్యంబునందు
నిడికొని నీవు నీయెలనాఁగఁ గూడి 2240

నావెంట వేంచేయు నన్ను మన్నించి
వేవేగ నాకూర్మిపింద ! గోవింద !
యని యొక్కపాటచే నారమానాథు

( 129. ప్రాథనానుగుణకార్యరచనాది. )

వినుతి చేసిన భక్తవివశుఁడై యతఁడు
పెనుపొందఁ బఱచిన పెనుబాపచాపఁ
దనచంక విఱికి పద్మాయుతుం డగుచు
మునుకొని చనుచున్న మునికులోత్తంసు
వెనువెంటఁ బాయక వేంచేయునప్పు
డినకులుం డడవికి నేగుచోఁ బౌర
జనులెల్ల నతనివజ్జను బోవునట్లు 2250

నిజవాసములు డించి నిఖిలదేవతలు
భుజగతల్పుని గొల్చి పోవు నత్తఱిని

130. (ప్రపంచస్థపగీత్యప్రదర్శనాది. నిబిడాంధకారప్రసారణాది. )

కులగిరుల్ గ్రుంగె దిక్కుంభులు మ్రొగ్గె
జలరాశివర్గంబు చలచల మరఁగె
నుడుపంక్తి చెదరె సూర్యునివేగ మడరె
వడఁకె శేషుఁడు ధరావలయంబు వేలె
నీరీతి జగ మెల్ల నిట్టట్టు వడియె
నారసిచూచిన నది యట్ల కాదె
హరిభక్తు లలిగిన యది నివారింప
హరహరిబ్రహ్మాదులైన నోపుదురె 2260

నెట్టన సురనాథు నిరసించుతపసి
తిట్టు దాఁకినయట్టి దివియునుం బోలెఁ
గప్పు మీఱినయట్టికావిరి విరిసెఁ
గప్పి నల్లడల చీఁకట్లు గ్రమ్ముచును
ఆమహీపతి యేలఁ నట్టి పట్టణము
సీమయు సర్వేళ శివపాదుసైవ
భావించి మంత్రులుఁ బౌరు లవ్విధము
భూవిభుతోడ నద్భుతముగాఁ జెప్పఁ

( 131. స్వాపరాధక్షమాపణప్రార్థనాక్రమము. )

గాంచి యేలెడుమహీకాంతుఁ డత్తెఱఁగు
గాంచి వారలు వల్కుక్రమ మాలకించి 2270

తనుఁ గట్టుత్రాడును దనుదాన తెచ్చి
కొనునట్లు నాయవగుణ మింత సేసె
నని తనసేయు మహాపరాధంబు
మనమునఁ దలఁచి వేమఱు భీతి నొంది
యిదియోగివరుచిత్త మేరీతిఁ గరఁగు
నియ్యపరాధ మిం కేమిటఁ బాయు
నేను గావించిన దిది మహాద్రోహ
మైన నామహాని కృపాకరుండగుట
వరశరణాగతవత్సలుం డగుట
శర ణన్నఁగాచు నిశ్చయ మింతకంటె 2280

నరయంగ మఱి యుపాయము లేదటంచు
సరివోరు భయము విస్మయ మాత్మఁ బొదలఁ
దడయక మంత్రులు తనవెంట నడువ
నడుగులు దొట్రిల్ల నలయిక వొడమఁ
బెదవులం దడుపుచుఁ బెం పెల్లఁ దక్క
యదపేది తనమార్గ మరయుచు వేగ

( **132.** నృపప్రార్థనాప్రకారము. )

నరిగి యేగుచునున్న యయ్యత్రిచరణ
చరణాబ్జములఁ జక్క సాగిలి వ్రాలి
తొడఁబడి రెండుచేతులఁ బాదయుగము
విడువక వడి వెక్కివెక్కి యేడ్చుచును 2290

జలమతి ద్రోహి నృశంసుండ మిగులఁ
జులుకనివాఁడ నసూయాపరుండ
జడుఁడఁ దామసుఁడ వంచకుఁడఁ గష్టుఁడను
బుడమి నెవ్వరిసరిఁ బోలనివాఁడ
నమరేంద్రవంద్య! సర్వాపరాధములు
క్షమియింపు కృపఁ జూడు సకలశరణ్య!
తనయుండు నేరక తప్పుఁ జేసినను
జనకుండు కోపింపఁ జనునె యోతండ్రి!
యని పెక్కుభంగుల నభినుతుల్ సేయ
మనమునం గరుణించి మౌనివల్లభుఁడు 2300

హరిచక్రమున కోడి యత్రినందనుఁడు
సిరివరు వేఁడ నాశ్రితవత్సలుండు
పొలయక యంబరీషుని వేఁడు మనిన
చెలువున నామౌనిశేఖరుం డనియెఁ

( **133.** మునీంద్రప్రత్యుత్తరశైలి. )

ప్రణతులచేఁ గాని ప్రణుతులఁగాని
కణికృష్ణు వికసింపఁగాఁ జేయ వేని
వేమాఱు నన్నెంతవేఁడిననైన
మామకభక్తుండు మగుడ కే రాను
రమణతో నియ్యపరాధ మయ్యోగి
క్షమియింప కేమను క్షమియింప ననిన 2310

క్షితినాథుఁ డాకణికృష్ణుపాదముల
కతిరయుంబున వ్రాలి యార్తరావమునఁ
గన్నీరు దొరఁగ గద్గదకంఠుఁ డగుచుఁ
బన్నినదైన్య మేర్పడ సన్నుతింప
నవిరళం బగుసహస్రాపరాధములు
సవరించి తుది వచ్చి శరణుచొచ్చినను
ఘను లైనవార లాకరటినేరములు
మనమునఁ బెట్టక మన్నింతు రెపుడుఁ
గావునఁ గరుణమై గణికృష్ణయోగి
భూవరు చేయుతప్పులు మది నిడక 2320
యతఁడుచుం దాను నయ్యక్షపాదునకు
నతులు గావించి మన్నిన సేయు మనిన
సంతసింపుచు భక్తిసారయోగీంద్రుఁ
డెంతయుఁ బ్రీతుఁడై యెలమి నెక్కొనఁగఁ

( 134. పూర్వాశ్రమప్రదేశాగమనము. )

జిరతపోనిధియైన శిష్యుండుఁ దాను
నరుదెంచె మగుడి పూర్వాశ్రమస్థలికిఁ
గ్రేపువెన్నునుగోవుక్రియ భోగిశాయి
యాపద్మయును దాను నతనితోఁగూడఁ
జనుదెంచె నతనితో సకలదేవతలుఁ
జనుదెంచి నిజనివాసముల నెక్కొనిరి 2330
యోగీంద్రుఁ డేకంతము న్నుండినయట్టి
నాగేంద్రతల్పుని నగరి కేతెంచి
యాదేవదేవు దయామృతాంభోధి
వేదగోచరు భక్తివినుతిఁ గావించి

( 135. పన్నగశాయిస్తోత్రప్రకారము. )

ఫణిశాయి ! కాంచికాపట్టణాధీశ !

కణికృష్ణుఁ డిచటికిఁ గ్రమ్మఱవచ్చె
నీవును నింక మ న్నిట్టిచందమున
శ్రీవధూమణిఁ గూడి శేషతల్పమునఁ
బవళింపు మని యొక్కపద్య మొనర్ప
భువనైకతల్పుఁ డప్పుడు ముదం బెసఁగ 2340

నాయోగివరుఁ గూడి యనురక్తి వెంటఁ
బోయివచ్చెనరీతి భువనంబు లెఱుఁగ
సవ్యహస్తంబు మస్తముక్రింద నునిచి
సవ్యేతరముఁ గటిస్థలిమీఁదఁ జూఁచి
కడలికన్నియ పాదకమలంబు లొత్త
నుడురాజుతెలి మించు నురగేంద్రుమీఁదఁ
బుండరీకముమీఁదఁ బొలుపొందునట్టి
గండుతుమ్మెదజేనిగతి నొప్పు మిగిలి
శయనించి తొల్లింటిసరవి నింపొంది
యయకరుం డై యుండె నదికారణమున 2350

( 136. శేషతల్పశయనప్రకారము, యథోక్తకారినామప్రాప్తివర్ణనము. )

ధారుణిమీఁద నందఱును యథోక్త
కారిశుఁ డని యెన్నఁగడగి రావేల్పు
చరణాబ్జముల వ్రాలుజనపాలుఁ జూచి
కరుణించి మంత్రివర్గంబుతోఁగూడఁ
బురమున కనిచి యప్పుడు భక్తిసారు
నురగేంద్రతల్పుని నురుకృపాంబుధిని
సేవించి మఱియు నచ్చినభక్తిఁ బ్రణుతిఁ
గావించి యంతరంగము భక్తిరసము
వెలికి నుప్పొంగినవిధమున నేత్ర
జలజాతయుగళి బాష్పములు బిట్టడర 2360

( 137. భగవత్సౌలభ్యాదికల్యాణగుణమహిమ. )

గోపాలపాలక ! గోవింద ! కృష్ణ !
నాపాలిదైవమ ! నను గన్నతండ్రి !
భావింప బ్రహ్మాండపటలసంతతులు
నీ వాడుమన్నపుణానిక నాడు; నట్టి
జాడ నొప్పెడురమాస్వామి ! యే నిప్పు
డాడించుకై నడి నాడితి వీవు
ఫాలాక్షనుత ! భక్తపరతంత్ర ! నీదు
సౌలభ్య మే మని సన్నుతించెదను?
అని పాదములమీఁద నందంద వ్రాలి
ఘనతరసంతోషకమలధిఁ దేలి 2370

( 138. ద్రావిడప్రబంధనిర్మాణవైఖరి. )

గుటి మీఱు తొలిపల్కునొన వేల్పుమాసం
దటిఁ బండుపంట నా ద్రావిడభాషఁ
గృతకృత్యజననమస్కృతియు లోకోప
కృతియునుం గా నొక్కకృతి సంఘటించి
యంత క్షీరాహారి యై శిష్యుతోడ
నంతరంగమున శ్రీహరిఁ బాదుకొలిపి
వేడుకతో యోగవిద్యానురక్తి
నేడునూటేడు లయ్యిరవున నుండి
యటమీఁద నామూర్తి సామూర్తి యగ్ర
తటమున నిలుచున్నధరచక్రధరుని 2380

యాసరి శయనించునట్టిగోవిందు
నాసీనుఁ డై యున్నయట్టి లక్ష్మీశుఁ
దలఁపులో నిడుకొని తత్పాదభక్తి
సొలపులు మిఁచి సచ్చోళమండలము

వెడలి తీర్థంబులు విపినాంతరములుఁ
గడచి శిష్యుఁడుఁ దానుఁ గడుసంతసమున

( 139. చోళమండలవర్ణనము. కుంభఘోణక్షేత్రప్రాప్తిక్రమము).

భూరివారిమరందపూరకల్హార
నారకాసారప్రసారవిస్తార
సారసబిసగణాస్వాదనలోల
వారణమదగంధవళితాళినాథ 2390
విలసిత మైన కావేరిచెంగటను
నలువొందు కుంభఘోణమున కేతెంచి
భాసితగోపురప్రాసాదతతుల
భాసిల్లు మణిమంటపంబులోపలను
నెరయఁ దెమ్మరదూది నించి చూపట్టు
పరపుపై నొనపరిబాగు లేర్పడఁగఁ

( 140. తన్నగరాలయనివాసిశ్రీశార్ఙ్గపాణిదివ్యవైభవవర్ణనము. )

బవళించి శ్రీదేవిపాలిండ్లబటువు
కవమీఁదఁ బాదపంకజములు సాఁచి
శిరము క్రిందట నొకచెయిఁ జేర్చి యొక్క
కరము బిత్తరముగాఁ గటిమీఁదఁ జాఁచి 2400
వీనులఁ గదిసిన వెలిదమ్మికన్ను
గోనల నమృతంబుఁ గురియుచునుండఁ
గడలుపింజెలు వారఁ గట్టినపసిఁడి
పొడలు రెట్టింపుసొంపులు దువాళింపఁ
గఱకు వేయంచులకత్తిచా లెడయు
మెఱసి వేడము గొన్నమెఱుపులై రెుప్ప
నిడువాలుపుత్తడినెట్టంబుపసలు
బెడఁగులై నలుగడఁ బేరెముల్ వార

ముద్దులమొసలిసొమ్ములచకచకలు
తద్దయుఁ బెక్కుటద్దముల నర్తింప 2410
నెఱమించు లోఁదవుమానికములఁజేని
మెఱపులు డెందంబుమీఁదఁ గ్రేళ్ళుఱుక

( 141. అపర్యాప్తామృతనామకహరిస్తుతివైభవాది. )

జిగిదమ్మిమోముచే శీతాంశుసొంపు
నగునపర్యాప్తామృతనాథ నామకుని
బరమాత్ము నాశాజపాణి దర్శించి
ధర సాగి మ్రొక్కి యెంతయు సన్నుతించి
పరిపూర్ణమగు భక్తిపారవశ్యమునఁ
బరికించి వెండియుఁ బ్రణుతింపఁ దొడఁగె
భద్రనాగేంద్రంబు పైఁ బవ్వళించి
నిద్రించె దేటికి నిర్నిమిత్తముగ 2420
నీతఱిం బవళించి తేమికారణము
నాతోడఁ జెప్పవే ననుఁ గన్నతండ్రి !
ఘనతరంబైన చక్రము కేలఁ బూని
చెనఁటిరక్కసులఁ ద్రుంచినబడలికయొ

( 142. పూర్వావతారచరిత్రమహిమ. )

జలరాశిఁ జొచ్చి రాక్షసు లగీటణఁచి
చెలఁగి వేదములు దెచ్చినబడలికయొ
క్షీరసింధువు మథించియుఁ గ్రుంగకుండఁ
జేరి మందరము మోచినబడలికయొ
ముఖదంతకోరకమున జగత్త్రయము
నిఖిలభారంబు నానినబడలికయొ 2430
పైకొన్నయుక్కుకరంబముఁ గొనగోళ్ళఁ
జేకొని వ్రక్కలించినబడలికయొ

జగము లీరేడును చక్కనియడుగు
చిగురుటాకునఁ గొలిచినబడలికయొ
గండగొడ్డట రాజకంఠనాళములు
చెండి చెండాడివైచినబడలికయొ
దండకావనమున దనుజవర్గంబుఁ
జెండివైచుచుఁ జరించినబడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమునఁ బెకల్చినబడలికయొ 2440

యలవి మీఱంగ గోపాంగనామణుల
చెలువంపురతులఁ దేల్చినబడలికయొ
మేలిమితురగంబుమీఁదట నెక్కి
లీల మ్లేచ్ఛాళిఁ ద్రోలినబడలికయొ
యీరయెట నాతోడ నింతయుఁ దెలియ
మాయన్న యెఱిఁగింపుమా యన్న నపుడు

( 143. హరిసల్లాపసంతోషాదికథనము. )

మునినాథువిన్నపమునకు డెందమున
ననయంబు హర్షించి యంబుజపాణి
తల యెత్తిచూచి యాతనితోడఁగూడఁ
బలుమఱు సరసత భాషించి మెచ్చి 2450

నవిభూతికముగ నిజస్వరూపంబు
నవిరళగతిఁ జూప నయ్యోగివరుఁడు
నలమయూరపురంబు నుండివచ్చి
యలవి మీఱినకాంచికాంతికస్థలిని
జెన్నొందు శారదాసింధువుచెంతఁ
బన్నగరాజతల్పంబున నేను
మును గనుఁగొన్నయీమూర్తినే యిచటఁ

నెట్టనం దనభక్తు నిరసింప శౌరి
బెట్టుగా వాఙ్ముద్రఁ బెట్టినాఁ డనుచు
ననుతాప మొదవంగ నతఁ డెట్టిఘనుఁడో
యనుచు నందఱు గూడి యాజాడఁబట్టి 2510

( 147. భక్తిసారమునిమాహాత్మ్యనుతిప్రార్థన. )

యరిగి వేఱొకచోట నతిభానుకోటి
కిరణుఁడై యున్నయోగిని విలోకించి
ప్రణుతి చేకొనుచుఁ దత్పాదపద్మములు
ప్రణుతులయ్యాలోకపావనమూర్తి!
బ్రహ్మణ్యమునివేద్య! భవరోగవైద్య!
బ్రహ్మయోగీంద్ర! కృపానిధీ యేము
నెన్నంగఁ జేసిన యెల్లనేరములు
మన్నించి మాకు బ్రాహ్మణ్యంబు గలుగ
దేవర! నిగమోపదేశంబు మాకుఁ
గావింపు మని పలుకఁగ మౌనివిభుఁడు 2520

భావజగురుపాదపద్మసంసక్తుఁ
డై వారితో మాటలాడ నైపమిని
వలకేలికొన నల్లవరిగింజ గిల్లి
యలవిప్రగణముపై నడరించుటయును
రామునిశ్రీపాదరజముచే రాయి
రామ యైనట్లు వారలజిహ్వలందుఁ
బాషాణతృణజడప్రాయమైనట్టి
భాష నిజస్వరూపమునఁ జెన్నొందె
నాదటఁ దత్క్రియ యర్థంబు దెలుపు
వేదంబు నెఱిఁగి భూవిబుధు లుప్పొంగి 2530

వలగొని యయ్యోగివరునకు మ్రొక్కి
యలరి గృహంబుల కరుదెంచి రంతఁ
గావున హరిభక్తిగలిగినవారు
భావింపఁ ద్రైలోక్యపావనాధికులు
మౌనీంద్రుఁ డంతఁ ద న్మార్గంబుఁగడచి
యానగరాధీశుఁ డగు దానవారి
సదనంబు వలచుట్టి చరియింపుచుండ
సదనంబులో రమాసహితుఁ డై యున్న
యాతపసులభాతి నతని నీక్షించు
కౌతుకం బతనిపైఁ గరుణయుఁ బెనఁగ 2540

( 148. యాగారంభాదిప్రస్తావము. అగ్రపూజాప్రదానవైఖరి. )

నామౌని యేదెస కరుదెంచెఁ దాను
నాముఖం బై కరుణాపాంగతతులఁ
గప్పుచు నమ్మౌనిఁ గనుఁగొనఁ దొడఁగె
నప్పుడు హరిపాదుఁ డను విప్రవరుఁడు
యాగకర్మారంభుఁ డై యేగుదెంచి
యాగాంతరాత్మకుం డైన యావేల్పు
నురుభక్తి మై షోడశోపచారముల
సరవిఁ బూజించి యంజలిచేసి మ్రొక్కి
యాగాగ్రపూజార్హుఁ డైనట్టి దివ్య
యోగవాఁ డని చూపునొప్పు దీపింపఁ 2550

గరమర్థిఁ బరివృత్తకంధరుం డైన
హరిఁజూచి యేమకో యని వెఱఁ గంది
పరికింప నిట యెట్టి పరమయోగీంద్రుఁ
డరుదెంచి యీచక్కి నరుగుచున్నాఁడొ
కడుఁ జోద్య మని తదాగారంబు వెడలి
వడినేగి తానును వలచుట్టుకొనుచు

నందంద నలుదిక్కు లరయుచువచ్చి
ముందరిదెస జగన్మోహనాకృతిని

( 149. ఊర్ధ్వపుండ్ర నళినాక్షమాలాదిదివ్యరూపప్రదర్శనము. )

వికసితధవళారవిందమధ్యముల
మకరందరేఖలమాడ్కి నెమ్మేన 2560
ధవళోర్ధ్వపుండ్రమధ్యముల శ్రీచూర్ణ
మవిరళరేఖ లై యనువొందుచుండ
రవిసుతాగంగాతరంగముల్ రెండు
కవగూడియొప్పెడి కరణినెంతయును
దులఁగించు నలినాక్ష తులసికామాలి
కలుకంబు కంఠలగ్నంబు లై యొప్ప
నొప్పుచున్న య య్యోగీంద్రుఁగాంచి
ముప్పిరిగొనుమోదమునఁ జేర నరిగి
పాదపద్మములపైఁ బ్రణమిల్లి విష్ణు
పాదకోవిదుఁ డంతఁ బ్రణుతిఁగావించి 2570
యయ్య ! నాకావించు యాగంబు సఫల
మయ్యె నీదర్శనంబబ్బుటవలన
నదె యాగశాల నీవటకు వేంచేసి
తుదలేనికృపఁ గృతార్థుని జేయవలయు
నోజతో నీదాసుఁ డొనరించు నగ్ర
పూజ నీ వవధరింపుము మానిచంద్ర !
యపుడు నాయజ్ఞంబు యజ్ఞమైయొప్పు
నపుడుగదా కృష్ణుఁ డదియొప్పికొనుచు
గావున నీభృత్యుఁ గరుణించియటకు
వేవేగ దేవర వేంచేయవలయు 2580
నని వేఁడియును జరణాంబుజాతముల
వినతుఁ డై లేవక వినుతిఁగావింపఁ

గరుణించి య య్యోగికంఠీరవుండు
హరిపాదకోవిదు నలమిలాలించి
వెనుకొని యతఁడు సేవింపుచురాఁగఁ
జనుదెంచె న య్యాగశాలలోపలికి

( 150. భద్రపీఠార్ఘ్యప్రదానాది సమర్పణము. )

నంత నావిష్ణుపాదాహ్వయసూరి
సంతసంబున భక్తిసారయోగీంద్రు
ననుపమభద్రపీఠాసీనుఁ జేసి
యనువొంద నర్ఘ్యపాద్యాదుల నొసఁగి 2590

మును చేదిభూపాలముఖ్యులు చూడ
వనజాక్షునకు ధర్మవసుధేశ్వరుండు
సవరించు నగ్రపూజయుఁ బోలె నపుడు
సవనంబు గనుఁగొనఁ జనుదెంచు జనులు
దినకరనిభులైన ద్విజులు ఋత్విజులు
గనుఁగొన నాగమోక్తప్రకారమున
రంగైనకనకపాత్రమున నమ్మౌని
పుంగవునకు నగ్రపూజఁ గావించెఁ
గావింప ఋత్విజుల్ గని కోప మెసఁగ
నావిష్ణుచరణు నందంద తిట్టుచును 2600

( 151. దీక్షితకార్యఖండననిందనాదికథనము. )

సర్వశాస్త్రజ్ఞులై చర్చింప వేద
పర్వతములవంటి బ్రాహ్మణులుండఁ
జేర్చి బృహస్పతి పెకలివచ్చినను
జర్చింపగల ఘనశాస్త్రు లుండంగ
నశ్వమేధాదిపర్యంతముల్ దెలిసి
శాశ్వతమతులైన శ్రౌతులుండంగను
మనమున భయ మింతమాని యీాయున్న

ఘనులనందఱు గట్టకడఁ బారవైచి
యెవ్వనినో తెచ్చి యితరులు తన్ను
నవ్వ నిందఱు నట్టనడుమును బెట్టి 2610

యగ్రజన్ముల కహీనమగుచు శోభిల్లు
నగ్రపూజన మిచ్చు టది యెట్టులోరి!
యోజమాలినవాజ వోరిపో వ్రాత్య
నీజన్న మంతియు నేఁడు ఫలించె
జగతి నెవ్వరు నీకు సరిలేరు నీకుఁ
దగునాతఁ డతనికిఁ దగుదువు నీవు
భాగ్యంబు చేసితి బంధుల యెదుట
యోగ్యుండ వైతి వీయుర్వి నెన్నంగ
వైదికుం డని జను ల్వర్ణించిచూడ
నీదు బ్రాహ్మణ్యంబు నేఁడు సిద్ధించె 2620

యాగమంతయు సాంగ మయ్యె నోరార!
నీగుణంబుల నెన్న నేర్తుమే యేము
అనుచు నొండొరు మోము లాగ్రహవృత్తిఁ
గనుఁగొని నిడువాలు గడ్డంబు లదర
జగడించి కెరలుచుఁ జంకపుస్తములు
దిగజార వదలఁగట్టిన పంచెలూడఁ
దొట్టిపెంజెమటలు దొఱఁగ ఫాలముల
దట్టంపుఁ బట్టెవర్ధనములు గరఁగఁ
ప్రాఁకుబన్నుల వెలిఁబడఁగ బాహువులు
వీఁక మై జాచియు విప్రుఁడిట్టుచును 2630

గడపట వీని సంగడి నింతనుండి
కుడువకుం డెవ్వఁడుఁ గుడిచినవాని
బొంపిరి జన్నిదమ్ములు త్రెంపివైచి

పెంపెల్లఁ బెడఁగొంపఁ బెరికింపవలయు
నని పోవ నుద్యుక్తులై యున్నవారిఁ
గనుఁగొని య య్యోగికంఠీరవుండు
మును మరుత్తనియాగమునకు సంవర్తుఁ
డనిమిషగర్వంబు లడఁచుచందమున
హరిపాద! వెఱవకుమని యాదరించి
సరగున హృదయకంజము శౌరిఁజూచి 2640

( 152. భక్తిసారమునికృతహృద్యపద్యసమర్పణము. )

హరి! రమాపతి! సహస్రారాంకపాణి!
వరదాయి! షడ్గుణైశ్వర్యసంపన్న
గాఢతరాజ్ఞానగర్వాంధ విప్ర
మూఢులవదనముల్ ముద్రించినట్లు
నీపాదసేవకు నిందించినట్టి
యీపాపమతుల యేపెడయ నివ్వేళఁ
దలఁపులోపలి శేషతల్పు నాలోన
వెలుపల నీదివ్యవిస్ఫూర్తిమూర్తి
వేవేగ జనులెల్ల వెఱఁగందికొనుచు
సేవింపగాఁ బ్రకాశింపించు మనుచు 2650

( 153. పద్మనాభప్రత్యక్షవైభవము. తత్సౌందర్యపరత్వాది. )

హృద్యంబుగా లోకహితముగా నొక్క-
పద్యంబు సపఠింపఁ బంకజోదరుఁడు
నామౌని శీతాంశు నగ్రభాగమున
సోమార్కకోటుల సొంపగ్గలించి
శ్రీరసానీళలు సిరిమించు హస్త
సారసంబుల నిజచరణంబు లొత్త
మణిమయ కింకిణీమంజీరకాంతి
గణసముజ్జ్వల పాదకమల యుగ్మండు

కనకచేలావృతఘంటికాఘటిత
ఘనసప్తకీశోభికటి చక్రతలుఁడు 2660

బంధురోడ్యాణ శంపాలతాజఠర
బంధరోమాళి షట్పదపంక్తి యుతుఁడు
సందీప్తదరసుదర్శన గదా శార్ఙ్గ
నందకయుత సమున్నత కరాబ్జుండు
శ్రీవత్సకౌస్తుభ శ్రీవనమాలి
కావరచందన కలితవక్షుండు
వరహీరదర్పణోజ్జ్వల గండయుగళ
నిరుపమచాంపేయ నిభనాసికుండు
నాకర్ణవిశ్రాంత హారిణాంబుజాత
నీకాశకరుణాంక నేత్రభాసితుఁడు 2670

చారుమందస్మిత చంద్రికాసార
పూరబింబాధరభూషితాననుఁడు
సకలంక కంకణ హార కేయూర
మకరకుండల దివ్యమణికిరీటుండు
నగుచు భోగీంద్రశయానుఁడై శేష
ఖగరాజసేనేశ ఘననిత్యముఖులు
వ్యాసాంబరీష రుక్మాంగద కపిల
వాసిష్ఠముఖభాగవతులు సేవింప
సరసిజభవ శర్వశక్రాదివిబుధ
గరుడ గంధర్వనికాయంబు గొలువ 2680

నిత్యప్రసన్నుఁ డానీరజోదరుఁడు
ప్రత్యక్షు మయ్యె నాభక్తిసారునకు

( 154. బ్రాహ్మణభయప్రస్తావము. అపరాధక్షమాపణ. )

నప్పు డాభూసురు లరుదంది భయము

ముప్పిరిగొనఁగ న మ్మునినాథవరుని
నతనికిఁ బ్రత్యక్షమైన యవ్వేల్పు
నతనికిఁ బరిచరులైనవారలను
సేవించి మొల్లఁబూఁచినరీతి మేని
తీవలుగరుపార ధృతభీతులగుచు
వడవడవణఁకుచు వచ్చియమ్మౌని
యడుగుదమ్ములమీఁద నందంద వ్రాలి 2690

యపరాధులము దురహంకారమతుల
మపరిమితాజ్ఞాన మనువార్ధి మునిఁగి
దరిగాన మిన్నాళ్ళు తావకపాద
తరణిచే నిటమీఁద దాఁటంగఁగలము
శరణాగతత్రాణ ! జగదేకవినుత !
పరికింపఁగా ద్విపాత్పశువుల మైనఁ
దమదు నేరములు చిత్తమునందు నిడక
క్షమియింపవలయు నేచందాన నైన
ఘనబలోత్కటమైన గంధసింధురము
కినిసికుక్కలు మొఱగిన లెక్కగొనునె 2700

నీచంద మెఱుఁగక నీచునందమున
మోచి నేమునుగొన్ని మొఱగితిమయ్య !
యవియెల్లఁ దలఁపక యభయం బొసంగి
భవవార్ధి వెడలింపు పరమయోగీంద్ర !
మఱియెఱుంగుదు మేని మహనీయమహిమ
మెఱిఁగిన నీమూర్తి యెఱుఁగంగవలయు

( 155. భార్గవమునికృతానుగ్రహప్రకారము. )

నని పెక్కులాగుల నందంద వినుతు
లొనరింప భార్గవయోగిచంద్రుండు

కరుణించి యావిప్రగణము నీక్షించి
సురగరుడోరగుల్ చూచి నుతింప 2710

నపుడు ప్రత్యక్ష మైనట్టి మాధవుని
సపరివారాయుధ శయనేందిరముగఁ
దడయక డెందంపుఁ దామరయింట
నిడికొని తొల్లింటి యింపు మైనున్న
వీక్షించి భూసురవితతి వెండియును
నక్షపాదునకు సాష్టాంగంబు లెరగి
యతనిచెంగట నున్న హరిపాదసూరి
నతిభక్తి నుతియించి యడుగుల కెరగి
పరమపావన! నీప్రభావంబు నాత్మ
నరయక దుర్భాషలాడితి మిప్పు 2720

డవియెల్ల నోర్చుకొ మ్మని ఫళఫళని
దవుడలు కరములఁ దాటించుకొనుచు

( 156. సాంగయాగపరిసమాప్తిక్రమము. అవభృథస్నానాచరణము. )
యోగీశ్వరశ్రీపాదతీర్థసేవనాదిక్రమము.

నావిష్ణుపాదున కభివాదనములు
గావించి క్రతువు సాంగముసేసి రంత
వనజాసనాదిదేవతలు న మ్మౌని
యనుమతి నెలవుల కరిగి రవ్వేళ
సారసదళనేత్ర చరణాహ్వయుండు
ధారణీసురలును దానును గూడి
యవభృథస్నాతు లై యరుదెంచి యోగి
ధవుని శ్రీపాదతీర్థము నన్వయించి 2730
యాయక్షపాదుని యాబాల్యమహిమ
వేయుచందంబుల వివరింపఁదొడఁగె

( 157. శ్లాఘ్యకైంకర్యవిధానము. భక్తిసారమునిమహిమ. )

నాసుదర్శనమూర్తి యురుతపోరాశి
రాసికి నెక్క భార్గవమునీంద్రునకుఁ
బొడమి యీప్రాకృతభోజ్యవస్తువులఁ
గుడువక హరిదివ్యగుణసుధారసముఁ
గ్రోలుచు వృద్ధులు గొనివచ్చినట్టి
పాలుగైకొని భక్తపరతంత్రబుద్ధి
సగమారగించి వాత్సల్యంబుతోడ
సగము వారలకుఁ బ్రసాదించి కరుణ 2740

వారికి మగుడజవ్వనము రాఁజేసి
ధారుణి వొగడ సంతానంబునొసఁగి
పరయోగిసామ్రాజ్య వైభవశ్రీలఁ
బరమాత్మ విశ్వరూపము విలోకించి
కటకంతఁ డెరగ లికను చూపు మగుడ
నటకాలనయన సహస్రము ల్చూచి
కొంకణు రసపాదఘుటికను బొద
పంకజరజముచేఁ బరిహాసింపుచును
నీరజభువుఁ డయోనిజుఁ డైన యోగి
ధారుణీవిభుని బాంధవ మాచరించి 2750

( 158. శ్రీవేంకటేశానుగ్రహకథనము. కణికృష్ణకలితకైంకర్యాది. )

శ్రీవేంకటేశదర్శిత సుధాసార
భావితకుండంబు పరికించికాంచి
కణికృష్ణు నిజశిష్యుగాఁగాఁ జేపట్టి
గణుతింప ముదుసలిఁ గన్యఁగావించి
జగములు గొనియాడ జగదేకనాథుఁ
డగుఫణిశాయి లెమ్మని తోడుకొనుచు
ననుచరుం డై వచ్చు నాదేవు మగుడఁ

జనుదెంచి తొల్లింటి సరవిమైనుంచి
కువలయ ప్రాణంబు కుంభకోణంబు
భవనంబుగానున్న ఫణిరాజశయను 2760

సేదదేరఁగ నుతిసేసి మెప్పించి
యాదేవుతో మాటలాడి యంతటను
వడినహంకృత విప్రవరులనాలుకలు
పెడతలఁ బట్టించి భీతులై వారు
శరణుఁజొచ్చిన దివ్యసారస్వతంబుఁ
గరుణించి యాచోటఁ గందర్పగురుఁడు
కరమర్థిఁ బరివృత్తకంధరుం డగుచు
గరిమతో నినుఁ బెక్కుగతుల వీక్షింపఁ
బావనచరిత నాభాగ్యంబువలన
దేవర యిటకు నేతెంచి నాసేయు 2770

నగ్రపూజనము నీ వంగీకరించి
నగ్రజన్మల దురహంకార మెడయ
ననఘుగోవిందుఁ బ్రత్యక్షంబు సేసి
కొని యాత్మలో నిడికొంటి యివ్వేళ
యెన్నశక్యము గాని యిట్టి నీమహిమ
నిన్నును వర్ణింపనేర్తునే యేను
భావించి చూచినఁ బరమయోగీంద్ర!
దేవరమహిమ శ్రీదేవుండె యెఱుఁగు
నని ప్రణామములు సమర్పింప మిగుల
మునిలోకవిభుఁడు ప్రమోదంబుతోడ 2780

( 159. హరిదాసానుగ్రహప్రకారము, దివ్యక్షేత్రయాత్రాది. )
ఆశీర్వాదశుభప్రాప్తివర్ణనము.

హరిపదాహ్వయుఁడైన యాసోమయాజి
గరిమడగ్గఱఁ బిల్చి కౌగిటఁ జేర్చి

ధరణి సర్వాభీష్టదాయకం బైన
వర మిచ్చి యవ్విప్రవరు నందునునిచి
సనుబోటి కలుషమానసుల వెండియును
దన కృపామృతముచే ధన్యులఁ జేసి
కణికృష్ణుతోఁ గూడఁ గ్రమ్మఱ మాని
గణయుతుండై ధరగలుగు తీర్థములు
శ్రీశైలరంగ విశేషభూవలయ
దేశంబు లందు వర్తింపుచుండె 2790

నిరవొంద భక్తిమై నీభక్తిసారు
చరితల నీధరాస్థలి నెవ్వఁడేని
గృతియొనర్చిన యట్టి కృతకృత్యమతికి
హితబుద్ధిఁ బ్రతిదినం బెన్నువారలకు
వినిన వ్రాసినఁ జదివిన వారికెపుడు
ననుపమదీర్ఘాయు రైశ్వర్యతతులు
సకలంకశుభములు సభిమతార్థములు
సకలసిద్ధులుఁ గరస్థలినుండు ననుచు

( 160. గ్రంధసమర్పణము. కవికావ్యప్రశంస. ద్వితీయాశ్వాసపరిసమాప్తిక్రమము. )

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని 2800

నతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్త సంతతికి
సంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందనరత్న శుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త

మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ 2810

కృతమైన పరమయోగివిలాసకృతిని
సతులితంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.



# పరమయోగి విలాసము.

## తృతీయాశ్వాసము.

( 161. శ్రీదేవీమహిమవర్ణనము. శ్రీవేంకటేశస్మరణాది. )

[ ద్విపద ]

హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూత సంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి!
వనమాలి! యవధారు వరదానశీలి!
కడుచిత్రమై తూర్పుకడలికిం జక్కఁ
బడమటి దెసజగత్పావనం బగుచు

( 162. పాండ్యమండలవర్ణనము. కురుకానగరనామప్రాప్తికథనాది. తామ్రపర్ణీనదీ మాహాత్మ్యాదివైఖరి. )

ధాత్రీసతీమణి ధరియించు రత్న
చిత్రకం బోయనఁ జెన్నుగ్గలించి 2820
మండితం బగు పాండ్యమండలి సరసఁ
బుండరీకంబునాఁ బురియొండు వెలయు
నాపట్టణము కురువను రాజుచేత
ద్వాపరంబునఁ బాలితం బై నకతనఁ
గురుకాభిధాన మై కొమరుదీపించు
నిరుపమతామ్రపర్ణీసమీపమున

నల పట్టణమునకు న మ్మహాతటిని
యెలమిఁ బుష్పాంజలు లిచ్చునోయనఁగఁ
గడలతాకఁల మహోత్తమములు బిట్టుగని
వడిదదంగణభూమి వర్షించుచుండు 2830

మందాకినీనదీమహితకల్లోల
మందానిలాలోల మంజుకేతువులు
గోపురాన్వితములై గోపురాగ్రములఁ
బ్రాపించి రతిపరిశ్రాంతి నున్నట్టి
యమరదంపతులమై నందందవోడము
చెమరులోర్చుచునుండుఁ జిత్రవైఖరుల
పరహేమవర్ణలు వసియించినట్టి
హరినీలమణిమయ హర్మ్యవాటికలు
అసమయశంపాన్వితాంబు దోదయము
పసలుపుట్టించు నప్పసము నచ్చటను 2840

( 163. కురుకాపురీభాగవతోత్తమమహిమ. )

శ్రీద్యోతితుఁడు మునిసిద్ధసేవ్యుండు
నాద్యుండునైన శ్రీహరియుండు నందు
నత్యంతశుభశీలు రమలమానసులు
శ్రుత్యంతవేదు లచ్చోటి భూసురులు
వీరు వారనక య వ్వీటిలోనున్న
పౌరులు పరమప్రసన్నులే తలఁప
నందులో నొక్క మహాభాగవతుని
నందనుం డిందిరానాథతత్పరుఁడు

( 164. వళుదినామాఖ్యవిప్రవరపుత్రపౌత్రావతారాదికథనము. )

వనధిగంభీరుండు వళిధినాటేంద్రుఁ
డనుపేరఁ బ్రఖ్యాతి నంది యాఘనుఁడు 2850

ధర్మధరుం డను తన జాతుఁ గాంచె
ధర్మజ్ఞుఁ డైన శ్రీధవభక్తుఁ డతఁడు
చక్రపాణిధ్యానసంసక్తుఁ డైన
చక్రపాణిని గాంచె సంతోష మెసఁగ
నతఁ డంత రక్తధారాహ్వయుఁ గాంచె
నతఁడు పాటల మోచనాఖ్యుని గనియె
నతనికి భోక్తాళి యనుపేరు గలుగు
సుతుఁ డుదయించె నాసుజ్ఞాననిధికి
విపులార్థసత్కారి విభవానుకారి
యపగతాహంకారి యఖిలోపకారి 2860

( 165. కారినామకకుమారావిర్భావము. తత్పరిణయాలోచన. )
నాథనాయికావివాహవర్ణనము.

యనుపమాలంకారి యవికారి కారి
జనియించె నాకారి జనకుఁడు నంత
వరుస నవీనయౌవనుఁడైన తనుజ
వరునకు నత్యంతవైభవశ్రీలఁ
గువలయాంగనకూర్మి కుఱుకైన కురుక
యవుల శోభిల్లు గ్రామాంతరసీమ
ఘనతపోనిధి యైన కమలాప్తవత్సుఁ
డనుభాగవతునకు నాత్మజ యైన
పాథోధికన్యకాపతిభక్తినిరత
నాథనాయికయను నలినాయతాక్షిఁ 2870
బరిణయం బొనరించి పరమానురక్తిఁ
గురుకాధివాసుఁ డై కొమ రొప్పుచుండె

( 166. గ్రహస్థాశ్రమకలనవైఖరి. )

నంత నాచెలువప్రాయమునఁ జెన్నొంది
కొంతకాలము కాంతుఁ గూడి వర్తించి

జననగేహమునకుఁ జనుదెంచి కొన్ని
దినము లచ్చట నుండి తిరిగి వెండియును
నత్తవారింటికి నరుగుచోఁ ద్రోవఁ
గ్రొత్తైనమించులు గులుకుమేడలును
బసిఁడిమొల్లాము గుబ్బలకవాటములుఁ
బొసఁగి చూపట్టుగోపురమంటపములుఁ 2880

జెలఁగుచు వెల్వునెచ్చెలులపాలిండ్లఁ
గలకల నవ్వుబంగారుకుండలన్న
నెలచట్టుకోటల నిద్దంపుమణుల
నలరెడు నగరంబునందుఁ జూపట్టు
నాకు రంగేశు దైవాధీశవంద్యు
లోకాధినాథు నాలోకించి భక్తి

( 167. పుత్రవరప్రార్థన. వరప్రదానక్రమము. )

వినత యై వినుతి గావించి "యానంద
తనుజన్మ! నా కొక్కతనుజన్ము నొసగు"
మన విని యప్పు డయ్యరవిందనాభుఁ
డనురాగ మెలరార నాత్మ నుప్పొంగి 2890

వదనంబుఁ దెఱచి దైవాఱుకరుణ
నెదుట నున్నట్టి య య్యింతి నీక్షించి
పుత్త్రి! యేనే నీకు భువనంబు లెఱుఁగఁ
బుత్త్రుండ నయ్యెదఁ బోయి ర మ్మనిన
మతి సంతసిలి ప్రణామము సేసి తనదు
పతిగేహమునకు నప్పుడఁతి యేతెంచి
కాంతానురక్తయై కడువేడ్క నుండె
నంతట నాకురంగాధినాయకుఁ డుడు
తననిజరూప మై తనరుసేనేశుఁ
బనిచెఁ దద్గర్భసంభవుని గమ్మనుచుఁ 2900

( 168. విష్వక్సేనాంశగర్భప్రాప్తిక్రమము )

బనిచిన నారమాపతికై నృపతియుఁ
జని ప్రవేశించెఁ దజ్జఠరంబునందు
ననబోఁడి యగు నాథనాయిక కపుడు
కనుపట్టె నొయ్యన గర్భచిహ్నములు
సూత్రవతీశుచేఁ జొప్పడుచున్న
వేత్రంబు మైకాంతి వెలిమించినట్లు
సవరై ననల్లపూసలపేరు వోలె
నవిరళం బగుచు రోమాళి చూపట్టె
ననవిల్తునునుగుందనపుబొమ్మరముల
కొనల నీలపుములుకులు దాచినట్లు 2910
పలుద లై తళుకెక్కి పట్టువ లైన
ములుగుబ్బపాలిండ్ల మొనలకప్పొదవెఁ
గలికిచూపులఁ జంద్రికలు పర్వె ననఁగఁ
బలుకఁబారెను గండపాళికాయుగము
నలివేణి ముఖచంద్రుఁ డమృతంపురసముఁ
జిలుకుచందంబునఁ జిట్టము లెసఁగె
గగనభోగంబు సాకార మై యొప్పు
పగిదిఁ గౌఁదీఁగ చూపట్టె నానాఁటఁ
బొలఁతికి నవమాసములు నిండువేళఁ
గలలోన గజముఖగణముఖు ల్గొలువ 2920
వేత్రహస్తునికూర్మి వెలఁది యైనట్టి
సూత్రవతీదేవి చూపట్టె నంతఁ

( 169. వైశాఖవిశాఖానక్షత్రదినములో [నమ్మాళ్వార్ నామక] పంచమయోగీశావతారవర్ణనము. )

గలియుగం బిలమీఁదఁ గలిగినమీఁదఁ
దెలియఁ దొంబదిరెండుదినములు చనఁగ

సవరని వేళ వైశాఖవిశాఖఁ
గవివాసరమునఁ గర్కటకలగ్నమునఁ
గనియెఁ బుత్త్రుని జగత్కల్యాణమూర్తి
వనజాక్షుఁ గన్న దేవకిరీతి నంతఁ
గావిరి విరిసె దిక్తటుల మహాను
భావభావముల సంభ్రమము రెట్టించెఁ 2930

గురిసెఁ బువ్వులవాన ఘుమఘుమ మింట
మొరసె దుందుభులు ప్రమోదంబుతోడఁ
బొంగె వైష్ణవకులాంభోరాశి మిగులఁ
గ్రుంగెను పాషండకులభూధరములు
విందులై మకుటాగ్రవిహితకరార
విందులై యింద్రాదివిబుధులు బుధులు
జయ జయ శబ్దముల్ సవరించి రెలమి
నయముగా వీచెఁ గ్రొన్ననతావిగాలి
యలయుచు యాయజూకాగ్నిహోత్రములు
వలగొనుశిఖలఁ బావకుఁ డొప్పుమిగిలె 2940

( 170. జ్ఞానోపదేశప్రాప్తిక్రమము. )

ధరణివరాహావతారుఁడై నట్టి
హరి సూతికాగృహ మపుడు సొత్తెంచి
కరుణ దైవాఱంగఁ గారిసూనునకుఁ
దిరముగా జ్ఞానోపదేశంబు చేసె
నప్పు డానాథనాయకి పుత్త్రుఁ గాంచి
నప్పుడాశౌరి గేహాంతరసీమ
శేషుండు నిర్నిద్రచించామహీజ
వేషుఁడై యెంతయు విలసిల్లుచుండె
హరికృపాలబ్ధవిద్యామృతాహార
పరితృప్తుఁడై తల్లిపాలిండ్లపాలు 2950

కుడువఁ జేడుపఁడు కన్గొనఁ డొండుదిక్కు-
బడలఁ డీగతి నున్నబాలు వీక్షించి
యడియూసఁ దలిదండ్రులదెయిదె యనుచుఁ
బొడిబడుకొనుచు నప్పౌరుడెల్లఁ గడపి
యిలఁ బుట్టి చనుగ్రోలఁ డీబాలుఁ డనుచు
నెలమి మారున్నాను మిడి యటమీఁద
మఱియుఁ దొల్లింటియమ్మాడ్కినే యుండ
గిఱికొన్నపగల మిక్కిలి వెఱఁ గంది
యిది యేమిచోద్యమో యిన్నినాళ్ళయు
నుదయాస్తమయములం దొక్కమాత్రైనఁ 2960

( 171. కుమారాద్భుతస్వరూపదర్శనము. )

జను నోటఁ బెట్టఁడు చను గ్రోలకున్నఁ
గను విచ్చి చూడఁడు కను విప్పకున్న
నెలుఁ గెత్తి కా వని యేడువం డెపుడు
నలకువ మేన నింతయుఁ గానఁబడదు
కడుఁ బెద్దకాల మీగతి గొడ్డుపోఁగి
కొడుకుఁ గాంచిన నెట్టికొడుకు సిద్ధించె
దేఁకువఁ గనిపించు తెఱవలఁ జూచి
యేఁకటఁ బడఁజేసె నిట్లు దైవంబు
మఱియును నేము నిమ్మహిఁ బుట్టి బుద్ధి
యెఱిఁగితి మీరీతి యెఱుఁగ మెన్నఁడు 2970

కరమునం గని పెంచువారలు లేరె
వరమైన నిటువంటివర మెందుఁ గలదు

( 172. కురుకాధీశహరికటాక్షవీక్షణవరప్రదానాది. )

కురుకాధినాథు మక్కువఁ గోరి వేఁడఁ
గరుణించి వర మిచ్చెఁ గడు సీగరముగ

నిచ్చెంబో యిందఱి కిచ్చినరీతి
నిచ్చనా తుది వచ్చి యిది కొంత సేసెం
దలఁపఁ బిడ్డఁడె వీఁడు దయ్యంబు గాక
పలుమాఱు నీరీతి బలుపుకో నేల
నని పుత్త్రవాత్సల్య మంతంతఁ బొదలఁ
దనవారిదెసఁ గాంచి తనయునింజూచి 2980

యేను నీకై నోము లెన్నని నోఁచి
పైనాఁకపాటులఁ బడి గొడ్డువీఁగి
కంటి నీవంటి చక్కనిముద్దుగుఱ్ఱ
నంటు సేయవు కేరి నవ్వ వేమిటికి
నీసున మీతండ్రి యేనును నీకుఁ
జేసిన యెగ్గేమి చెప్పుమా తండ్రి!
యోయన్న! యిట్లూరకున్నాఁడ వేలఁ
బూయంగఁ జేసి యేర్పులు దట్టుతనదు
చన్నులపాలేల చవిగొన విపుడు
కన్నుల ముత్యాలు గాఱ నేడువవు 2990

( 173. అప్రాకృతకుమారయోగాభ్యాసవైఖరి. )

తనయ! నీ వేల మీతండ్రి "నన్న" నవు
నను "నమ్మ" యని యొక్కనాఁడుఁ జీరొ్కనవు
సుద్దులు చెప్పవు చూడవు నీదు
ముద్దులు సూపవు మురియ వేనునుచు
నాఁపిన బొప్పంబు లడరి నిండారఁ
జేఁపినపాలిండ్లు చేతఁ గుల్కుచును
గన్నవారలకుఁ జెంగట నింత సంత
నున్నవారికి దైన్య మొదవ నిట్లనియెఁ
బలుమాఱు పిలిచినఁ బలుకవు తాము
తొలుజన్మమున నెంతదోసకారులమొ 3000

చిట్టినీబంగారుచేతుల హరికిఁ
బెట్టుమా జోతాలు ప్రియము రెట్టింప
కొలుకనవ్వులు దేఱ ముద్దులు గాఱఁ
గిలకిల వాయెత్తి కేరు నాతోడఁ
గురుకాధివిభుఁడు మక్కువ నిచ్చినట్టి
వరమునఁ బుట్టి దేవరవలె నున్న
నినుఁ జూచి మాటాడ నేరనివాఁడ
వనుచు నీభావ లంతంత నవ్వెదరు
బడిసె మిక్కిలిసిగ్గు వడఁగ నీయెడమ
యుదుగునఁ జెప్పిదుమయ్య ! నాకోడె ! 3010

కడువేడ్క మీతాత గావించుబాల
తొడవులు దొడుగఁ జేతులు సాఁచు మయ్య !
మనమున నినువంటిమనుమండు గలిగె
నని సంతసించి మీయవ్వ తాతయును
బొదలుచు వచ్చి మూఁపులు మూడు గాఁగ
నడె పిల్చెదరు మాట లాడవే తండ్రి !
మును వరంబిచ్చిన మురసూదనుండు
తనుఁ బోలుపుత్త్రరత్నముఁ బ్రసాదింతు
ననఁగ నమ్మితిఁ గాని యన్న ! యీపుట్టు
ముని వైన నిన్ను నిమ్ముల నిచ్చుటెఱుఁగఁ 3020

( 174. జగదుపకారప్రశంస. భగవద్గుణవైభవము. )

ప్రాకృతక్రియకు లోఁబడకున్న నిన్నుఁ
బ్రాకృతనిజపుత్త్రభావంబుఁ జేయ
నలిగితో తలఁపు శ్రీహరియందుఁ దగిలి
యిల నొంఢను సైఁపదో యీవేళ నీకు
నుడుగక మావంశ ముద్ధరింపంగఁ

బోడమిన కురుకాధిపుఁడవె నీ వనుచుఁ
దమకంబుఁ బ్రియమును దైన్యంబు వగపు
సమకొనం బలుకుభాషణము లాలించి
యనిశంబు సంసార మనుపయోరాశి
మునిఁగి తేలుచు నున్నమూఢకామినులు 3030

కొందఱు బాలుదిక్కును బాలుతల్లి
చందంబుఁ జూచి లోఁ జర్చించి యనిరి
కట్టెఁడి వీరి కెక్కడిబిడ్డఁ డమ్మ
పుట్టి యిన్నాళ్ళయెఁ బలుకునఁ గన్ను
దెఱవక చన్నుద్రావఁ దివురనిబిడ్డఁ
బరికించి యింత నిబ్బరికంబు లేదు
వాది గల్గి భూమిఁ గాఁపురములు చేసి
బ్రదికి బాళెదమునఁ బరఁగువారలకు
వలవంతవేళ దేవర దయ్య మనఁగఁ
గలదు వారలరీతి గాదు వీరలకు 3040

దేవుఁడో దయ్యమో దిరిగియు మగుడి
దేవుఁడు మాకు శ్రీదేవుఁడే యనుచుఁ
బిలిచి యంతయుఁ జెప్పఁ బెరుమాళ్లె మాకుఁ
గలఁ డంచునొల్లరు కలిగె వీరలకు
వజ్జంబో వారంబో వారిసాజంబో
వెజ్జుఁ జూపించరు వేల్పు లకిడరు
ఇప్పుడు బుడిబుడియేడ్పు లేడ్చినను
దప్పునే యిది పెద్దదయ్యంబుపట్టు
మనము చెప్పినమాట మనమున నిడరు
వినరన్నవారినే వెఱ్ఱులఁ జేసి 3050

దాయలగాఁ జూడఁ దలఁతురు తాము
పోయినదేపోక పోసఁగ నా ననరు

అని కొండ అనుచుండ నతఁడు యోగీంద్రుఁ
డని కొండ అవల నున్నట్టిసన్మతులు
నాయాయివాక్యంబు లాలించి నాథ
నాయిక పరమవైష్ణవ శీలయనియెఁ
బ్రకృతివాసన నిట్లు పలుక వేమిటికి
సకలజీవులఁ జరాచర వస్తుతతులఁ
బొడమింప నుడిగింపఁ బోషింపఁ గలిగి
కడ యాది మధ్యముల్ కన్పింపరాక 3060

( 175. పరమోత్కృష్టకార్యరచన. )

జగదేకవిభుఁడును సర్వస్వతంత్రుఁ
డగు రమావిభుఁడు సేయఁగలేనిపనులు
తనుదేహులును నస్వతంత్రు లస్థిరులు
ననధికారులుఁ గ్రూరు లల్పజ్ఞులైన
యితరులచే సాధ్య మెట్లగు నైన
నతనిచేతనె యగు నఖిలకృత్యములుఁ
బుడమి దేవార్హమై పొలుచుహవ్యంబు
కడు మొక్కలమునఁ గుక్కల కిచ్చినట్లు
నతనికి శేషమైనట్టి యీయాత్మ
నితరశేషము సేయు టెట్లు చింతింపఁ 3070

దలఁపఁ బాతివ్రత్య ధర్మంబువంటి
నలినాక్షుదాస్య మెన్నక యిట్లు మీఱి
పలుకుదురే మీరు? పామరు ల్గానఁ
బలికితి రిఁకనాడఁ బని లేదు మిమ్ముఁ
బరమబాంధవుఁడైన పంకజోదరుని
నరిమీఱి యేమునిందనకదూఱితిమి
అతని దూఱఁగ నేల యతఁడిచ్చినట్టి
సుతుని మే మతఁ డున్న చోటనే నిలుప

వెత లేదు పద మంచు విభుఁడుఁ గాంతయును
నతివేగమును బుత్త్రు నక్కుమారకుని 3080
గొని యేగుదెంచి యాకురుకేశుఁ డైన
ననవిల్తు జనకుని నగరిలోఁ జొచ్చి

( 176. తింత్రిణీవృక్షప్రదేశప్రాప్తిక్రమము. )

యలవేల్పురాయని యగ్రభాగమునఁ
బొలుపొందుతింత్రిణిభూజంబు మొదలఁ
బసిఁడితొట్టెలలోనఁ బరపును బోలెఁ
బొసఁగంగ మెత్తనిపొత్తులు పఱచి
యిందుమైఁ గప్పిన యెలమించుసోగ
కందువఁ జలి యెండ గాలిచాటుగను
నొరపుతోఁ గప్పినయుత్తరీయంబు
చెరఁ గింత చుబుకంబుచే నోసరించి 3090
పొదిగిటం జేర్చినపుత్త్రు నీక్షించి
ముదమునఁ జెక్కిలి ముద్దాడి యందు
నునిచి ముంగల నున్న యురగారవాహుఁ
గని యిరువురు నమస్కారము ల్సేసి
తమ కేమి తెలియు నంతయు నీకుఁ దెలియు

( 177. బాలయోగిశరీరసౌందర్యదివ్యచర్యాది. )

భ్రమరశోభనగాత్ర ! పరమమాయావి !
యేము నీమహిమఁ దా మెఱుఁగ నోపుదుమె
యే మునీశ్వరులు ని న్నెఱుఁగంగలేరు
ఇటమీఁద నీచిత్త మెటువలెవచ్చె
నటువలెఁ జేసికొమ్మని విన్నవించి 3100
యంతటఁ దమయింటి కరిగెద మంచుఁ
గొంతద వ్వరిగి యక్కువలయనేత్ర

పక్కఁ బాయని తనపట్టిరూపంబు
గ్రక్కునఁ గన్నులఁ గట్టినట్లైన
నెద జల్లు రనఁగఁ బాలిండ్లు సేచేప
మదిఁ బుత్త్రుమైఁ బ్రేమ మల్లిడిగొనఁగ
నలయుచుఁ బోవ కాళ్ళాడకయుండఁ
గలఁగి మిక్కిలి కన్నకడుపుగావునను
గన్నీటిసెలయేటికాలువ లుబ్బి
చన్నుగొండలమీఁద జాలువారంగ 3110

హా! కుమారక! యంచు నవనిపై వ్రాలె
నాకారియును నట్ల యవశుఁడై తెలిసి
నెఱిఁ దక్కి తామరనెమ్మోము వాడ
నెఱిగొప్పు వీడఁ గన్నీరు బిట్టడరఁ
బదకింకిణులు గేరఁ బయ్యెద జాఱ
నదరుడెందముమీఁదిహారముల్ చెదర
మహితనందన శోకమగ్నయై మున్ను
మహి నున్న యలచంద్రమతియును బోలె
నిలఁ బొరలుచు నున్నయింతి లాలించి
తెలిపి కేలునఁ గేలు దెమలించుకొనుచు 3120

నడలుచు సుతుఁ డున్నయటఁ జూచి కన్న
కడుపు గావున సాధ్వి క్రమ్మఱఁ బలికె
నేఁచి యింతఁగ బెంచి యెలమి వోవిడిచి
యేచింతయెఱుఁగని యీపసిబిడ్డ
నీచింతక్రింపట నిటు పాఱవైచి
యేచింత మఱిలి నే నింటి కేగెదను
అని పోవఁదలఁచితి నకట! నోచెల్ల
తనగుండె ఘాత ఱాతను జేయఁబోలు

నని కన్నులారంగ నాత్మజు మఱియు
గనుఁగొనం గోరి యక్కడకుఁ గ్రమ్మరను 3130

బోవంగ నం దేమి పోయెద వనుచుఁ
జేపట్టి తిగిచినచెలువు నీక్షించి
నను నేల పట్టెదు నాచిట్టిపట్టి
మునివంటివాని కామునివంటివాని

( 178. మునికుమారసర్వజ్ఞత్వవైభవము. )

జననిగర్భములోనె సర్వజ్ఞుఁడైన
మునివంటివాని సోమునివంటివాని
నెనయు వేదములచి క్కడలించినట్టి
మునివంటివాని రామునివంటివాని
జిగిమించు మోవి కెంజిగురాకుమీఁద
నిగనిగ నగవువెన్నెల జల్లువానిఁ 3140

గొదమతామరలబాగునవీనుసిరులఁ
గదిసిన నిడువాలుగన్నులవాని
బంగారుప్రతిమకుఁ బ్రతివచ్చునట్టి
సింగారములతోడఁ జెలువొందువాని
నీలంపుమొలకలనెఱులముంగురుల
చాలు గప్పినఫాలశశిరేఖవానిఁ
బొన్నపొక్కిలితోడఁ బొసఁగి బాగైన
తిన్ననిమెఱుఁగుచంద్రికబొజ్జవానిఁ
గ్రొన్నెలపులిగోరు గ్రుచ్చినమణుల
యున్నువకంఠలో నలవడువాని 3150

గొరగల్లి కొదమనాగులబాగు లెసఁగు
మురువైన యపరంజిమురువులవానిఁ
బూని దేవుని సరిపోలఁ బవచ్చు

వానిఁ గన్నులఁ జూచి వచ్చెద ననుచు
నొడఁబడఁ జెప్పి యయ్యువిద కెంగేలు
విడిపించుకొనుచు నావృక్షంబుక్రింద
మలుకటుంగరములు మణికంకణములు
నెలవంక పులిగోరు నెఱిగుండ్లదండ
నీలంబు లెడఁబెట్టి నిగుడించినట్టి
పాలఫూసలు నొసపరిరావిరేక 3160
రవలగజ్జియ లపరంజియందియలుఁ

( 179. కృష్ణోపమానకథనాది. )

బవడంపుమొలనూలు పసిఁడిగంటలును
గలిగి శ్రీకృష్ణుని గతి నొప్పుసుతుని
చెలువంబు గాంచి మచ్చికఁ జేర నరిగి
నెఱికురుల్ దిద్ది క్రొన్నెలబొట్టుఁ దీర్చి
చిఱుబొజ్జనిమురుచుఁ జెక్కిలినొక్కి
తద్దయుఁ బ్రేమ మస్తకము మూర్కొనుచు
ముద్దాడి మోముపై మోము డాయించి

( 180. అవిభాజ్యాది వైభవప్రశంస. )

నాపుత్త్రిరత్నంబ నావెండికొండ
నాపాలిదైవంబ ననుఁ గన్నతండ్రి ! 3170
నాకులోద్ధారక నాతోడునీడ
నాకుందనపుఁబెట్టె నాకోడె యనుచు
నొసపరి చిగురాకుటొగరుశోకముల
కసరాటరెలిసరాగపునాద మెసఁగఁ
గోయిలజవరాలు క్రోల్చినరీతి
వాయెత్తి యాకీరవాణి యేడ్చుటయుఁ
గరుణించి శ్రీరమాకాంతుఁ డాకాంతఁ

బరికించి పలికె నోపరమకల్యాణి!
కృతకృత్యులైన మీ కేల చింతింప
నతని మానవమాత్రుఁ డని తలంపకుము 3180

ఏన యీరూపున నిలయెల్లఁ బ్రోవఁ
బూని మీకడుపునఁ బొడమినవాఁడ
నడలకుం డిఁకమీఁద నఖిలసౌఖ్యములు
నెడపక మిముఁ జెందు నిది నాదుమహిమ
సరగున నిజనివాసమునకు వేగ
నరుగుండు మీ రని యానతిచ్చుటయు
నాదంపతులు సొంపు లాత్మ రెట్టింప
మోదించి కరములు మోడ్చి నుతించి
వలచుట్టికొని నిజవసతి కేతెంచి
రలయోగిశీతాంశుఁ డలరి యవ్వేళఁ 3190

బరపైనకొమ్మలు ఫణములు గాఁగ
సిరిమించులతికలు జిహ్వలు గాఁగ
మొగడగుత్తులు ఫణామణుల్ గాఁగఁ
దగినశలాటువుల్ దంష్ట్రలుగాఁగ
బొది గుల్లుమూలంబు భోగంబు గాఁగ
బదినూఱుశిరముల ఫణిరాజుకరణిఁ
దీటయి యొప్పున త్రింత్రిణీతరువు
కోటరవసతిఁ గైకొని నవ్వలించి
సరగున నపుడు శైశవ ముజ్జగించి
తరుణభావముఁ దాల్చి తద్వాసమునకు 3200

( 181. పద్మాసనకలనాదియోగపరిచయము. హరిధ్యానరచన )

ధరనుండి గిరిగుహాంతరమున కెగురు
కరివైరిపోతంబుకరణి లంఘించి

పద్మాసనస్థుఁడై పద్మాక్షు పాద
పద్మముల్ తనదుహృత్పద్మసద్మమున
ధ్యానంబు సేయుచుఁ దనుబోలుజ్ఞానిఁ
గానమి నొంచొరు కడఁజూడ కచట
సంయమివరుఁడు వాచంయముం డగుచు
సంయుతవిద్యానుషక్తుఁడై యుండె

( 182. భగవత్ప్రత్యక్షప్రకారము. )

సత్తతి హారి యంబుజాలయఁ గూడి
క్రొత్తకుందనపురేకులనిగ్గు లోలయఁ 3210

గలికి ప్రామినుకుఱెక్కలతేజి నెక్కి
సలలితశశిబింబ సహితహైమాద్రిఁ
బోలుచుశోంపాన్వితభువనదం బనఁగ
సలపరమాభ్రంబునందుండి వచ్చి
భానుకోటిప్రభఁ బ్రత్యక్షమయ్యె
నైన విలోకించి యాకారిసుతుఁడు
శ్రుత్యంతదృష్టి కళోద్భవుఁడై యుండి
శ్రుత్యంతదృష్టికిఁ జూపట్టె ననుచు

( 183. కారిసుతపరమానందాది. ద్రావిడవేదావిర్భావక్రమము. )

నాసనసుముదాస్యుఁ డమృతంబు గురియఁ
బూనిన క్రియ బాష్పపూరముల్ గురియఁ 3220

గంతుతండ్రిని బొడఁగన్న సంతోష
మంతకంతకు హృదయమున నుప్పొంగ
తనువెల్ల గరుపార తామరసాక్షు
వినుతింపుచుండె వేవేలచందముల
నపుడు జగన్నాథుఁ డగురమానాథుఁ.

డపరిమితంబు లై నట్టివేదముల
నఖిలశాస్త్రంబుల నయ్యోగిచంద్రు
ముఖమున ద్రావిడామోదవాక్యముల
రాజిల్ల వీక్షింప రమణమై భోగి
రాజపర్యంకువరప్రసాదమున 3230

నమితాగమములు జిహ్వారంగసీమఁ
దముదామె చెలఁగి నర్తన మాడఁదొడఁగె
నాక్షణంబున వచ్చి యఖిలశాస్త్రములు
లక్షింప లాలాజలంబు లై తనరె
వెలయంగ శారదాన్వితజిహ్వుఁ డగుచు
నలయజుఁ బోలె నేకాననుం డయ్యు

( 184. సారస్వతోదారమహిమ. ఆషోడశవర్షవ్యాఖ్యానరచనాది. )
యోగిప్రబంధమాధుర్యగాంభీర్యాదిప్రశంస. చతుర్వేదసారభరితప్రబంధచతుష్కవైభవము.

నీరీతి నాసంయమీంద్రుండు సహజ
సారస్వతోదారసంపన్నుఁ డయ్యు
ధవళాక్షుఁ డంత నంతర్హితుం డైన
వివరించి యానందవిహ్వలుం డగుచు 3240

నాషోడశాబ్దంబు లంతరంగమున
శేషపర్యంకుని జింతించుకొనుచు
మౌని యై యుండె నమ్మౌనివల్లభుఁడు
సానందుఁ డై పదియాఱవయేఁట
నరవిందభవసపర్యాప్తగోవింద
చరణారవింద నిష్యందమరంద
వారిధారాకారవరవారిపూర
పూరితగంభీరభూరినిర్ఘోష

రంగదభంగసంభ్రమభరోత్తుంగ
గంగాతరంగవై ఖరులు దీపింప 3250

నిరవద్యములు యోగినికరవేద్యయులు
హరిగుణహృద్యంబు లై నపద్యములు
మకరకుండలధారు మై ననేకంబు
లకలంకభావంబు లలరఁ గావింప
నవిరళశత్రదసం బరయుచు నంద
తవిలి డెందమున నెంతయుఁ జిక్కిచొక్కి
యానందపరవశుఁడై యాఱునెలలు
మానిమై యుండి క్రమ్మఱ మేలుకాంచి
మకరకేతనుతండ్రిమై నంకితముగ
నొకకొన్ని పద్యంబు లొనరించి మఱియు 3260

నందలిరసరీతు లరసి యానంద
మొంది యాకై వడి నుండె నన్నాళ్లు
వెండియుఁ జెలి వొందు విష్ణునిమీఁద
దండిమైఁ బెక్కుపద్యములు గావింపఁ
గారిసూనుని కావ్యకన్యకామణికి
ధారుణి నర్చావతారరూపములఁ

(185. నవశ్రీమూర్తిప్రత్యక్షమై భవప్రశంస. స్వస్వనామకథనము. )
శఠకోపకలిత వేదాంతసారమహిమవర్ణనము.

జెలు వొందు విష్ణుని శ్రీమూర్తులెల్ల
వలచి వేగమె వచ్చి వలచుట్టుకొనుచు
నతులచించాకోటరావాసు యోగి
పతిని సత్కవిసార్వభౌము నీక్షించి 3270

తెలియంగఁ దమతమ దివ్యనామములు
తలపించి తముఁబాడు తముఁబాడు మనుచుఁ

దోదోపు లాడుచుఁ దోలఁగక నంత
శేదశాఖలు వోలె వెలయుశాఖలను
నవలంబనము సేసి యాట్రమానిచుట్టు
బవరిగాఁ జుట్టి శ్రీపతిమూర్తులెల్ల
వినయభాషణముల వినుతి సేయుచును
మనములోపల మమ్మ మఱవకు మనుచు
నాకారివైరిసంతతి నుతి సేయ
నాకారినఁజసుం డానంద మంది 3280

మానులవిందులై మాధవాంశములఁ
వీనులవిందులై వెలయుసూక్తులను
వారక యొకతరవాటు చేకొనుచు
నీరజోదరుల వర్ణించి వర్ణించి

( 186. శ్రీవేంకటేశతద్దివ్యమహిషీమంగళాశాసనవైఖరి. ప్రబంధమహిమ. )

శ్రీవేంకటేశు రాజీవాస్త్రగురుని
భావించి యతనినిం బలుమాఱు నెన్ని
వెండియు వారల వినుతి సేయుచును
గుండలీపతిశైలగురుని కీర్తించి
కలయ వారల నెన్ని క్రమ్మఱె మఱియు
నలమేలుమంగా విహారుచందములు 3290

కొనియాడి యాడి తద్గుణసుధారసముఁ
దనివారఁ గ్రోలి యాతనియంద చిక్కి
యచరితభావంబు లడర వేదములు
పచరించి చేసెఁ బ్రబంధరత్నముల
నున్నతి వేదాంతయుక్తులఁ బేర్మి
నెన్నిన హరిమూర్తు లేకభావముల
నది మెఱింగియు మాని యై యంజనాద్రి

మదనమన్మథుమీఁద మరు లేల కొనియె
సరయ నందఱకంటె సహిరాజశైల
మురవైరి కిటువంటి మొగసిరి గలదో 3300
యరయంగ సర్వజ్ఞుఁ డతఁ డెఱుంగుటకు
నరుదు గా దెన్నిన నమ్మహామూర్తిఁ
గన్నవారలుఁ గడకడనుండి చెవుల
విన్నవారలు కడువేడ్క నుప్పొంగి
యక్కజపడి యాత్మ నందంద చొక్కి
చిక్కకపోరు చర్చింప నాకృతుల
నందలిరుచిఁ జిక్కి యన్నాళ్ళు తొంటి
చందాన నుండి క్రచ్చఱ మేలుకాంచి
యనిశంబు శౌరిదివ్యగుణానుభవము
లనుభవించుచు నుండె నంతటిమీఁద 3310

( 187. పాండ్యమండలస్థతిరుక్కోటూరునామకదివ్యక్షేత్రమహిమ. )

ధారుణీస్థలి సంపదలచేత వెల్లు
టూరు గెలిచు కోటూరునా వెలయు
నవిరళశుభముల కాలవాలంబు
నవణింపఁ బాండ్యమండలమండనంబు
నళినాక్షుఁ డచట ననంతతల్పమున
నలువొందుచుండు ననంతభోగములఁ
దనరు నచ్చోటివైతానసంతాన
ఘనతరధూమరేఖావితానంబు
గగనకల్లోలినీకల్లోలలోల
మగుచుండ నయ్యేఱు యముననా నొప్పు 3320
మురవైరిపదభక్తిముదితమానసులు
కరుణాపయోనిధుల్ గాంభీర్యనిధులు

నగణితవేదవేదాంతపారగులు
నగుచుఁ బ్రాజ్ఞత నిర్జరాచార్యు నగుచు

( 188. వాదికేసరినామకోర్ధ్వశిఖబ్రాహ్మణవరమహిమ )

మెలఁగుదు రచ్చోటి మేదినీవిబుధు
లలవిప్రవరులకు నాచార్యుఁ డగుచు
వాది కేసరియు నూర్ధ్వశిఖుండు సామ
వేదియుఁ బరతత్త్వవేదియు నైన
యొకభూసురేంద్రుఁడు నియమవిదగర్భమున
సకలేశుఁడైన విష్వక్సేనమూర్తి 3330

( 189. చైత్రచిత్తానక్షత్రదినములో నిత్యకుముదాంశముగా మధురకవినామకపష్ఠ
యోగీశావతారవర్ణనము. శుభశకునాదివీక్షణము. )

యమితగణంబుల కధినాథుఁ డైన
కుముదాహ్వయుఁడు నిత్యకుముదబాంధవుఁడు
ననుపమచైత్రచిత్రాహ్వయతార
జనియించె శుభవేళ జగము లుప్పొంగ
సొలపుల నిలఁ బుట్టుచునె తావితోడ
మొలకెంచుమరువంపు మొలకచందమునఁ
బొడమినప్పుడె లోకములు గొనియాడఁ
కడఁక నొప్పెడు సదాగతిపట్టి వోలె
నుదయించినప్పుడ యోగసామ్రాజ్య
పదపట్టభద్రుఁడై పరఁగి యమ్మౌని 3340

( 190. యోగాభ్యాససత్కవితాప్రాప్తిక్రమము. )

యష్టాక్షరావృత్తి కనుగుణంబైన
యష్టాంగయోగంబు నలవరింపుచును
అలరెడు వెన్నునియడుగుదామరల
తలఁపుఁ దేనియల డెందపుఁదేఁటి చొక్కఁ

గవిసార్వభౌముఁడు కవిపురందరుఁడు
కవివసచైత్రుఁ డీఘనుఁ డంచుఁబొగడఁ
బలికినపలు కెల్లఁ బన్నీరుచెంబు
గులికినచందానఁ గ్రొన్నెలసోఁగ
వోలసినరీతి కర్పూరంబులప్ప
లొలుకుకై వడి మించు లుడుగక మెఱయి 3350

ననువునఁజల్లఁగా నమృతంపుసోన
చినుకుసోయగముఁన జీవరత్నములు
మొలఁగెడుజాడఁ బ్రామినుకువజ్రములు
తులఁగింప జలజలఁ దూర్పెత్తినట్టి
మెలుపున వలుపుఁదెమ్మెరలు వేడించు
నలువునఁ గ్రొత్తకట్టాణిముత్యములు
డాలించుసరణి బిటారంబు లొకట
గీలించుకరణిఁ జక్కెర లుప్పతిలఁగ
మగనిమైఁ గూర్మి రమాదేవి చూపు
నిగుడించుభాతి దేనియ లుట్టిపడఁగఁ 3360

( 191. మసురకవినామప్రాప్తిప్రకారము. తీర్థయాత్రాగమనప్రస్తావము. )

గవిత మాధవుమీఁదఁ గావింప మధుర
కవిపేరు జనకుఁ డాఘనునకు నొసఁగె
నాయోగి యటమీఁద నచ్చోటనొప్పు
శ్రీయోగిమైన యాశేషపర్యంకుఁ
దనహృదయారవిందమున సేవించి
కొనుచు నాపురి నెలకొని చిరాబ్దములు
వసియించి యటమీఁద వసుధమైఁ గలుగు

కను విచ్చి కరుణ యోగసమాధిఁ దెలిసి
మునుకొని తనదుసమ్ముఖమున నున్న

( 194 శఠకోపముని ప్రబంధ మాహాత్మ్యాది ప్రార్థనాప్రకారము. )

చిరతపోనిధిఁ గటాక్షించిచూచుటయుఁ
బరమయోగీంద్రకృపాదృష్టివలనఁ 3420

బరమసుజ్ఞానసంపదఁ జెన్నుమిగిలి
కర మర్థి మధురాఖ్యకవి పరాంకుశుని
దనపాలిగురువును దైవంబు గాఁగ
మనమునఁ దలఁచి ప్రేమము దయివాఱ
నాగమసారంబు లగుశఠకోప
యోగిసూక్తులయందు నున్నయర్థంబు
తెలియంగఁ దలఁచి తద్దివ్యపాదాబ్జ
ముల వ్రాలి హస్తము లొడ్డిచ్చి యిట్లనియె
వెలయ వేదములు ద్రావిడముగాఁ జేసి
వెలసిన యోగీశవిద్యాప్రకాశ 3430

యీవేళ మీ రానతిచ్చినకృతుల
భావంబులందలి పదపదార్థములు
నానతీవలయు నీయంఘ్రిసేవకున
కోనిర్మలాచార ! యోకృపాసార !
యని విన్నవించిన నమ్మహాయోగి
ఘనభక్తి శిష్య శేఖరు విలోకించి
యరయంగ నీవు నన్నడుగునర్థంబు
పరమరహస్యంబు పరికించి చూడ
మునుకొని యేఁగ్రమమున నేర్పరింతు
ననఘాత్మ ! నీ వివి సావధానముగ 3440

( 195. మంత్రోపదేశక్రమవర్ణనము. అర్చావతారవైభవము. ద్రవిడప్రబంధమహిమ. )

విను పర వ్యూహవిభవాంతరాత్మ
లనఁగొప్పు శౌరిపర్యాయమూర్తులను
భాసిల్లు నామ్నాయపంచరాత్రేతి
హాసముల్ శ్రుత్యాదు లనిశంబు నెన్నుఁ
దలపోయ నర్చావతారరూపములఁ
జెలు వొందఁ జగతిపై శ్రీపతిఁబొగడు
స్తవములై శ్రుతిగర్భితంబులై యేను
శ్రవణించు నీద్రావిడప్రబంధములు
కృతయుగాదుల మూఁట గిరికొనఁజేయు
నతులితధ్యానయోగార్చనావిధులఁ 3450

గలుగునే ఫల మది కలియుగవేళ
నళినాక్షుసంకీర్తనంబుచేఁ గలుగు
ధర వ్యాసుఁడై భారతముఁ జేసినట్లు
మదుగురుం డిప్పుడు మామకముఖంబునను
బృథివి జంతువులెల్ల నీడేరుకొఱకు
బృథుల వేదార్థగర్భితములు గాఁగ
నిలలోని జనులెల్ల నీడేరుకొఱకు
నలలిత వేదార్థసారసంతతులు
కృపసేయ ద్రావిడకృతులుగాఁ జేసె
నిపు డీరహస్యంబు లెఱిఁగింతు వినుమి 3460

( 196. శఠకోపమునిప్రబంధచతుష్టవైభవము. చతుర్వేదస్వరూపత్వకథనము. )

యివి మత్ప్రణీతంబు లివి నాల్గుకృతులు
వివరింపఁగాఁ జతుర్వేదార్థవతులు
కడలినీ రాని మేఘము లుర్వి గురియఁ
గడుమంచి వైనసంగతుల నీకృతుల
ననుపమకఠినాగమార్థము లొనుచు

ననువదింపఁగ మార్దవాకృతుల య్యో
నాదిప్రబంధంబు హారిగుణోద్దార
వేదనీయంబు ఋగ్వేదమయంబు
శతపత్త్రిజాతవిస్మయకారి గాఁగ
శతపద్యములచేత సవరింపఁబడియె 3470

రెండవకృతి యజుర్వేదాంగసప్త
కాండార్థవతి యేడుగాథల నొప్పు
నరయ మూడవకబ్బ మఖిలార్థవితతి
వరుసఁ దెల్పుచు నధర్వస్వరూపముగ
వెలయఁ దొంబదియేడువృత్తము ల్గలిగి
యలరు నాల్గవకావ్య మది యెట్టి దనిన
రూపింప సామనిరూపకం బగుచుఁ
బ్రాపితరసశబ్దబంధంబు గలిగి
ప్రఖ్యాత మగు పరబ్రహ్మపరత్వ
ముఖ్యనామములచే మొనసినయట్టి 3480

( 197. ద్రవిడవేదగానశ్రావ్యత్వాదిశైలి. )

యేనవస్థలచంద మెంతయుఁ దెలుపు
గానకరోన్మచితాంగంబు శ్రావ్యంబు
నరయంగ ద్రివిధజీవాళి కామోద
కరము భవ్యము వేయుగాథల నొప్పు
దాకొని యెల్లవేదముల గాండాను
వాకముఖ్యంబులు వఱలినరీతిఁ
దలఁపనిందును నేకదశశతసంఖ్య
నలవడియుండు సర్వాగమోత్పత్తి
కారణం బగుచు నక్షరములమూఁటఁ
జేరిక గల్గి పెంచ్చినప్రణవంబు 3490

పాడుగా నయ్యాదిపద్యంబునందుఁ
బాదత్రయమునఁ జొప్పడి యొప్పుచుండుఁ

( 198. ఉపనిషత్సారత్వసత్ఫలప్రదత్వాదివై భవము. )

దుదలేని యుపనిషత్తులు చెప్పుచున్న
మొదలి కర్మబ్రహ్మముల నిరూపించి
వలగొని నిదురవోవనిచింతకొమ్మ
లలమియుండిన యంబుజాక్షుమూర్తులను
ఎన్నుచు వేర్వేఱ నీప్రబంధంబు
లెన్నిచూచిన జగదేకపూజ్యముల
వినినఁ జెప్పినఁ జదివినయట్టివాఁడె
వనజాక్షుదాస్యంబు వలసినవాఁడు 3500

సొవుండుఁ దత్ప్రబంధములయర్థంబు
భావంబులోఁ బాదుపఱచి మోదమున
భువి సాగి ప్రణమిల్లి పొగడుచు మధుర
కవిరాజు యోగిపుంగవుని సేవించి
తామసాంభోరాశి తరియింపఁ జేసి
శ్రీమించ ననుఁ గటాక్షించినయట్టి
కురుకాధిపతియైన గురుపదాబ్జముల
నిరతంబు వసియించి నిలిచె నాతలఁపు
వేదెఱంగులనైన వేఱొం డెఱుంగ
వేదమంతయును ద్రావిడముగాఁ జేయు 3510

పరమగురుండు నాపాలిదైవంబు
గురువును నను చు సద్గురువరేణ్యునకు
ననుపమరసరీతు లలవడి యొప్పు
నొనరించె నొకకృతి సురుతరసుకృతి
నాపరాంకుశయోగి యతనితోఁ గూడి

దీపితనిర్నిద్రతింత్రిణీచ్ఛాయ
ననిశంబు శౌరిదివ్యగుణానుభవము
ననుభవింపుచును యోగైశ్వర్యలతలఁ
దా మించునై కుంతధామాఖ్యముఖ్య
ధామావృతుం డైన తామరకంటి 3520

( 199. శ్రీశఠకోపమునిపాదసేవాక్రమము. వకుళాభరణనామప్రాప్తిప్రకారము. )

శుభఫలప్రాప్తి హేతుకథనము.

సాకురంగాధీశు నాద్యనామకుని
జేకొని నుతులు చేసిన మెచ్చి యతఁడు
సొగసులు నిగుడ నాసురలెల్లఁ బొగడఁ
బొగడదం డిచ్చె నప్పుడు శఠారికిని
అదియాదిగా వకుళాభరణాఖ్య
విదితుఁ డై యయ్యోగివిభుఁడు చెన్నొందె
ననయంబు హరిపదధ్యానామృతంబు
ననుభవించుచు నమ్మహాతరుచ్ఛాయ.
యునికిగా నుండె ర య్యోగిశేఖరులు
జననుతంబైన యీచరితంబు జగతి 3530

వినినఁ జెప్పిన నుడివిన వ్రాయువారి
కెనలేనియట్టి యభీష్టంబు లొదవు
సిరులు నాయువులునుం జెడనిసంపదలుఁ
గరతలామలకంబు కైవల్యపదము
ధనధాన్యసంగతి తంగేటిజున్ను
గొనబైన ప్రాయంబు కొంగుపసిండి
యెడపక యొక్కమా టెన్నినఁ జాలు
జడునకైనను కల్గు సారస్వతంబు

( 200. కేరళదేశప్రశస్తి. [కొల్లినామక] కుక్కుటనగరవర్ణనము. )

పుడమిఁ గేరళదేశమున నొప్పుచుండుఁ

గడలిరాయనిపట్టి కల్యాణవేది 3540

యమితసౌభాగ్యంబు లలవడి మిగులఁ

గోమరొప్పు కుక్కుటకూటం బనంగఁ

బ్రాపితదివ్యసంపద నీడు రాక

యాపురంబున కోడి యమరపట్టణము

విఱిగి భూస్థలి నుండ వెఱచి దేవతల

మఱుగుఁ జొచ్చెనో దానిమహిమ యెట్టిదిరయో

( 201. తన్నగరసౌధవర్ణనము. పరిఘాస్వరూపము. దంపతికేళివర్ణనము. )

యాపట్టణంబుసౌధాగ్రంబులందుఁ

బ్రాపించుమరకతప్రభలు వీక్షించి

పాయనికూర్మిచేఁ బచ్చిక లనుచు

మేయంగ గమకించు మిహిరుగుఱ్ఱములు 3550

నరసికోటలరాసి జలరాశి యెపుడుఁ

బరిఘ యై యొప్పు నప్పట్టణంబునకు

ననుపమదివ్యరత్నాకరం బగుచు

ననిశంబు నవ్వ రత్నాకరస్ఫూర్తి

నాపురంబున గోపురాగ్రంబులందు

నేపు రెట్టింప ననేకబంధముల

నడలని యంగజసంగ్రామకేళి

బడలిన తరుణదంపతులమైఁ బొడమి

చెమరు లార్చును దేవసింధువుమీఁది

కొమరుఁదెమ్మెర లెదురొ్కని సంతతంబు 3560

వరదంతఘాతసత్త్వములనొక్కంత

హరిదంతదంతుల నడఁచుదంతులును

భువి సురంగముల నొప్పుచు గంధవాహు
నవకురంగముగతి నగుతురంగములు
నవకంబులై యమానవవిమానములఁ
బవమాను నవమానపఱచు తేరులును
బటుతరనిటలాక్షు పటుహంసరావ
పటలోగ్రనిరసనార్భటు లైన భటులు
బహుముఖంబులఁ బొరుపత్తెంబె కాని
యహరహం శోకముఖ మైయుండఁ డెపుడు 3570

రాజసుం డై యహంబ్రహ్మ నటంచు
వేజాడలను గర్వవివశుఁ డై యుండు
ననుచు నిచ్చలును దోయజసూతి లెక్క

( 202. బ్రాహ్మణక్షత్రియవైశ్యాదిమహిమ. )

గొనక నానాగమకోవిదు లగుచు
నాసురవైరిపాదాంభోజభక్తి
భాసురు లై పేర్మిఁ బరఁగుభూసురులుఁ
గలిమి గిన్నరరాజుఁ గలికిచెల్వముల
వలరాజు దానంబువలన రేరాజు
నిరతభోగంబుల నిర్జరరాజు
విరవిక్రమంబుల వనరాశిరాజు 3580

తేజంబుకలిమిని దినరాజు నగుచు
రాజిల్లుచుండెడి రాజరాజులును
ధనదుఁ డై తిరిపె మెత్తఁగఁ జూచుజంగ
మును వేఁడికొని యొక్కమూలనె యొదిగి
వెలుచుచందమునఁ గుబేరుఁ డై యుండు
నలకాధిపతి యంచు నణఁకించుచుండు
ఘనులు సౌందర్యరేఖామహోదారు
లనుపమామితధను లగువైశ్యజనులుఁ

ద్రొక్కినచోటెల్ల దున్నక పండ
దిక్కులఁ బసిఁడి విత్తినపైరు గాఁగ 3590
వివరింపఁగాఁ గొండ్ర వేలును బండ
నవనికి నేలికలై నహోలికులుఁ
జుటక్లైన దివి సోమసూర్యవీథులకు
నొట్లు దిద్దెడు సూర్యసోమవీథులును

( 203. నగరకామనీ సౌందర్యాతిశయవర్ణనము. )

నీలవర్ణుని మానినీశిరోమణికి
నాలయంబైన దేవాలయంబులును
గప్పులై యొప్పులై కళుకులై తేఁటి
చొప్పులై గొప్పులై సొగయుగొప్పులును
గళుకులై బెళుకులై కలువపూసొగ
ములుకులై తళుకులై మొనయుకన్నులును 3600

సోగలై బాగులై సొలపులై సిరుల
ప్రోగులై వాగులై పొలుచుమోములును
గావులై తావులై కండచక్కెరల
ప్రోవులై ఠీవులై పొలుచుమోవులును
గట్టులై గుట్టులై కామునిపసిఁడి
జెట్టులై చెట్టులై చెలఁగుపాలిండ్లు
జినుగులై బినుగులై సింహమధ్యముల
కనుఁగులై పెనగులై నట్టికౌనులును
గెంపులై సొంపులై కెందమ్మిచాయ
నింపులై యింపులై నిగుడుహస్తములు 3610

నినుపులై నునుపులై నెఱయుదిబ్బలకు
ననుపులై పెనుపులై యనువొందుకటులు
ననుకులై మినుకులై యపరంజిపసల

కుసుమములై మసుకములై యొప్పునూరుపులుఁ
బొలుపులై సొలపులై పూవిల్తువాలు
మెలుపులై వలపులై మించుపాదములుఁ
గలిగి మున్నెన్నఁడు గడివోకయున్న
జలజాస్త్రిమోహనాస్త్రంబులో యనఁగ
నలవిమీఱినయట్టి యంగనామణులు
నలరుదేనియల నోలాడి తుమ్మెదలు 3620

కెలకుల మలయ రాగిల్లుచెంగల్వ
కొలఁకుల రత్నంపుఁగొమ్మలపసిఁడి
కోటలుఁ బూవాన గురియుచునుండు
తోఁటలు నమృతంబు దులఁదూఁగునీటి
బావులు పాంథులబడలికల్ దీర్చు
తావులుఁ గినిసి నెట్టన సురాచార్య
కవులు వచ్చిన వారికవులెన్నుచుండు
కవులు నిచ్చలు భోరుకలఁగెడునాట్య
శాలలు వెన్నెలల్ చల్లెడు చంద్ర
శాలలు మొదలైన సకలసంపదలు 3630

( **204.** దృఢవ్రతనామక చేరవంశభూపాలప్రశస్తి. మాఘపునర్వసునక్షత్రదినములో కౌస్తుభాంశభూతకులశేఖరాఖ్యపరమయోగీశావతారక్రమము. )

గలిగి యయోధ్యసంగతి శుభస్ఫూర్తి
నలవిమీఱినయట్టి యాపట్టణమునఁ
బూర్ణరాజాన్వయములతోన మొదల
వర్ణింపఁదగు చేరవంశంబునందు
జనితుఁడై భువనప్రశస్తుఁడై యర్థి
వనచైత్రుఁడును దృఢవ్రతుఁడును నగుచు
నపరరుక్మాంగదుఁ డని త్రిలోకముల
నుపమింపఁ దగువైష్ణవోర్వీశ్వరునకు

రవివంశుఁడగు దశరథమహీపాలయు
ధవునకు రాముఁ డుద్భవమైనయట్లు 3640

నలువొందు మాఘపునర్వసుతార
జలజాక్షుకౌస్తుభాంశం బుదయించి
కులశేఖరాఖ్యఁ గైకొని దివ్యయోగి
కులశేఖరుండునాఁ గొమరు దీపించి

( 205. శ్రీరామపదపద్మభక్తివైభవము, కులశేఖరభూపరాజ్యనిర్వాహకత్వసామర్థ్యము. )

శ్రీరామపదభక్తిఁ జెంది నానాఁట
నాగూఢయావనుండై చెన్ను మిగిలి
కమఠేంద్రనాగ నాగప్రభుల్గావ
సముదయంబులమోపు సడల నింపెసఁగ
భండనప్రతిభటపరభటవీర
గండమండలకాండకాండవేదండ 3650

దండధరోద్దండదండకోదండ
దండదండనబాహుదండంబుచేత
సర్వసర్వంసహాచక్రభారంబు
నిర్వహించె నఖర్వనిర్వాహశక్తిఁ
బరులకు నాసార్వభౌముని కేలి
కరవాలవల్లి యుగ్రము గాదు తలఁపఁ
గ్రతుదానముల నశక్యంబైన దేవ
సతులపొం దప్రయాసమున నెసంగుఁ
గావున నదియునుగాక యారాజు
దేవేంద్రుదానంబు తెఱఁ గెల్ల నెఱిఁగి 3660

బలువేది తామ్రమానుపడుచుగైవ్రాలి
వెలవెలఁబాఱె నావేలుపుమ్రాను

( 206. దేవబ్రాహ్మణారాధనాదిప్రకారము. భూపాలసద్గుణప్రశంస. )
ఏకాతపత్రరాజ్యపరిపాలనవైచక్షణ్యము.

వేదవేదాంతాదివిద్యావినోది
భూదేవదేవతాపోషణపరుఁడు
రామకథాసుధారసలగ్నహృదయుఁ
డామోదభరవికచాననాంబుజుఁడు
నయవేది సత్యసంధాధురంధరుఁడు
జయశీలుఁ డధ్వరశతదీక్షితుండు
కరుణాసముద్రుండు గంభీరభావ
నిరతుండు పరకామినీసహోదరుఁడు 3670

అభినవకందర్పుఁ డతులచారిత్రుఁ
డభిమతవరదాయి యమ్మహారాజు
సకలదిక్కుల జయస్తంభముల్ నిలిపి
యకలంకవిక్రముండై ప్రతాపించి
యరయ సముద్రంబు లవధులు గాఁగ
ధరణి యేకాతపత్రముగ నేలుచును
మురవైరియవతారములయందు భక్తి
పరుఁ డయ్యె నాభూమిపతి సంతతంబు

( 207. దేవతాభక్తిపారవశ్యాదికథ. భాగవతసంమానప్రకారము. )

సీతామనోహరశ్రీపదాబ్జాత
చేతోద్విరేఫుఁడై చెన్నొందు మఱియు 3680

ధారుణి సర్వావతారంబులందు
నారయ సమభక్తుఁ డందులోపలను
సతతంబు నంజనాచలసార్వభౌమ
పతికి మిక్కిలి మేలుపడియుండునట్లు
శ్రీరంగపతిమీఁదఁ జేయుసద్భక్తి

గారవం బెసఁగ భాగవతులయందు
తోయజనాభమూర్తుల నెట్టిభక్తి
సేయు నాగతి భక్తి సేయుచునుండు
నన నేల వేయు శ్రీహరికంటె వారి
ఘనులుగాఁ జూచు హృత్కమలంబులోన 3690

నొకట వంచన లేక యుడివోనికూర్మి
సకలసంపదలు వైష్ణవులసొమ్ముగను
నెన్నుచుఁ దను వార లిడువాని గాఁగ
నెన్నుచుం దత్పూజ యేకాగ్రబుద్ధి
సేయుచు నానతిచ్చిన వాక్యసరణిఁ
ద్రోయక భాగవతులయెడాటమున
దాకొన్నప్రేమ యెంతయు నడ్డమూఁక
లేకుండఁ జేసి యేలీల నాఘనుల
నీడయపోలె నన్నిట వశుం డగుచు
నాడుపన్నటువలె నాడుచునుండుఁ 3700

( 208. కులశేఖరసూరిసద్గుణప్రశంస. )

బరికింపఁగా భక్తపరతంత్రుఁ డైన
హరియునుం బోలె నయ్యబ్ధిపరత్నంబు
ఈలీల భూచక్ర మింతయుఁ దాన
యేలుచు నుండ నయ్యెడ నొక్కనాఁడు
తిరముగా నిడు పట్టెతిరునామములును
దిరుమణిపడములుఁ దిరుచూర్ణములును
బూసఁగఁ జుట్టినయట్టి పొత్తిపాగలును
గసటులేనట్టి సీర్కావిధోవతులు
వెలఁదిజన్నిదములు విచ్చక నడుము
బలసిన వెలిపట్టుపచ్చడంబులును 3710

రవరవ తాంబూలరాగంబుతోడ
గవరనై యున్న చక్కనిదంతములును
గలిగి యాతెలిదీవిఁ గాపున్నవారు
కులశేఖరునిఁ గనుఁగొనవచ్చి రనఁగఁ
గడివోనిపన్నిటఁ గడుఁ బెక్కుమార్లు
వడులుదేరిచి మించ వాసనం గట్టి
నెలపొల్పుపస నవనీతంబుచాయ
గలిగి వెన్నెలసోగకణికలో యనఁగఁ
జెలివొందు నిడువాలు తీరుమణుల్ మిగులఁ
బొలుపొందు పెదపెద పూవ్వారు ఫళలు 3720

( 209. ద్వారపాలకనిరోధప్రస్తావము. )

వలకేలఁ గీలించి వైష్ణవోత్తములు
చలిమియు బళిమి నిచ్చలుఁ బెచ్చుపెరుగ
జంటలై యామహాజనపాట నగరు
తొంటికై వడిఁ దురఁదురఁ జొచ్చి పోవఁ
జేరువ మంత్రులచేనన్న గాంచి
వారలఁ జూచి తద్ద్వారపాలకులు
కేలిదండములు వాకిలి నడ్డగించి
నేల గుప్పన నూఁది నిలునిలుండనుచుఁ
గుదిచి మూఁపులవారుకోలలు పూన్చి
చెదర నూరక ఝళిపించి యిట్లనిరి 3730

వరుఁడు లోపల నమ్మవారిలో సంతి
పురమున నేకాంతమున నున్నవాఁడు
అవసరంబుల వారి నడుగక పతికి
నవసరం బిపు డెద్ది యని మనంబునను
అరయక యెపుడైన నపుడె లోజొచ్చి
యరిగెద రేమనియనవచ్చు మిమ్ము

(210. కులశేఖరభూపసౌలభ్యప్రశంస.)

భూపాలుఁ డతిసులభుండైన చెఱకు
తీపని వేళ్ళతోఁ దెరలింపఁ దగునే?
యాఁపితి మని యయ్యవారిచి త్తములఁ
గోపగించకుఁడు మాగొల్ల మాబలకుఁ 3740

బలుమాట లనకుఁ డుప్పవడమై రాజు
కోలువై నయపుడొ క్రక్కున వేళఁ జూచి
విచ్చేయుదురు గాన వేగిరపడక
యిచ్చటఁ గూర్చుండు డించుకతడవు
అనవుఁడు వార లహో మంచి దయ్య
యనుచు మే మవసరం బనవసరంబు
నెఱుఁగకపోయితి మింతియె మతుల
మఱియొండు వలదు ముమ్మాటికి మాకుఁ
బరమభాగవతునిభవనంబు గాచు
టరయంగఁ బ్రార్థనీయముగాదె యెపుడు 3750

నేవెఱపునైన నిసుమంతతడవు
శ్రీవైష్ణవులపంచఁ జేరంగఁ గలుగు
నని యున్నవాఁడుగదా వైష్ణవుండు
కనుఁగొన సట్టును గాదు వెండియును
బాటించి వైష్ణవపంచ నున్నట్టి
కీటంబులును ముక్తికిం బోవు నండ్రు
ఈమహాయోగీంద్రు నింటిమోసాల
నేమందఱము వసియించియుండెదము

(211. జన్మభాగ్యప్రశంస.)

ఇంతకంటెను భాగ్య మెయ్యెది యనుచు
సంతసం బొదవ హజారంబుమీఁద 3760

విచ్చేసియుండి రావృత్తాంత మెల్ల
నచ్చట నవసరం బరయుచేడియలు
ఇరవొంద నీకార్య మెఱిఁగింపకున్న
వరునిచే వడి నాజ్ఞవచ్చుఁ బొమ్మనుచు
నుదిరి కొందలమంది యొక్కరిఁ బట్ట
పదుగురు నగరిలోపలి కేగుదెంచి
తొలుకారుమెఱుఁగులం దులఁదూఁగుపసిఁడి
గొలుసులతోఁడఁ గీల్కొని చెన్నుమిగిలి
బవరిగాఁదరవణిం బట్టినమెఱుఁగు
బవడంపుఁగోళ్ళడాపల రువారముగ 3770
ములుకుగొంపులవంకముక్కులపచ్చ
చిలుకలగములు రంజిలి చుట్టువార
నిగుడి వెన్నెలతేఁట నెఱపుముత్తియపు
మొగడల వైడూర్యముల వెలుగడలఁ
గ్రిక్కిఱియుంగ మిక్కిలివింతవగలఁ
జెక్కినరత్నంపుచీర్ణంపుపనుల
నురుతరం బగుతూఁగుటుయ్యేలమీఁదఁ
బఱపుగల్గినపట్టుపఱపు నిండార
మంచుతో సరిపోలుమణుఁ గచ్చుళించి
మంచిపన్నీటికమ్మనివిరుల్ రాల్చి 3780

( 212. రమణీయస్వరూపవర్ణనము. )

నలినాస్త్రసింహాసనంబునందమునఁ
జెలువొందు నాపుష్పసెజ్జమీఁదటను
రాజీవనాళనూత్రముచుట్టుకొన్న
రాజహంసముభాతి రాజసం బెసఁగ
విన్నెటికాలువ వింతగాఁజుట్టు
కొన్న హేమాచలకూటమో యనఁగఁ

గొనబైన వెలితాళిగోణంబుతోడఁ
గనుపట్టి నవరత్నఖచిత మైనట్టి
మురువైన మొగపులమొలనూలివింత
మెఱుఁగులు నలుదెస మిసమిసల్ గొలువ 3790

లీలఁ గ్రొంబచ్చతాళియుఁ బదకంబుఁ
బీలి డెందముమీఁదఁ బేరెములాడఁ
దెలివొందు నొంటిముత్తియపువెన్నెలలు
వెలఁదినవ్వులతోడ వీడుజోడాడ
మగతుమ్మెదలచెక్కుమబ్బులనెఱులఁ
జిగురులు వెడలఁ గీల్చినకొప్పులోన
సరవిరిబాగుగా సరవిరుల్దుఱిమి
యరచందురునికి విందైసనెన్నొసల
సన్నపురేఖమంజలికాపుతోడఁ
దిన్ననితెలిగీరుతిరునామ మలరఁ 3800

జాకొన్న మించుపుత్తడిసరపణులు
డాకేలిమీఁద బిటారంబు నెఱప
మురువైన యపరంజిముద్దుటుంగరము
మెఱుఁగులు మోముదమ్మికి సరిగొలుప
మదదంతికటముల మదధార లెసఁగు
చదురునం బెక్కులజవ్వాది జాఱ
నెరయఁ గుంకుమపువ్వు నించినమలగు
టొరగుపై నొయ్యారమొలయంగ నొరగి
కంకణధగధగల్ గడలుకొనంగఁ
గుంకుమగుబ్బలకువలయేక్షణలు 3810

తావులకొండనెత్తావివీవలులు
వీవ వీవన లొయ్య వీవ నాసెంతఁ

బిన్నాణమైన ముప్పిడిహాడపంబు
కన్నుల కల్కియొక్కతె దాల్చియొప్ప
నిలుకడయొరపువన్నియమీఱ నొక్క
చిలుకలకొలికి కుంచియ వైచుచుండఁ
దలచుట్టుగన్నులతళుకుసిబ్బెముల
కలికిగుబ్బెత లూడిగంబులు సేయ
జనకయోగీంద్రునిసరవిఁ జెన్నొందు
జననాథుఁ గాంచి యాంజలజలోచనలు 3820

( 213. భాగవతోత్తమాగమనవృత్తాంతము. )

దేవ ! భాగవతు లేతేర మొగసాల
కావలివార లక్కడివారిఁ జూచి
భూవరుఁ డిపు డంతపురములో నుండఁ
బోవరా దన ద్వారమున నిల్చినార
లీవార్తవేవేగ నెఱిఁగింపకున్న
దేవరచిత్తమే తెఱఁగో యటంచు
విన్నకన్నది గాన విన్నవించితిమి
యన్న రాజేంద్రుఁ డయ్యన్నలఁ జూచి
యనిరుద్ధులైనట్టి యనిరుద్ధభక్త
జనులకు నడ్డ మెచ్చటనైనఁ గలదె 3830

యడ్డ మెన్నఁడు లేని హరిదాసవరుల
నడ్డగించుట యెట్టులని కోపగించి
యుంకించి యప్పు డయ్యోగపరిపుష్పు
కంకటిమీఁదు దిగ్గన డిగ్గనుఱికి
గోణంబుతోనె మిక్కుటపువేగమున
వీణముఁ గట్టక వెలఁదు లమర్చు
పావలు దొడుగక పదనూపురంబు

రావంబు లడర వారణరాజయాన
యొదవెడుకై దండ యొల్లక జాతి
కోదమసింగంబు బోగున వడి నీకె 3840

బలిమి నొక్కతె కూడఁ జనుదెంచి చలువ
వలిపెంపుదుప్పటి వలెవాటు వైవ

( 214. సత్కారరచనాక్రమము. అపరాధక్షాపణప్రార్థన. ఆశీర్వాదప్రకారము. )

నరుదెంచి మోసలయరుఁగుమై నున్న
పరమవైష్ణవుల శ్రీపాదపద్మముల
వ్రాలి యానందాశ్రువారిపూరములు
వాలుగన్నుల తినిండివడియ సందంద
సర్వాపరాధముల్ క్షమియింపుఁ డనుచుఁ
బర్వినభక్తిమైఁ బ్రణతులొసర్పఁ
గులశేఖరుని నెత్తుకొని కౌఁగిలించి
పలుమఱుఁ బొగడి యాపరమపావనులు 3850

సొలయక "శ్రీనివాసోరక్ష" తనుచు
నెలమిఁ జేకానుక లిచ్చి రిచ్చుటయుఁ
జేకొని యారాజసింహుఁ డవ్వేళ
వాకిట నున్నకావలివారిఁ జూచి

( 215. భూపాలాజ్ఞాప్రకారకథనము. పరిచర్యాప్రకారము. )

యెట్టురా వైష్ణవు లేతెరనడ్డ
పెట్టకుండని మిమ్ముఁబిల్చి చెప్పితిని
జెప్పిన నాయాజ్ఞ సేయక మీర
లిప్పు డీగతి సేయు నెట్లు భీతిలక
యిమ్మెయి నెవ్వరే నెసకొల్పి నేఁడు
మిమ్ముఁజెయించిరో మీరె చేసితిరో 3860

యిచ్చలో నాయాజ్ఞ యెఱిఁగియు మీఱి
వచ్చునే కండగర్వము పొట్టక్రొవ్వా
యని తిట్టి పట్టుకొమ్మని కోపగింపఁ
గని సర్వమీశ్వరగాత్రంబు గాఁగ
నకలంకమతిఁ జూచుహరిభక్తవర్యు
లొకరియాపదఁ జూడనోపరు గాన
సరగున నెడఁజొచ్చి జనకులోత్తంసు
కరములు దెమలించి కరుణాద్రై వాఱఁ
జేకొని మామాటఁ జేసి యీవేళ
మాకుగా నీతప్పు మన్నింపవలయు 3870

( 216. ఆనందానుభవప్రకారము. )

నని వారలకడ్డ మాడంగ లేక
జననాథుఁ డాయనుచరుల మన్నించి
గురుభక్తి వారిఁ దోకొనిపోయి యంతి
పురములో మణిపీఠములయందు నునిచి
యతులవస్తువుల నాహారిపదాసక్త
మతులసమ్మతుల సమర్పించి యతఁడు
నానందజలధి నోలాడుచున్నంత
మానవాధీశ్వరు మంత్రివర్గంబు
మనుజాధినాథుసమ్మతి వేళ యరసి
చనువుమీఱంగ నచ్చటి కేగుదెంచి 3880

కరములు మొగిచి చంకలఁ జేతు లిడుచు
వరుసనొండొరులు క్రేవల కేగుదెంచి
యొలయ రెంటెపుఁగొంగు లోకకేల నదిమి
వలకేలిదమ్ముల వాతెఱలాపి
యీమొడం గదిసి చయ్యన విన్నపంబు
నేయంగఁ జెవిఁ జేరఁ జేరభూవిభుఁడు

నేల కొంకెదరు మీ రిప్పు డేకాంత
మేల యిచ్చటఁ బరు లెవ్వ రున్నారు
తప్పక యెఱిఁగింపఁదగినకార్యంబుఁ
జెప్పుఁడా యనవుడు క్షితిపాలుఁ జూచి 3890

వెఱచి విన్నపముఁ గావింతుమో లేక
వెఱవ కిప్పుడు విన్నవింతుమో మీర
లైన నోడకుఁ డని యానతిచ్చితిరి
కానఁ దెల్పెదము తత్క్రమమెట్టి దనిన

( 217. రాజ్యకార్యనిర్వహణప్రశంస. )

నేకొఱంతయు లేక యీధరాచక్ర
మేకచక్రంబుగా నేలుభూపతివి
బొక్కసభండారములు వానిలెక్క-
పొక్కలు మఱియు మున్నగనగరికిని
నిలువ పూజ్యముగ మన్నీలు చెల్లింప
వలసిననిల్వ సల్వాలు విరాఢములు 3900

సరవి గానుక దేవసంబు ధాన్యంబు
వరసియు గాది దిపావళు లందు
పగిదిఁ జెల్లించు నప్పగిది రాహుతుల
నగరిబంటులజీతనాతంబు లేలు
కరుల గుఱ్ఱముల దుర్గపుసపరణాలఁ
బరివారముల భూమిపతుల పౌంజులను
నగపడి రాణువయందుఁ బాలింపఁ
దగునట్టి రాజకృత్యము లొక్కనాఁడు
నేవిధి సమకూడు నెట్లుండు ననుచు
దేవర పారుపత్తెము సేయవలదె 3910

కడునెచ్చరిక గలకాలంబు పాటు
వడి సేయు తమదైనపారుపత్యంబు
భూనాథ మీ రలవోకఁ గావించు
నానతిం బోల దెంతైనఁ జర్చింప
నిందుల కనుట గా దేవనికైన
నిందఱ ముండి తామేలని యాజ్ఞ
వదల మన్నియును దేవరప్రతాపమునఁ
గొదలేక తముదామె కొనసాగివచ్చు
రాజవై దేవర రాజచిహ్నముల
నోజమై క్రమమున నొకకొంతతడవు 3920

( 218. రామాయణశ్రవణాదిసత్కార్యరచనావర్ణనము. )

నామతీర్థము రామనామసంస్మరణ
మామీఁద హరిపూజ యదికొంతతడవు
సంతట శ్రీవైష్ణవానుభాషణము
లంత నారోగణ మైనమీఁదటను
నకలంకరామాయణాదిసంశ్రవణ
మొకకొంతతడవుమై నుచితకృత్యములు
నలుపుచు సకలరాజ్యంబు పాలింప
వలయుఁగా కిటు సదావైష్ణవు లనుచు
వారును మీరు నీవడువుననున్న
నీరసాతలచక్ర మీడేరు టెట్లు 3930

రావయ్య తుదిని సర్వజ్ఞుండవైన
యీవెఱుంగనికార్య మే మెఱుంగుదుమె
చేసేత మా తెలిసినవిన్నపంబు
చేసితి మింక మీచిత్తంబుకొలఁది
తరవాత నినుఁ గన్నతండ్రి యేమనునొ

గురిగా విచారించుకొమ్మని యనిన
సెలవియ్యఁ జెలునవ్వు చిగురొత్తుచుండఁ
బలికె శ్రీవైష్ణవపారిజాతంబు
వినుఁడు మీ రిటు పదివేలు చెప్పినను
వినఁగూడునే నాకు వివరించిచూడ 3940

( 219. శ్రీరామభక్తిప్రభావప్రశంస. )

జనని జానకి రామచంద్రుండు జనకుఁ
డనుపమబంధువు లతనికింకరులు
ఘనరాజ్యభోగంబు కామితార్థంబు
ధనము సర్వము నాకుఁ దత్పాదసేవ
యందుఁ జిక్కినహృదయం బితరంబు
నందుఁ జిక్కదుమీర లవివేకమతులు
పరమభాగవతసంభావణారుచులు
మరగినవాఁ డేల మరగు నన్యంబు
లెంచిచూడక మీర లీఁక నింతనుండి
మించిచెప్పిన మీకు మీ రెఱుంగుదురు 3950

అనిన భీతిల్లి "హాసా" యని మంత్రులెల్ల
వెనువెనుకకె వచ్చి వెలవెలం బారి
జననాథుకోపంబు సైరింపలేక
చనిరి గ్రక్కున మొగసాలవాకిటికి
నావసుధేశ్వరుం డనిశంబు నిట్లు
శ్రీవైష్ణవులఁ గూడి చెన్నగలించి
యీరీతి మఱియు ననేకకాలంబు
వారక యలభాగవతు లిచ్చగించి
యడిగినవెల్ల లేదనక సంప్రీతి
నుడుగక యిచ్చుచునుండి యొక్కఁడను 3960

( 220. శ్రీకులశేఖరనృపతిభూషణాలంకారరచనాక్రమము. )

బిరుదమంజీరశోభితపద్మాబ్జుండు
సరసకుంకుమగంధచర్చితాంగుండు
వరహారకంకణోజ్జ్వలభూషణుండు
పరిమళకుసుమసంభరితచూడుండు
మకరకుండలదీప్తిమండితాననుఁడు
సకలమాణిక్యచంచత్కిరీటుండు
ధవళోర్ధ్వపుండ్రసంద ల్లలాటుండు
నవిరళరత్నమయాంగుళీయకుఁడు
సురుచిరచిత్రకౌసుంభాంబరుండు
కరధృతశత్రుభీకరకృపాణుండు 3970

నగణితపరిచారకౌఘసంవృతుఁడు
నగుచు సభామంటపాంతరస్థలికిఁ
జనుదెంచి రిపుమూర్తిసంవృతరాజ
దనుపమసింహాసనాసీనుఁ డగుచు
జలజాప్తుఁ డుదయాద్రిచక్కిఁ జూపట్టు
నలువున భద్రాసనమునఁ జూపట్టె
నొకచోట రాజన్య లోకచక్కి మంత్రు
లొకదెస విద్వాంసు కాకయొడఁ గవులు
నొకవంక గాయకు లొకచాయ మిత్రు
లొకభాగమున నటు లొకపార్శ్వసీమ 3980

( 221. భూపాలసభామంటపప్రవేశప్రస్తావము. )

సుకుమారు లగు చేరచోళపాండ్యులును
నొకదిక్కునను సారసోత్పలేక్షణలు
సకలదేశాధీశజనము సేవింప
నకలంకవికచాననాంబుజ మలర

నమరేంద్రగురునయం బనయంబుఁ దెగడఁ
గమగించుమంత్రివర్గం బొకచాయఁ
గొలువఁ గట్టుకవారు కొమరుదీపింప
బలువిడి వడి బరాబరి సేయుచుండఁ
నెలమి భూనాథులు హేమదామకళల
జళిపించు మించువింజామర లిడఁగఁ 3990

బలుతెలుంగుల సార్వభౌములు చల్ల
వలుపులు చల్లువీవనలు వీవంగ
నిద్ధవైభవముల నిరుమేల పట్ట
బద్ధు లూడిగములు పట్టి కొల్వంగ
జలశేఖరాదు లాశ్చర్యంబు నొందఁ
గులశేఖరుం డిట్లు కొలువున్నతఱిని

( 222. భాగవతోత్తమస్వరూపశీలాది. ఉత్తమపురుషసత్కారక్రమము. )

శ్రీమదష్టాక్షర శ్రీరాజ్యసార్వ
భౌములు నధిగతపరమార్థు లర్థ
కామానపేక్షులు గతదోషమతులు
ధీమంతులును గతదేవతాంతరులు 4000

జగతేకబంధువుల్ సత్త్వసంపన్ను
లగణితకరుణాఢ్యు లమృతభాషణులు
నపగతమదమాను లచ్యుతధ్యాను
లపగతఖేదులు నగుభాగవతులు
అతిమోదమున ద్రావిడాగమజాత
చతురార్థముల ననుసంధించిగొన్నచుఁ
బారతంత్ర్యము స్వరూపము శేషతయును
గారవంబుగ నలంకారంబు గాఁగ

వేంచేసి రప్పుడు విభుఁ డున్నకడకు
వేంచేయ నప్పు డవ్విభువరేణ్యుఁడును 4010
గద్దియ డిగి వేడ్కకడలి నోలాడి
తద్దయుం గూర్మి పాదంబుల కెరఁగి
యుచితాసనంబుల నునిచి సద్భక్తి
నుచితాసనస్థుఁడై యుండె నామీఁద

( 223. మాధ్యాహ్నవేళకార్యసేవనప్రస్తావము. )

మానవేశ్వరుఁడు వే మధ్యాహ్నవేళ
యైన మజ్జనమున కాయత్తమనుచు
జలకము వార లెచ్చరికఁ గావింపఁ
గొలువువారలఁ గనుంగొని యాదరమున
దొరల మన్నీల నాప్తుల బంధు మంత్రి
వరులఁ దక్కినయట్టివారి వేర్వేఱఁ 4020
గనుసన్నఁ గొందఱఁ గై సన్నఁ గొంద
అను శిరమునఁ గొందఱను దీని మెఱయ
సరగున నిజనివాసములకు ననిచి
పరమవైష్ణవులతో భాషించుతఱిని
నుడిగంబు వారిచే నొసఁగంగ మఱచి
తొడవులు సడలించి తోయంబు గాఁగ
నెట్టనం గొలువున్న నిజపీఠియందుఁ
బెట్టి వేఱొక హేమపీఠంబునందు
విమలమై నిండారు వెన్నెలసోగ
కొమరుమించినతాళిగోణంబుతోడ 4030

( 224. రాజకార్యాచరణాది. )

నాసీనుఁడై పిల్వ మనినంతలోనె
భాసురగై రిక పర్వతాగ్రముల

గోడాడి యేతెంచుకుంజరయుగము
జూడ నొప్పుచు నున్న జగజెట్టి లోకట
నానతి నిజమూర్తులై యేగుదెంచి
భూనాథుఁ డోసఁగెడుభుజశాఖ లంది
పెనువ్రేలిసంధులఁ బెనువ్రేలిసంధు
లెనయించి కేలిమై యింపుమై బిగిసి
నివురుచు సొగసుగా నెటుకలు విఱిచి
సవరగాఁ జేపరుసనమించకుండ 4040

జవ్వాది మెఱుఁగుహస్తముల డాలించి
యువ్వాళుగా నూర్పు లోసరింపుచును
భూమీశ్వరున కింపు పుట్ట నేర్పునను
మై మర్దనంబు వేమఱు నొనర్చుటయు

( 275. శ్రీవైష్ణవసత్కారప్రకారము. )

నచ్చటి శ్రీవైష్ణవాళి నీక్షించి
విచ్చేయుఁ డని విన్నవించి యారాజు
పాదుక లొసపరి బాగుగా మెట్టి
కై దండ యొకపద్మగంధి గావింప
సరవిమై మజ్జనశాల చెంగటికి
నరిగె నంతట మల్లు లరిగి రిండులకు 4050

నక్కడనున్నట్టి యాభరణములు
బొక్కసంబులవారు పోలించి చూచి
యీయెడ భూనాథుఁ డేటికిం బెట్టి
పోయెనో యనుమతంబునఁ గాని తమకుఁ
బట్టరా దని భయపడి యోగిరతని
కట్టడ నెఱిఁగి యక్కడనుండ వెఱచి
తదనంతరమున నద్ధరణీశ్వరునకు

నాదవు వేడుక నాకానాకవిన్నపంబుఁ
గావింతుమని దైవికంబున మంత్రు
లావేళ వచ్చుచు నచ్చోటనున్న 4060

( 226. సత్కార్యవిషయకదురాలోచనాది. )

సొమ్ములు చూచి యాచుట్టు నొండొరుల
త్రిమ్మట లేనియత్తెఱఁగు వీక్షించి
యేకాంత మయ్యెఁబో యీవేళ మనకు
భూకాంతు వేడబంబుల నోసరింప
వసుధేశునకు వైష్ణవభ్రాంతిపట్టి
వసుధరాజ్యంబు నెవ్వరి సడ్డఁ గొనఁడు
మన మెంతచెప్పిన మనమాట విభుఁడు
వినఁడు నిత్యంబు నీ వెఱ్ఱిదాసరులు
గడుసు లేమియు నెఱుంగనిరాజు చెవులఁ
బుడుకలు విఱచి రేపునుమాపు వచ్చి 4070
బాధించి యింటిలోపలివెల్ల మరులు
బోధించి వెరఁజి కొంపోవుచున్నారు
వీరి నేమనినను విభుచిత్తమునకు
దూరమయ్యెదము కాంతుని నంటిమేని
యతనిచిత్తంబురా దైన నింకొక్క
గతియొప్ప మన మెఱుఁగనిరీతి నిచటఁ
దొడవులు డాఁచి యీధూర్తులమీఁద
నడిపైచి విభునకు శతముఁ బుట్టింప
వారికి ధారుణీశ్వరునకు మఱియుఁ
జేర దీచందంబు చేసినఁగాని 4080

( 227. రాజభూషణచౌర్యరీతివర్ణనము. )

విఱుగడు వారిపై విభువరేణ్యునకు
మఱి రారు వారు నమ్మనుజేశుకడకు

ననుచుఁ బ్రమాణంబు లన్యోన్యమప్పు
డొనరించి యచ్చోట నున్నభూమలను
గైకొని పోయి బొక్కసములవారి
కీకార్య మంతయు నెఱిఁగించి వారి
నామెడఁ దమసేయునటువంటిబాస
సేయించుకొని వారిచే దాఁప నిచ్చి
యఱిమురి విభుఁ డెంతయడిగిన నేమ
రెఱిఁగింపు మనక మీ రెఱిఁగింపవలదు 4090

అనిసమకట్టి వారటు వాసి చనిన
జననాథ భాండికజనము చింతించి
జననాథునకు నెంతచనవరు లైనఁ
జన దమాత్యులవాక్య సరణులు మీఱఁ
గడఁగి మీఱిన నెన్నిగతులను లేని
సడివైచి నృపునకుఁ జౌకపుట్టించి
గొనకొని వడి గుంట గూల్చినదనకఁ
గనుమూయ రెటో దైవగతిఁ జూచికొనుట
యనుచుండి రట మంత్రు లావాసమునకుఁ
జనిరి డెందముల నుత్సాహంబు లొదవ 4100

( 228. దుష్టరాజసేవకవిజ్ఞాపనక్రమము. )

జననాథుఁ డంత మజ్జనభోజనాదు
లొనరించి నగరిలో నొకకొంతతడవు
పవళించియుండి యుప్పవడమై చెంత
నవసరంబులవార లపుడు కొల్వునకు
వేళ యయ్యె నటంచు విన్నవించుటయు
నోలగం బొనరింప నుద్యుక్తుఁ డగుచు
కొలఁది మీఱినయట్టి కొలువుకూటమునఁ
గొలుతఁ దా నిడినట్టితొడవులు దలఁచి

కవగూడి యప్పు డూడిగంబులు సేయఁ
దివురు బ్రెద్దలప్రోడ తెఱవలఁ జూచి 4110

కొలువుకూటంటులో గొప్పసింగములు
దళుకొత్తుచంద్రకాంతంపుఁగంభంబు
చాటున మించుపచ్చలకాళ్ళపలక
పీఁటపై సొమ్ములు పెట్టి వచ్చితిని

( ౬29. ఆభరణవిషయకప్రశ్నాది. )

తెమ్మన్న వార లేతెంచి వేవేగ
నమ్మహీపతి చెప్పినట్టిచందమున
నరయ నాభరణంబు లచట లేకున్నఁ
దిరిగి రాజునకు నత్తెఱఁ గెఱిఁగింప
వెఱఁగును గోపంబు పిడుజోడాడ
మఱియు వారలఁ జూచి మనుజేశుఁ డనియె 4120

లేకుండు టెట్లు తాలిమితోడ నరిగి
వాకిటఁ గాపున్నవారల నరసి
యాచెంత నేఁ జెప్పినట్టిచోఁ జక్కఁ
జూచితిరో లేదొ చూడుఁ డీమాబు
కప్పినముదిమిచేఁ గన్నులపొరలు
గప్పెనో భ్రమసి యెక్కడఁ గానలేరు
యనుఁడు కట్టికవార లనయంబు బెగడి
చని పీఁటమీఁద నాసందుగొందులను
నరసి వాకిటివారి నచటిహెగ్గళ్ళఁ
బరిచారకులఁ బెక్కుభంగుల నడిగి 4130

వెదకి కానక ధరావిభునిచెంగటికిఁ
గొదుకుచు నరిగి వాక్రువ్వ నోడుచును

( 230. పరిజనవిజ్ఞాపనక్రమము. )

జనవు నెయ్యంబు విశ్వాసంబు లోకటఁ
బెనఁగొనఁ బలికిరి పృథ్వీశ! యేము
నేవిధి మీ రానతిచ్చితి రట్ల
యావరపీఠంబునందు నాచెంతఁ
బదివేలతెఱఁగుల భావించి యేము
వెదకెడులాగుల వెదకిచూచితిమి
ఎడపక నచ్చోటిపెగ్గళ్ళఁ బరుల
నడిగెడుచందాన నడిగిచూచితిమి 4140

దేవర తెలియు టింతియుకాని తమకు
భావింప వానిపోవడి కానఁబడదు
అవి తాము పోడఁగాన మని యెట్టిబాస
సవరింపు మనినను సవరింతు మనిన
నీవిధిఁ దనసొమ్ము లింటిలోపలివి
పోవు టెట్లని మనంబునఁ బలుమాఱుఁ

( 231. మంత్రిప్రముఖవిచారణక్రమము. నిజరాజ్యపైభయప్రశంస. )

గనలుచుం బేరోలగమున కేతెంచి
తనమంత్రివరుల నందఱఁ బిలిపించి
జననాయకులుఁ బరిచరులు బాంధవులు
వినుచుండఁ బలికె సవిస్మయుం డగుచు 4150

వింటిరే యొకయింత వింత నాయాజ్ఞ
గెంటిపోవక మెలఁగెడుమంత్రులార!
కొలువులోపల నిడికొన్న నాతొడవు
లిల పచ్చగద్దియ నిడి లోని కరుగ
మనమున భయ మింత మాని చోరకులు
గొనిపోయిరఁట యిట్టిక్రొత్తలుం గలవె?

జానకీవిభు రామచంద్రునికృపను
మానితసామ్రాజ్యమండలం బెల్ల
బోకమై నొకచోటఁ జోరశబ్దంబు
లేకుండునట్టు లేలినయట్టితనదు 4160

నట్టింట సింహాసనముమీఁద రేన
పెట్టినసొమ్ములు పెఱదొంగ వచ్చి
యిట్టికై కొనిపోవు టేరీతి రచ్చ
కొట్టమె నాయున్నకొలువుకూటంబు
ఇక్కడ నాయింట నీరీతి యైన
దిక్కుల నెట్లు వర్తిలు మదీయాజ్ఞ
నయ వేదు లని మిమ్ము నమ్మితిఁ గాని
భయమేది మీర లివ్వగిది దుర్నీతి

( 232. స్వామిద్రోహపాపాది. )

మొదల స్వామిద్రోహమున కొడిఁగట్టి
యెదురమి త్కెఱుఁగమి నెఱుఁగ లేనైతిఁ 4170

బదిలంబు గాఁగ లోపలను వెల్పలను
మెదలెడువారి నెమ్మయి విచారించి
యీక్షణంబున దొంగ నిట పట్టితెచ్చి
శిక్షించి సొమ్ముఁ దెచ్చినఁ గాని మొగముఁ
జూడ రాఘవునాన సారిది మీయాట
లాడింతుఁ దెలసికొం డంతరంగముల
మఱి యెవ్వ రిచటఁ ద్రిమ్మరెడు రారు మీర
లెఱుఁగ కాసొమ్ము దా నెందుఁ బోవచ్చు

( 233: మంత్రివిజ్ఞాపనాదిప్రస్తావము. )

ననుచు నాగ్రహవృత్తి నాడువాక్యములు
విని యమాత్యులు ధైర్యవివశులై యనిరి 4180

ఈపదువున నానతిచ్చిన నన్యు
లావల మఱియడ్డ మాడంగఁ గలరె
యీయెడ మీ రానతీఁగ విన్నపము
సేయ కుండఁగరాదు చేసితిమేని
స్వామిచిత్తమున నేనరవిస్మె నుండు
నో మాకుఁ దెలియబు నుడివెద మైనఁ
దరతరంబులను బ్రాంతరికంబు గలుగఁ
గర మర్థి హితవు సక్కజియునుం బొదలఁ
దేరు పెంపులు పెట్టిబిడ్డలై నిన్నుఁ
జేరి సమంచిత శ్రీలఁ బెంపొ ది 4190

తుదిని సమ్మోళిగెతొండ లై యుండి
బ్రతుకంగఁ గోరునీపరిచారజనులె
యీవిధంబుల ద్రోహ మేల సేసెదరు ?
ఈవిధి మీ రానతిచ్చినయట్టి
యానతి కే మడ్డ మాడంగ లేము
కాని నీలెంకలు కల్లరుల్ గారు
ము న్నింటనుండియు మొఱ పెట్టి పెట్టి
విన్నవింపమె నీకు వేయుభంగులను
జేసితి మానుఁదోఁచినవిన్నపంబు
జేసినమీఁద నోక్షితినాథ యాజ్ఞ 4200

( 234. చౌర్యానోపాగోపణప్రకారవర్ణనము. )

పెట్టిన మేలు తప్పిదముగాఁ గొనక
నెట్టన మమ్ము మన్నించిన మేలు
నీకు లోకములోని నృపులకుఁ బోలె
వాకిటికావలివారికట్టడయొ
యొకమంత్రియాజ్ఞయో యొకయవసరమొ
యొకరాజసమొ యొద్దియును నొల్ల వెప్పుడు

నెట్టన నొసలిపై నెరయు నామంబు
పెట్టినవారెల్లఁ బెద్దల మనుచుఁ
బదివేవు రొకట లోపలికి వెల్పలికి
నుదయాస్తమయము లం దొక్కచందమున  4210

వచ్చువారలు పోవువారలు నగుచు
నిచ్చలు నగరిలోనికి నేగుదెంచి
యీరీతిఁ జరియింతు రీమూఁకలోన
నేరిఁ జోరకు లని యేర్చిపట్టెదము
వారుదక్కఁగ మనవారికి సొమ్ము
కోరికై కొన నెన్నిగుండెలు గలవు ?
వినుమయ్య యిఁకఁ బదివేలు నేమిటికి
జననాథవర్య ! వైష్ణవులుదక్కంగఁ
జెఱవార లవి కనుపెట్టి కైకొనఁగ
వెఱతురు తుదిఁ బదివేలు చెప్పినను  4220
అని యమాత్యులు పల్కునట్టివాక్యములు

( 235. శ్రీవైష్ణవాపవాదాసహిష్ణుత్వశైలీవర్ణనము. )

విని రాజు చెవులకు వేఁడియైయున్న
జానకీపతి ! రామచంద్ర ! యటంచు
వీనుల హస్తారవిందము ల్చేర్చి
యాచందమున వార లాడినతెఱఁగుఁ
జూచి పోసీక రాజుల చక్రవర్తి
కడుఘోరమైన యీకష్టవాక్యములు
నుడువంగ మీకు నీనోళు లెట్లాడె

( 236. శ్రీవైష్ణవస్వాభావికమహిమ. )

శ్రీవిభోరుని నింద సేయు పాపంబు
శ్రీవైష్ణవుల నుతి సేసిన నుడుగు  4230

శ్రీవైష్ణవుల నింద సేసినదోష
మేనిధిఁ బాయు మీ రేమిసేయుదురు
కలుషాలవాలసంగతలతాజిహ్వా
లలవరించినబ్రహ్మ ననుటయెకాన
యనుచు నాగ్రహవృత్తి నంతటఁ బోక
మనుజేశుఁ డనియె నమ్మంత్రివర్యులకు

(237. శ్రీవైష్ణవాపరాధిజనదండనాదిప్రస్తావము.)

శ్రీవైష్ణవుల నింద సేసినమిమ్ము
వేవేగ నాజ్ఞఁ గావించుటే నయము
పదరి యిప్పుడు మిముఁ బట్టి శిక్షింపఁ
దుదలేనియీజగత్తులు నన్నుఁ జూచి 4240
తనకు నిష్టము సేయఁ దలఁచినయట్టి
తనవారిఁ జంపించె ధరణీశుఁ డంద్రు
తొడింబడ నిదియనందుగ వారిమీఁద
సడి వైనఁ జూతురు చపలమానసులు
కావున నారీతిఁ గాక లోకైక

(238. శ్రీవైష్ణవనిరుపమమాహాత్మ్యాదికథనము.)

పావను లిర్జితాపారకల్మషులు
నపగతమదమాను లంత్యమోహాయు
లపరిమితజ్ఞాను లమరసన్నుతులు
రామచంద్రాయత్తరతులు నన్నేబు
స్వాములు నైన వైష్ణవులు చోరకులు 4250
గారని యే బాసఁ గావింతు నిపుడు
శ్రీరమావిభుఁడు సాక్షిగ నొండు నేల
జగదేకనాయక జానకీదేవి
జగదేకనాథుండు జానకీవిభుఁడు

పురుడింప నుభయవిభూతులు వార
లిరుపురిగతి గడియించి గా రరయ
వారినందనులు శ్రీవైష్ణవు లెల్ల
వారిపదార్థముల్ వారు గైకొనిన
వారిఁ జోరకు లనవచ్చునే మీఁకు
నూరక పలుమాఱు నుచితంబు దక్కఁ 4260

( 239. శ్రీకులశేఖరభూపప్రతిజ్ఞాప్రకారము. )

యది విచారించిన నాగమాంతముల
విదితమై మునులచే వెలయునర్థంబు
ధీరత నొండుప్రతిజ్ఞ చేసెదను
పారమార్థము గనిపట్టిన వినుఁడు
పరవధూ పరధన పరనింద లొల్ల
రలయుంగఁ గలరోన నైన వైష్ణవులు
పదివేలు మీఁతోడఁ బలుకంగ నేలఁ
ద్రిదశు లచ్చెరు వంద దివి భువి క్రిందఁ

( 240. క్రూరసర్పయుతకుంభప్రతిజ్ఞావైఖరి. )

గోరి వైష్ణవచోరకుండు లేఁ డనుచుఁ
గ్రూరసర్పంబు నారూఢిఁ బట్టెదను 4270
లేనిసిగ్గెంబు లేలిక నాఁడబంబు
వానికిఁ రా నిచ్చి వారించు టొప్పు.
స్వాములు తనకు శ్రీవైష్ణవులెల్ల
నామహాత్మునిబంట నైనట్టివాఁను
వారలపై నపవాద మింతయును
వారింతు నేనని వసుమతీవిభుఁడు
పన్ని నే వారలపై నిందఁ దీర్ప
కున్న స్వామిద్రోహ మొదవెడు ననుచుఁ

( 241. కుంభస్థితక్రూరసర్పవిషపరీక్షాక్రమము. )

కుంభమధ్యమునఁ గర్కోటకనామ
కుంభీనసము నిడుకొని తెం డటంచు 4280

నెట్టనం దెప్పించి నిశ్చలవృత్తిఁ
జుట్టాలు మంత్రులు సుతులు చారికులు
ననుచరు లినమృగాంకాన్వయుల్ పౌర
జనులు చూడఁగఁ గృతస్నానుఁడై వచ్చి
వెనక వింటిమి మేము విని మని యనక
వినుఁడు స్వప్రతిన భావించి కన్గొనుఁడు
పంచాస్త్రగురుపాదభక్తు లీసొమ్ము
పంచిపంచి కైకొన్నవారలు గారు
శౌరిసాక్షిగను వైష్ణవులు చోరకులు
కారు ముమ్మాటికిం గారు కా రనుచుఁ 4290

ద్విజగంబు లెఱుఁగఁ దద్దివ్యకుంభమున
భుజగంబుతోడ మున్పుగఁ బెట్టియున్న

( 242. శ్రీరామప్రత్యక్షవైఖరివర్ణనము. )

హేమపుఘుటికఁ దా నెత్తె నెత్తుటయు
శ్రీమనోహారి యాశ్రితవత్సలుండు
రంగనాయకుఁడు శ్రీరఘుకులాన్వయుని
సంగతి మరకతశ్యామవిగ్రహము
నేర్చినయమ్మును నెడవెన్నచాయఁ
జేర్చినపసిఁడిపింజియయంపపొదలు
వేదండశుండంబు విరసంబులౌడు
కోదండ మూఁతగాఁ గొన్న కెంగేలు 4300

( 243. శ్రీరామదివ్యస్వరూపదర్శనము. )

చుట్టినగోణంబుచుంటువోఁ బెనఁచి
కట్టినతళుకుబంగరుపట్టుదట్టి
కటిమీఱ మించుబంగరుకుప్పెతోడ
నటనఁ జూపట్టుసొన్నాళెంపుసరియ
వెలిదామర వికవికనవ్వువాలు
తెలిగన్నులును నెలతీరునామంబు
వెలఁదినవ్వులు నరపిరిమోము మీఁద
విలిసిల్లుసన్నంపు విడియంపురేఖ
వెడదయురంబుపై వెన్నలసోగ
యొడికరంబు చూపినయుపవీతలతిక 4310

కంబుకంఠంబు చక్కనిముద్దుమోము
బింబాధరంబుపై బెరయులేనగవు
మకరకుండలములు మణికిరీటంబు
సకలంకకేయూరహారజాలములు
నొసరికలై యొప్పనొకపాద మూఁది
యినకోటికోటుల హెచ్చుతేజమున
పలపలికడపంటవలఁగ్నైచూపి
పలనొప్ప తమ్ముఁ డవ్వలనొప్ప దెసల
దళుకెత్త నపుడు సీతాప్రాణనాథుఁ
డలభూమిపతికిఁ బ్రత్యక్షమై నిలిచి 4320

( 244. శ్రీరామసంభాషణప్రకారము. )

కరమునం దనభక్తుకరముఁ దెమల్చి
కరము దైవాఱంగఁ గౌఁగిటం జేర్చి
భాగవతోత్తంస ! పరిపూర్ణహృదయ !
యోగికైరవచంద్ర ! యుర్వీశచంద్ర !

భూవర నాకంటెఁ బొడవుగాఁ దనదు
సేవకులందు నీ సేయుభక్తికిని
మెచ్చితి నీవు కామించినవరము
లిచ్చెదనన విని యింపు రెట్టింపఁ
గులశేఖరుఁడు రఘుకులనాథపాద
జలజాతములఁ జక్కఁ జాగిలివ్రాలి 4330

( 145. కులశేఖరరచితశ్రీరామస్తుతివర్ణనము. రామాయణసంగ్రహము. )

దశరథనందన ! తాటకాజైత్ర !
దశరథకౌశికాధ్వరవిఘ్నహరణ !
హరచాపభంజన ! యవనిజారమణ !
పరశురామాభంగ పటుతపోహారి !
గురువాక్యపాలన ! గుహవంద్య ! మౌని
వరదాయి ! దండకావనభూవిహారి !
కటజసన్నుత ! మౌనికులనత ! పంచ
వటవాస ! రాక్షసవరగర్వహారి !
ఖరదూషణాదిరాక్షసకంఠదళన !
శరభిన్నమారీచ ! శబరిప్రసన్న ! 4340

వాలిశాత్రవ ! మాల్యవద్గిరివాస !
పాలితసుగ్రీవ ! పౌలస్త్యవరద !
కంధిబంధన ! దశకంఠసంహారి !
బంధురనిర్జరపతిముఖప్రణుత !
భూమిజాసంయుత ! పుష్పకారూఢ !
స్వామి ! రాఘవ ! భరద్వాజపూజార్హ !
సాకేతపురనాథ ! జగదేకనాథ !
నాకులస్వామి ! వై నాకులస్వామి !
మొదలైనదివిజులు మునులు వేదములు
మొదలకింపఁగరానిమూర్తివి నాకుఁ 4350

సుముహూర్త మొసంగ నాసుముకోమలాంగిఁ
గమలాక్షునకుఁ జేరకాంతుఁ డర్పించె 4400

నపుడు వధూవరు లాననాబ్జముల
నపరిమితోత్సాహ మడర వీక్షించి
సగుడ జీరకము మస్తములఁ దోడ్తోన
నిగుడొత్తువేడ్కల నిడి రొప్పుమిగుల
రాయంచపై నెక్కరాకేందువదన
యాయంచ రారదుం డలరంగ వీణ
వాయించ, వడఁకుచల్వలకొంజచూలి
పాయకకూడి శోభానపాడంగ
నరవిందనేత్రున కాత్మసంజాత
వరవైభవముల వివాహంబు సేసి 4410

జనకుండు మును రామచంద్రున కొసఁగు
ననువున మితిలేనియట్టి సంపదల
సరణంబుగా నిచ్చె నప్పు డమ్మంత్రి
వరు లరువంది యవ్వసుమతీశునకుఁ
దమసేయునేర మంతయు విన్నవించి
యమితాపరాధుల మని దైన్యపడుచు

(150. సచివకృతాపరాధక్షాపణాదిక్రమము.)

మును దాఁచినట్టిసొమ్ములు భయపడుచుఁ
గొనివచ్చి యెదుటఁ గ్రక్కునఁ బెట్టి సొరిది
నిల వ్రాలి నీదైన యీమహామహిమఁ
దెలియక కీగతిఁ జేసితిమి దము నింకఁ 4420

జేకొని నీ వాజ్ఞ చేసిన మేలు
కాక పెద్దలఁ జూచికాచిన మేలు
నీచిత్తమునఁ గరుణించి వారలను

జూచి లెమ్మనుచు నానుగుణాంబురాశి
యేల కొంకెదరు మీ రేమి సేసెదరు
శ్రీలలనాధీశుచిత్త మట్లుండె

( 251. భక్తపరతంత్రత్వప్రకటనము. )

వెఱవకుఁ డని గారవింప దుందుడుకు
మఱచి సంతోషాబ్ధి మగ్నులై రంత
నాయాదిదంపతు లారాజయోగిఁ
బాయకుండిరి భక్తపరతంత్రు లగుచు 4430

నటుమీఁదఁ దనుఁ బోలునట్టికుమారుఁ
బటుగుణోదారుని బట్టంబు గట్టి
సరవిమై వైష్ణవజాలంబుఁ గూడి
హరిభజనాసక్తుఁ డై యుండె నంతఁ

( 252. శ్రీరామాయణశ్రవణవైభవప్రస్తావము. )

ప్రతిలేనియట్టి శ్రీరామాయణంబు
హితుఁడైన నిజపురోహితునిచే వినుచు
నతిశయిల్లుచు నుండె నమ్మహాకథకుఁ
దతిభక్తిపరవశుఁ డైన భూపతికి
ననిశంబు సీతాపహరణంబుపట్టు
కనుమాటి వినుపింపఁగా నొక్కనాఁడు 4440

పనివడి నా కొక్కపయనంబు గలుగఁ
దనయుని రావించి ధరణీశ్వరునకు
వాణీవిలాసవాగ్వైఖరుల్ మెఱసి
రాణింప నీవు పురాణంబు నేఁడు
వినిపింపు మనిచెప్పి వీడ్కొల్పఁ దండ్రి
యనుమతిం బౌరాణికాత్మసంభవుఁడు

( 253. రామాయణభట్టశరీర భూషాదివర్ణనము. )

సావిగన్నెర పూవు చాయనీర్కావి
ధోవతి మీగాళ్లతో నొఱయంగ
ధౌతమై పురిగొని తనరుయజ్ఞోప
వీతజాతం బురోవీథి న ర్తింప 4450

మడతవిప్పక నడుమనుగట్టుచాయ
జడిసినతోపుపచ్చడ మింత జాఱ
డాలికెవెల్లపు త్తడి నై నదర్భ
వేలిపవిత్రంబు వెడవెడ దిరుగ
నవిరళంబుగ జాతినట్టినెన్నొసలి
ధవళోర్ధ్వపుండ్రంబు తనరారుచుండ
బెడతటిమై జాఱ వెట్టినచింపి
ముడుతకుళ్లాయి కిమ్ముల మిట్టిపడగ
దట్టమై పొదిగల్గి తరవాయి బెట్టి
కట్టినపెనుపు స్తకము చంక నలర 4460

( 254. సభామంటపస్థలప్రాప్తిక్రమము. రామాయణశ్రవణరీతి. )

జనుదేఱ గువలయేశ్వరు డారగించి
యనుపమ మణిమంటపాసీను డగుచు
హితులు మంత్రులు బురోహితులు బాంధవులు
సుతులు వైష్ణవులు రాజులు గొల్వ సేయ
శ్రీరామకథ విన జెలు వగ్గలింప
బౌరాణికుని బిల్వ బొయ్యెడటంచు
నుడిగంబు సేయుచు నున్న సేవకుల
బడిపడి తనుబిల్వ బంపునయ్యెడకు
నరుదెంచి సంతతహరిభ క్తిరస్తు
ధరణీశ! యని యక్షతము లిచ్చి యతని 4470

( 255. శ్రీరామాయణపఠనక్రమము. )

యనుమతి నుచితాసనాసీనుఁ డగుచు
వినయ మేర్పడఁగ నవ్విప్రపుంగవుఁడు
తరవాయిఁ గైకొని ధవళాక్షుఁ దలఁచి

నెరి దపస్స్వాధ్యాయ నిరతప్రమోద
ధరఁ దపస్వివాగ్విదాంవరభక్తి
పరనారదంపరి పప్రచ్ఛ భవ్య
వాల్మీకిమునిపుంగవువా యని నుడివి
కేల్మోగిడించి భక్తి నమస్కరించి
యనిశంబు శ్రీరామ యని మధురముగఁ
దనరుచుండెడు కవితాశాఖ యెక్కి 4480

( 256. శ్రీరామాయణకథాసంక్షేపక్రమము. )

పలుకుచుండెడు నాకు భవకోకిలంబుఁ
దలఁచి యంజలిఁ జేసి తదనంతరమునఁ
బదపదార్థంబు లేర్పడఁ జోల కింపు
లుదయింప రసరీతు లుప్పొంగుచుండ
నగపడి కత చెప్పినటువలెఁ గాక
సొగయఁ బ్రత్యక్షంబు చూచినట్లుండ
వెనుకఁ ద్రొక్కక రసావేశంబు పలికిఁ
గనుపట్టు మారీచుకథఁ జెప్పి చెప్పి
చొప్పుగా విభుని కచ్చోటు నీ వెపుడుఁ
జెప్పకు మని తండ్రి చెప్పినకతన 4490

సతతంబు సురల నాశ్చర్యమొందించు
నతనితుర్యపుభక్తి నరయనికతన

( 257. సీతాపహరణవార్తాశ్రవణఖేదప్రస్తావము. భక్తిపారవశ్యక్రమము, )

వరుసతో ముందరవచ్చుకార్యంబు
నరయక సీతాపహరణంబుపట్టు
చెప్పఁ జెప్పినఁ గులశేఖరాధీశుఁ
డప్పుడు ప్రత్యక్షమైనయట్లుండఁ
బటుతరనిజభక్తిపరవశుఁ డగుచుఁ
గటము లుత్కటములై కంపింపఁ గనలి
మున్నిఁటి నరసింహమూర్తియో యనఁగఁ
గన్నుల విస్ఫులింగము లుప్పతిలఁగ 4500

( 258. శ్రీకులశేఖరభూపప్రతిజ్ఞాప్రకారము. )

నడుగక సింహాసనము డిగ్గనుఱికి
తడయక రామచంద్రద్రోహిఁ బట్టి
యీక్షణంబున సురలెడఁ జొచ్చిరేని
శిక్షింతు నెందుఁ జొచ్చినఁ బోవనీను
మునుకొని యరకాలములుగాడకుండ
ననుఁగన్నతల్లిఁ గ్రన్నన రాముఁ గూర్తు
నని యుద్ధసన్నద్ధుఁడై పరిచరులఁ
గనుఁగొని వాజి వేగమ తెం డటన్నఁ
జెవితీరు నెరిగండసిరియును వెన్ను
సవరనమించు పంచారంబు బటువు 4510
నున్న నిమేసికన్నుల చక్కఁదనముఁ
దిన్నని నెమ్మోముఁ దెలివైనగోరజ
బాగును నురము లోపలి యాయితంబు
సోగైనవాలంబు సొబగునెన్నడిమి
సైకంబు నడలోనిసరసత పరువు
జోకయుఁ గల్గి యించుక వెల్తి లేక
మదమును గమనంబు మనువు నిబ్బరము

నుదుటును నదుటును నొఱపును జాఱుకుఁ
బూని చిత్తరువునఁ బొసఁగంగ వ్రాయ
రానిబిత్తరపుసామ్రాణితేజీగి 4520

( 259. భక్తిపారవశ్యత్వరాకాయణావర్ణనము. )

పురుడింప నిల నల్లపూసలు నెఱయు
వెరపున బొలియుంబు విఱిచిన గచ్చు
పల్లంబు నింద్రగోపంబు టుల్లోరు
బల్లెంబు కపిలోకభర్తవాలంబు
కలికిచిల్కలకొల్కి కఱివంకబొమలు
దలపించి సింగిణీతరకసంబులను
జుట్టుకేవడెమువిం చులకరొచూరి
పట్టుపట్టియ గనుపట్టుపట్టెంబు
పఁసిడిజంగిలు నెడపలకవజ్రములు
పొసఁగి చూపట్టుకెంపులమొగముట్టు 4530

వరరత్నహారంబు వల్లుదైన మెఱుఁగు
బిరుదుతలాటంబు పెట్టుపక్కెరయు
నొనరంగ సంజోగ మొనరించి మిగుల
ననువొందుబిరుదుసోయగము దీపింపఁ
గమలనాళంబులఁ గబళించునంచ
రమణఁ గళ్యము బాగురాగమరికించి
హరిగిరిచుట్టు తారాళిచందమున
వరరత్నహారంబు వలనొప్పచురడ
బాగొప్పు నుదయాద్రిభానుబింబంబు
లాగునం బట్టుతలాటంబు చెలఁగ 4540

వనజారిఁ జొదివినవనదంబుకరణి
ఘనతరం బగుకంఠచుకము తేజరిలఁగఁ

బట్టంపుసాహిణి బాగుగా నెదుటఁ
బట్టిన చూచి భూపాలశేఖరుఁడు

( 260. కులశేఖరతురగారోహణప్రకారము. )

ఖగపతిస్కంధంబుఁ గైకొన్న శౌరి
పగిది నత్తురగంబుపైకి లంఘించి
రాగెలు బిగియించి రభసంబుతోడ
వాగియు సడలి చువ్వన రెండుగడల
దాఁటించి ధేయని తరులు గావించి
యాటోపకోపంబు లడరఁ దోడ్తోన 4550

నుడువీథి నెఱమంట లుమియంగఁ జికిలి
యడిదంబు జళిపించి యార్చి నార్పుటయుఁ
జెవులు నిక్కించి గొజ్జికితోఁక నిగుడఁ
బవనవేగముఁ గ్రిందుపఱచు వేగమునఁ
బనుపడ నోరిలోపలఁ గాళ్లు వెడలె
ననఁగఁ జెచ్చెరఁ గోలయనువున డేగ
వడువునఁ బెనుసాళువమురీతి లగడు
వడి పెటల్గుండుకై వడి వడి మీఁటి
కెరలుచుఁ గదలి సింగిణివింటికోల
కరణి ధురీన చక్కఁగఁ దీఁగేసాగి 4560

( 261. పంచభూతవైపరీత్యప్రస్తావము. )

దిరదిర దశదిశల్ కెరిగి ఘూర్ణిలఁగ
ధరణి యభ్రము రసాతలముఁ గంపింపఁ
బధఘట్టనోద్ధూతపాంసువుల్ విష్ణు
పదమెల్లఁ బొదువ నిబ్బరము నబ్బురము
గదుర మనోవాయుగతులఁ గీడ్పఱచి
కదలించు తనపతికదలిక యెఱిఁగి

కదలె లంకాభిముఖంబుగా నపుడు
త్రిదశులు గురిసిరి దివిఁ బుష్పవృష్టి

( 262. శ్రీగోవిందప్రత్యక్షసేవాప్రదర్శనాది. ద్రవిడప్రబంధరచనాక్రమము. )
శ్రీరంగక్షేత్రమహిమ.

నాతఁడి గోవిందుఁ డతనిభక్తికిని
బ్రీతుఁడై ఘననిత్యబృందంబు గొలువ 4570

గరుడార వైనతేయారూఢుఁ డగుచు
నరుదెంచి యయోధ్యాగి హాయముతోఁగూడ
జనులు నిర్జరులు వాసవముఖ్యు లెల్లఁ
గనుఁగొని వెఱఁగందఁ గరుణ దైవాఱ
ననుపమమణివిమానారూఢుఁ జేసి
కొని యేగె నిత్యవైకుంఠంబుకడకుఁ
దొలుత నయోధ్యాగిచంద్రుఁడు నూఱువాట
దలుకొత్త నేప్రబంధముఁ గావించె
నందు ముప్పదివాట నారంగనిలయు
వందితామరునిఁ గైవారంబుఁ జేయు 4580

( 263. గ్రంథపఠనశ్రవణాదిఫలశ్రుతికథనము. )

కడమడెబ్బదివాట క్రమ మేరుపడఁగఁ
జెడనిసంపద లిచ్చు శ్రీవేంకటేశు
శ్రీరామసోదర శ్రీరాము తొంటి
శ్రీరాము నభినుతుల్ సేయుచు నుండు
పదిలుఁడై యయోధ్యాగిభక్తచారిత్ర
మెది రెడు వేడ్కతోనిల నెవ్వఁడేని
వినిన వ్రాసినఁ జదివిన నుతిసేయ
నెనలేనిసంపద నెనసియుండుదురు

( 264. కావేరీతటస్థితనిచుళా [ఉఱైయూర్] నామకనగరవర్ణనము. )

కావేరిదక్షిణాంగణసీమ నిచుళ
నా విలసిలు నొక్కనగరరత్నంబు 4590

అందలి మణిమయహర్మ్యమయూఖ
బృందముల్ నిచ్చలు బిట్టెండ గాయఁ
జదలేట మెలఁగెడు చక్రదంపతులు
పొదలెడువేడ్క నెప్పుడుఁ బాయకుండు
నిరుపమగురుకళా నిధులును భోగి
వరకవికేతు భాస్వద్బుధముఖులు
గలిగి యయ్యమరలోకముచెలువెల్ల
గెలిమి యాపురము మిక్కిలి నొప్పుచుండు

( 265. రాయచోహత్తమల్లాఖ్యభూపాలరాజ్యపరిపాలనక్రమము, )
శ్రీరంగనాథసేవాప్రకారము.

జనవినుతుఁడు రాయచోహత్తమల్లుఁ
డనఁ నొప్పు రాజేంద్రుఁ డాపురం బేలు 4600

నారాజదేవేంద్రుఁ డట నొక్కనాఁడు
శ్రీరంగధాముని సేవించి మగుడి
తనపురంబునకు నెంతయు సంభ్రమమునఁ
జనుచుండి వేఱొక్కజాడగా నరిగి
కలువల మించు చెంగలువల మెలఁగు
నలుల రాయంచతొయ్యలులఁ గొక్కెరల

కవలఁ బిషాళిజక్కవల నొప్పారు
తావల నెత్తావిచెందొవల బంగారు
తమ్మిల మీలమొత్తమ్ముల శైవ
లమ్ములఁ గ్రౌంచజాలమ్ములఁ బొలిచి 4610

యల్లన నెత్తావు లడరుదెమ్మెరల
జల్లుబోరాడుకాసారంబుఁ గాంచి

( 266. కనకకమలజనితశ్రీలక్ష్మ్యంశకన్యకాదర్శనప్రస్తావము.
భూపాలసంతోషాది. )

యందుఁ దోయములోన నరిగి మధ్యంబు
నందుఁ గాంచనతోయజాంతరసీమఁ
గమలాంశజాతయై కమలయుం బోలెఁ
గొమరారు నొకరాచకొమరితెఁ గాంచి
నెలపొల్పుఁ గన్న వెన్నెలపుల్గుకరణి
ఒలువైననిధిఁ గన్న బడుగుచందమున
సంతసంపుచుఁ జేరఁ జని నిచుళేంద్రుఁ
డంతరంగము ప్రేమ నంతంతఁ బొదలఁ 4620

( 267. అంతఃపురాగమనము. పట్టమహిషీసంతోషాదివర్ణనము. )

దళుకునెత్తమ్మిపుత్తడిబొమ్మరింటఁ
బొలుపొందురత్నంపుబొమ్మచందమునఁ
జెలువారుబాలికం జేకొని పుత్త్రి
చెలువున భావించి చెలఁగి యారాజు
తనపురంబునకు నెంతయువేడ్కతోడఁ
జనుదెంచి నిజనివాసముఁ బ్రవేశించి
తనయులు లేమిఁ దద్దయుఁ బొక్కుచున్న
తనపట్టమహిషి కాదరము రెట్టింపఁ
బద్మిని యనుపేరఁ బాటింపుఁ డనుచుఁ
బద్మజయైన యాపసిబిడ్డ నొసఁగఁ 4630

( 268. రాజమహిషీకలితపద్మినీనామధేయప్రకారము.
పద్మాఖ్యకన్యకాభివృద్ధిక్రమము. )

నాబాలఁ గైకొని యాత్మ నుప్పొంగి
యాభాలశశిఫాల యనురక్తి మీఱఁ

గొడదలేనినెమ్మది గొనకొన్నకూర్మి
పొదలుగారాముని బోషింపఁదొడఁగె
నాళీకసంభవ నవచంద్రరేఖ
వోలెనానాట సొంపులు మించి ప్రబలి
మొగినీలములరంధ్రముల నెన్నుకురులు
నిగురుజందురువంక లెన్నునెన్నొసలు

( 269. ఆపాదచూళిభాసురసౌందర్యవిశేషవర్ణనము. )

డిగనివిండ్లకు నెక్కుడించుభ్రూలతలుఁ
దొగమొత్తముల నీళ్లఁ ద్రొక్కుకన్నులును 4640
బెలుచశంఖము మొలపెట్టించుగళముఁ
గెలసిచక్కెర నుడికించు పల్కులును
గిసలయంబుల వణకించు కెమ్మోవి
బిసముల సీరాకఁ బెట్టుబాహువులు
వనజాతములఁ దలవంపించునడుగు
లొనరికమైయొప్పు నొప్పునాతన్వి
ధగధగందళుకొత్తు తలిరంపకాని
చిగురుకరాచూలి జీవరత్నంపు
చక్కనిగుమ్మ వాసనల పూరెమ్మ
చక్కెర కవణాల సాంబ్రాణి తేజి 4650
యపరంజినక్కు మోహనములచొక్కు
కపురంపులప్ప సింగారంపుకుప్ప
చిలుకలకొలికి గొజ్జగిపువ్వుములికి
తొలుకరిమించు కంతుని కేళియుంచు
ఇంచువేలుపుతీఁగ మెలమించుసోగ
చంచరీకాలక శశిఫాలఫలక
పలకవజ్రపుఁదల్కు బంగారుకళుకు
కలుకుల నెఱివేణి కలకీరవాణి

( 270. శ్రీరంగనాయకవైభవాదిశ్రవణప్రస్తావము. )
యౌవనాధిక్యప్రాప్తిక్రమము.

వాణీశనుతపాణి వనజాక్షురాణి
రాణించుకలువ వారనిముద్దుజెలువ 4660

యున నిండుజవ్వని యై రంగవిభుని
సనుఁగులోఁగూర్మి యొయ్యనలాకలోత్త
నిలకు మింటికి సూత్ర మొసఁగించి మంచి
వెలఁది చల్లనియేటివెలదిని గాంచి
పొలపుకెంజెడల గొల్పులబాదు గలిగి
తళుకొత్తుచంద్రకాంతంపుదొట్టులను
వేడుక నిడి చేసి వీవనిజోలఁ
బాడుచు రాతికిఁ బ్రాణంబుఁ దెల్చి
మునులడెందంపు దమ్ములనిల్చి సిరుల
మొనసిన యడుగుదమ్ముల నొప్పువాని 4670

పదియాఱు వన్నియపచ్చ రింటెంబు
గదియ రింగులువారఁ గట్టెచవాని
బుట్టుచు జగములు పుట్టించువాని
బుట్టినిల్లగు తమ్మిపొక్కిలివాని
నలదేవమణియు ఘంటాభరణంబు
గలిగి ఘల్లనిమ్రోయు కాలియందియల
కంచుమించుగ నేలఁ గాలొందనీక
మించి మేఘంబులమీఁదఁ బాఱుచును
జెలువారుదోలుబల్కు సెకలింపు లెసఁగఁ
బోలుచుపుల్గులరాయబొల్లని నెక్కి 4680

చొప్పడం ద్రొక్కనిచోట్ల ద్రొక్కించి
యొప్పెడు దేవరాహుత్తరాయునిని

నెఱి నెండకన్నును నీడక న్నెపుడు
నెఱుఁగనివాఁ డయ్యు నెరరార నెండ
కన్నును నలనీడకన్నును గలిగి
క్రొన్ననవిలుకానిగురుఁడై నవాసిఁ
గడపటఁ గడుపులోఁ గాల్గొండఁగాను
పుడమిపైఁ బుట్టక పుట్టెఁబొ మ్మనుచు
వేయినోళులతోడ వినుతులు మునులు
సేయంగఁ గన్నులే చెవులుగా వినుచుఁ 4690

బలుకులు గురువునాఁ బ్రబలి నమలక
మలకలపెనుబొన్నుమైవొప్పువాని
పొట్టంపు నెట్టె పు పొందు నీరెండ
చుట్టుదారల కరాచూలిమీఁదటను
బంచెవన్నెలతేజిపై వానిమామ
మించుల నదలించుమించుల గలిగి
కడిఁదిరాకాసిమూఁకలఁగన్న బొబ్బ
లిడుపోటుముట్టుమై నెనయించువాని

( 271. శ్రీరంగనాథాఖ్యవరనిశ్చయప్రకారము. )

రంగనాథుని రమారమణు రాజసము
శృంగారమును రూపు చెలువంబు సిరులు 4700

నెఱతనంబును గల్గునేర్పరి యనుచు
గుఱుతుగ నలపరాంకుశముఖ్యమునులు
పలికిన దివ్యప్రబంధరత్నముల
వలన నిచ్చలు విని వరునిగాఁ గోరి
తనమది నతనిమైఁ దలకొన్నకూర్మి
నినుపాఱ నాపద్మనీరాజవదన
చింతించి వలపులఁ జిక్కి లోఁజిక్కి

యెంతయుం దమిఁ జిక్కెయే పెల్లఁ దక్కి
పన్నుగా నరజాఱుపయ్యెదం జేర్చుఁ
బన్నినతమి నాథుపయ్యెదఁ జేర్చు 4710

నుడుగక నీరు కన్నుల నాన నిలుపు
నుడివిన సైప కన్నులనాన నిలుపుఁ
గలసెద నని కోరికలలోనఁ గాంచుఁ
గలసి మేల్కని కోరికలలోనఁ గాంచు
గాంతు నెన్నను వినుకలితనంబునను
గాంతుఁ జెప్పిన వినుఁ గలితనంబునను

( 272. స్వమనోరథవిలాసనిశ్చయాదిక్రమము. )

ఈరీతిఁ దనలోన నిగురొత్తుకోర్కె
సారెసారెకు దీఁగసాఁగ రంగేశు
డాయక పాయక తలఁపు లేకములు
సేయక రాయక చికిలిచన్మోనలు 4720

కుచ్చక మెచ్చక కొనసాఁగి వలపు
లెచ్చక యిచ్చక మిటుసేయకున్న
నేరీతి వేఁగింతు నే నంచు చింతఁ
గూరిన యారాచకూఁతురిఁ జూచి
చెలులెల్ల మతులఁ జర్చించి యీచెలువ
చెలువ మి ట్లీలోకో చెలువంబుఁ దక్కి
చెలులఁ జేరదు వింతచెలువంబుఁ దాల్చి
చెలువార నెటువంటిచెలువునిమీఁదఁ
దలఁపు చేకూరెనో తరళాక్షి కిపుడు
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . 4730

తఱివేచి చుట్టమై గాయచందమునఁ
దరితీపు సేయుచు దరితీపువింట

నీనారిపైఁ మారుఁ జెలఁ దేటినారిఁ
బూని నెత్తావితూపుల నేయఁబోలు
రామాభిరామ నీరామ నారామ
సీమం బరాకు సేసినఁగానియింక
బలవంత మగువంతఁ బాయ దటంచుఁ

( 273. ఉద్యానశోభాదివర్ణనము. ఉద్యానవనప్రవేశలీలాది. )
వసంతకాలశోభాప్రలోభనాదివర్ణనము.

జెలు లంతఁ దమపొంత చెలువదోకొనుచు
మందారమాధవీమాలతీతిలక
చందనశారదసాకారసరళ 4740

పూగపున్నాగజంబూభూజధూప
నాగకేసరనీపనారంగవకుళ
పనసపాటలపారిభద్రబంధూక
ఘనసారతింత్రిణీక్రముకజంబీర
తరులతాముఖములఁ దనరు నుద్యాన
మరుదార సొత్తెంచునపు డేపు మీఱి
వృద్ధభావము మాన్పి వృక్షాళిఁ గాయ
సిద్ధిఁబొందఁగఁ జేయుసిద్ధముఖ్యుండు
కంతునెచ్చలి వేల్పుగములవిందులకు
సంతసం బొదవ వసంతుఁ డేతేరఁ 4750

దోయజబాణుకత్తులనారు వోలె
నామెడం దలిరించె నవనీజతతులు
విరహులడెందముల్ విదళింప బిట్టు
దొరిగెడురక్తంబుతోఁ దొప్పదోఁగి
రాగిల్లుమరునఖరంబులో యనఁగ
బాగొప్పెఁ గింశుకప్రసవాంకురంబు

లీయింతిచనుగవయెడ రంగవిభుఁడు
పాయకయుండుఁ జొప్పడు మీఁద ననుచుఁ
దెలిపెడిగతి మిండతేఁటిఘోత్తంబు
లలరుగుత్తులయెడ పలరి చూపట్టె 4760

నప్పు డారాజకన్యకచెలుల్ చెలిమి
చొప్పడఁ దనుఁగూడి జోడుగా నడువ
జొబ్బిలుకమ్మకస్తురిగబ్బు లొరయ
గుబ్బచన్నులతళుకులు బిత్తరింప
మరుని సామ్రాజ్యరమాదేవికరణిఁ
దరుణులతోడ నెంతయు నొప్పు మిగిలి
వలపలిచలిగాలివలన నల్లాడు
వెలఁది హంబాళిలె వీచోపులుగను
దళుకొత్తుతలిరుబద్దలు సవరించి
బలువిడి గోయిల సడవాళ్ళు నడువఁ 4770

దనరారు చిలుక మొత్తపువందిజనము
తనదుముంగల బిరుదము లుగ్గడింపఁ
బొదలఁ దుమ్మెదనకీపులు బిట్టుమొఱయఁ
బొదలుచుఁ జదలఁ బుప్పొడిదుంము తెగయు

( 274. వసంతకాలపంచబాణాదివిలాసప్రకారము. )

వడివసంతుఁడు దళవాయియై నడువఁ
గడుసొంపు మిగిలి చక్కదనంబు లెసఁగు
పంచవన్నెలతేజి ఘడీవాగె నడవఁ
బంచబాణుఁడు విజృంభణవృత్తిమెఱసి
మిసమిస మనుచుఁ గ్రొమ్మించులు గలుగు
పసనికర్ణికలును బసిఁడిఘంటలును 4780

గ్రొమ్మించుచెంగల్వ కుచ్చులవెలఁది
తమ్మిలేఁదూఁడుదంతపు గోడియలను
దిలకించు పవడంపుఁ దీఁగెత్రాఁడులను
బలువన్నె విరుల కుప్పడ మైనపడము
నలరు మొల్లలవెండి యనుసులతోడఁ
జెలువొందు పూఁదీవెసెల గొమ్మకొమ్మ
గొనబుచూపట్టు కుంకుమపువ్వు వఱపు
నొనరిక చిగురాకు టారఁగును గలిగి
యలరారు చిన్నాణ మైన యందలము
బొలుపొంద రాయంచబోయలుమోవ 4790

నంచలవలరాయఁ డావేళ నేగు
దెంచి యచ్చోట వర్తింపుచుండె

( 275. రాజకన్యావనవిహారప్రస్తావము. కుసుమశోభాద్యాకర్షణప్రకారము. )

సత్తటిఁ జెలరేగి యాకన్యపొత్తు
క్షత్రియల్ వనకేళిఁ గావింపఁదలఁచి
కెరలి గేదంగుల గిల్లి రాగిల్లి
పరిమళోత్పలములు బట్టి చూపట్టి
కదిసి గొజ్జంగులఁ గామించి మించి
తుదలేని పుష్పజాతుల రాసిరాసి
పోదఁడు రండని పొదరిండ్లు దూరి
కదియుచు సుమవారిఁ గైకొన్నవారిఁ 4800

జేరి చేమంచి గొజ్జెగి నీటముంచి
సారెకు నీరీతి సరసంపురీతి
విలసిల్లుచుండెడువేళ నామెఱుఁగు
తలిరుబోణులఁ జూచి తము దాను చొక్కి

( 276. నానావిధవిలాసచేష్టాదివర్ణనము. )

విటపులు గొన్ని పర్వినప్రేమతోడఁ
జిటపొటలాడ రంజిలి విఱ్ఱవీఁగి
తముఁజూడఁ గాన చేతనమూర్తులయ్యు
భ్రమసి చొక్కుచు నెంతెపల్లవింపుచును
నేలీల నను గూడి యీముద్దులాడి
కేలిమై బిగ్గఁగౌఁగిటఁజేర్చు నొక్క 4810

యరయంగ నిదియేల యాకోకిలకంఠి
పరికించి యొకపాటఁ బాడినఁ జాలు
నంతయేమిటికి నయ్యమృతాంశువదన
వింతగాఁ దన్ను నవ్వినఁ జాలుఁ దుదిని
అదియేలఁ దనతోడ నాకీరవాణి
యదనెన్ని యొక్క మాటాడినఁజాలుఁ
దలఁప నాగతియేల తరుణి నామీఁదఁ
జలువవాతెర తేనె చల్లినఁజాలు
నదియేల తుదిని తోయజపాదపదము
ముదమున నామీఁద మోపినఁజాలు 4820

నని కోరుచుండెడు నమ్మహీజములు
యనురాగ మెలిఁగి యయ్యంబుజాననలు
నకలంక నిజరూపహావభావముల
వికసింపఁజేసి రవ్వేళ నాచెంత

( 277. శ్రీరంగరాజాగమనము. )

రంగభూవిభుఁ డొసరంగ భుజంగ
పుంగవముఖులెల్ల బోలమరు లగుచు
జగడించు నిగమంపు సారమేయముల
డిగిన సూత్రంపుఁ బట్టెడలచేఁ బూని

సైరింపలేక యచ్చనలాడు తమిని
గూరినచింతఁ గూర్కొనుచుండు తఱిని
అలరంగ విభుఁడు మోహనరూపరేఖ
నెలయించి మొలయించి యింపు పుట్టించి 4880

యరుదెంచె తనదుగేహమున కవ్వేళ
మరుబారిఁ జిక్కి వేమఱుఁ జొక్కుచున్న
చెలువచందముఁ జూచి చెలులెల్లఁ గదిసి
సొలవకొం ఘోరుమోహముఁ జూచి యిట్లనిరి
డాయదు మనలతోడను జారువలువ
మూయదు చనుదోయి మోహనం బొదవఁ
జేయదుగానంబు చెలువారు వీనఁ
బూయదుకస్తూరి పొలుపొందునొసలఁ
దీర్పదు తిలకంబు తిన్నఁగా వీణఁ
గూర్పదు గేదంగి క్రొమ్ముడిచెంతఁ 4890

( 282. విరహవేదనాధిక్యసంతాపాది. )

జేర్పదు ముద్దురాచిలుకకు చదువు
నేర్పదు కంటిరే నేఁడింతవింత
యలరంగపతిఁ జూచినప్పటినుండి
చెలువమారునిబారిఁ జిక్కిసొక్కెడిని
అలివేణి సింతసేయఁగవల దనుచుఁ
బిలిచి యెవ్వరిని ప్రియము సెప్పదము
కెలయుగీరంబు మిక్కిలి వాఁతరట్టు
పొలుచుగోయిల నన్న పొంపుడుచేయ
మలయ దుమ్మెదలు దిమ్మరిదిప్పకాయ
లిలఁ జందమామయెయ్యెడ బక్షపాతి 4900

సొలయు నీచలిగాలి సోమరిపోతు
ఎలయించు విలుఁ డన్న నెగపోఁతకాఁడు
కావున సురభి సొంకవలి త్తదేహు
శ్రీవేంకటేశ్వరుఁ జింతింపరమ్మ
రామనామముఁ బదరక యెన్నరమ్మ
రామపైఁ గనకాంబరముఁ గప్పరమ్మ
వేగ నాగశయాను వేడికోరమ్మ
యోగీంద్రబృందవంద్యుని గొల్వరమ్మ

( 283. విరహతాపోపశాంతిరచనావైఖరి. )

యనుచు శైత్యోపచారాదులుసేయ
మనసిజతాపంబు మఱియు రెట్టింప 4910

నొకవిధంబునఁ జెలు లొకకొంతతడవు
నకుఁ దేల్చిరాజకన్యక బుజ్జగించి
రాకుమారిక యంతరంగంబుఁ దెలిసి
తోకొని చెలులు తోడ్తోనగరికిని

( 284. ప్రియనాథవిషయకప్రశ్నాదిక్రమము. )

జినుదెంచి రంత నాజనవరేణ్యుండ
తనుజాతయున్న చందము విలోకించి.
కడుఁ గూర్మివొదల సంగడిసెజ్జమీఁద
నిడికొని యెక్కుమా ఱెలమి వాటిలఁగఁ
బరికింప నిన్నాళ్ల భావంబులేదు
పరచింతనొందె నీభామాలలామ 4920

యని లిందుజవ్వనియగుట భావించి
తనలోనఁ దాన యెంతయు విచారించి
మాయమ్మ నీకెట్టిమగఁడు గావలయు
నీయెడ భయము లే కెఱిఁగింపు మనిన

ముసిముసినగవు కెమ్మోవిపై నిగుడ
నొస పరిముద్దుమోమొక యింతయెత్తి

( 285. రంగనాథాఖ్యపరనిశ్చయనివేదనము.)
తదనుగుణసంతోషప్రాప్తిక్రమము.

పరునొల్ల నల పరాత్పరుఁడైన రంగ
వరుని నావరునిగా వరియింపవలయు
నన విని కడు వెఱఁగంది యారాజు
తనుజాతఁజూచి పద్మజభవాదులకుఁ 4930

జర్చింపఁగా నగోచరుఁడైన విష్ణు
నర్చావతారుని నారంగధాముఁ
గోరుటయెట్లు నీకోరినయట్ల
కూరిమితోడఁ జేకూర్చుటయెట్లు
లీలలోనఁ బసిబిడ్డ లెఱుఁగమిఁ బిలిచి
యలచందమామ వెన్నడిగిన ట్లయ్యె
నని విచారముచేయునపుడు విన్వీథిఁ
గనకాద్రి నీలశృంగము వొల్చినట్లు

( 286. రంగపతిప్రత్యక్షదర్శనప్రకారము. )

పసిఁడిరెక్కల తేజిపై నెక్కి రంగ
వసుధేశుఁ డఖిలదేవత లెల్లఁ గొలువ 4940

నరుదెంచి ప్రత్యక్షమై రాజుఁ బిలిచి
కరమర్థిఁ బద్మినీకన్య నిమ్మనిన
జననాథుఁడెంతె విస్మయమంది రంగ

( 287. చోళరాజకలితరంగనాథస్తుతిప్రశంసాది. )

జననాథుపాదకంజముల మ్రొక్కవాలి
రంగ ! పక్షీంద్రతురంగ ! వేదాంత

రంగ ! సత్కరుణాంతరంగ ! యభంగ !
కౌతుకంబున నేఁడుగాఁ గృతార్థుండ
నైతి ధన్యుఁడ నైతి ననఘుండ నైతి
ననుచు సంతోషబాష్పాంబుపూరములు
కనుదోయి నుప్పొంగి కడలుకొనంగ 4950

( 288. పద్మినీరంగరాజపరిణయవైభవము. )

వినుతులు మఱియు వేవేలు గావించి
ఘనతమైవీడ్కొల్లఁ గైసేయఁ బనిచి
నరసురాసుర యక్షనాగకిన్నరులు
వెఱఁగంద శ్రీరంగవిభునకుఁ బ్రేమ
ననుపమలగ్నంబు నందు లోకైక
జనని నాపద్మినీ జలజాతనేత్ర
వరవైభవముల నుద్వాహంబుసేసి
యరణంబుగా నప్పు డాసతీమణికి
సిరిమించు పసిఁడి జేసినతండులములు
వరుసమున్నూట యఱ్వదిగలంబులును 4960

( 289 ఉత్తమయాతకద్రవ్యసమర్పణాది.
గోపురమంటపాదినిర్మాణప్రకారము. )

అనిశంబు నారతు లర్పించి పెక్కు
నరవా
జికుణాలఁ బెక్కువాహనంబులను
అసదృశరత్నధనాదివస్తువులఁ
నొసఁగి తక్కినయట్టి యుచితము ల్సలిపి
రమణీయగోపురప్రాసాదమంట
పము లనేకములు చొప్పడమానికములఁ

( 290. హరిభక్తిజ్ఞానానందానుభవప్రకారము. )

పద్మినీరంగపతివివాహకథాశ్రవణాదిఫలము.

గట్టించి శ్రీరంగఘనునకుఁ దనదు
పట్టికి సకలసంపదలు నర్పించి
పరమవిజ్ఞానసంపదఁ జెంది భక్తి
పరతఁ దత్పాదతాత్పర్యుఁ డై యుండెఁ 4970

బరమమైయొప్పు నీపద్మినీకన్య
చరితంబు ధరలోన జను లెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివినఁ జేరుకొన్న
నెనలేనివేడ్క నభీష్టంబు లొందవు

( 291. నిచుళానగరస్థబ్రాహ్మణోత్తమమహిమ. )

కార్తికమాసరోహిణీనక్షత్రదినములో శ్రీవత్సాంశముగా కవియోగి
[తిరుప్పాణాళ్వార్] నామకాష్టమయోగిప్రాదుర్భావము.

ననుపమం బగు నమ్మహానగరమున
వనజాతనేత్రు శ్రీవత్సాంశ మొంతె
ప్రచురవైష్ణవకులపాథోధిశీత
రుచినాఁగ కార్తికరోహిణీతార
జనియించి కవియోగి సన్నుతుం డగుచు
ననఘుఁడై తిరుపాణుఁ డనుపేరుగలిగి 4980

( 292. ఆబాల్యహరిభక్తిరసానుభవప్రకారము. )

యుదయ మొందిననాఁటనుండి రంగేశు
పదచింతనామృతపానంబు సేసి
తలఁపులోఁ బ్రకృతిరోదనము నోదనము
సలుపక కొలుపక జలకాంక్షభక్తి
సరవిధారకముఁ బోషకమునుగాఁగఁ
బరమయోగానంద భరితుఁ డై యుండె

( 293. వీణావాదనద్వారా శ్రీరంగనాథకల్యాణ గుణకీర్తనము. )

లాలిత సకల కళావేత్తయయ్యు
నాళీకకుక్షిగానవిలోలుఁ డగుచు
వేణునాదము సల్పు వెన్నుఁడో యనఁగ
వీణాప్రవీణుఁడై వీణచేఁ బూని 4990

( 294. శ్రీరంగక్షేత్ర మాహాత్మ్య నిర్ధారణము. )
కావేరీ దక్షిణతీరాశ్రమస్థ కవియోగకలిత హరిగుణకీర్తనము.

యరుదెంచి నిచ్చలు నా రంగభూమి
హరి దివ్యమూర్తిగా నాత్మభావించి
యావీడు ద్రొక్కరాదని తలపోసి
కావేరి దక్షిణాంగణ సీమయందు
నలరంగ విభునకు నభిముఖంబుగను
నిలిచి తత్పదభక్తి నిరతిఁ బెంపొంది
తలఁపు నెత్తమ్మిలోఁ దద్దివ్యమూర్తి
బలుకఁ దద్గుణదివ్య భవ్యకీర్తనము
నిలిపి హస్తముల వీణియఁ గీలుకొలిపి
కలయంగఁ దంత్రులొక్కటఁ బాచుపఱచి 5000

( 295. వీణావాదనస్వరలయగ్రామమూర్ఛనాదివిశేషము. )

కొనవేల శ్రుతి తంత్రి గూడంగ మీటి
మునుమంద్ర మధ్యమము లుదారకమును
నిరవొందఁ జూపి యాయిత మొనరించి
స్వరలయ గ్రామమూర్ఛల సంచులెఱిఁగి
స్ఫురితకంపిత ముఖ్యముల బాగులెసఁగ
వరరసరీతి భావములు చొప్పడఁగ
ఘనశుద్ధమును సాళగమును సంకీర్ణ
మును తేటపడ జగన్మోహనం బొదవ

వీనులవిందుగా వింతగా సామ
గానలోలున కెంతె కర్ణామృతముగ 5010

సతతంబు నీగతి సవరేయిదనుకఁ
బ్రతిలేని కూర్మి విపంచి మీటుచును
ఎడపడకుండఁ జెక్కెడు లీగతిని
గడివోనికూర్మి గైంకర్యంబు సేయ

( 296. శ్రీరంగనాథకలితవీణాగానశ్రవణానందాదివర్ణనము. )

నా మహాయోగి గానామృతంబునకు
శ్రీ మానినీయోగి శ్రీరంగవిభుఁడు
చిత్తంబులోన రంజిలి పద్మమోము
నెత్తమ్మి మిగులనూనిన ప్రేమఁ జూచి
నంటున నయ్యోగి నాథుగానంబు
వింటివే వీనులవిందు లయ్యెడిని 5020

అమితమై నాకు న య్యమరులు గ్రోలు
నమృతంబుకంటె మోహనము చూపెడును

( 297. శ్రీరంగనాయికా ప్రార్థనాప్రకారము. )

అన విని శ్రీదేవి యంబుజోదరుని
గనుఁగొని హస్తపంకజములు మోడ్చి
దేవ ! తావకదయాదృష్టిఁ జెన్నొందు
భావింప నీ ప్రాణపద మైనవాని
బరిపూర్ణమైనసీ పదపద్మభక్తిఁ
బెరసి దేవరకింత ప్రియుమైనవాని
బరుని సంగతి వెలుపలఁ పంప ? దగునె
పరమాపుగాఁగఁ జేపట్టి నీ కరుణఁ 5030

(298. ఆస్థానమంటపములో కవియోగిస్థితిక్రమానుమోదనము.)

లోకసారంగాఖ్యముని ప్రేషణము. తదూర్ధ్వపుండ్రవస్త్రాలంకారాదివర్ణనము.

దిలకింప నికటవర్తిని జేసికొనఁగ
వలయునాపుడు రమావరుఁడు మోదించి
యనిశంబుఁ దనకుఁ దోయంబు లర్పించు
జనసుతుఁ డగు లోకసారంగమౌని
కలితగంగాతరంగముల నెన్నడుమఁ
బొలుపొందుచున్న పుప్పొడిచాళు లనఁగ
ధవళోర్ధ్వపుండ్ర మధ్యముల శ్రీచూర్ణ
మవిదలరేఖ లై యనువొందుచుండ
నిగనిగ మనుచు వెన్నెలసోగ చెలువుఁ
దెగడు ధోవతులెంతె తేజరిల్లఁగను 5040

జిలుగు వెన్నెలలమించిన జన్నిదములు
వలనొప్ప తిరుమణి వడము లింపొంద
రాజిల్లు శంఖచక్రములు నామంబు
తేజరిల్లఁగ మోరదిద్దినయట్టి
పుత్తడిబిందె మూఁపునఁ జేర్చికొనుచు
నత్తఱిఁ గావేరి కరుదెంచి డిగ్గి
తొలకించి యొక కొన్నితోయము ల్నించి
వలిపెంపుఁబావడ వాసెనంగట్టి
పొలుపొందఁగా శిరమునఁ బొందుపఱిచి
పలుమరులొగుచుఁ బదములెన్నుచును 5050

(209. పూర్ణకుంభ ఛత్రచామరవీజనపూర్వకముగా గాయకమునిసమానయనాజ్ఞా కథనప్రకారము.)

గరిమవేడుక సుధాకలశంబుఁ దెచ్చు
గరుడుఁడో యనఁగఁ బ్రకాశించిచెంత.

ధవళాతపత్త్ర సంతతి సందడింప
వివిధవాద్యములు వేర్వేర ఘూర్ణిలఁగ
మదకరు ల్గొలువఁ జామరములువీవఁ
ద్రిదశేంద్రముఖ్యు లెంతే సన్నుతింప
నెమ్మిమై నగరిలోనికి నేగుదెంచి
క్రొమ్మించు లన హేమకుంభంబుఁ దెచ్చి
తనదుమంగలినిడఁ దద్దయుఁ బ్రీతిఁ
గనుఁగొని శ్రీరంగకాంతుఁ డిట్లనియె 5060

(300. శ్రీరంగరాజదివ్యాజ్ఞానివేదనప్రకారము.)

నాసద్గుణములు వీణను దెల్పికొనుచు
నాసీనుఁ డైన గాయకసార్వభౌము
నలవాని వేగ నీయంసంబునందు
నెలమిమై నిడికొని యిటకుఁ దెమ్మనిన
శ్రీరంగవిభుమాట చెవిసోక లోక
సారంగముని మానసమున నుప్పొంగి
కమలజాదులకునుంగనరానియట్టి
కమలలోచనుఁ డెంత కరుణించె నితని
జెదర కమ్మౌనీంద్రుం జెందుభాగ్యంబు
తుదినెన్న నారదాదులకైనఁ గలదె? 5070

యనుచుఁ గవేరకన్యక దాఁటిచేరఁ
జనుదెంచి యాలోకసారంగమౌని
తనుబట్టఁ గమకించు తలఁపు డెందమునఁ
గనియుఁ గాననివానిగతిఁ జక్కనిలిచి
గ్రక్కునం దనుబట్టఁ గదిసినం జూచి
యెక్కడ వచ్చెద వెఱుగవే నన్ను

(301. గాయకమునిసమానయనప్రకారము,)
హరిపాదకమలసేవానందాదిప్రాప్తిక్రమము.

రాకు రాకు మటంచు రయమునఁ గదలఁ
బోకు పోకు మటంచుఁ బొంచిపోనీక
బలువిడివడిఁ గూడ బరతెంచి యతని
జల పట్టిపట్టి భుజంబుమీఁదటను 5080
ఎక్కించుకొనుచు రంగేశు సన్నిధికి
మక్కువఁ దోతెర మౌనివాహుండు
చేరంగ నేగి రాజీవాస్త్రగురుని
శ్రీరంగనాథుని సేవించి పొంగి
యమలుఁడై యాదినాయకుఁ డైన నన్నుఁ
దమదాసులకు దాసుఁ దగఁజేసె రంగ

(302. శ్రీరంగనాథ శ్రీవేంకటేశదాశరథ్యాద్యవతార మహిమానందాదివర్ణనము.)

రమణుఁడౌ వేంకటగ్రావేశుపాద
కమలముల్ నాకన్నుగవ నెలకొనియె
నలఘుప్రసన్నుఁడై యఖిలలోకములు
గొలిచి దైత్యుల గాడకులముల నణికి 5090
కౌతుకంబున నొప్పు కాకుత్స్థతిలకుఁ
బీతాంబరంబునం బెరసె నాతలఁపు
చక్కని వేంకటేశ్వరు బ్రహ్మఁ గన్న
పొక్కిలి యరసంజపోలుపు లల్లార్చి
సిరిమించు లొయ్యారి చెంగావివలువఁ
బరికింప నాప్రాణపదమై తనర్చె
బవరాన లంకాధిపతిపదితలలు
తివుట నొక్కమ్మునఁ ద్రెళ్ళంగనేసి
మధుపానమధుమత్తమధుకరజాల
మధురనాదంబుల మా నగ్గలించి 5100

మొనసిన పెనుదేటిమూఁకలమొగలు
లనియాఁడునమ్మల యలరంగ భూమి
నుల్లసించిన దేవు నుదరబంధంబు
నుల్లంబులోన నా కుల్లసిల్లెడిని
మున్నింటి ఘోరాఘములవేరుఁ ద్రెవ్వ
నన్నింటిఁ దనకృపయనుకత్తిఁ దఱిగి
తనవానిఁ జేసి నాతలఁపులో నిలిచి
తనరారు శ్రీరంగధారుణీనాథు

(303. శ్రీరంగేశ శయనప్రకార సేవాదివర్ణనము.)

సిరులు దేరుచునున్న శ్రీవత్సతలము
కరమర్థి నను బంటుగాఁగఁ గైకొనియె 5010

హరు బ్రహ్మహత్యవాయఁగఁ జేయురంగ
వరు నజాండంబులు వడిఁద్రిమ్మింగుచుండు
కమనీయకరమైన గళము నన్నిపుడు
ప్రమద మెలర్పంగ బంటుగా నేలె
దదధగం దళుకొత్తుదరము చక్రంబు
నొగిఁబూని శేషునిపై నొప్పు రంగేశు
నిగనిగ మనుచుఁ దేనియసోనఁ గురియు
చిగురుకొమ్మోవికిఁ జిక్కె నాతలఁపు
గండుదుమ్మెదలతోఁ గనుపట్టు వికచ
పుండరీకములసొంపులు దువాళింపఁ 5120

డెలుపులై నలుపులై తేటకెంజాయ
లోలయంగ నొప్పు నీయురగేంద్రశాయి
కన్నుదామరలవికాస మెంతయును
నన్ను నీవేళ మిన్నక దక్కఁగొనియె

( 304. హరివైభవ కీర్తనానందానుభవము. )

ఘనజగత్త్రయమును గడుపులో నునిచి
తనర నొక్కటి వటదళశాయి యైన
యీ రంగనాథుని నిందిరతోడ
హారజాలంబుల నలరు నెమ్మేను
ఎట్టిచిత్రము కాని యిట్టి నాతలఁపు
గట్టిగాఁ దనసొమ్ముగాఁ జేసికొనియె 5130

నవనీతచోరుండు నా మనోహరుఁడు
నవిరళ శుభమూర్తి యగు రంగశాయిఁ
గనుఁగొన్న యీ తన కనుదోయిరెండు
గనకుండఁగా కనుక్రమము దీపింప
దానవారాతి డెందముఁ బ్రవేశించి
లీనమై తొంటిపోలిక నుండె నతఁడు

( 305. మునివాహనయోగిచరిత శ్రవణపఠనాదిఫలము. )

హితమతి మునియంస మెక్కినకతన
నుతికెక్క మునివాహనుం డను పేర
ఘనభక్తి నీ యోగికథ యెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను 5140

నిచ్చ బొందుచు నిందిరేశుఁడు సిరికి
నిచ్చిన చన విచ్చు నెడపగ యనుచు

(306 గ్రంథసమర్పణక్రమము. కవివంశవర్ణనము. నిజకావ్యమహిమ. తృతీయాశ్వాసనిగమనము.)

నలమేలు మంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్దపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సర్వోముఖ్య భక్త సంతతికి

నంకితంబుగను శ్రీహరిభక్త నికర
పంకజార్యమతాళ్వపాకాన్నయార్య
తనయు తిమ్మార్యనందన రత్నకుంభ
దనుపమ శ్రీ వేంకటాద్రీశ దత్త 5150

మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాద సంసేవకాబ్జ
సదలనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగి విలాసకృతిని
యతులితం బగు తృతీయాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## చతుర్థాశ్వాసము.



(307. శ్రీయలమేల్మంగ దేవీ వైభవప్రశంస. శ్రీవేంకటేశ స్మరణప్రార్థనాది.)

[ ద్విపద ]

హైమసరోజాంగ ! యలమేలుమంగ !
జీమూతసంకాశ ! శ్రీవేంకటేశ !
మునిశాలికా సారముఖ్యభక్తాళి
వనమాలి ! యువధారు వనదానశీలి ! 5160

భావించి మున్నీటిపడ తులలోనఁ
గావేరిసరి యెన్నఁ గావేరి యనఁగ
దీపించుపుణ్యనదీమణిచెంతఁ

(308. చోళదేశస్థ మండంగుడినామక క్షేత్రవర్ణనము.)

జూపట్టు శుభలీలఁ జోళదేశమున
నలరు మండంగుడి యనుపేరుగలిగి
జలజాత జాతుని జలజాక్షి యజితి
యగ్రహారంబన ననువొంది యున్న
యగ్రహారం బొప్పు నమితసంపదల
నాసురరిపుచరణాసక్తులైన
భూసురవర్యు లెప్పుడు నప్పురమున 5170

(309. ఊర్ధ్వశిఖా బ్రాహ్మణగణ వైభవాదికథనము.)

నఖిలాగమజ్ఞులు ననఘులు నూర్ధ్వ
శిఖులు నిజాశ్రమోచితకృత్యపరులు

నై సప్తశతసంఖ్య నలరియుండుదురు
వీనమంతకునైన విధి లెక్కగొనరు
అందునఁ గలిదోషహరణంబు సేయ
నిందిరాసఖుఁడైన హేమాంబరుండు
లోకరక్షణవృత్తిలోలప్రతిజ్ఞఁ
జేకొని నిరతంబుఁ జెన్నొందియుండు
ననిశంబు యాగభాగాసక్తినచట

(310. విప్రదంపతి శుభగుణశీలాది)

ననిమిషుల్ సకుటుంబులై వసింపుదురు 5180

తమచతురాననత్వముఁ బోల దనుచుఁ
దమిఁ జతురాననత్వము సడ్డఁగొనరు
తృణముగా మేరువుఁ దిట్టంగఁగలరు
తృణము మేరువుగాఁగ దీపింపఁగలరు
చలన మొందనియట్టిచక్రిసంసక్తి
గలిగి యజ్వజనాయకత్వంబు నొంది
యొప్పుదు రెల్లప్పు డుర్వీసురేంద్రు
లప్పురి నాపావనాత్ములలోని
సకలవేదాంతవిశారదుండైన
యొకవిప్రవరుకాంత యుదరంబునందు 5190

(311. ధనుమాస జ్యేష్ఠానక్షత్ర దినములో శ్రీహరివనమాలాంశ నవమయోగీశావతారము.)
విప్రనారాయణనామకథనము.

జిష్ణుతారను మార్గశీర్షంబునందు
వైష్ణవాన్వయభవ్యవనధిచంద్రుండు
వనమాలికామోదవహ మైనయట్టి
వనమాలికాంశంబు వచ్చి జన్మించి
ధారుణిమైన సాధారణవిప్ర

నారాయణుండను నామంబుఁ దాల్చి
జననిగర్భములోనె సకలంబు నెఱిఁగి
జనసుతుం డగు పరాశరమౌని వోలె
మాతగర్భములోనె మహిమతో లోక
మాతనెమ్మోముదామరతేఁటులైన 5200

( 312. జన్మప్రభృతిరంగనాథకటాక్షవీక్షాప్రాప్తిక్రమము. )

యారంగపతికరుణాపాంగతతులఁ
జేరంగఁ గలుగుటఁ జేసి భాసిల్లి
సర్వసర్వంసహాచక్రంబులోన
సర్వజ్ఞమూర్తినా జరగి నానాఁట
బెరుగుచునుండెను పిన్నప్రాయమున
సరసి గురుండు నిజాగమోక్తమున

(313. ఉపనయనాద్యాచరణము. శ్రీరంగనాథసేవాపరిచర్యాది. )

నయమార్గమున మౌనినాళీకవిష్ణు
నయనంబునకు నుపనయనంబు నేసి
వనజాక్షులో నొప్పు వసుదేవుకరణి
ఘనమోద మాత్మలోఁ గడలొత్తనుండె 5210

పెనుకొని తనలోన విజ్ఞానలతిక
ననలొత్త శ్రీవిప్రనారాయణుండు
కంసారిపాదపంకజభక్తిఁ జెంది
సంసారసారం బసారం బటంచు
శ్రీరంగపతిసేవ సేయుచుఁ గన్ను
లారంగ నతనిసోయగముఁ గన్గొనుచు
నతనికింకరులతో ననిశంబుఁ గూడి
యతనికైంకర్యంబు లాత్మఁ గోరుచును

గరిమవైష్ణవ గృహాంగణముల ముక్తి
కరవృత్తి యగు మాధుకరవృత్తిఁ జెంది 5220
ఘననీలతనునకే కైంకర్య మిష్ట
మని యెంచి యొక యుపాయముఁ గాంచి యతఁడు

( 314. విప్రనారాయణకృతపుష్పోద్యానకైంకర్యాది. )

శ్రీరంగధాము పశ్చిమభాగసీమఁ
జేరువఁ గావేరిచెంత నెల్లపుడు
నలరుచు శ్రీమకుటాంతరీపాఖ్య
గలిగిన యొకదీవి గ్వాచి యచ్చోట
నుద్యాన మొక్కటి యొనరింతు ననుచు
నుద్యుక్తుఁ డగుచు నయ్యుర్విభాగమునఁ
జిల్లరములు చెట్టుచేమలు నఱికి
కల్లగా వైచి నల్గడఁ బాదుపఱచి 5230
నినుపుగాఁ గావేరినీరుగారెమునఁ
దనివార నెత్తి యంతట జేడవెట్టి
యలిపచ్చియైయుండ నొక యింతయూరి
పలకెక్కి గుగ్గిలపదునుగా నిచ్చి
పరుపడి గుద్దలిపార సొంపార
నిరుచాలువడఁ ద్రవ్వి యిరువాటు వైచి
కాలువ లొనరించి గనిమలు దీర్చి
చా లేర్పరించి యా చాయ నంతంతఁ
బాదులు సవరించి పైరులు పావి
పోదులు నారివి నేర్పున నాటుకొలిపి 5240

( 315. పుష్పారామవర్ధితనానావృక్షలతాదిలాలనము. )

యామెడ నీరాన నలరు పూబాదల
డాయఁ జెంగల్వమోడలు పొందుపఱచి

కాపాడి గూడులుగట్టి శైత్యంబు
పైపైనఁ గావింపఁ బ్రబలి నానాఁటఁ
బొన్నలు బొగడలు బొండుమల్లియలు
గన్నేరుల్ కలుగొట్టు కాంచనంబులును
మల్లెలు కురువేరు మరువంబు పచ్చ
మొల్లలు నారదంబులు గొజ్జగులును
బారిజాతములును సంపంగులు తులసి
గోరంటలును గేతకులు నశోకములు 5250

మొదలైన భూరుహంబులు పుష్పలతలు
పదివేల తెఱఁగులఁ బ్రబలి చూపట్టె
యొక్కకైవడి లాకలొత్తి తలిర్చి
పక్కొమ్మలిడి పాదుపడి చెట్టుగట్టి
యలరుచు నొకటి సహస్రమై పెరిఁగి
చలిమీఁటి శాఖోపశాఖలై నెగడి
వెడవెడ తూణంబు వెడలినయట్టి
వెడవిల్తుమిట్టల వింతలై యొప్ప
మొనచూపి ననలొత్తు మొగడులం దనరి
మినుకుదేఁటులతోడ మేకులు చేసి 5260

యీనినగతి నొకు నిగురుబక్కొమ్మ
గానరాకుండ నల్లడ విఱ్ఱవీఁగి
పరిబండ్లనాఁ గనవచ్చు బొమ్మనఁగ
నెరతావి దిక్కులనిండి వాసింపఁ
గ్రిక్కిరియుచుఁ బుష్పగిరులచందమున
నొక్కెడం బూచె నయ్యుర్వీజతతులు
ఆ మహానిశీతాంశుఁ డంతరంగమున
నామోదవార్ధి నోలాడి యంతటను

దనపెట్టు పైరులు తినకన్ను లెదుట
ననిచెఁ గా యనుచు నానందించు నడుమ 5270

( 316. తుళసీపుష్పమాలాదిసమర్పణక్రమము. )

సొరిది మరందంబు సోనలు గురియు
సురపొన్నసీడ భాసురముగా నొకటి
సవరగా నడుమను జవికె గావించి
బవరిగా దట్టంపుఁ బందిలి వెట్టి
యినుఁ డుదయించు నయ్యెడ మేలుకాంచి
తన యనుష్ఠానంబుఁ దప్పక తీర్చి
మునురాజ మైనట్టి మంత్ర మెన్నుచును
ఘనమైన పూవులకరడి గీలించి
యరిగి యవ్వనములో నందంద తిరిగి
యరవిరులై యున్న యట్టి సూనములు 5280

ననిచి గోదుమగింజ ననలొత్తు తులసి
దినదినంబును గోసి తెచ్చి వేర్వేఱఁ
జినుగకుండఁగ నీరు చిలికించి తోలఁచి
పనుపడఁ గదళికా పత్త్రముల్ పఱచి
యందుమై వేర్వేఱ వావిరు లునిచి
పొందుగా మునుమున్న పోఁజినయట్టి
నార చెన్నార నన్నంబుగాఁ జీరి
చేరువఁ దా సుఖాసీనుఁడై యుండి
బొటవ్రేల దర్జనిం బూవులు రెండు
నటున గీలించి లో నార సంధించి 5290

తొడిమతోఁ దొడిమ పొందుపడంగఁ జుట్టి
మిడివ్రేళ్ళ నందుమై మెణకుగా నైచి
దొడనెడం దులసి నయ్యెడ నరవిరులు

గడుసొంపుమీఱంగఁ గట్టి మాలికలు
బొండులు తావడంబులు వింతవింత
కందుకంబులు నొప్పుగా నవరించి
పూవులు సజ్జలోఁ బోసఁ గంగఁ బెట్టి
తావివోవకయుండ దళముల మూసి
అది తనముంగేల నమరియుండంగ
నదటున నుత్తరీయము ముసుం గిడుచు 5300

( 317. ద్రావిడవేదపఠనశ్రవణానందాదివైఖరి. )

గనియరుపూచాయ గలనీరుకావి
గనుపట్టుశాటి మీగాళ్లతో నొరయ
వినుతిమై ద్రావిడవేదంబు చదివి
కొనుచు వైష్ణవు లెదుర్కొనినంతలోనె
యడుగులు వ్రాలి శ్రీహరిభక్తి మేన
వడియంగ నాయోగిపరుఁ డేగుదెంచి
శ్రీరంగనగరంబు చేరంగవచ్చి
యారంగపతిఁ గన్నులారంగఁ జూచి
నుతియించి శౌరి మనోవీథి నిలిపి
యతనిదామోదరాహ్వయము సార్థముగ 5310

( 318. తీర్థప్రసాదస్వీకరణాదిమహిమ. )

నాపాదలంబులై యలర దామంబు
లావంకజాక్షున కర్పించి భక్తి
దనరఁ దీర్థప్రసాదము లన్వయించి
ఘనతరవైష్ణవాగారంబులందుఁ
గరము వేడుక మాధుకరముఁ గైకొనుచు
నరగున నిజనివాసం బైనయట్టి
తనచేయు నవ్వనస్థలి కేగుదెంచి

( 319. నిజపర్ణశాలానివాసక్రమము. హరిధ్యానకైంకర్యనిరతత్వప్రకారము. )

తన రెడు పర్ణసద్మంబు సొత్తెంచి
యంతరంగమున రంగాధీశ్వరునకు
నంతట నలపవిత్రాన్న మర్పించి 5320
భుజియించి కైంకర్యముల ప్రొద్దుఁ గడిపి
రజనియు దినము నారాధనంబులోనె
కడపుచు నతని కైంకర్యంబు దినము
నెడపడకుండఁ దా నీరీతిఁ జేయుఁ

( 320. బ్రహ్మేంద్రశంకరపూజాతారతమ్యవిమర్శనము. )

బంకజభవుఁడును పాకశాసనుఁడు
శంకరాదులు నెంతె సవరించుపూజ
సామాన్య మనుచు మెచ్చనియట్టివేలు
పామానివరుపూజకాత్మలో మెచ్చి
తనదు లీలావినోదము చూపవలసి
యనుపమలావణ్యయచ్చర నోర్తుఁ 5330
దలఁప నేతెంచి పాదములకు నెఱఁగి
పలుమఱు వినుతించి పలుక నీక్షించి

( 321. హరికృతాప్సరోవరాహ్వానము. విప్రనారాయణభక్తవిమోహనార్థ ప్రస్తావము. )

సరసిజనేత్రుఁ డచ్చరతోడఁ బలికె
ధరణిఁ గావేరి కుత్తరభాగసీమ
విలసిల్లు వఙ్జ్ఞవిఖ్యాతదేవ
నిలయ మొక్కటి యొప్పు నిఖిలసన్నుతము
భూదేవరాజాదిభూషితం బైన
యాదేవదేవుని యాశ్రమాంతమునఁ
జతురనర్తకవంశజాతవై జగతి
నతిలోకసుందరివై యుండుమింకఁ 5340

గౌతుకం బొకటి యేఁ గావింతు ననిన
నాతలోదరియు దదాజ్ఞ వాటించి

( 322. నర్తకకన్యాప్రాదుర్భావప్రకారము. )

యరిగి వర్ణజాహ్నవీయమున నింపొందు
నరవిందనేత్రున కావాస మైన
పురమున నర్తకపుత్త్రియై పొడమె
మఱఁ దేర్చిపట్టినమార్గణం బనఁగఁ
దనదు వర్ణాశ్రమ ధర్మముల్ చూపి
మునుల వర్ణాశ్రమములు చూఱఁగొనుచు
జను లాత్మఁ జొక్కి మెచ్చఁగ దేవదేవి
యనఁగ జగన్మోహనాంగియై పొదలె 5350

( 323. దేవదేవీనామకనటకన్యాభివృద్ధిప్రకారము. )
తత్సౌందర్యవిశేషాదివర్ణనము.

నొఱపైన జడవిరహుల వెన్నతరటు
కొఱనవ్వువరభుజంగుల గుండెదిగులు
కరములు పల్లవకంఠపాశములు
గురుకుచంబులు కాముకులరొమ్ముపసులు
కడతొడల్ పాంథులకట్టుకంబంబు
లడుగులు విటహృదయముల శల్యములు
లనఁగ బిటారిసోయగములతోడఁ
గనుపట్టుచుండునంగంబులు గలిగి
రతి కళాప్రౌఢి భారతి కళాప్రౌఢి
నతిశయింపుచు యౌవనారూఢ యగుచు 5360

నొఱపులకుప్పయో యొప్పులగనియొ
మెఱుఁగులదిన్నయో మేలిమిచాలొ
నటనలదీమమో నయములప్రోవొ

బటువులపిండో శోభనకదంబంబో
యని లోకములు గొనియాడంగ మేన
నసలొత్తె నెరజవ్వనము కైలువారఁ
బాటఁ దుంబురుని వాక్రొప్పెడిమ వాణి
నాట రంభాదుల నణకించు మఱియు
నక్కజంబగు దానియందంబుఁ జూచి
చొక్కకుండుట యెట్లు సురనాథుఁ డైన 5370

మలయుసొంపుల దానిమాటలు విన్న
వలవకుండుట యెట్లు వలరాయఁ డైన
దానిఁ బైకొనెనేని తామరచూలి
యైన గౌరీనాథుఁ డైన లోఁ జిక్కి
లోఁగక తేనియలోఁ బడినట్టి
యీఁగలచందాన నెడఁబాయఁగలరె
యట్టిసొంపులు గల యలదేవదేవి
నెట్టనఁ దనవిద్యనేర్పులు నెఱపి
ధరలోన నొరెలకుం దరములు కాని
సురతాణిచే నిలు చూఱలుగొనుచు 5380

( 324. భూపాలచిత్తాకర్షణలీలాదికథనము. )

నరసార్వభౌము నానందింపఁ జేసి
యరుదైన సగము రాజ్యంబుఁ గైకొనుచు
గరినాథుఁ జొక్కించి కటహాకుంభీంద్ర
వరమణిభూషణావళులు గైకొనుచు
గౌళ నేపాళ బంగాళ పాంచాల
చోళేంద్రముఖుల రాజులఁ జొక్కఁజేసి
తనకు నై జంపుబందాయిలం జేసి
కొని లోకములు దన్నుఁ గొనియాడనుండి

యొకనాఁడు నిచుళేంద్రు నుర్వీశచంద్రు
నకలంకగుణధాముఁ డగు సార్వభౌముఁ 5390

( 325. దేవదేవీనాయకగణికాలంకారాదివర్ణనము. )

బొడఁగని తనదు నేర్పులు పచారించి
యెడపక నతనిచే నీరానియీవిఁ
గైకొందు ననుచు నొకమలాయతాక్షి
జోకగాఁ గమ్మకస్తురినలుం గిడుచు
జాతిగొజ్జగినీట జలకంబు లాడి
రీతిగా నొకవింతరేఖ చూపట్ట
వలిపెచెంగావిపావడరం గొకింత
వెలిమించు నెరిపట్టు వెలిపట్టు గట్టి
జవ్వాదిపద నిచ్చి చంద్రకాంతంపు
దువ్వెనఁ గొమరార దువ్వి నెన్నడుమఁ 5400

కొపట యొసపరిబాగుగాఁ దీర్చి
చూపట్టుకొ ప్పొకించుకజాఱఁ దురిమి
తెలిమింపు నాణిముత్తెపుజేర్లతోడఁ
బొలుపొందుపచ్చలబొ ట్టొనరించి
విటుల మన్మథుఁడేయు విరిమొగ్గతూపు
నటన గుమ్మడిగింజనామంబుఁ దీర్చి
బవరిముత్యములఁ జొప్పడి పూర్ణచంద్రు
రవణించు విమలతాటంకముల్ దాల్చి
మొగపుదీఁగెను చెంత ముత్తెపుబలుకు
జిగిమీఱు మణులమించినతాళి వెట్టి 5410

పుంజాలదండదాపున నేవళంబు
రంజిల్ల బణ్ణసరంబు గీలించి
ముంగై మురువుల కిమ్ములఁ గంకణముల

చెంగట ముత్యంపుఁజేకట్లు పూని
దళుకుమించినసందిదండలమీఁద
నెలవంక తాయెతుల్ నెరిపట్టుఁ గట్టి
తిరుగుటుంగరముపూఁదియు లౌన వాము
కరమున ముద్దుటుంగరము గీలించి
పడమటిపన్నీటఁ బద నిచ్చి చెంప
కడల కస్తూరి రేఖలువారఁ బూసి 5420

పోలింపఁ దగు మొగపులతోడ దెసలు
డాలించుమణులయొడ్డాణంబుఁ బెట్టి
యొరయుకుచ్చిలమీఁద నొకయింత జాఱ
మురువైనబిల్లలమొలనూలమర్చి
మరునిపట్టంపుసామజనిగళంబు
కరణి శోభిల్లఁ డాకాల నంచలను
సింగారముగ మీలఁ జేర్చినమించు
బంగారుసరపణి బాగుగా నునిచి
గణికాశిరోమణి ఘనబిరుదాంక
మణినూపురము వింతమహిమగాఁ జేర్చి 5430

తనజోడుకోడైయు తనుఁబాయలేని
తనయగ్రసంభవ తన మున్నె నడవ
నీడుజోడై తను నెనకొల్పఁ జాలు
చేడియల్ తనుఁజుట్టి సేవించి నడువ
నిచులకు నరిగి యానృపసభలోత్తంసు
నిచుకేంద్రుఁ బొడఁగాంచి నేర్పున నపుడు

( 326. వీణాదివిద్యాప్రవీణత్వప్రాప్తిప్రస్తావము. )

రాణించురాగవర్ణములతోఁగూడ
వీణానువిద్యాప్రవీణతఁ జూపి

తక్కినకళలయందలినేర్పు నెఱపి
సొక్కించి వలపులసోనఁ జిక్కించి 5440

యీరాజుచేత సప్తాంగంబుఁ గొనుచు
శ్రీరంగనగరంబుచెంతనే మగుడీ
చనుచుండి చైత్రవైశాఖంబులందు
మినుకైన రోహిణీమృగశీర్షములను
మిక్కిలివేండ్రమై మెకములతలలు
ప్రక్కలోఁ బొమ్మనువడి నెండఁ గాయ
గూడారములబండి గొల్లనగొడుగు
నీడలలోనెల్ల నిలువరాకుండ
వడచల్లునెరయెండ వాతెఱ లెండ
నిడుసోగకన్నుల నెరికెంపుచూప 5450

విరిదేనియలు కమ్మనిరిమీఁదఁ బొదలు
కరణి లేఁజెమట మొగంబుపైఁ బొడమ
నీయెండవడఁ దీర్ప నెలదోఁట యొకటి
యీయెండ లేదొకో యింతులారనుచుఁ
దలపోఁత సేయు నత్తఱిసొంపుమీఱ
నలరుదేనియ నోలలాడి యందంద
పూచినగొజ్జంగిపొదరిండ్లు దూరి
యేచినయలులకు నింపు పుట్టించి
తలిరుజొంపములనెత్తములమై వెడలి
కోలకోలకోలకుల గేడించికొనుచుఁ 5460

గలువల నొరసి చెంగల్వలఁ జెనఁకి
చలిమీఱి తొవలతోఁ జయ్యాటమాడి
వనజపంక్తులమీఁద వడిఁ బల్లటీలు
కొనుచుఁ గుందములమై గునిసియాడుచును
ననసోనగురియుపొన్నలనీడ వెడలి

గొనబుమించిన కేతకుల దండవట్టి
ననతివేగమి నట్టినడిచాయఁ జొచ్చి
కనుపట్టుపన్నీటికాలువ దాఁటి
మగుడి గందంపుఁగొమ్మలతోడఁ గలిసి
పొగడపుప్పొడి గంధపొడిఁ దొప్పదోఁగి 5470

నారాయణునికరుణాదృష్టి వోలెఁ
జారుసౌరభశైత్య సౌభాగ్య మొదవ
వలరాజు గురుఁడు నీవలకులోఁ జేయఁ
గలవాని నిచ్చోటఁ గంటి రమ్మనుచు
నద నెన్ని తనుఁ బిల్వనంపినరీతిఁ
గోదమ తెమ్మెర లెదుర్కొన సేదదేరి

( 327. దేవదేవీనామకగణికామణిసంతోషప్రాప్తిక్రమము. )
విప్రనారాయణసంవర్ధితారామవృత్తనామాది.

యాదేవదేవి తదామోదమునకు
మోదించి పరిమళములజాడ నరిగి
నాగచాంపేయ పున్నాగ జంబీర
పూగ కేసర కుంద పూగ మందార 5480

సాల నారంగ రసాల బంధూక
కోల కుద్దాల తక్కోల ఖర్జూర
కరక చందన శుభాకర కదంబాది
ధరణీజములతోడఁ దనరుచు నెదుట
నందనవనముచందంబు పులస్త్య
నందనవనముచందంబు గేలించు
సౌరభంబుల విందు సలుపు శ్రీవిప్ర
నారాయణోపవనంబు డాయంగ
నరుదెంచి పూదేనియలకాల్వ దాఁటి
విరివాడినెత్తంబువెడచాయ వెడలి 5490

మలగొన్న సంపంగిమ్రాకులు గడచి
చలిమించు పుష్పమంజరుల వీడ్కొనుచుఁ
జొదలినగొజ్జంగిపొదరిండ్లు దూరి
ముదముల వనమధ్యమునకు నేతెంచి
పన్నీటియివముక్రపముమాఁదిచలువ
వెన్నెలలో సీతు వెడనవ్వికొనుచు

( 328. ఉద్యానవనప్రవేశాదివిలాసము. )

మట్టమై తలిరుజొంపములలో నొక్క-
పుట్టమెలో నెండ పొడపడకుండఁ
దలిరించి కడు నివతాళించు నొక్క-
యెలమావిక్రిందటి కేతెంచి నిలిచి 5500

యాచల్లగాలియు నాతోఁటసొబగు
చూచి హా యని షొక్కుచును దేవదేవి
యనుఁగుఁజేడియలెల్ల నందంద కొలువఁ
దనయగ్రజాత నుత్తటిఁ జూచి పలికె
నోయక్క- కంటివే యొకయెంతవింత

( 329. ఉద్యానవనకుసుమశోభాదివిలాసము. )

యీయెడ విరహులయెదలు బిట్టగల
జలజాస్త్రుఁ డడిదముల్ జలిపించినట్లు
చిలుపగాలికి మావిచిగురు లల్లాడె
నమలనానాప్రసూనార్ఘ్యసంతతుల
రమణీయవివిధ మరందపాద్యములఁ 5510

దలకొన్నభృంగనాదస్వాగతముల
నెలమివాటిల మన కీపాదపంబు
లాతిథ్య మొసఁగెడి నదె చూడఁ గదవె
యోతలోచూదరి యింక నొకవింత వినవె

పంకజాస్త్రునివెన్ను బలమైనవిరుల
సుంకులు రాలు నీసోమరిగాలి
చుట్టాలసురభియై సురభిసంతతుల
నెట్టనఁ గొనివచ్చి నేఁ డిచ్చె మనకు
నవపల్లవోష్ఠి సూనవిరళహాస
ప్రవిమలపుష్ప పరాగాంగరాగ 5520

కలకంఠనాద సంకలితాబ్జవదన
యలికులనిభవేణి యగువనలక్ష్మి
మనలపై నెంతప్రేమము నేసె నిపుడు
వనములో మనయెండవడయెల్లఁ దీర్చె
నని పలుకుచు నున్న యాదేవదేవిఁ
గనుఁగొని పలికె నగ్రజ నేర్పు మెఱసి
సారంగముఖపక్షిసమితి వేఁటాడి
శ్రీరంగవిభుఁడు విచ్చేయునవ్వేళ
నతని సెదలు దేర్చు నారామమునకు
నతులితం బగు జగదభిరామమునకు 5530

మనబడలిక లెంత మన మన నెంత
యని తనతోడ నిట్లన దేవదేవి
తమకుఁ జేరువఁ దపోధామవిస్ఫూర్తిఁ
గమలాప్తబింబంబుగతి నొప్పువాని

( 330. విప్రనారాయణాఖ్యహరిభక్తదేహశోభావర్ణనము. )

బాలేందుచాయలఁ బదిరెండువగల
డాలించునూర్ధ్వపుండ్రంబులవాని
గాత్రంబుమై నొప్పుగలుగు పైడూర్య
సూత్రంబుగతి బ్రహ్మసూత్రంబువాని
నొప్పుచందురుని రాహువు డాసినట్లు
కప్పారు నిడువాలుగడ్డంబువాని 5540

మొలకొత్తుము త్తెంపు మోసులకరణిఁ
దళుకొత్తు శుభ్ర దంతంబులవానిఁ
దవిలి మల్లియచాలుతావికై కదిసి
బవరిఁ జుట్టినయట్టిభ్రమరాళికరణి
సవరని తులసిపూసలదండతోడఁ
గవగూడి హరినీలకాంతి గేలించు
తమ్మిపూసలపేరు తనకు నై జంపు
సొమ్ముగా సవరించి చూపట్టువాని
సదనగావేరితోయంబులఁ గాల్వ
మొదలబంటెని ముంచి ముంచి పోయుధను 5550

దడయకవచ్చి గుద్దలిఁ గొనితొంటి
మడవ మార్చుచు మాఱుమడవఁ దీర్చుచును
ద్రవ్వంగవలయుచోఁ ద్రవ్వి యందంద
పువ్వుఁ జెట్టులకెల్ల బ్రోదిసేయుచును
ఆరామకృత్యంబు లాచరింపుచును
జీరికిం దము లెక్కసేయనివాని
శౌరికైంకర్యసంసక్తు శ్రీవిప్ర
నారాయణునిఁ గాంచి నగుచు నిట్లనియె
నక్కక్క చూడవె యలవాఁడు మనల
దిక్కుఁ గన్గొన డెంతతెంపరిఁ వీఁడు 5560

మీఱుజవ్వనము క్రొమ్మిసిమితో నిల్వ
నూఱుబంగౌడిని గన్నులఁదన్నుఁ జూడ
నొగి యతీశ్వరుపోల్కి నుట్టులతోడఁ
దెగఁగోసికొన్నాఁడొ తెగువతో మున్నె
నలినశరుండైన ననుఁ జూచెనేని
నిలువునఁ గరఁగడే నీరుచందమున
నిటవచ్చి మనము దా నెంతసేపాయెఁ

గటకటా! యొకమాటు కన్నులఁ జూచి
యెందుండి వచ్చితి రేమని యనఁడు
మందుఁడో జడుఁడో సోమరియో హెగ్గడియొ 5570

యన విని శ్రీరా మయని కేలు చెవుల
నొనరంగ సవరించి యోసి పోవినవె
వీరివారలఁ బల్కువిధమునఁ బెద్ద
వారల నిట్లనవచ్చునే నీకు
మందుండు జడుఁడు సోమరియు హెగ్గడియు
నిం దుండునే? యున్న నిట్టి తేజంబు
గలుగునే? కమలసంగముఁ గోరు తేఁటి
యిలలోన నుమ్మెత్త కేల యాసించు
రంగేశకైంకర్యరతుఁడై నయాతఁ
డంగనారతిఁ గోరునా యెందునైన 5580

నని పలుకుచునున్న యక్కతో మగుడ
ననియె గద్దింపుచు నాదేవదేవి

( 331. శాండిల్యపరాశరకౌశికమునివరచరిత్రదృష్టాంతము. )

గాలియే కుడుపుగాఁ గైకొని కాలు
నేలమోపక నూది నిలిచియున్నట్టి
శాండిల్యుఁ డల పరాశరుఁడు కౌశికుఁడు
నుండిరే యింతుల నొనఁగూడఁ కిలను
ఉప్పు నీరును జొచ్చియున్నట్టిమనుజుఁ
డప్పరో లోనుగా కతఁ డేల యుండుఁ
గలవి లేనివి కొన్న గడియించి వట్టి
బలిమి చూపుచు లేని పౌరుషం బెన్ని 5590

కొనల కెక్కించెదు గోఁచిబాపనిని
అనుధుఁ గోపించి యిట్లనియె సోదరికి

సోదరీ ! వినవె యీయోగినాయకుని
నీదైన రూపంబు నెఱపి చొక్కించి
వలపులు పచరించి వలపించితేని
దొలఁగక యేను నీతోత్తు నయ్యెదను
అనుమాట లాలించి యాదేవదేవి
యనియె సంతసమున నాయక్కతోడ
మఱవకే యీమాట మఱవకే నీవు
మఱచిని నేనేల మఱవనిచ్చెదను 5600

అలివేణి నానేర్పు లన్నియుఁ జూపి
వలపించి వీని నావలలకు లోను
జేసెద నారీతిఁ జేయకయున్న
దాసి నయ్యెద నీకుఁ దరళాక్షి యనుచు
ననుఁగుజేడియలతో నగ్రజం బురికిఁ
జనిచి తా నొకపాదపమునీడ నిలిచి
తొలుతఁ బెట్టినయట్టితొడవులుఁ బట్టు
వలువయు సడలించి వనములో నొక్క
యేకాంతమైయున్నయెడ డాఁచి యప్పు
డాకాంత యొకయుపాయము విచారించి 5610

గన్నేరుపూచాయ గల నీరుకావి
వన్నియపుట్టంబు వదులుగాఁ గట్టి
మిడుగుల నొరయ నామీఁదఁ బింజయల
మడిచారుచెరిపియామై నేర్పుతోడ
బిగిచన్నుఁగవమీఁదఁ బెరయఁ బయ్యెదయు
దిగిచి నెన్నడుమున దిండుగాఁ జుట్టి
నడిముక్కు నొరయంగ నామంబు వెట్టి
నడుమ హారిద్రచూర్ణపురేఖఁ దీర్చి

వరుసగాఁ దిరుమణివడములు వైచి
పరమవైష్ణవ ముట్టిపడఁగఁ జూపట్టి 5620

వైకుంఠపురినుండి వచ్చెనో యనఁగఁ
గాక వైరాగ్య మీఁగతి నిల్చె ననఁగఁ
జని తోఁటలో నున్న జగతీసురేంద్రుఁ
గని యాననము వంచి కరములు మోడ్చి
గొదుకుచు నొదుగుచు గోలచందమునఁ
బదము లెంతయుఁ దొట్రుపడఁగ నందంద
నిలిచి ప్రాకులపొంత నిక్కంపుభయము
గలిగినదానిసంగతి వడంకుచును

( 332. విప్రనారాయణసమీపప్రాప్తికథనము. ప్రార్థనాప్రకారము. )

దోరంపుఁగన్నులఁ దొరఁగెడు బాష్ప
ధారలు చెక్కుటద్దములమై నిగుడ 5630

నెదురేగునమ్మాని కెదురేగి యతని
పదపంకజములపైఁ బడి దైన్యపడుచుఁ
దొడిబడ రెండుచేతులఁ పదాబ్జములు
విడువక పడి వెక్కి వెక్కి యేడ్చుచును
నర్తకీగ్రామణి నలిఁ గ్రుక్కి క్రుక్కి
యార్తి రెట్టింపంగ నాయోగి కనియె
నోయార్తరక్షక ! యోకృపాచంద్ర !
యోయాదిగురునాథ ! యోమునినాథ !
రంగనాయకపాదరాజీవలోల
భృంగ ! యభంగనిర్జితదోషకరణ ! 5640

పాథోధికన్యకాపతిభక్త ! యోగి
నాథ ! యనాథను నను గావు మనుచు

మాటిమాటికిఁ బల్కు మట మాయలాఁడి
మాటలు నిజమని మది విచారించి

( 333. యోగికలితసంభాషణాప్రకారము. )

కరుణాపయోరాశి గాన నయ్యోగి
తరుణి లే లె మ్మన తనకేల నెత్తి
యెందుండివచ్చితి వేది నీనామ
మిందుబింబానన యేకారణమున
నిటకువచ్చితివి నా కెఱిఁగింపు మనినఁ
దటుకునఁ బాణిపద్మంబుల మొగిచి 5650

( 334. గణికామణిప్రత్యుత్తరప్రకారము. )

యీతఱిఁ జిక్కెఁ బో యితఁ డంచుఁ జెప్ప
నాతికై వడి యెలనాతి యి ట్లనియె
నేమని మీతోడ నే విన్నవింతు
నేమని నానామ మిపుడు సెప్పెదను
ఐనను మీయాజ్ఞ యది మీఱరాదు
గాన నావచ్చినక్రమ మేర్పరింతుఁ
బోడిమి నిలఁ బుట్టుపుట్టువులందు
నాఁడుపుట్టువు హీన మందులోపలను
గంజనందనుఁ డతికష్ట మైనట్టి
లంజపుట్టువున నీలాగున నన్నుఁ 5660

( 335. ధనవినియోగప్రకారకథనము. )

బుట్టించె నారోఁతపుట్టునఁ బుట్టి
యట్టె నే గడియించు నతిహీనధనము
తనతల్లి దాఁచి యాధనమెల్ల పిసిఁడి
తనమున నిలదేవతలకు విప్రులకుఁ
జీమంత యిడక తెచ్చినకాసు లెల్ల

వేమాఱు డాపంగ వేసరి యేను
బడయంగవచ్చు నాపసి డిచే నేమి
పడయంగవచ్చు వెంబరవిత్త ! యనుచు
రోసి యాతల్లిదండ్రులపొందు వీడఁ
గోసి చంచలకామగుణకవాటంబు 5670

( 336. స్వానుగుణకైంకర్యప్రార్థనశైలి. )

మూసి నీపదపద్మములు వచ్చి డాసి
డాసి నయ్యెద నని తలపోసి యిపుడు
పనివిని మానీంద్ర ! భవదీయపాద
వనజముల్ శరణని వచ్చితి నేను
నెరవుగాఁ దలఁపులో నిడక వేవేగఁ
గరుణించి యొకయూడిగంబుఁ గల్పించి
పనిగొను మింక నీవంచనే కాచి
కొని యివ్వనముఁ గాచికొను చునుండెదను
భర్తవు సకలసంపదలకు నాత్మ
కర్తవు నీవు యోకరుణాంబురాశి ! 5680

( 337. తత్ప్రార్థనాంగీకారప్రకారము. )

యన విని మోదించి యామాయలాఁడి
యనుమాట లెల్లఁ దథ్యములేయటంచు
మానినాథుఁడు తనమదిలోన వార
మీనలోచన సధర్మిణిగా నెఱింగి
కనకచేలాంగుని కైంకర్యమునకు
ననుకూల మగుసహాయము గల్గె ననుచు
ననిశంబు నారామ నారామమునకుఁ
బెనుపొందఁ గావలిపెట్టి తా నరిగి

( 338. హరికైంకర్యాచరణశైలి. భైక్ష్యాచరణాదిప్రకారము. )

యలరంగధాముఁ డంతంతఁ జిత్తమునఁ
నలరంగ దామంబు లర్పించి మగుడి 5690
చనుదెంచి తెచ్చు భైక్ష్యము మనోవీథిఁ
బనుపడ శ్రీరంగపతికి నర్పించి
మును దా భుజించి ప్రమోదంబుతోడఁ
దనప్రసాదము పొలంతకు బ్రసాదించి
యగపడి కావేరియంబుపూరంబు
మొగవాళమునఁ గుంభమున ముంచి ముంచి
యెడపడకుండ నీరెత్తి వానీట
వడి మడమలు చిందు వంపు గాకుండఁ
కుసుమమంజరులసోఁకున కోర్వలేని
కుసుమకోమలి వాడిగుద్దలిఁ బూని 5700

( 339. ఆరామపోషణరీతికథనము )

నిడుదవాయిగఁ జేసి నీరు నిండార
మడవ గప్పుచు దండ మడవ విప్పుచును
దనసేయుసేద్య మంతయుఁ బరవంబు
గాని తాను సేయ నెక్కొను గూర్మితోడ
నిరీతి యోగీంద్రుఁ డింతితోఁ గూడ
నారామకృత్యంబు లాచరించుచును
నెలమిమైఁ బగలెల్ల నిట్లుండి రేయి
యెలనాఁగ యొకపొదరింటిలో నుండఁ
జనుదెంచి తనపర్ణశాలలోనుండి
దినదినంబును దేవదేవుని సేవ 5710

( 340. ఏకాంతాలోచనాప్రకారము. )

యకలంకమానసుం డై చేసికొనుచు
నొకయేఁడు గడపె నయ్యువిదతోఁ గూడి

యంత నా కాంత యేకాంతంబునందుఁ
జింతించి తనలోన శ్రీరంగవిభుని
దూరి పూఁబొదరిల్లు దూరి డెందమునఁ
గూరినవగపుతోఁ గుందుచుఁ బలికె
నిచ్చోటి కుండుండి యేల వచ్చితిని
వచ్చితింబో యిటువంటిగొంటరిని
గనుఁగొంటి చేలకో కనుఁగొన్నత్రోవఁ
జనక యీగతి కొనసాగనిప్రతిన 5720

సేసితి నేలకో శ్రీరంగరంగ
నాసరివారిలో నగుబాటు గాఁగ
నని కనుమూయంగ నారంగవిభుఁడు
సనుదెంచి వెఱవ కోసారంగనేత్ర
మెల్లి యీప్రొద్దున కెల్ల నీమనసుఁ
జల్లఁజేసెద నని చనిన మేల్కాంచి
యరుదంది డెందంబునందు సొంపంది
యరవిందసమనేత్ర యారాత్రిఁ గడపి
మఱునాఁడు వనములతో మానితోఁ దొంటి
తెఱఁగునఁ గూడి వర్తింపుచున్నంత 5730

( 341. ఆరామసౌందర్యకామోద్దీపనవర్ణనము. )

గగనయాంత్రికుఁడు లాగపుబంతి డాఁచు
పగిది భానుఁడు గ్రుంకెఁ బశ్చిమాంబుధిని
తెర నరమొఱఁగి నర్తింపుచునున్న
యరవిందనయనలయందంబు దోఁప
నెఱయ మించులతోడ నీరాళ్ళగొంది
మెఱచెం దళుక్కన మేఘంబు చెంతఁ
గాముకహృదయపుష్కరము నిండారఁ
గామాంధకారంబు గప్పినపగిది

గగన మెక్కెంతయుఁ గానరాకుండ
మొగులు గ్రక్కమ్ముచు ముంచె నల్గడల 5740

ముంచి నల్గడ నల్లముసురుగాఁ బట్టి
మించులతోఁగూడ మేళమై పొదలి
విటపాగ్రములు వెడవెడఁగ నల్లాడఁ
జిటిపొటి చినుకులు చినుక నవ్వేళ
నాకులమీఁద నీ రానక జాఱి
కోకమైఁ బడ పడంకుచు నొదుగుచును
నులికి యాపొదరింట నుండరాకున్నఁ
దలఁకుచు వెడలి యాతన్వంగి వంగి
బలుపువ్వుగుత్తులబరు వానలేక
నలపుష్పలత యసియాడుచందమునఁ 5750

జన్నుగొండలవ్రేఁగు సైరింపలేక
చిన్నారికౌఁదీఁగ జివ్వాడుచుండ
జవులిఁ జూపట్టెడు శంపాళికేళి
దివియలై తనమున్నె తెరువు చూపఁగను
గనుచూపుమించులు కారుమించులును
బెనఁగొన్నఁ దెలియక బెగడొందికొనుచు
తనకొప్పుమొగులునా దట్టంపుమొగులు
నెనసిన వివరించి యెఱుఁగంగలేక
యల్లనల్లన వచ్చి యామహాయోగి
వల్లభుసదనంబువాకిటియెదుట 5760

దళము లొండొంటితోఁ దార్కొని మిగుల
దళమైన యొకచలదళముక్రిందటికిఁ
జనుదెంచి మరుఖడ్గశాఖయపోలెఁ
దనరుచు నాబ్రాహ్మణిదండ నిల్చుటయు

వలిపిరిగాలితో వలి మీఱె మీఱె
బలువిడి వాన యంపాజాల మైన
యలజడిచేతఁ బాయనియీదగాలి
యలజడిచేతఁ దా నందంద వణఁకి
యే రావికిందట సీరీతి నుండ
నేరా విచారింప విభరాజవరద ! 5770

( 342. పర్ణశాలాసమీపమహావృష్టిప్రాదుర్భావము. )

యని రంగవిభునకు నంతరంగమున
ననలోత్తుభక్తి సన్నుతిఁ జేయుచున్న
నప్పు డాపర్ణశాలాంతరసీమ
నొప్పుచుం బవళించియున్న యాయోగి
యలవిమీఱిన యమ్మహావృష్టి యిపుడు
వెలిచెనో వెలవదో వివరింతు ననుచు
మసకల ద్వారసీమకు వచ్చి హస్త
కిసలయాగ్రమున వాకిలి యూఁది నిక్కి
జలదకీర్ణము నాకసముఁ దొంగి చూచి
యలరావిక్రిందటియలివేణిఁ జూచి 5780

( 343. కామినీసమాహ్వానప్రకారము. )

తొలుత నభ్రంబునఁ దుళగించుమించె
యిల వ్రాలెనో కాక యిది యది యైన
దండనె చలనమొందక రూపుతోడ
నుండునే యనుచు నిట్లాకగొంతతడవు
తలపోసి తలపోసి తరళాక్షి ! యనుచుఁ
బలుకరింపుచు నిజభావంబుఁ గాంచి
జక్కవకవ వెక్కసపు వలవాడి
ముక్కుల నొత్తినమురువు దీపింపఁ

బనుపడ నులిపచ్చిపయ్యెదకొంగు
మొనలనానినకుచముల నొప్పుదాని 5790

మీఱినచింత నెమ్మొయి విలోకించి
తేరి కన్గొని దేవదేవిగా నెఱిఁగి
కటకటా ! వానచేఁ గడునొచ్చి దీని
నిటకు రప్పించునో యేల యివ్వేళ
నేకాంతమునవచ్చి యెలనాఁగ లున్న
నేకాంతులకుఁ గూడునే యని తలఁచి
యీాద యేగతి మాను నేదయమాలి
యీాదెస నుండంగ నిగురుఁబోణికిని

( 344. ఈశ్వరప్రేరణానుగుణమోహప్రాప్తిప్రకారము. )

అని యీాశ్వరప్రేరితాత్ముఁడై మఱియు
ననబోఁడిఁ గని విప్రనారాయణుండు 5800
తడయనేటికి రమ్ము తరళాయతాక్షి
జడియక మాపర్ణశాలలోపలికి
నన విని యిదియసం దనుచు నాచక్కి-
మును దాఁచియున్నపొమ్ములు నంబరమును
గొనుచు వేవేగ నక్కుటిలకుంతలయుఁ
జనుదెంచి యాపర్ణశాలలోఁ జొచ్చి
యలిబలంబులు వచ్చి యతనితో మున్న
యెలగోలు సేసిన యింపు దీపింపఁ
( 345. విప్రనారాయణమునికామకావస్థాదిప్రకారము. )
దల తడియార్చి చందము దోఁప మాని
కులనాథు పోఁకంగఁ గ్రొమ్ముడి విడిచి 5810

జాడించి సీమంతసరణు లేర్పడఁగఁ
గూడదువ్వుచు జారుకొప్పు గీలించి

జోఁకగాఁగనయంబుఁ జొనిపి మై మొగలి
రేఁకుబాగున కొంగురింగు వోఁ జెరివి
పాలిండు లజుఁగానుపడ నొకవింత
లీలఁ బయ్యెదకొంగు లేజాఱువైచి
చికిలిచేసినమారుచేకత్తి వోలె
నకలంకమణిభూషణాన్విత యగుచుఁ
గోమలునిక్కఁగ నేయుకుసుమాస్త్ర మనఁగ
బొమలు నిక్కఁగ నొరపులచూపు జూడ 5820

నినుపైనచూపువెన్నెలసోఁగ సోఁక
ఘనమాని హృచ్చంద్రకాంతంబు కరఁగ
మాని వయ్యారిదీమపుఁ జూపువలకు
లోనయ్యె ననుచు నాలోలాక్షి కదిసి
యుదిరెమె సందిని మొలుఁగెత్తి తేనియల
చిదురుప ల్చెవులలోఁజిలుక నిట్లనియె

( 346. సుందరీకలితమునిపాదసేవాప్రకారము. )

నెఱపక వనములో నిందాఁక దిరిగి
బడలితి రొక్కింత పదము లొత్తుదునె ?
యనుచు నూరులమీఁది కామానిపాద
వనజముల్ కరపల్లవముల రాఁదిగిచి 5830

యొత్తి కన్నులమీఁద నొత్తి డెందమున
నొత్తి మత్తిలి పల్కె నోమానిచంద్ర !
కొండగా నినుఁ జూచికొని వచ్చి యిచట
నుండఁగా ననుఁ జూచి యొక్కనాఁ డైనఁ
బడుచ రమ్మని కేలుపట్టి లాలించి
యొడబాటు గావించి యొకమాఱు హితవు

( 347. కామోద్దీపకశృంగారణాదివర్ణనము. )

నెరవుసేయక చెప్ప నీరీతి గలదె ?
హరిహరీ ! యింకనైన నానతి మ్మనినఁ
గమలాస్యుత్రిమార్తాపటంకారంబుపగిది
సమకొన్న తేఁటులఝుంకార మెసఁగ 5840

నసతేనియలవాన నాని యింపూని
చనుదెంచె నొయ్యనఁ జలిగాలికొదమ
రాగంబుతో నంతరంగము రంగ
భోగి ప్రేరేప నప్పుడు మానివరుఁడు
నలుగడఁ జొరనేయు నళినాస్త్రిపువ్వు
ములుకులు వెలికింత మునుపుచందమున
నలమోహనాంగి చే యంటుటవలన
నిలువెల్లఁ బులకింప నెన రామతింప

( 348. సుందరీసురతసుఖానుభవప్రకారము. )

హరి కుబ్జ మున్ను నెయ్యంబునం గలయు
కరణి నాతేమ నంగజకేలిఁ దేల్చె 5850

రతి వేదశిక్షకు రతిరాజు తరటు
గతివేణి యొప్పు నక్కలకంఠకంఠి
వనములు గాఢభావజకేలిఁ గొన్ని
దినము లచ్చోట వర్తించినమీఁద
నారామ తనకోర్కె యలరంగ విప్ర
నారాయణుని యోగినాయకోత్తముని

( 349. విభండకమునికుమారచరిత్రదృష్టాంతము. )

మునుపు విభాండక మునిపుత్త్రుఁ దోడి
కొనిపోయినట్లు తోకొని యేగుదెంచి

తనయగ్రజాతముందర నిల్వ నవుడు
గని మోహనాంగి డగ్గఱ వెఱఁగంది 5860

యవునౌను నీ వాడినట్టి యీ ప్రతిన
యవగడం బగుమాట లవి నీకె చెల్లు

( 350. మోహవాక్యప్రకారము. )

నోకొమ్మ ! నీదుమా టొకటి నేఁ డొకటి
కాకుండ పంతంబుఁ గడ తేర్చికొంటి
వాకొని వేయును వర్ణింప నేల
నీకు నీవే సరి నిఖిలంబులోన
నీదెస మఱి నేర్పు లెన్న నేమిటికి
నీదెపో నేర్పైన నేర్పు తన్వంగి !
యిలలోన నేము నీయిందఱిలోన
మెలఁతరూపులఁ జూడమితి మింతెకాక 5870

నీవంటిచతురత నీవంటిసొబగు
నీవంటినేర్పు నెన్నిన మాకుఁ గలదె ?
మానినీమణులలో మఱియును నాట
దానవై నను నీవ తలిరాకుబోఁడి
మఱియును నీవ పో మఱియును నీవ
మఱియును నీవ ముమ్మాటికి ననుచు
నెన్ని కౌఁగిటఁ జేర్చి యింతి నామాట
లన్నియు నోర్చుకొమ్మని గారవింపఁ
దనచెల్మికత్తియల్ తనుఁ జెక్కుగతులఁ
గొనియాడ నావారకుటిలకుంతలయు 5880

నలభూసురేంద్రుతో ననయంబు బత్తి
గలిగినదానిసంగతిఁ గొన్నినాళు
లెనసియుండఁగఁ జూచి యితరు లాసన్నఁ

గని యప్పనముగ నొక్కనిపాలఁ జిక్కి
తగువైనమగువలం దగులుట రోఁత
తగదని విటులు రాఁ దడసినకతన

( 351. వారవనితాస్వరూపకార్యప్రదర్శనాది. )

వెచ్చసచ్చములకు వెడవెడ యైన
నచ్చపలాక్షిలో యనుఁగు వోవిడిచి
వసుధలోపల వారవనితలవలపు
పసిఁడిలోఁడిద, కాదె ? భావింప మఱియు 5890

నెన్న నేటికి లంజ కిలలోనఁ గ్రొత్త
మిన్న లిచ్చినవాఁడె మీనకేతనుఁడు
ఈనియామరుఁడైన హీనవిగ్రహుఁడు
గాన యామిని యున్నగతి యెల్ల నెఱిఁగి
యీఁబుచ్చుకొనకుండు మెఱిఁగి యీపడుపుఁ
బూఁబోఁడి మదిఁ దలపోసి యే వీని
నడి నొంద కేరీతిఁ జయ్యన నిల్లు
వెడలఁగొట్టఁగ నెద్ది వెఱ వని తలఁప

( 352. వృద్ధగణికారూపవర్ణనము, తద్దుష్టకార్యాదికథనము. )

నల్లన నది గని యాఁడేవదేవి
తల్లి పల్లవభావాహుతాడితవదన 5900

మంకుదిమ్మరి మటమాయలబండి
డొంకువోయినటక టొంకుసంకటము
విటుల నిచ్చలుఁ గాఁచి వేఁచుటవలన
విటకంటకిఖ్యాతి వెలసినగబ్బి
యెప్పుడు తనయింటి కేగువారలకుఁ
దప్పుబాసలు సేసి తప్పినకతన
వెలికురికినపండ్లు ప్రేలాడుచండ్లు

కంఖపవట్టినమేను కోఁతిమోగంబు
తప్పకన్నును బట్టతల గూనివీఁపు
పుప్పిగోళ్లును నీచవోయినకాళ్ళు 5910

చీమకండ్లను మొండిచెవి బుఱ్ఱముక్కు
గాముఁ బోలినమూపు గలిగి యందంద
వెరగై నతనమాట వినినంతలోనె
పొరుగిండ్లకుక్కలు బోరున మొరఁగఁ
జిలుముచాయలపండ్ల చెడ్డకంపునకుఁ
దలఁకి చుట్టాముడ దయ్యాలు బెదరఁ
గడుఁగోప మెసఁగ రోఁకలి మూఁపుమీఁద
నిడుకొని దుడి దుడి నేతెంచి పలికె
నోవెఱ్ఱిబిడ్డ! నీ కుచిత మి యిట్లు
నీవంటిలంజెల నీవు గన్గొనవె 5920

( 353. లజ్జాకరవాక్యప్రేరణాది. )

తాటోటుమాటల తక్కరిగొంటు
తాటదమ్మని నమ్మఁ దగునె యోయమ్మ
కోఱమాలి యున్నవే గొంగబాపనికి
**మరు** లేల కొంటివే మటమాయలాడి!
గారాబు వెన్నెల గలనాఁడె యల్లో
నేరేళ్లు గాకయో నీలాహివేణి!
బ్రదుకెల్ల ముదిమిచేఁ బడకుండ నాఁడె
ముదిసినఁ గొరయానె ముంజ లంజెయును
వయసునం గడియింపవలయుఁగా కరుగ
వయసు రమ్మనినను వచ్చునే మగుడి 5930

యిచ్చుట నొక్కఁగా నిచ్చునో వీస
మిచ్చునో వీఁడు దా నింటిలోఁ గలవి

తిని పులిబోఁతుపొందికనున్న లెక్క-
గొన వింటిలోపల గుండ్రించుకొనుచు
నేనాఁటిలంజియ లింటిలో వెరఁజి
యేనాఁటిమగలకు నెదురువెట్టుదురు ?
ఎలయించి ప్రియులకు నింపు పుట్టించి
కలకాలమును జేతఁ గలకొను లెల్ల
వలిపించి వెరఁజుకోవలయును, గాలి
గలనాఁడె తూర్పెత్తఁగాఁ దగుఁగాక 5940

యిన్నాళ్లు నోర్చితి నిఁక వాని వదలి
యున్న నామాటలో నుండు కాదేని
పూని నీబుద్ధులఁ బోయితివేని
వాని నిన్నును బట్టి వడి నంటఁగట్టి
చంపి చాఁగరగొని సదముదం బాడి
కొంప నుండకయుండఁ గొట్టి తోలుదును
అని వెండియును దన్ను నదలించి కినుకఁ
గనుఁగొని వేయుసంగతుల సాదించి

( 354. స్వకీయాలోచనా-చింతాప్రకారము. )

జనని వేసారంగ సారంగనయన
తనలోన తాను చింతనసేయుచుండెఁ 5950

దనపట్టి శాంతియంతయు మట్టుపెట్టి
కనలుచు నావిటకంటకి యపుడు
చేరి యాచెంత భాసిల్లెడు విప్ర
నారాయణునిమీఁద నడతెంచి కదిసి
కడిఁదికోటికి గంట గట్టి నిచ్చలును
బడసి గడించు నాబంగారుకుండ
మక్కువ నెలయించి మాఱు లేకుండఁ

దక్కక మందులు తల కెక్కఁజేసి
యోరోరి నాబిడ్డ యో జెల్లఁ జెఱచి
తీరీతిపెఱ పోకయింతైన లేక 5960
క్రొత్త లిచ్చెదో పుచ్చుకొనియెదో పట్టి
రిత్తమాటలు నీవు రెంటునుం బస్తు
లోరి నీ వొకచిన్న మొసఁగవు లంజ
వారిసొమ్ములు దిన వారి కేమగును
వీఁగనిమృత్యువు వెస నన్నుఁ జూచి
లోఁగుఁ దామరపాకులోనీరు వోలె
నలజముఁ జైన నాయందంబుఁ జూచి
తలకు నొక్కింతయుఁ దలఁకవు నీవు
మడియఁ గొట్టుదునో దిమ్మరితొటదమ్మ
వెడలెదో మాయిల్లు వేవేగ ననుచు 5970

( 355. విప్రనారాయణముని పరాభవనిరాసాది. )

బెగడొంది తనుఁ జూచి బీరువో నన్న
జగతీసురేంద్రుహస్తముఁ బట్టి తిగిచి
నిడుసాగిలఁగ నెట్లు నెట్లు నడంగ
మెడ వట్టి ద్రొబ్బి గామిడితొండ యనుచుఁ
దలుపు బిగ్గన మూసి తడయక గడియ
బలువుగా నిడి వెలుపలిమానిఁ గూర్చి
మగుడివచ్చిన సిగ్గుమాలుతు ననుచు
జగటాఁగ ముదుసలి సాదింపుచుండె
నంత నామునినాథుఁ డంతరంగమున
నెంతయుఁ జింతించి యే పెల్ల దక్క 5980
జగడించునల బేరజమునకు నోడి
పొగులుచు నిలు సొచ్చి పోవంగ లేక

( 356. యోగివరదీనదశాకార్యాది. )

పలువెఱంగులఁ మేలుపడి చిక్కియున్న
పొలఁతిపొందులు డించి పోవంగలేక
వకవకలై యింత వ్రతముఁ దక్కినను
సుకము దక్కకపోయెఁ జూచితే యనుచు
ఖిన్నుఁడై వారివాకిట నున్న పంచ
తిన్నెపై నొదికిలి దేవుఁడా యనుచు
దలక్రిందఁ జే యిడి తనలోనతానె
తలపోయుచుండె నంతట వెన్నచాయఁ 5990

జిలుకముక్కులచాయ జేవురెంపంగ
ఫలితాస్తనగచూతపరిపక్వఫలము
ఇల వ్రాలెనో యన నినుఁ డస్తమించె
నలుకనిమతులలో యోగీంద్రవరులు
హరిపదధ్యానామృతాహారలహరి
నరగన్ను లిడినపోయుగము దీపింప
విరిదామరలు వెడవెడఁ గన్నుమొగిచె
గరుపంబు దక్కె జక్కవమొత్తమునకుఁ

( 357. సాయంకాలవర్ణనాప్రకారము. )

కుముదినుల్ చంద్రుఁ గన్గొనుచంద మెసఁగెఁ
గుముదముల్ విరియ గ్రక్కున తేఁటు లెసఁగె 6000

నగి కోపమునఁ గాలనరసింహమూర్తి
గగనహిరణ్యవక్షము విదారింపఁ
దొరగు రక్తంబునాఁ దులగించుసంజ
నరుణాంశువల్లిక లలరె నభ్రమున
నలరాత్రికోమలియాఁదలఁ గలువ
చెలికాఁడు పెట్టినసేసబ్రా లనఁగఁ

వెలిమించుమించులు దీండ్రింప నభ్ర
తలమునఁ జూపట్టెఁ దారాగణంబు
లున్నతోన్నత మైన యుదయశైలమునఁ
జెన్నొందు నమృతంపుసెలబుగ్గ యనఁగ 6010

నలకాముకులహృదయములలో మంట
వెలిమించె నన నొప్పె విధుమండలంబు
వేదన గలమానినివిరహార్తిలతకు
బ్రోది సేసినరీతిఁ బొదలెఁ జంద్రికలు

( 358. శ్రీరంగనాథనైవేద్యసమర్పణప్రకారము. )

రంగనాయకుఁ డౌనరంగ నాయంగ
రంగవైభవముల రాజసం బెసఁగ
నప్పు డేకాంతపాయస మారగించి
చొప్పడుముత్యాలసొంపు దీపించి
క్షీరతరంగంబుచె న్నగ్గలించి
హారపుంజంబుచాయలఁ గ్రిందు పఱచి 6020

కపురంబు చవచవఁగా నాడి మంచు
రపణంబు విడియించు రమణఁ జెన్నొందు
నహిరాజశయనంబునందు నిందిరయు
మహియు నీళయును బ్రేమము దయలొప్పఁ
గెమ్మోవి దలిరాకు గేలించు కేలి
దమ్ములఁ బాదపద్మంబు లొత్తంగ
నొప్పుగా నొకవింతయొయ్యార మొదవఁ
గప్పిన హేమాంశుకంబు చూపట్ట
జడిగొన్న ముత్తెంపు జల్లి గింజ్లముల
విడియంబు డాపలఁ బెంపొందుచుండఁ 6030

బెంగావితలిరులజిగి మించు నొక్క-
కెంగేలు మస్తంబుక్రింద సమర్చి
యకలంక కంకణోదంచితం బైన
యొకకేలు జానువు నొరయంగఁ జాఁచి
పవళించి యారంగభర్తకెమ్మోవి
చివురుపై వెన్నెలజిగితేటరవలు

( 359. అకారణకలితమందహాసప్రశ్నాది. )

మలయ నకారణమందస్మితంబు
సలుప నచ్చెరు వంది జగదేకమాత
రంగనాథుని పాదరాజీవయుగళి
బంగారుపాలిండ్లపై నొత్తుకొనుచుఁ 6040
బగటున నీవేళఁ బనిలేనిపనికి
నగ నేల చెప్పుమ పన్నగరాజశయన !
నావుఁడు మిగుల మన్ననతోడ దేవ

( 360. రంగరాజ కృతప్రత్యుత్తరప్రకారము. )
విప్రనారాయణదైన్యదశాకథనము.

దేవుఁ డాయిందిరాదేవి నీక్షించి
యారయ నొందు గా దబ్జాక్షి ! విప్ర
నారాయణుం డను నాదుభక్తుండు
వెనుకొన్నభక్తితో వేసట లేక
యనిశంబు సూనంబు లర్పించుచుండు
నతఁ డొకగణికను నాసక్తుఁ డగుచు
మితమున వారి కేమియు నీనికతన 6050
ననురాగశూన్య యై యాలేమతల్లి
చెనఁటి నిరాకరించిన చిన్నఁబోయి
విడిచిపోవఁగలేక వెలయాలిపంచ

నడుకుచు నొడుగంగ నవ్వితి నిప్పు

( 361. దివ్యదంపతీప్రశ్నప్రత్యుత్తర ప్రకారము. )

డనుఁడు శ్రీరంగనాయకునకుఁ బద్మ
వినత యై వినుతి గావించి యి ట్లనియె
వనజాక్ష! మీపాదవనజంబు పేరు
కొనినఁ బాపము లెల్లఁ గుందుఁ జేసేత
నీదాసుఁ డైన యీనిర్మలాత్మునకు
నీ వెస వాటిల్లు టేమికారణము 6060

మట్టుమీఱినయాగమము లెన్న లేని
యిట్టినీమాయకు నితఁడుఁ లక్ష్యంబె
రవిదీప్తి నంధకారము సోఁకు నెట్లు
భవదీయభక్తుని బాప మే లంటుఁ
గనికరింపవు నీది గాదె యాకీర్తి
తనయునినెగ్గెంబు తండ్రిది గాదె
పనుపడ నే విన్నపము సేయకున్న
ననఘశరణ్య నీ కతనిపైఁ గరుణ
లేదె యెంతైనఁ దల్లికి లేనిముద్దు
దాదికిఁ గలదె యోధవళాక్ష! యింక 6070

ననుఁ జూచి వాని మన్ననఁ జేసి నీదు
తనయునిపై నింద తరలింపవలయు
నన విని రంగేశుఁ డరవిందసదనఁ
గనుఁగొని పలికె నోకలకంఠకంఠి!
యతఁడు మహాయోగి యతనికి దుష్ట
రతిరక్తి గలదె యారసిచూచితేని
అతఁడు మల్లీలార్థ మై రాగవశుని
గతిఁ జెందియున్నాఁడు గాని యంమాని

తలఁప నేఁ గృష్ణావతారంబునందు
నలరుబోఁణులఁ గూడి యట్లయుండితిని 6080

( 362. మురారివనమాలికాంశ విప్రనారాయణయోగి మహిమ. )

దుద నాకు రాగ మఁదుల నింత కలదె ?
యది నీ వెఱుంగవె యాత్మ భావింప
నలినాస్య వినరింప నా కెంతశక్తి
గల దంతశక్తియుఁ గలదు నిత్యులకు
నతఁడు మద్వనమాలికాంశంబు గాన
నతనికి దోష మింతైననుం గలదె
హితమతి నే మోక్ష మిచ్చెద నన్న
నతఁ డీయఁగలఁ డేరికైన మోక్షంబు
నతులితం బైనట్టి యతనిపూజకును
బ్రతి యేమి సేయుదు భావించి యింక 6090

( 363. భక్తమనోరథ పూర్తీకరణ ప్రస్తావము. )

నైన నీమాట నా కది ద్రోయరాదు
గాన నే నట్టులే గావింతు ననుచు
దనుఁ జూడ భక్తవత్సలుఁడుగావునను
వనజాక్షుఁ డిది సేయ వచ్చు రా దనక
మిసమిస మనుమీనుమీసంబుఁ దెగడు

( 364. రంగరాజకృతవటురూప పరిగ్రహణము. )

పసిఁడివన్నియముంజి పచ్చనిగోఁచి
సోలిగోంచుఁల నొప్పుచూపుదండంబు
కేలికమండలు కృష్ణాజినంబు
చిన్నారు తిరుమణి శిఖయు జన్నిదము
సన్నంపుగాటుక చారులపంచ 6100

గొనబైన కుడివ్రేలికొడియుంగరంబు
పసుపడ మిగులంగఁ బటువైన వటువు
రూపంబు దాల్చి యుక్కని గేలిగొనుచు
నాపొంత థళథళమనుమించు లోదపు

( 365. కనకపాత్రస్వీకరణము. గణికాగ్రహద్వారప్రాప్తిక్రమము. )

సల విభీషణుఁడు ము న్నర్పించినట్టి
దళమైన హేమపాత్రంబు కెంగేలఁ
గై కొని వచ్చి లోఁగక దేవదేవి
వాకిట నిలిచి కవాటంబు మీటి
గడియదీయుఁడు పని గలదు నావుఁడును
గడుగోపమున విటకంటకి పలికె 6110

వలదన్న నేటికి వచ్చెద వింక
పొలసువై వఁగ నిడె పో పొమ్ము కొండఁ
దల నెత్తుకొన నీకుఁ దరమె యిం తేలఁ
తొలఁగరా యీమోరతోఁపు లేమిటికి
సటలు చూపకుము చచ్చనకూట లేల
మటమాయలాడ ముమ్మాటికి నీవు
బుద్దులు కలిగి సేర్పులు చూపవలదు
ప్రొద్దున నెండైనఁ బోకుండి తేని
గాసి నాకేలిరోఁకలిపెట్టులెల్ల
నీసొమ్మె యన నవ్వి నీరజోదరుఁడు 6120

( 366. కనకపాత్రప్రదాన ప్రకారము. )

నమ్మ కేటికి మీరు నను మీకు నిచ్చి
రమ్మని విప్రనారాయణుం డనిచెఁ
గనకపాత్రం బిదే కాంతోపయుంతుఁ
డనువాఁడ పరుఁడఁ గా నతని శిష్యుఁడను

మఱియున్న జగజోగమాటలు మాని
తెఱవ వే చనుదెంచి తెఱవవే గడియ
యనవుడు బంగారు మనుమాట చెవుల
విని బత్తి గలదానివిధమున నప్పు

( 367. గణికాకృతసంతోషపూర్వకాహ్వాన శైలి. )

డలదేవదేవి యెయ్యనవచ్చి తల
వలదన్న వినక కవాటంబుఁ దెఱచి 6130

తపనబింబప్రభఁ దలపింపుచున్న
తపనీయపాత్రంబు దాల్చినవానిఁ
గని తోడుకొనిపోయి కన్నులఁ గప్పి
కొనుచు లోనింటిలోఁ గూర్చుండఁబెట్టి
గారవింపఁగ విటకంటకి యపుడు
చేరి యెంతయు సంతసింపుచుఁ బలికె

( 368. విటకంటకినామకవృద్ధగణికావాక్యప్రకారము. )

వినవయ్య యోదేవవిప్రపుంగవుఁడ
పనివడి నీచేత బంగారుగిన్నె
యిప్పు డంపకయున్న నింతలో నేమి
దప్పె మాకిది గుఱుతా తొనకాక 6140

యింతకాలము నొకయింటిలోపలనె
యింతయునఱ లేక యెనసియుండితిమి
మక్కువఁ దలపోయ మాలోనఁ దాను
నొక్కడై యుండు వేఱొక్కఁడు గాఁడు
కొమరుప్రాయము దొరకొని కూడి మాడి
మమతఁ బాయక యున్న మందెమేలమున
నలసి వేసరి యాడినట్టిమాటలకుఁ
దలఁపున నెరవుగాఁ దలఁప నేమిటికిఁ

చెల్లఁబో యొగ్గల సేసె నొక్కఁడను
దల్లిబిడ్డలకునై తము రాడె వాదు 6150

ఏ నెఱుంగకయున్న యీపాపజాతి
తానైన నీ కిది తగుఁ దగ దనక
యర్మిలి నే ప్రొద్దు నాతనిమనసు
మర్మమెఱింగి యీమాయపుబిడ్డ
యీరీతి నవ్వుల కితఁ డోపఁ డనుచుఁ
జేరి తా నొకమాట చెప్పకపోయెఁ
జనవున నొకకొన్ని చచ్చినమాట
లని సరసము లాడినంతలోపలనె
యది సందుగాఁ గొని యరిగె మీయొజ్జ
యిదియు మానితి మయ్య యింతటినుండి 6160

యింతవేగిరకాని నెఱుఁగము తనదు
పంతమంతయుఁ జెల్లె పదివేలు వచ్చె
నందుల కనుట కా దయ్య మాపడుచుఁ
గొందలపడుచు లో గుబ్బతిల్లుచును
బగఁగొని లోన నప్పటినుండి సొంపు
డిగి కంట కంట పుట్టెడునీళ్లు కార
మమ్మ నిందాక కంభారాళ్ళు సేసి
లెమ్మన్న లేవక లీల నా కింక
నతనితోడిదె లోక మని కూడు నీళ్లు
మఱిఁదలంపక నేలపై శయనించు 6170

నెపమాత్ర నీమాట నెఱిఁ జెవి సోఁక
నిపుడు దా వాకిటి కేతెంచెనయ్య
కనకంబు చూచి తక్కరిమాట లాడె
నని తలంపకు తన కప్పటినుండి

చెడుగుకోపం బింతసేసెఁగా యనుచు
గడుపులోఁ జెయివెట్టికలఁచిన ట్లగుచు
నిలువ సయింపదు నిలిచినచోటఁ
దలఁపులో వెత జెప్పఁ దరము గా దనుచుఁ
గనుదోయి బులుకుచుఁ గడలఁ గన్నీరు
కొనవ్రేల మీటి డగ్గుత్తిక వెట్టి 6180

( 369. రంగనాథస్వరూపజ్ఞాన ప్రాప్తిక్రమము. )

కొంతధైర్యముఁ దెచ్చుకొన్నది యగుచుఁ
గాంతోపయంతనుం గనుఁగొని పలికె
నీచేత నిపుడు గిన్నియు యందుకొన్నఁ
జూచువారలు మనసున నాడకున్న
నీసున నిందున కెంతగావించె
గాసించి యిది యెంతకష్టురా లనరె
నెట్టన నేము గిన్నెయ యిప్పు డిట్టి
పట్టకుండిన నెగ్గుఁ బట్టు మీరొజ్జ
యెవ్విధమునఁ జూడ నెందుఁ బోవచ్చు
నెవ్వారితో సడ్డ యే లయ్యె తనదు 6190

మనసువచ్చినఁ జాలు మాకేమి యనుచుఁ
గనకపాత్రము నేలఁ గైకొని మఱియుఁ
దత్తరపడుచున్న తనబిడ్డప్రాణ
మెత్తుకోవలసిన నిపుడె ర మ్మనుచు
మక్కువ వేమాఱు మామాఱు గాఁగ
మ్రొక్కి తోకొనిరమ్మ మొకబంగ మెడయ

( 370. ఆదివటుదయాకలనాది ప్రస్తావము. )

ననప్రుఁడు మిగులంగ నయ్యాదివటువు
తనలోన నవ్వుచుఁ దడయ కేతెంచి

యిమ్ములవారి వాకిటిలోన్నమీఁదఁ
జిమ్మచీఁకటిలోనఁ జింతింపుచున్న 6200

యామాని గాంచి యొయ్యనఁ జెంతఁ జేరి
ప్రేమమైఁ జెయివేసి పిలిచి యిట్లనియె
మీరెవ్వ రనిచూచి వివరించి విప్ర
నారాయణుఁడ విప్రనారాయణుండ
నిట నేల యున్నాఁడ వీదేవదేవి
విటకంటకియు నిన్ను వేయుభంగులను
వెనుకొని యూరెల్ల వెదకి కానమిని
ననుఁ బంపి రెచట నున్నాఁడవో యనుచు

( 871. విప్రనారాయణసంతోషకారణ ప్రకారము. )

వేవేగ నచటికి విచ్చేయుమయ్య
నావుఁడు విని విప్రనారాయణుండు 6210

చెవులలో నమృతంబు చిలికినట్లైనఁ
జివురు గెదువుజోడుచేబారిఁ జిక్కి
వడి లేచివచ్చి యవ్వటువు డెందమునఁ
గడువేడ్కఁ జేర్చి యక్కజమందికొనుచు
నీ వెవ్వ రోతండ్రి ! నీవు నాపాలి

( 872. శ్రీరంగనాథదయాప్రసారాది మహిమ. )

దైవంబ వగు రంగధారుణీపతివో
కాకున్న నొరుల కీకరుణ నామీఁదఁ
జేకూరు టెట్లు చర్చించిచూచినను
అని సంతసించిన నతని వారింటి
కనిచియంతటమీఁద నారంగవిభుఁడు 6220

సరగున నిజనివాసమున కేతెంచి
యురగేంద్రశాయి యై యుండె నంతటను

(873. గణికాకలితనానావిధసురతలీలాది.)

అలతల్లితోఁగూడ నాదేవదేవి
మొలమిసేయుచు మాని కెదు రేగుదెంచి
పసనిగద్దియపీఁటపై నుంచి మంచి
పసిడితంబుగ నీటఁ బాదము ల్గడిగి
నిడిసోగచంద్రికనిగ్గు లల్లార్చు
దడిపంబుపావడఁ దడివాయ నొత్తి
మేలిమిపన్నీట మెదిచి కస్తూరి
డాలుగా మైని వాటంబుగా నలఁది　　6230

జవ్వాదిపసచేసి సంపంగి విరులఁ
గ్రొవ్వాడిమొగలిరేకులఁ జాలఁ దురిమి
పలుచనిపన్నీటిపదనికప్రమునఁ
గులికినబాగాలు కొమరుగా నొసఁగి
వెలఁది వెన్నెలసోఁగవేఁగెంబు లాడ
దుళగించు బొమ్మంచుదుప్పటిఁ గప్పి
మొనసినప్రేమమై నెప్పటికంటె
నినుమడించినభక్తి నిరువురుం గూడి
సరసకళావిలాసములచేఁ జొక్కి
మరుకేళిఁ దేలి నెమ్మది నుండి రంత　　6240

(874. ప్రభాతకాలవర్ణనము. అంధకారతిరోధానక్రమము.)
పద్మవికాసాదిశోభావర్ణనము.

గగనాంబురాశి బుగ్గలు పుట్టి యడఁగు
పగిది తారలు పలపలఁ గ్రుంకఁదొడఁగె
సహజాంధకారకాష్ఠంబుల నేర్చు
మిహిరాగ్నిఁ బొడమినమిణుఁగురో యనఁగఁ
జొక్కమై వేగురుచుక్క చూపట్టెఁ

గుక్కుటకూటంబు కోవన నార్చె
లలిమీఱి విరహిజాలము నెలయించు
నిల యించువిలుకాఁడు నేటు చాలించెఁ
బ్రియమార మరుకేళి బిగిసినప్రియుల
ప్రియురాండ్ర కౌఁగిళ్ళబిగువులు సడలె 6250

వలపలిమొడదండ వలపులకొండ
సలల గేడించి గొజ్జఁగుల వేడించి
పొలయుతుమ్మెదలపుప్పొడిజాడ రాడి
చలువపూనీట వసంతంబు చల్లి
కెలనఁ దామరలఁ జక్కిలిగింతఁ బెట్టి
కలువలనోళ్ల నొక్కట ముద్రవెట్టి
జక్కవకవల రేజగడంబుఁ దీర్చి
మక్కువ నంచకొమ్మల మేలుకొల్పి
యలరువిల్కాని యాహవకేళి నలయు
కలికిపూఁబోణులగబ్బినిబ్బరపు 6260

( 375. రమణీయతమప్రభాతవేళావర్ణనము. సూర్యోదయప్రకారాది. )

సిబ్బెంపుఁబొడలరంజిలి పసనైన
గుబ్బగుబ్బలుల మైఁ గుప్పించుకొనుచు
రసికులమొదలను రాగంబుఁ జెంద
విసరె నొయ్యన నరవిరినాలిగాలి
యలఘు ప్రభాతచైత్రాగమవేళఁ
దొలుత వాకసపుమోదుగ పూఁచె ననఁగ
విమల నభోద్యానవీథి చిగిర్చె
రమణీయసాంధ్యానురాగంబు లెసఁగె
శ్రుతిలతాంతంబునఁ జూపట్టుఫలము
గతి నంధకారతస్కరుఁడు భాస్కరుఁడు 6270

నెనయుకెంజాయల నెలమించు లొాదవఁ
గనుపట్టెఁ దోలుచాయఁ గడు సొంపుమీఱి
కాలమ్ము గేంద్రంబు గనలి యూపూర్వ
శైలేభకుంభముల్ జదియఁగొట్టుటయు
నెనయురక్తమున బిట్టెగయు మౌక్తికము
ననువున నుదయించె నంబుజాప్తుండు
కైరవంబులదాయఁ గని తమరతుల
కైరవంబులు డాయ నరిగెఁ జక్రములు

( 376. రంగనాథపూజకవరసమాగమనము. )
తదంగభూషావేషాది వర్ణనము.

అపుడు శ్రీపాంచరాత్రాగమశాస్త్ర
నిపుణుండు శ్రీరంగనిలయార్చకుండు 6280

మిడుగుల నొఱయుచు మించుబింజియల
బెడఁగుల నెరులు గాన్పించుదోవతియు
నుత్తరీయంబుగా నొకకొంత వైచి
గుత్తంబునడుము చుంగులువార బిగిసి
పొసఁగఁజుట్టినయట్టిపొత్తిచీరయును
బసమించు సన్నపుఁ బట్టెనామములు
మలయునూరుపులకు మాఱుగానునుల
జెలువారఁ జుట్టినజిలుఁగుబాగయును
వ్రేలుపీనులు దర్భవ్రేలియుంగరము
నీలాహిపిల్లవన్నియ పిల్లసికయు 6290

వెలఁదిజన్నిదములు వేదమంత్రములు
నలవడఁ బ్రొద్దుది క్కరసికన్గొనుచుఁ
దాలంబు చేతితోఁ దగిలినకంచ
కోలయుంగరము చేకొనఁ గీలుకొలిపి

( 877. దేవాలయభాసురగరుడస్తంభ (ధ్వజస్తంభ) సమీపప్రణామాచరణాది. )
రంగమంటప ప్రాప్తిక్రమము.

చనుదెంచి గారుడస్తంభంబుచక్కి
ఘనభక్తిమై నమస్కారంబు చేసి
రంగమంటపముచేరంగ నేతెంచి
రంగేశునిలయాంతరద్వారసీమ
నిలిచియుండెడువేళ నీలంపుమణులఁ
బొలుచుతామరపెద్దపూసలపేర్లు 6800

( 878. పెద్దజీయన్ నామక యతివరదండకాషాయ వేషాదివర్ణనము. )

వలనొప్పు తిరుమణివడములు వైచి
బలువుగాఁ దిరుమణు ల్పదిరెంను దీర్చి
గట్టిగా శంఖచక్రములు నామమును
బెట్టినపరుఁజుముప్పిడిఁ గేలఁ బూని
యనులు వోఁ జుట్టిన యరవడుపాగ
గనుపట్టనొకకొండికాఁడు ముందరును
గొంటరి పాషండకులముపైఁ గనలి
గంటవైచినరీతి గంట నాదింప
రుచిరకాషాంభశ్చిరోవేష్టనంబు
ప్రచురంపువెన్నెల పట్టుపచ్చడము 6810

మనతరంబై నట్టికపిరాజముద్ర
మొనసి చూపట్టెడుముద్దుటుంగరము
కావిశాటులు గల్గి కాలదండంబు
చేవ యడంచి మించిన త్రిదండంబు
విదళితాసురమత విజయధ్వజంబు
చదురున శిష్యహస్తమునఁ జెన్నొంద
నిఖిలేశుఁ డగు రంగనిలయుకోవెలకు
నఖిలంబునకుఁ కర్త యగు పెద్దజియ్య

(379. దేవాలయకవాటోద్ఘాటనక్రమము.)

పంచబేరపాదప్రణామాది.

చనుదెంచి లచ్చనల్ సలపిమైఁ జూడ
మునినాథునసుమతంబున నంబి యప్పుడు 6320

బీగంబుచేయుచే బీగముల్ దెఱచి
లాగుగాఁ గుంచెకోలను లోన నిడిన
బలుపైన గడియలు వాపి భేళాన
తలుపులు దెఱచి యత్తఱి లోని కరిగి
పంచబేరములకుఁ బ్రణుతిఁ గావించి

(380. శ్రీరంగరాజస్వర్ణపాత్రాదర్శనప్రకారము. తదాశ్చర్యకథనము.)

పంచపాత్రములఁ దప్పక విలోకించి
యందులో నడుమ గొప్పగుగిన్నెఁ గాన
కందంద వణఁకుచు నాత్మఁ గుందుచును
బరిచారజనము లోపలను వెల్పలను
. జరియించువారి నిష్టంబైనవారి 6330
నడిగి కానక నంబు లరు దందికొనుచు
వడఁకుచు నయ్యతీశ్వరుసన్నిధికి

(381. యతీశ్వరాదిభయప్రాప్తిప్రస్తావము.)

, నేతెంచి పదముల కెఱఁగి యాకార్య
మాతని కెఱిఁగింప నక్కజం బంది
సభయుఁడై వేగ మచ్చటియధికారి
సభికులం దక్కినస్థానంబువారి
రావించి శ్రీరంగరమణుని సొమ్ము
పోవు టెట్లని మనంబునఁ గోప మెసఁగ
బహుపురాణములఁ జొప్పడుదేవదేవు
మహిమ లెఱింగిన మతిమంతులార! 6340

( 382. కనకపాత్రచౌర్యకథావిషయకాతిశ ప్రశ్నాది. )

విహితమే యీమాట విన మీకు గర్భ
గృహములోఁ బెట్టినగిన్నె లే దనుచుఁ
బోదెఁ బొ మ్మనుచు నంబులు తారు గొన్ని
మాయల మముఁ గనుమాటి యీరీతిఁ
గల్లలు పచరించి కడపట మనల
బెల్లించి యిదిదక్కఁ బెనఁగఁజూచెదరు
ఎందుఁ బోవచ్చుఁ దా మెఱుఁగ కీసొమ్ము
నందువారలు దాఁచునట్టివారలును
దాము గా కిబ్బంగిఁ దమకన్నుఁ బ్రామి
హేమపాత్రము గొన నెవ్వ రోపుదురు 6350

( 383. నానావిధమనోవేదనా ప్రాప్తిక్రమము. )

మున్ను నీకరణి సొమ్ము గను వస్తువులు
నెన్ని గైకొనినారొ యీనంబు లనుచు
గసిమస హరిసొమ్ము గలకాలమెల్ల
మెసఁగి లేదనిన స్వామిద్రోహులార !
యెట్టినసొమ్మెల్ల నొడచూఱఁ గాఁగఁ
బట్టి లేదను సర్వభక్షకులార !
యనుచు నంబులదిక్కు నందఱదిక్కుఁ
గనుఁగొని యొక్కటఁ గలయంగనాడి
యిమ్మెయి నను నేలు నిందిరావిభుని
సొమ్ము వోవంగ నేఁ జూడలేఁ ననుచు 5360
గన్నీరు గాఱ గద్గదకంఠుఁ డగుచుఁ
బన్నిన దైన్య మేర్పడఁగఁ బల్కుచును

( 384. ఏకాంగిపరిచారకాదిచింతా ప్రకారము. )

మున్నుగా మొలసన్న ముమ్మాలకావి
పిన్నలి వలి మెడం బెనచితగిల్చి

కడువాఁడి యేకాంగి కత్తిఁ దెమల్చి
యడలుచు మెడఁ బూనునంతలోపలనె
నంబులు నచటిస్థానంబులవారుఁ
బంబినభీతిఁ జేపట్టి గొబ్బునను
బిన్నలిఁ దప్పించి పెనఁకువఁ గేల
నున్నట్టికైదువు నొడిసి కైకొనుచు 6370

నేవెరవులకుఁ దా మింద యుండంగ
దేవర యిటు సేయఁ దివుర నేమిటికి
నని యధికారి యయ్యతిని లాలించి
కనలుచుఁ దనదుచెంగటిభృత్యసమితిఁ

( 385. అర్చకముద్రాధిపతిమనఃఖేదప్రాప్తిక్రమము. )

బిలిచి నంబుల నడ్డపెట్టి యాసొమ్ము
నిలిచిననిలువున నేఁడు గైకొనుఁడు
అన విని యర్చకు లాముద్రకర్త
కనిరి యేలయ్య యన్యాయంబు నీకు
దుష్టుల మైన యందులకు నీయెదుట
దృష్టిశోధన మమ్ముఁ దెలిసికొమ్మయ్య 6380

యీయెడ మేము చీమంత దోడినను
సేయింపు శూద్రులఁ జేయించు నాజ్ఞ
యనవుఁ డయ్యధికారి యాత్మఁ జింతించి
యనిరె వారికి నిశ్చయంబుగా మీర
లచ్చు లైనది ముచ్చు లైనది దెలిసి
చెచ్చెఱ నన్నియుఁ జెప్పెదఁ గాని

( 386. గణికాగృహద్రవ్యవస్తు ప్రస్తావము. )

యటనుండుఁ జని వారి నాఁకఁ బెట్టించె
నిట విటకంటకియింటిలో మెలఁగు

మటమాయలాడి ద్రిమ్మరిగబ్బితొత్తు
పటరమై చంచలవాణినాఁ బరఁగు 6390

నావేళ నదియొక్క టక్కఱి గలిగి
దైవవశంబునం దదనుజ్ఞ వడసి
నల్లపూసలపేరు నలగినకోక
వెల్లనై గుడిగొన్న విచ్చుటాకులును
గొప్పన కందని కుఱుచ వెంట్రుకలు
కప్పురరావాడికప్పుబల్వరుస
కొమరుమించిన బండిగురిగింజతావ
డములు నిట్టుకపవడంపుఁ జేకట్లు
పిత్తడికడియముల్ పికిలిపూదండ
మొత్తంబు లగు నల్లముదుకగాజులను 6400

లక్కతాయెతులు తెల్లనితగరంపు
ముక్కర సీసపుముద్దుటుంగరము
కాకిబేగడబొట్టు కంచుమట్టియలు
కైకడసంకుటుంగరమునుం గలిగి
జగడాఁగయై కూడ సందిట నిఱికి
మొగము జొత్తిల బొమముడివెట్ట కొనుచు
పణగుల నేలికసాని లోలోన
గొణిగి తిట్టుచుఁ బలుగొఱికి వేసరుచు
శ్రీరంగనగరంబుచేర నేతెంచి
యారంగవిభునగరాంతంబుఁ జొచ్చి 6410

యెదురుగా నల్లంత నెవ్వరిం గన్నఁ
బదపడిపాడుచు బయల నవ్వుచును
బలుదొర లెదురుగాఁ బరతేరఁ దెరువు
దొలఁగక గొందులు తొంగిచూచుచును

సరమురి సన్యాసి నైన లెక్కిడక
నౌరయుచుఁ బొమ్మన్న నుదిరిపల్కుచును
మఱిసహస్రస్తంభమంటపంబునకు
నఱిముఱి నేతెంచి యచ్చోట నిలిచి
యిడుమకట్టున వేఁడియెండలో మిగుల
జడియు పీఁపులమీఁదఁ జాపరా తెత్తి 6420

( 387. అధికారిపరిచారకాద్యన్వేషణక్రమము. )

పొగడదండలు వైచి పోసీక యెదుట
బెగడఁ దిట్టుచు నడ్డపెట్టినవారి
నరసి యిదేమొకో యని యధికారి
పరిచారజనులఁ దప్పక విలోకించి
పనివడి పీరి కీపాటేల వచ్చె
నని వారు సేయు నయ్యపరాధ మెఱిఁగి
యందులో మొగ మెఱుకై యున్నవాని
ముందర నిలిచి నెమ్మోము వీక్షించి
కిలకిల నగి కేలు కేలునం బట్టి
లలిమీఱి పలికె నుల్లాపంబుతోడ 6430

నీగిన్నికై పీరి నీపాటువఱప
నాగిన్ని తెలియంగ నది యెంతకలదో ?
యనవుడు బంటువాఁ డది దొడ్డసామ్ము
చనుము నీ కిట్టిప్రసంగ మేమిటికి

( 388. గణికాప్రత్యుత్తరప్రదానాది. )

నిప్పు డాగిన్నియ యీపాటి యనుచుఁ
జెప్పి నసేమి యార్చెదవో తీర్చెదవో
చాలుఁ బొమ్మనినఁ జంచలవాణి పలికె
నేల రా మీగిన్ని లిటువంటి విపుడు

వేఱైనఁ ద్రాసున వేసి తూఁచినను
మాయక్కగిన్నెకు మఱి సరియగునె 6440
యడిగినంతటిలోన నది గొండసేసి
నిడుసాగిలం బెట్టి నీల్గ నేమిటికి
ననవుఁడు చెంతవారపు డాలకించి
విని దానిమాటలు వెలుచుకో ననిరి
యోగులదాసి నీయొడలి సొమ్మెల్లఁ
బ్రోగుగా రూకెత్తుపుత్తడి లేదు
నీవున్నసొరికా నీయక్కసొరు ?
పోనె యీపోలనిబొంకు లేమిటికి

( 389. స్వర్ణపాత్రస్వరూపాశ్చర్య ప్రస్తావము. )
అధికారివిషయనివేదన క్రమము.

నివ్వసుంధరలోన నిటువంటి గిన్నె
యెవ్వరు మీకిచ్చి రెందుండి వచ్చె 6450
నన విని కోపించి యాబేలవరవుఁ
డనియెను మాయక్క యలఁతియే తలఁప
నిచ్చవచ్చినవార లిటకి వచ్చి
యిచ్చిరి వారు మీ కెవ్వరై రేమి
యుదిరి మాయక్కఁ జూపోపక మీరు
పదివేలు న ననేలఁ బందలా రనుచుఁ
జనుదానిమాటలచందంబు చూచి
యనుమానపడి వేగ నద రఁటఁబట్టి
కట్టి తోకొని యధికారిముందరను
బెట్టి యవ్విధముఁ జెప్పిన సంతసించి 6460

( 390. అధికారివిచారణా ప్రకారము. )

యప్పు డాయధికారి యాదాసి డాసి
చెప్పవే నెఱవక చెప్పవే యనుచుఁ

దలఁ జేయివెట్టి డెందము భీతిఁ దెలిపి
చలపట్టి యడుగఁ జంచలవాణి యపుడు
వడవడ వడఁకుచు వాతెఱ మిగులఁ
దడుపుచు మాటలు దడఁబాటు గొనఁగ
నీరీతి నేమియు నెఱుఁగ. నీరేయి
నేరేడుబండువన్నియమేనితోడఁ

( 391. స్వర్ణపాత్రప్రదర్శనాది. )

బలుచని యొకచిన్న బాపనివడుగు
బలిమిమై నింటిలోపలి కేగుదెంచి 6470
యుదిరి బంగరుగిన్నెయొక్కటి దెచ్చి
యది వల దనఁగ మాయక్క చేతికిని
యిచ్చి తాఁ గ్రమ్మర నేగెను దాఁప
నిచ్చెనో తుదిఁ దక్క నిచ్చెనో యెఱుఁగ
నని మ్రొక్కి బాష్పంబు లడరించుదాని
గనుఁగొని యయ్యధికారి లాలించి
కట్టల్క నెండలోఁ గములంగ నడ్డ
పెట్టిన నయ్యొడ్డపెట్టు చాలించి
రావించి నంబులు రాగిల్లఁ బలికి
కావికట్టణములు గరిమమై నొసఁగి 6480

( 392 స్వర్ణపాత్రప్రాప్తిక్రమము. విప్రనారాయణముని చౌర్యక్రమకథనాది. )

తాలిమి నిరుమేలఁ దనుఁ గొల్చియున్న
కాలకింకరభయంకరులఁ గింకరులఁ
దెసఁ గనుఁగొని దేవదేవిచేనున్న
యసమసాయకుతంత్రి హైమపాత్రంబు
చేకొని దాని కిచ్చినవాని దాని
వేకట్టికొనిరండు వెఱ పింతలేక

యని నియోగించిన యాభృత్యసమితి
యనిలవేగంబున నలపురంబునకుఁ
బఱతెంచి యొక్కనిఁ బట్టంగఁ బదువు
రఱముఱి దానియి ల్లటు చుట్టుముట్టి 6490
ఘుల్లుఘుల్లన గిలుకలతోడి గుదియ
లల్లనల్లన భూమి యదర నూఁదుచును
లోఁగక కొంద ఱాలోనికిం జొచ్చి
తూఁగుటుయ్యల హంసతూలికమీఁదఁ
బవళించియున్న శ్రీపతికుమారకుని
సవరనిచరణాంబుజము లొత్తుచున్న
చకితకురంగాక్షిఁ జంద్రబింబాస్యఁ
బికవాణి మదనుని బిరుదువారువము
నడయాడుక్రొమ్మించునన దేవదేవి
జడవట్టి కుదిచి భూస్థలి వ్రాల నీడ్చి 6500

( 393. విప్రనారాయణమునిబాహు బంధన తర్జననిందాది. )

తలగడనున్న నిద్దపుఁబైడిగిన్నెఁ
గలయంగ వీక్షించి కైకొని పిదప
నుయ్యాలపై నున్న యోగీంద్రు మున్ను
పయ్యాడి కరునలిపట్టి దానవులు
పట్టి బంధించినపగిది బాహువులు
పట్టి యాతఁడు గట్టుపంచచేఁ గట్టి
ఫ్రరిలోన నీసరిపూఁబోఁడు తెల్ల
దొర వని నినుఁ జెప్పుదురుగదె యెపుడు
నట్టి నీవేల రంగప్పని గిన్నె
యెట్టు గైకొంటివే ఝాదొంగచేతఁ 6510
గొల్లఁగా భువి రాచకొడుకులసొమ్ము
తెల్లను గైకొంటి విలుచూఱఁగాఁగ

నంమునం దరివోక యయ్యాన పెద్దగుడు
నిండున కొడిఁగట్టితే యుంచుఁ బలికి
గందంపుగొమ్మలఁ గాలాహి చుట్టు
చందంబునను గరజలజాతయుగళిఁ
బెడమరలఁగఁ బట్టి బిగియించి కుదిచి
నిడుదతుమ్మెదకప్పునెఱివేణి గట్టి
మిగిలినజడ కేలి మెయి నిండనూలు
సొగసున నిరుమూఁడుచుట్టులుఁ జుట్టి 6520
యోరి! సజ్జనుమాడ్కి నున్నాఁడ విప్ర
చేరిటి లాగించి తీప్పైఁడిగిన్నె
గడుస! నీకెటువంటి కనుమాయ గలదొ

( 394. మునికృతహరిధ్యానము. నివేదనాప్రకారము. )

జడియక పద్మజశంకరాదులకుఁ
దలఁపరాని శ్రీధరునగరంబు
వలవోకఁ జొచ్చితి వారేర దొంగ
నీమేన నిండార నెనయునామములు
నామము ల్గావు కన్నపుఁగత్తు లరయ
నన విని "నీలీలలా? రంగ!" యనుచు
ననిమొ వారలతోడ నామహానిభుఁడు 6530

వినరయ్య నీతికోవిదులార రంగ
జననాథుసొమ్ము వంచనచేసి యేను
దెచ్చినవాఁడనో దేవదేవికిని
ఇచ్చినవాఁడనో యేలయ్య నన్ను
విడువుండ యనుమాట విననంతలోనె
కడుఁగోపమున విటకంటకి వచ్చి
యెట్టులురా యోరి యీనడురేయి
నెట్టన శిష్యుచే నీ పంపలేదె?

యంపలే దని కల్లలాడెదు ప్రాణ
మింపని బొంకెఁ దిక్లోలరా యనుచుఁ 6540

( 395. నగరజనకృతచోరనిందాప్రకారాది. )

గరలి వెన్నెలలు గ్రక్కెడు చకోరముల
కరణి లోచనములఁ గ్రమ్మునశ్రువులు
చెక్కుటద్దములపైఁ జిందిఁ క్రిక్కిఱిసి
కక్కసం బగుచనుగవమీఁద నురలఁ
దలవంచి సిగ్గునం దనతోడ మగుడఁ
బలుకనేరక దుఃఖపడుచున్న కూఁతుఁ
గనుఁగొని వరదలై కన్నీరు జాఱ
నెనయఁ గౌఁగిటఁ జేర్చి యిట్లని పలికె
అప్పుడే వీఁడు దొంగని యేను జాటి
చెప్పిన నామాటఁ జెవిఁ బెట్టవైతి 6550
పనిఁ బూని తాము చంపము తాడు చంపె
ననియెడు సీంద్ర నోయమ్మ నమ్మెదురె
ముందర నీరీతి ముదిమాట లాడి
యెందఱఁ జెఱపెనో యీకొంపచెఱుపు
గౌళ నేపాళ బంగాళ పాంచాళ
చోళాదిరాజన్యసుతులు నిచ్చలును
నైలాగు సనరింపఁ నైకొనుచేతు
లీలాగు కట్లకు నెట్లోర్చునమ్మ
చెలువలు నేర్పుమైఁ జిక్కెడలింప
బలిమిఁ బట్టకుమని పాటించివేఁడి 6560
సదయులై తలవరు లదరంటఁ బట్టి
కుదియింప నెట్లోర్చుకొంటివే కూన!
కెందలిరాకుసోఁకినయంతలోనె
కందెడుమేను కర్కశపాణు లిపుడు

తోడిబడ మెడబట్టి ద్రొబ్బంగ నెంత
యడలుచు నేగెదో యమ్మ! నాగమ్మ!
యందఱు నిటకు రమ్మని గారవింపఁ
జెందనిసభలకుఁ జెల్లఁ బో నేఁడు
కట్టిడిదొంగని గాసించి విఱచి
కట్టుకొంపోవ నేగతి నేగ దమ్మ! 6570

యని బిడ్డఁ గౌఁగిట నలమి పోనీక
మునుకొని దుఃఖించు ముదియ నీక్షించి
రావె దొంగలనంపి రాత్రి వేవేగ
దేవదేవునిసొమ్ము దెప్పించునపుడు
నవ్వను బిమ్మట నగరివా రెఱిఁగి
యివ్విధిం బట్టిన నేడ్వ నేడ్వనా? ఔఁగ!
కృపపుట్ట బిడ్డఁ గౌఁగిటఁ జేర్చి చేర్చి
యిపుడుసెప్పెడుబుద్ధు లెటఁబోయె నప్పు
డని తిట్టి పొమ్మన్న నంతటఁ బోక
తనకూఁతునెనువెంటఁ దగిలి వాపోవ 6580

( 398. గణికామణిమునివరకష్టదశాకథనాది. )

నొక్కట వడిఁ దలారియొక పెట్టుపెట్టి
కుక్కఁగొట్టినయట్లు కొట్టి చీకొట్టి
తలవరు లప్పు డంతటఁ బోకయున్న
దొఁలగంగ నిల వ్రాల ద్రొబ్బి నవ్వుచును
ఆకోమలాంగితో నామునివరుని
దోకొని పోవుచోఁ ద్రోవ నున్నట్టి
చెలువలు మగలుఁ జర్చించి లోలోనె
తలపోసి పలికి రాదట వారిఁ జూచి
తనవేఁడితేజ మంతయు డాఁచి పుడమిఁ
జనుదెంచు సూర్యునిసరణి నున్నాఁడు 6590

తలకొని నడికందుఁ దరలించి జిగని
కళలతోఁ జంద్రునికరణి నున్నాఁడు
ఇతఁడు దొంగిలునటే యితఁడు యోగీంద్రు
గతి నున్నవాఁ డేమికర్మమో కాని
దీనిఁ జూచిన సాసఁదీసినమరుని
చేనున్ననారంజిచెలువుఁ జూపెడిని
కన్నియ తుది నెంతకన్నును నీడ
కన్ను నెఱుంగనికమ్మపూఁబోఁడి
గోలచూచినరాచకూఁతురువంటి
దీఁగగు కట్టకు నెట్లోర్చె నమ్మ 6600

( 397. అకారణనిందాప్రస్తావము. )

కష్టపువిధి గాక కడపట దీని
దృష్టించి చూచిన దృష్టిదాఁకెడిని
గడపటఁ దమసేయుకష్టన ర్తనకు
నోడఁబడకున్న నీయురుపుణ్యనిధుల
కోవఁజాలనివార లోకొక్కనింద
పైపైవ నీడెస పాటిల్లెఁ గాని
వీరు దొంగలు కారు వివరింప ననుచుఁ
జేరి యేబ్రాసైన సేయంగవచ్చుఁ
గందు తెల్లంబుగాఁ గానక యొరుల
నిందింపవచ్చునే నిర్ణిమిత్తంబ 6610

( 398. అధికారిరచితచోరకార్య శిక్షాక్రమము. )

యనువారు కొందఱు నటఁ దోఁచినట్ల
యనువారు నై యుండి రప్పుడు భటులు
వారిఁ దోకొనిపోయి వనజాక్షుగన్న
యారయరాదామొ నని యాత్మలోన

నందంద చింతించు నయ్యధికారి
ముందర నిడి కేలు మొగిచిన నతఁడు
గాసించి వీరి నిక్కడ నాకునేన
చేసేతఁ బట్టి శిక్షించితినేని
ఈజాడ తన కేల మొఱఁగింప ననుచు
రాజు విన్నను నపరాధంబు వచ్చు **6620**

( 399. రాజసన్నిధి ప్రవేశక్రమాది. )

నని వారివారిచే నగపడినట్టి
కనకపాత్రంబు దిగ్గనఁ గొనిపోయి
రుచిరసింహాసనారూఢుఁ డై యున్న
నిచుళేంద్రుఁ డగుచోళనృపతిముందరను
ఇరువుర నిడి మ్రొక్కి యాకార్య మెల్ల
నిరవొంద నెఱిఁగించె నెఱిఁగించుటయును
విని భూవరుండు సవిస్మయుం డగుచుఁ
గనలి వారల దెసఁ గాంచి యిట్లనియె
నారంగపతికి ద్రోహము సేసినపుడు
చేరి వీరల చాజ్ఞ సేయుటే తగవ **6630**

( 400. చోళభూపాలకృతసావధానప్రశ్న విచారణాది. )

మైన న్యాయంబున న్యాయంబుఁ దెలిసి
కాని మిమ్మిట నాజ్ఞఁ గావింపఁ దగదు
హెచ్చినకడఁక రంగేశ్వరునగరు
సొచ్చినచందంబు చొచ్చి యాగిన్నె
తెచ్చినబాగును దెగువమై మీకు
వచ్చినలాగును వలవ దున్నట్టి
రవళిసేయక, పదరక, యొక్కరొకరె
వివరంబుగా మాకు వివరింపుఁ డనిన

దిట్టయై యాదేవదేవి దా వీణె
ముట్టి నాదించినమురువు దీపింపఁ 6640

జుక్కలతోఁ నొప్పుసోముచందమునఁ
చిక్కటిల్లెడుబాష్పబిందుపూరముల
నొప్పెడియాననం బొకయింత యెత్తి
యప్పు డిట్లనియె దైన్యము పాదుకొనఁగ

( 401. నిజకార్యనివేదనప్రకారము. )

ఓసార్వభౌమ ! లోకోన్నతచరిత !
నాసేయునేర మంతయు విన్నవింతు
నవధరింపుము పరా కది చిత్తగించి
వివరంబుగా నాదువిన్నపం బిపుడు
మునుపు దేవరపాదములు గాంచి మగుడ
ననిపించుకొని పోవునపుడు మార్గమున 6650

నొకతోఁటలో నితఁ డున్న మాయక్క
వెకలియై తనుఁజూచి వెగ్గంబు లాడి

( 402. వటువేషధారిపురుషకార్యనివేదనము. మారీచదృష్టాంతము. )

లలితంబులైన విలాసముల్ చూపి
వలపింపఁ గలవె యీవటువేషధారి
నని యని పంతంబు లాడునాయక్కఁ
గనుఁగొని యేనును గండగర్వమునఁ
గడనున్నగొడ్డలిఁ గాలిమీఁదటికిఁ
దోడిఁబడవైచుకోఁ దొడరినయట్టు
లారీతిఁ జేసెద నని చలపట్టి
మారీచువంటియీమాయావిఁ దగిలి 6660

పిలిచి తోకొనిపోయి పెరిమె మాయింట
నెలమిపైఁ నుంటి మనేకకాలంబు
కనలి మాయమ్మ యొకానొకనాఁడు
తనమీఁద వేసరి తనుదిట్టుకొనిన

( 403. శ్రీరంగనాయకలీలాకార్యనిర్ధారణాప్రకారము. )

నది తన్నుఁ దిట్టెఁ బొమ్మని యెగ్గు గాఁగ
మదిఁబెట్టుకొని తమపైఁ మచ్చరమున
నేచందమున నెటకేగెనో యేగి
తెచ్చి యీగిన్నెయందిచ్చి వెండియును
దారాకశిష్యుచేఁ దనయింటికనుప
నారయ బంగారమని యడియాస 6670

నూని నే మందిన యొక్కదోషంబె
కాని యొండెఱుఁగము కడపట నొకటి
మును పారుఁ డీగిన్నె ముచ్చిలి తెచ్చె
నని యేనెఱుంగ రంగప్పయే యెఱుఁగుఁ
గడముట్ట నిది లెస్సగా విచారించి
చెడుగునై నను నాజ్ఞ సేయింపు మనుచు

( 404. చోళరాజకలితకనకపాత్ర చౌర్యక్రమనిర్ధారణము. )

నాదట నాదిమధ్యావసానములు
మేదినీశ్వరుని కిమ్మోయి నెఱింగింప
వసుమతీశ్వరుఁడు క్రేవల నున్నగిన్నె
దెసఁజూచి యాయింతిదెసఁ జూచి నగచి 6680

మానీంద్రుకడఁ జూచి మాకుఁ దెల్లముగ
దీనిమాటలలోనితెఱఁగెల్లఁ దెలిసె
నీవుచెప్పెడిమాట నిక్కంబుగఁ జెప్పు

మావిప్ర ! యనుఁడు నవహ్మానివల్లభుఁడు
దిచ్చరియగునట్టి దీనిమాటలకు
వచ్చె నానిలువల్లె వళుకులపుట్ట
తానాడినటువలె తనయింటికడకు
నేను వచ్చుటయును నెనసియుండుటయుఁ
గలదు తానును దనుఁగన్నతల్లియును
వెలిమీఁజఁ దమయిల్లు వెడలఁగొట్టుటయు 6690

( 405. మాయాబ్రహ్మచారిప్రాదుర్భావకార్య కథనాది )

నకటకటా ! యంచు నడలుచు నరిగి
యొకపంచ తిన్నెపై నొదిగియున్నంత
నారాత్రిఁ దముదామెయనురక్తి గలుగు
వారికై వడిఁ గైతవబ్రహ్మచారిఁ
బనిచి రమ్మని పిల్వఁబంచిన మగుడి
చనుటయె కాని యాజలజాక్షుసొమ్ముఁ
దెచ్చుట లేదు నేఁ దెచ్చి వీరలకు
నిచ్చుట లేదు రంగేశుఁడే యెఱుఁగు
నవివిని చూఁబోటి యద్దిరా ! రేయిఁ
బనివడి నీవనుపవె శిష్యుచేతఁ 6700

( 406. చోళరాజసభాపురుషయుక్తినిర్ధారణము. )

బూని యీసభలోన బొంకుటకాక
యానలు గొన్నిదె యనిన నాతపసి
చెనఁటిరో ! యెక్కడిశిష్యుండు లేని
యనుచరుం గల్పించి యాడ నేమిటికి
నని వితర్కింపంగ నవనీశ్వరుండు
గని వారికలహంబు కలయవారించి
మత్తుండు కామినీమదదృష్టిచలిత

చిత్తుండుఁ గాన నాత్కితిప్పుఁ దజ్ఞతను
దనకొల్వులోని విద్వాంసులు నృపులు
వినుచు నచ్చెరువంద వివరించిపలికె 6710

నెంతైన నితఁ డింక నిదిదొంగిలింప
నెంతటియది చూడ నితఁ డెంతవాఁడొ
వచ్చిపోయెడువారు నలయునర్థములు
తెచ్చి యేమిచ్చినఁ దేతెమ్మటంచుఁ
గోరి వేవేగఁ గ్రైకొనుశెల్ల లంజ
వారికిఁ దగవె యేవలనఁ జూచినను
వీరిమాటలబాగు వింటిరే మీర
లేరివంకది నేర మెన్నిచూచినను
బూఁచి యీమాటలఁ బోలింపఁ దనకుఁ
దోఁచినగతిఁ జెప్పెదను వినుఁ డనుచు 6720

సీతలోదరి వడు విచ్చినాఁ డనియె
సీతఁడు తను వడువే పిల్చె ననియెఁ
దలపోయ వడువుచందం బిరువురును
గలుగంగఁ జెప్పిరి గతి విచారింప
రీతిగా బ్రహ్మచారియె యేల యితనిఁ
దోతేర వీరింటితొత్తులు లేరె?
యొంటిమై నపరేయినోడక వీరి
యింటికి వడువు రా నేమికారణము
అన్నతాదొంగిలి యది పోలబొంక
కున్నమై నపరాధ మొదవెడు ననుచుఁ 6730

బులిమినం దెలియదే భూసురుమాట
పొలుపుబొంకుగఁ దలంపున మీకు లేదె?
యని విప్రవరుని దొంగగనిశ్చయించి

వనజాక్షిమైఁ దప్పు వారించి కరుణ
విడువుఁడ యని కట్లు విడిపించి దాని
కుడుగర లోనఁగ నయ్యుడురాజవదన
ఒళిరె! నాయేలిక! బాపురే! భూధ
వులశిరోమణి! తగవులచక్రవర్తి!
దొంగనినంత కట్టుఁడు కొట్టుఁ డనక
సంగతి కల్ల నిజంబు తేర్పఱచి 6740

( 407. తథ్యకార్యనిర్ధారణా ప్రకారము. )

యీరీతి మన్నింప నిది నీకె చెల్లు
నో రాజదేవేంద్ర! యుర్వీశచంద్ర!
యనవిని భూపాలుఁ డాపైఁడిగిన్నెఁ
గొనిపోయి శ్రీరంగకువలయేశునకు
నర్పింపు మని యప్పు డారంగవిభుని
తీర్పరిం బిలిచి చేతికి నిచ్చి కనలి
యీచోరునకు నాజ్ఞ యేది శాస్త్రంబు
చూచి సేయింపుఁ డచ్చుగ మీర టంచుఁ
దెలియ విద్వాంసులదిక్కు వీక్షించి
పలికిన పలుకులోపలనె యభ్రమునఁ 6750

( 408. శ్రీరంగనాథ శరీరభూషణాది వర్ణనము. )

దమ్మికెంగేలు గదాపాణితలము
క్రామించు కెందమ్మి గుంపులనీన
వలనొప్పు పదియాఱువన్నెలదట్టి
ధళధళల్ దశదిగంతంబులం బొదువ
డాలైన మకరకుండల చకచకలు
వాలుఁ జెక్కులను దువాళముల్సేయఁ
బూసిన సిరిగందవొడిబుగబుగలు
డాసి పంకజభవాండము వోడుముట్ట

మిండతుమ్మెదలకామెతలుగావించు
దండినెమ్మేనిచెంతల గొండ్లిచూప 6760

నెలమించుదీవల నెలయించుమేని
చెలువ యురోవీథిఁ జెన్నుగ్గలింప
నురుతరకౌస్తుభద్యుతిపల్లవములు
దొరసి వక్షోవీథిఁ దుళగింపుచుండ
నెమ్మోమ్ముదామర నెరయునెత్తావి
కమ్మకస్తురితిలకపుఁదేఁటి గ్రోల
రంగనాథుఁడు తనరంగ విహంగ
పుంగవు నెక్కి వేల్పులుగొల్వ వచ్చి
యతులితగతి జను లరుదంది చూడ
నతనికిం బ్రత్యక్ష మయ్యె నవ్వేళ 6770

( 409. శ్రీరంగరాజవాక్య ప్రఖ్యాపనము. నిజలీలాదివర్ణనము. )

మును వైనతేయుసమ్ముఖమునంచెగడి
యనిరుద్ధబంధంబు లరిగినపగిది
దనవిల్తుతండ్రిముందర నిల్చినంతఁ
దనుదానె యూడె నత్తపసిబంధములు
జనులెల్లఁ జూచి యాశ్చర్యంబు నంద
వనజాక్షుఁ డాయోగివరుఁ జేరఁ బిలిచి
భక్తిమోక్షంబున భవరోగపాశ
ముక్తుని లాలించుమురువున నతని
గారవింపుచుఁ జోళకాంతునిఁ జేరి
యోరి! నీ కిటుసేయ నుచితమే తలఁప 6780

నీగతి నిల నటియించినవాఁడ
నీగిన్ను పీరల కిచ్చినవాఁడ
నేను నీవెవ్వండ వితఁడు నాబిడ్డఁ

జేసు గూర్చినధనం బితనిది గాదె ?
చేకొని లంజ కిచ్చినయట్టిసొమ్ము
కైకొందునే యేను గడు నీతిదక్క
వారి కిచ్చినసొమ్ము వారికే యొసఁగి
నారీతి నయ్యోగినాథు నాతనయుఁ
దలపోయు మనుమ నాతాపసోత్తముని
తలఁపునెత్తమ్మికి నత్తఱిఁ బ్రవేశించి 6790

( 410. చోళరాజ ప్రార్థనాక్రమము, స్వాపరాధక్షమాపణశైలి. )

తలయూఁచు నమ్మహీధవుఁడు డెందమునఁ
దలకొని భీతితోఁ దనవారుఁ దాను
నఱిముఱి సాష్టాంగ మతనికి నెరఁగి
మెఱుఁగక చేసితి నీతప్పిదంబు
కావవే శ్రీరంగకాంతుండ నీవ
కావవే నను నేలు కరుణాంబురాశి
నీవ శ్రీరంగేశునిజకుమారుఁడవు
దేవర సుతుఁడ నైతిని యే నటంచు

( 411. చోళరాజకలితవిప్రనారాయణ సంమాననాది. )

నావేళ నతని సింహాసనారూఢుఁ
గావించి తత్పాదకమలము ల్గడిగి 6800
తనపట్టమహిషులుఁ దాను నందంద
ఘనభక్తిమై నూడిగంబులు చేసి
యోజ పెంపున వివిధోపచారములఁ
బూజించి యాయోగిపుంగవుం గొలిచి

( 412. శిబికారోహణవీథీప్రదక్షిణ రచనాక్రమము. )

యాసక్తిఁ జతురంత యానా వరోహుఁ
జేసి కైసేసి విచిత్రవైఖరులఁ

బటువాభేరీతూర్యపణవాదివాద్య
చటులఘోషంబులు జగమెల్ల నిండ
భజనఁ జూపట్టు నావల్లకికొమ్ము
భుజమున నిడుకొని పురవీథులందు 6810

మెరయింప నప్సరమీనలోచనలు
పరమైన యుపరంజిపళ్ళెరంబులను
ఘనసార దీపముల్ కడువింత లెసఁగ
నొనరించి యారతు లొనఁగ నచ్చరలు
దేవకామినులు భూదేవకామినులు
సేవించి దీవించి సేసప్రా లిడఁగ
నీరీతి పురమెల్ల నేగింప మగుడి
ధారుణీవిభుఁడు సద్మమున కేతెంచె

( 418. శ్రీరంగనాథమందిరప్రవేశక్రమము. స్తోత్రరచనాది. )

నారాజుమై నప్పు డామహానిరాజు
చారుకృపామృతాసారంబు నించి 6820

యతని వీడ్కొని రంగహర్మ్యసన్నిధికి
నతివేగమునఁ బోయి యవనతుం డగుచు
దనసేయునట్టికృత్యము నీచమైన
ఘనతరభోగ్యంబు గాఁగఁ జేకొన్న
యీసర్వసులభుని నిందిరానాథు
వాసుదేవునిఁ దండ్రి వాత్సల్యజలధి
యేమని వినుతింతు నిభరాజవరద !
నీమహామహిమ వర్ణింప శక్యంబె?
యని వినుతింప రంగాధినాయకుఁడు
మునినాథుఁ జూచి ప్రమోదించి పలికెఁ 6830

( 414. విప్రనారాయణముని రచితపుష్ప మాలాసమర్పణకైంకర్యప్రశంస. )

దనయ ! నీవరసుమదామకైంకర్య
మునకు మెచ్చితి వరముల నభీష్టముల
నడుగు మటన్న నీదగుభక్తజనుల
యడుగుదమ్ముల రేణు వనుపేరు నాకు
దయసేయుమా శాశ్వతంబుగా ననిన
దయసేసియారంగధవుఁ డట్ల యొసఁగి
తనసేయు గోపకాంతావిహారంబు
వినుతించువారి కెవ్విధి ఫలం బొదవు
నారీతి సౌభాగ్య మబ్బు నీచరిత
ధారుణి నొకమాఱు దలఁచువారలకు 6840

( 415. భక్తాంఘ్రిరేణుకాపరనామధేయ ప్రాప్తిక్రమము. ఆత్యాశ్చర్యము౦మహిమ )

నని యానతిచ్చిన నదియాది గాఁగ
జననుతుం డగుమహాని జనవరేణ్యునకుఁ
జనుపడ భువిలోన భక్తాంఘ్రిరేణుఁ
డనుపేరు విలసిల్లె నమ్మహాయోగి
పరమవైష్ణవనుతపదపద్ముఁ డయ్యు
హరిభక్తపదపద్మ మాత్మఁ గోరుచును
బరమవిరక్తుఁడై పద్మజముఖ్య
సురశిరోన్యస్త విస్ఫురితాంఘ్రి యగుచు
పరసమృద్ధి వహించి భవము లడంచి
హరిభక్తతాఁ గాంత ననుచు భావించి 6850

( 416. యోగికృతప్రబంధద్వయ సమర్పణక్రమము. )
సర్వోత్కృష్ట కైంకర్య నిరతత్వ పరమానంద ప్రాప్తిప్రకారాది వర్ణనము.

తనతోటిగతి సుమదామకైంకర్య
మొనరించుకొనుచు సర్వోన్నతుం డగుచుఁ
దావనమాలికాత్మజుఁ డై నకతన

నావనమాలికి నంకితంబుగను
లాలితవేదజాలప్రసూనముల
మాలిక గాఁగ శ్రీమాలిక యనెడు
కృతియును బ్రాబోధకీఖ్యాతి దనరు
కృతియును సవరించి కృతకృత్యుఁ డగుచు
నిరతంబు హరిపదాన్వితచిత్తుఁ డగుచు
బరమయోగానందభరితుఁ డై యుండె 6860

( 417. దేవదేవీనామక గణికామణిభక్తి సచ్చరిత్రాదివర్ణనము. )

నాఁడేనదేవి రంగాధీశ్వరుండు
భూదేవబాలురూపున దూతకరణిఁ
దనయింటి కేతెంచి తనజాతిఖ్యాతి
యునికిఁ గన్గొనక సర్వోత్తరుం డయ్యు
మునినరేణ్యునికతమున నిట్టిభాగ్య
మనువొందెఁ దనకని యాత్మ నుప్పొంగి
పరమయోగీంద్రుకృపాదృష్టినలనఁ
బరమవిరక్తయై భవముక్త యగుచుఁ

( 418. ధనధాన్యసమర్పణాది. భక్తాంఘ్రియోగి చరిత్ర శ్రవణపఠనాదిఫల నిరూపణము. )

దనసకలోత్పత్తి ధనళాత్ముఁ డొసఁగు
కనకపాత్రంబునం గై కొనివచ్చి 6870
శ్రీరంగవిభుని కర్పించి తత్పాద
నీరజభావననిరతయై యుండెఁ
బరమపావనమైన భక్తాంఘ్రిరేణు
చరితంబు భక్తి నిచ్చలు నెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివినను వారిచ్చి
నను వారి కెపుడు వైష్ణవులసత్కృపయు
హరికృపామృతము ననంతమై పొంగి
పరిపూర్ణమై యుండుఁ బ్రతిలేక యనుచు

( 419. గ్రంథసమర్పణక్రమము. కవివంశమహిమ. కవికావ్యప్రశంస. )

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని 6880

యతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళ పాకాన్నయార్య
తనయు తిమ్మార్యనందన రత్నకుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ

( 420. చతుర్థాశ్వాసపరిసమాప్తిప్రకారము. )

సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ 6890

కృతమైన పరమయోగివిలాసకృతిని
ధృతులిలంబుగఁ జతుర్థాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## పంచమాశ్వాసము.



( 421. శ్రీదేవీవైభవ ప్రశంస. శ్రీవేంకటేశస్మరణాది. )

[ ద్విపద ]

శ్రీశ్యామసరోజాంగ ! యలమేలుమంగ !
జీమూతసంకాశ ! శ్రీవేంకటేశ !
మునిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి ! యనఘారు వరదానశీలి !

( 422. పాండ్యదేశస్థిత శ్రీవిల్లిపుత్తూరునామకనగరవర్ణనము. )
తన్నగర కాంతాజన సౌందర్య విశేషవర్ణనము.

యవిరళశ్రీలచే నమరుదేశంబు
రవణించు బాండ్యమండలమధ్యమమునఁ
బొగడొందు శ్రీవిల్లిపుత్తూరు నాఁగ
నగర మొక్కటి యొప్పు నవ్వైఖరుల 6900
నవ్వీటిసౌధచంద్రాననామణుల
నవ్వువెన్నెలసోగననల నిచ్చలును
విలసిల్లుతావుల విన్నేటిలోని
కలువలు వికసించుఁ గమలముల్ మోడ్చు
నలపురివీథుల ననిశంబు మెలఁగు
జలజనేత్రలకటాక్షంబులవలన

( 423. తన్నగరవాసి వటపత్రశాయి నామకహరి వైభవము. )

మట్టుమీరిన పుష్పమయతోరణములు
కట్టకట్టినగతి నొప్పుచుండు
నట నొప్పు శేషపర్యంకంబునందు
వటపత్రశాయి నా వసుదేవసుతుఁడు 6910
తనయపాంగామృతధారలచేత
వినుతతాపత్రయవిపులార్తి నార్చు
ననుపమం బైనట్టి యప్పట్టణమున
వనజలోచనముఖవనజవంశమున

( 424. జ్యేష్ఠమాస స్వాతీనక్షత్రగినములో గరుడాంశరూప విష్ణుచిత్తాఖ్యదశమయోగి ప్రాదుర్భావకథనము. )

సిరిమించుకళలతో జ్యేష్ఠమాసమున
పరలగ్నమున గంధవహతారయందు
నక్షీణవేదమయాంగు డైనట్టి
పక్షీంద్రునంశంబు ప్రభవించి జగతి
నెట్టన సురగురు నిరసించుపేర్మి
భట్టనాథుం డనఁబరఁగి వెండియును 6920

( 425. విష్ణుచిత్తనామకయోగి స్వాభావిక హరిభక్త్యాది ప్రశంస. )

నరయంగ సకలకళాశ్రయుం డగుట
నిరుపమకారుణ్యనిధి యైనకతన
వైష్ణవపూజావివర్ధనుం డగుట
విష్ణుచిత్తుం డనవిఖ్యాతి నంది
యచ్చటివటధాము హరికోటిధాముఁ
బచ్చవిల్తునితండ్రి భక్తి గొల్చుచును

( 426. దశావతార వైభవానుభవ ప్రకారము. )

ఈసరోజాక్షున కెట్టిపూజనము
సేసి చిత్తంబు రంజిల్లఁ జేయుదునో
యని రమావిభుని దశావతారములు
మనములోపలఁ బలుమాఱుఁ జింతించి 6930
నందనందనుఁ డైన నందకపాణి
నందితకథల నానందించుకొనుచు
మధురలోఁ దొలుత మన్మథవైరి కంసు
వధియించుకొఱకుఁ దీవ్రత నేగి యేగి

( 427. శ్రీకృష్ణభక్తి పారవశ్యాది. పుష్పసమర్పణ కైంకర్య నిరతత్వ ప్రకారము. )

హరిపుష్పలావకుండగు వానియింటికి
కరిగెఁ బుష్పములకునై యాత్మ నొండెడక
కావున ధవళపంకజలోచనునకుఁ
గావించు సకలయాగంబులకంటె
నరయంగఁ గడుమనోహరమైన పూజ
విరులపూజన మని వినరించి తెలిసి 6940

( 428. విష్ణుచిత్తపరిపాలితారామవృక్షలక్ష్మీప్రశంసాది. )

భావించి వటధామభర్తకే నట్ల
కావింతు సుమదామకైంకర్య మనుచుఁ
జందన చాంపేయ శారద వకుళ
కుంద మాకంద ముకుంద మందార
కరవీర ఖర్జూర కరక జంబీర
కురువక కరంట కాకోల నారంగ
కేసరి కింశుక కేతకి నాగ
కేసరముఖవరక్షితిజవల్లికల

సురరాజువనము, నసురరాజవనము
నరపాలువనము, వానరపాలువనము 6950

( 429. మాలాసమర్పణదాసి కైంకర్యవర్ణనము. )

నగుచు గేలింపుచు నంటుసేయుచును
బొగడుచు జగతి కద్భుతము దీపింప
లలితసంతతపత్త్రలక్ష్మిచే మిగుల
నలపడ నారామ మభిరామముగను
నొనరించి యమ్మహాయోగీంద్రచంద్రుఁ
డనయంబు భక్తితో నరవిరుల్ గోసి
దామము లల్లి నిత్యము వటపత్త్ర
ధామమూర్తికి నర్పితంబు సేయుచును
నరవిధారకముఁ బోషకము భోగ్యంబుఁ
గరిరాజవరదుకైంకర్యంబు గాఁగఁ 6960

( 430. మధురా [దక్షిణమధురా] నగరవర్ణనము. )

దలఁపుచు నితరచింతలు గట్టిపెట్టి
యలఘువిద్యాసంగతాత్ముఁడై యుండె
నాకాలమున నొప్పు నగణితశ్రీలఁ
బ్రాకటం బగు మధురాపురం బనఁగ
నురుతరం బగుచు నర్వోత్తరం బగుట
నరయంగ రాజరాజాన్వితం బగుట
నలకాపురముఁ బోలె నమ్మహానగర
మలరు నచ్చటిమేడలందుఁ జరించు
నేణలోచనలముఖేందుబింబంబు
లేణాంకబింబంబు నెదురుతాఁకైనఁ 6970

( 431. పాండ్యరాజ రాజ్యపరిపాలన వైఖరి. )

దమపతి యితఁ డంచుఁ దలఁపంగలేక
భ్రమసి తారాళి యేర్పఱపరాకుండు
నాపట్టణాధీశుఁ డమరేంద్రుఁ దొడరి
యాపట్టణం బేలు నమృతాంశుకులుఁడు
దీపకవల్లభదేవుండు ఘనుఁడు
భూపచంద్రుఁడు పాండ్యభూవల్లభుండు
జనులెల్ల జయలిడ సకలరాజ్యంబు
బనుపడ నెంతయుఁ బాలించుచుండి
తనయేలుపురమునందలిసర్వజనుల
యునికియు వా రాడుచుండువాక్యములుఁ 6980

( 432. పాండ్యరాజ కృతరాత్రికాలనగరశోధనా ప్రకారము. )

గన విసం గోరి యొక్కఁడ యొక్కనాఁట
నసయంబుఁ గార్కమ్ము నట్టిరేరేయి
భృంగకాంతుల జళిపించువన్నియల
గొంగడి ముసుఁ గిడుకొని యిల్లువెడలి
వీడులోపల వీథివీథులఁ జారు
లాడువాక్యంబుల నాలకింపుచును
అరిగి పురంబెల్ల నంతయు నరసి
తిరిగి యింటికి నేగుదెంచుచునుండి
యొకపంచతిన్నెపై నొక్కండ యలసి
నికటభాగంబున నిద్రించుచున్న 6990

( 433. బ్రాహ్మణవాక్య శ్రవణాశైలి. )

భూసురవరుఁ జేరఁ బోయి యాచెంత
నాసీనుఁ డగుచు నొయ్యన మేలుకొలిపి

యొకనేర్పుమైఁ బ్రసంగోచితోక్తులను
వికసింపఁ జేసి కై పీడియం బొసఁగి
యెందుండి వచ్చితి వీరీతి నొంటి
నిందేల నిద్రించె దీవు నావుఁడును
బనివడి దివ్యసంపద లొసఁగంగ
మునుమిడి ఘనదోషముల మెసఁగంగ
మహితవిజ్ఞానంబు మదిబొసఁగంగ
నిహపరసౌఖ్యంబు లెసగంగ బడిసి 7000

దుసికిలిలోనిశ్త్రులు విసుకంగ
వెస గంగ కరిగి వేవేగంబ మరలి
చనువాఁడ నగుచు నిచ్చట నెండవడిసి
వెనుకొన్నబడలిక విశ్రమించెదను

( 434. భూపాల బ్రాహ్మణ పరస్పర సంభాషణాది. )

అన విని భూనాథుఁ డవనీసురేంద్రుఁ
గనుఁగొని పలికె నక్కడఁ బెద్దలైనఁ
సదమలజ్ఞానుల సంగడి మీరు
చదివివచ్చినవిశేషము గల్గనేని
యానతి మ్మన విని యాత్మ నుప్పొంగి
భూనాథుతో విప్రపుంగవుం డనియెఁ 7010

గడునేర్పుమై వానకాలంబుకొలకుఁ
గడమ యెన్మిదినెల గ్గడియింపవలయు
నగపడురాత్రికై యాత్మఁ జింతించి
పగలె వస్తువుల నంపాదింపవలయు

( 435. పరతత్వజ్ఞాన సంపాదనావశ్యకతానిరూపణము. )

మునువచ్చువార్ధకమునకునై నరుఁడు
తనయావనమున యత్నము సేయవలయు

భాజనీయం బై నపరకారణంబు
నీజననముఁ నందె యెఱుఁగంగవలయు
ననునర్థములు గల్గి యఘదూర మగుచుఁ
జనగ వర్షార్ధ మష్టా ప్రయతేత 7020

మాసాననెడు శ్లోకమహిమఁ దా నప్పు
డాసార్వభౌముతో ననువదించుటయు
నాలించి విభుఁడు తదర్థ మంతయును
జాల డెందంబులోఁ జర్చించి చూచి
కోరక కర్మానుగుణముగా నెపుడు
వారక సంపద ల్వచ్చుచున్నవియు
కలదె యదృష్టంబు గలిగించు వెరవు
తెలియంగవలయు నింతియు యాత్మ కనుచు
నగరికి నంతఁ గ్రన్ననేగి కలువ
పగదాయ పొడుపుగుబ్బలిమీఁదఁ బొడమ 7030

( 480. పాండ్యరాజకలిత ప్రాతఃసంధ్యాకార్య వర్ణనాది. సభామంటపప్రవేశాది. )
హితపురోహిత సమాలోచనారీతికథనము.

నుచితసంధ్యావిధు లొనరించి రత్న
రచిత సభామందిరమున కేతెంచి
యింపుమై భూనాథు లిరుమేలఁ గొలువ
సంపదుం డను పేరఁ బనుపురోహితుని
రావించి తనయంతరంగంబులోని
భావమంతయుఁ దేటపడఁ జెప్పఁదొడఁగెఁ
గలయుంగ ధర్మార్థకామసౌఖ్యములఁ
దెలిసి యవ్విధుల వర్తించి చూచితిని
బోలింప నంతిమపురుషార్థసిద్ధి
యేలీలఁ దెలియుదు నెఱిఁగింపవలయు 7040

( 437. వేదాంత తత్త్వజ్ఞాన సంప్రాప్తి ప్రకారము. )

నవిన రాజేంద్ర ! నీ వడిగినసూక్ష్మ
మనిమిషులకు నైన నది యెన్నఁ దరమె
యైన మహాత్మ ! శ్రీహరిపాదమతివి
కాన నీ వెఱుఁగంగఁగలవు చెప్పెదను
నిగమాంతవిధులచే నిశ్చితం బైన
నిగమార్థ మాత్మలో నిలిపి నమ్మినను

( 438. భూపాలకలిత కనకశుల్కస్థాపనప్రకారము. )

గానంగవచ్చు మోక్షముత్రోవయెల్ల
భూనాథ ! యన మనంబున విచారించి
కనకముల్ పెక్కు శుల్కంబు గావించి
తనసభా స్తంభమధ్యమునఁ గట్టించి 7050
యలయంగఁ దవలోనియనుమాన మెడయ
ధర నెవ్వరేఁ బరతత్త్వనిర్ణయముఁ
జేసి యీశుల్కంబుఁ జేకొనుం డనుచు

( 439. పరతత్త్వశుల్కజయభాసురసూరి సంమానన ప్రతిజ్ఞారీతి. )
కపిలాక్షపాద భట్టాదిమతపండిత పరాజయము.

రాసికి నెక్కుమర్యాద గావించి
ప్రకటవివేకసంభరితులచేత
సకలదిక్కులయందుఁ జాటంగఁ బనిచెఁ
బనిచినఁ గపిలాక్షపాదభట్టాది
ఘనశాస్త్రవిదు లైనఘను లేగుదెంచి
యారాజుసన్నిధి నాసీను లగుచుఁ
జేరి యొండొరులు చర్చించి చర్చించి 7060

( 440. పరస్పర మతగుణాగుణ చర్చాప్రకారము. )

యది మృష యిది మృష యనుచు గడ్డంబు
లదరంగ హస్తవిన్యాసంబు లెసంగ
వినుఁడు పల్కులు గర్వించి మోయెదుట
వనర నేమిటికి సర్వము మిథ్య మీకు
మనయంబు నిశ్చయం బగునె మీచేత
ననుమానములదొంతియాకార మెల్లఁ
గారు లేటికిఁ బుట్టు కర్మ లై నట్టి
మీర లీయర్థ మెమ్మెయి నెఱుంగుదురు
పెలుచ మాటలరాసిఁ బెట్టనే కాని
తెలియునే మీకు నదృష్టకారణము ? 7070

ఆగమబాహ్యుల రయినట్టిమీకు
నాగమాంతార్థంబు లవి యేల తెలియు
ననుచు నన్యోన్యమతాభిభాషణము
నొనరింపుచును జేరి యొండొరులకును
సారెకు నిగ్రహస్థానంబు లిడుచు
నీరీతి నిశ్చయం బెందును లేక
పెరుగు వడ్లును గలిపినరీతి నుండ

(441. పాండ్య భూపాలమనఃఖేద ప్రాప్తిక్రమము. )
హరికృతవిష్ణుచిత్తాఖ్య భక్త ప్రేషణము.

నరనాథుఁ డెంతె చింతాక్రాంతుఁ డయ్యె
నట ధన్వినగరవరావాసుఁ డైన
వటపత్రశయనుండు వాత్సల్యజలధి 7080

తనకు నిచ్చలు పుష్పదామసంపదలఁ
గొనివచ్చి యొసఁగుభక్తుని విష్ణుచిత్తుఁ

గని వత్స ! పాండ్యభూకాంతునిసభను
గనుపట్టు కనకశుల్కంబుఁ గైకొనుము
అన విని యరుదంది యయ్యోగివరుఁడు
వినయ మేర్పడ విన్నవించె శౌరికిని
వేదమో శాస్త్రమో విఃరించిచూడ
వేదాఁర్థసాధ్యమై వెలయు శుల్కంబు
పాయక గుద్దలిఁ బట్టినకేలి
కాయుల చూపి యేఁ గైకొను టెట్లు 7090

( 442. వేదాంతజ్ఞాన ప్రదాన ప్రకారము. )

లితరవిచారంబు లెవ్వియు నెఱుఁగ
మతి నీదుపాదపద్మము లెఱుంగుదును
అన విని కరుణా కటాక్షామృతంబుఁ
జినుకుచు నావిష్ణుచిత్తుని కనియె
నీకడ నందియుం జేటికి వలదు
నీ కేమిభార మిన్నిటికి నే నుండఁ
దలఁప నీహృదయపద్మములోన నేన
నెలకొని నిగమాంతనిశ్చితార్థంబు
పలికించువాఁడను బలికెడువాఁడ
నల మహాశుల్కంబు హరియించువాఁడ 7100

( 443. సంతోషప్రాప్తిక్రమము, హనుమత్ దృష్టాంత కథనము. )

నేన నీ వటఁ బోయి యిటకు రమ్మనుచు
నానతిచ్చిన యంత నాయోగివరుఁడు
పరమసంతోషసంభరితుఁడై యాది
గురునియోగమున మిక్కుటపువేగమునఁ
జని యాంజనేయుండు జానకీనాథు
ననుమతిఁ గడలిఁ బయ్యన దాఁటినట్టు

లతులగ్రహారాది సమంచిత, వేగ
వతి యనునొక మహావాహిని దాఁటి

( 444. మధురానగరాగమన వర్ణనము. )

మధువైరి కుమతుల మర్దించుకొఱకు
మధుర సొచ్చిన రీతి మధుర సొత్తెంచి 7110
వాటమై మిగుల విద్వత్కదంబముల
చేటాడు నారాజు పేరోలగంబు
నల్లంత వీక్షించి యటకు నేతేర
వల్లభదేవుఁడా వనజాక్షుచిత్తు
నకళంకమతియైన యభిమన్యుసూతి

( 445. పాండ్యభూపాలకలితయోగి సంమానసాదికథనము. )

శుకయోగి గనుగొన్న చొప్పునఁ గాంచి
గ్రుక్కున సింగంపుగద్దియ డిగ్గి
మొక్కుడు భక్తిమై నెదురేగుదెంచి
తన పురోహితుఁడును దాను దత్పాద
వనజయుగంబుపై వ్రాలి యగ్గించి 7120
తోకొనివచ్చి బంధురరత్నపీఠిఁ
జేకొని యాసీనుఁ జేసి సద్భక్తి
భ్రాజితంబుగ నర్ఘ్యపాద్యాదివిధులఁ
బూజింపఁ జూచి యప్పుడు చెంతనున్న

( 446. పాషండాది పరమతప్రస్తావము. వేదాంతమతస్థిరీకరణ ప్రార్థన. )

పరమతవాదులై పరఁగు పాషండ
ధరణీసురులు చూపుదాళ కిట్లనిరి
బహువేద వేదాంత పఠనాదివిధుల
మహి నెన్నఁదగు మహామహులైన సహారి

నక్షులుగాఁ జూచి యతఁడునుం దానుఁ
దక్షులపోలె నీ ధారుణీశ్వరుఁడు 7130

బీనుఁగుదాసరి నొక పెద్దగాఁ జేసి
కొనివచ్చి పీఠవునం గూర్చుండఁబెట్టి
పలువిధంబులఁ బొలుపడి మాపుదనకఁ
జిలివిషంబులు గొన్ని సేయుచున్నాఁడు
పట్టెనామంబులు ఫాలభాగమునఁ
బెట్టిన వచ్చునే పెద్దఱికంబు ?
ఆరాజు చేసినయది కొంతకాక
యీరీతి నేమిటి కీ శుంఠకాయ
వైదికుఁడై యుండి వ్రాత్యుచందమున
నీడెసఁ దాఁ బురోహితుఁ డైనవాఁడు 7140

వల్లభదేవుండు వందనం బిడినఁ
జెల్లఁబో! తా నేల సేసె వందనము
లంపటఁబడఁగఁ దాళ్ళకుఁ దలబంటి
ఱొంపటిచెట్లకు నీఁక నెంత బంటి ?
యను నీతిశాస్త్రంబు లందలి కొదవ
తొనర దిద్దెడునట్టి యోగ్యులచేత
నెక్కుడఁ దీరని యీ బీరకాయ
చిక్కు దా నితనిచేఁ దీరుటయెట్లు
పన్ని యసూయ యేర్పడఁ బలుమాఱు
నిన్నియు నన నేల యిందె చూచెదము 7150

( 447. భట్టనాథయోగికరణీయ పరతత్త్వనిర్ణయప్రకారము. )
పరమతాల్పసారస్వరూపతత్త్వకథనము.

అనువారు కొందఱు నతఁడు మహాత్ముఁ
డనువారు కొందఱు నై యుండి రంత

హితవుమీఱఁగఁ బురోహితుఁడు భూధవుఁడు
నతు లొనర్చుచు భట్టనాథు నీక్షించి
యుండట మోహశాస్త్రావనీస్థలుల
భేదింపరాక యభేద్య మైనట్టి
యనుపమ పరవస్తు వనువిధానంబుఁ
గనఁజేయు విద్యాప్రకాశాంబనమునఁ
బదపడి యెన్నని బలుమాఱు నిచటఁ
దుద మొద లెఱుఁగక దుష్టవాక్యములు 7160

( 448. భట్టనాథయోగికృత హరిధ్యాన ప్రార్థనాప్రకారము. )

నుడివెడు పీరలనోళ్ళుల మ్ముద
లిడినట్లు వేవేగ నిఁక జాగుమాని
దాస వత్సల ! పరతత్త్వ నిర్ణయముఁ
జేసి మమ్మిటు దయచేసి రక్షింపు
మనవుఁడు మోదించి హరిచిత్తుఁ డపుడు
తనలోని వటపత్రధాముఁ బ్రార్థింపఁ
బరమేష్ఠి యనుమతిఁ బ్రాచేతసునకుఁ
బరిపూర్ణ విజ్ఞానపద మొందినట్లు
ఘన పాంచజన్య సంగంబున ధ్రువున
కనుపమ సకలవిద్యలు వచ్చినట్లు 7170

( 449. హరికృపాప్రాప్త నానాశాస్త్రసారతమజ్ఞాన వైభవము. )

అఖిలేశుకృపను జిహ్వారంగసీమ
నఖిలశాస్త్రములు నృత్యము లాడుచుండ
ననఘుఁ డా హరిచిత్తుఁ డనియె నవ్వేళ
జనపతి భూమి నిర్జరులును వినఁగఁ
బ్రకృతి జీవులకు లోపలను వెల్పలను
సకలశాస్త్రముల నిశ్చలత దీపింప

నాది యంత్యము లేక యధికుండు సముఁడు
నే డెన లేక సర్వేశ్వరుం డగుచు
సర్వనియంతయై సర్వజ్ఞుఁ డగుచు
సర్వంబుఁ దనకు శేషంబుగా మెలఁగు 7180

( 450. పరతత్త్వ వైభవావిష్కరణ ప్రకారము. )

కాంతిఁ బాయని మణికరణి నా దివస
కాంతుఁ బాయని రుచిగతిఁ బద్మఁగూడి
మిగుల వేదములాడి మిథునం బటంచుఁ
బొగడఁ బెంపొందు (శ్రీ) పురుషోత్తముండు
పరతత్త్వమని పల్కుపల్కు లోపలనె
సరగునం దత్సభా స్తంభ మధ్యమున
ఘనపాశములఁ గూడఁగట్టిన ముడుపు
తనుదానె యతని పాదములపై వ్రాలెఁ
దోడనే మొరసె దుందుభులు రంభాదు
లాడిరి కొనియాడి రఖిల భూసురులు 7190

( 451. పాండ్యభూపాలపరమానంద కథనాది. )

సురలు మోదించిరి సారిది నందంద
విరివాన కురిసె కావిరిమల్ల విరిసె
నప్పు డా రాజేంద్రుఁ డంతరంగమున
నుప్పొంగి పొంగి యయ్యోగి నాయకుని
బదపద్మముల వ్రాలి పరమానురక్తిఁ
బదివేల తెఱఁగులఁ బ్రణుతిఁ గావించి
యో పావనాత్మ! యో యోగీంద్రచంద్ర!
నాపాలిదైవంబ ననుఁ గన్నతండ్రి!
యనుచు నానద బాష్పాంబుపూరముల
నినుపారి నా యోగి నీరజనేత్రుఁ 7200

( 452. పాండ్యభూపాలకలితసంమాననాతిశయము. )
వీథీప్రదక్షిణ బిరుద ప్రఖ్యాపనాది.

ప్రచురమాల్యాంబరాభరణుఁ గావించి
రుచిరదంతావళారూఢుఁగాఁ జేసి
బహుతర చతురంగబల పుత్త్రమిత్ర
సహితుఁడై యనుచరుచందానఁ గొలిచి
తనపురంబెల్లఁ బ్రదక్షిణగతుల
నెనలేనివేడుక నేగించుతఱిని
ఆలోకపావనునభినవోత్సవము
నాలోకనము సేయునట్టివేడుకను
కమలాసనుఁడు చండకరశీతకరులు
నమరేంద్రసిద్ధవిద్యాధరు ల్గొలువ 7210

( 453. గరుడారూఢశ్రీహరిప్రత్యక్ష సేవాప్రదర్శనాది. )

శ్రీహరి కలిమినెచ్చెలువతో గరుడ
వాహనారూఢుఁడై వచ్చి యవ్వేళఁ
దనయుఁడు బ్రహ్మ రథంబుపై మెఱయ
జననియు జనకుండు సంతసం బొదవఁ
గనుఁగొనుగతి గజస్కంధంబుమీఁద
దనరారువిష్ణుచేతను గటాక్షింప
విష్ణుపదంబుపై వెలుఁగొందుచున్న
విష్ణు సేవించి యవ్విష్ణుచిత్తుండు
నరయ నకాలదేశాస్పదం బైన
పరవస్తు విపుడు చూపట్టెఁ గన్నులకు 7220

( 454. విష్ణుచిత్తయోగి భక్తిపారవశ్యాది. జగదీశ్వరమహిమాతిశయకథనము. )

నని భక్తిపరవశుండై శంబరారి
జనకునిఁ గాంచి యాజగదేకనాథు

సర్వజ్ఞుఁడును సర్వశక్తియుం దాన
సర్వంబు ననుచుఁ గ్రచ్ఛర భక్తిపరత
జలజాక్షులావణ్యసౌందర్యముఖ్య
ములకె మిక్కిలి చిక్కి మోహించి యప్పు
డీమోహనాంగున కీదృష్టిదోష
మేమియు లేక సొం పెసఁగుఁ గాకనుచు
జంటలై మొఱయు కుంజరములై పసిఁడి
గంటలు తాళము ల్గాఁగఁ జేఁబూని 7230

( 455. విష్ణుచిత్తయోగికృతహరిమంగళాశాసన ప్రకారము. )

నవరసరాగవర్ణములఁ బెంపెసఁగ
నవరించి మంగళాశాసనం బపుడు
శ్రీమాల్యకారునిచే దివ్యపుష్ప
దామముల్ తాల్చి యుద్ధత రంగసీమ
జాణూరమల్లుని సమయించి మిగుల
రాణించుశౌరిదోర్దండంబులకును
వలపల రవికోటి వడఁకించుకాంతిఁ
దలుకొత్తుచుండుసుదర్శనంబునకు
నలచెంత ననిదైత్యు లగలునాదములు
సలుపుచుండెడు పాంచజన్యంబునకును 7240

నపరంజిబొమ్మయో యన నొప్పు మేన
నుపమింపఁ దగి యెద నున్నయిందిరకుఁ
గెందామరలపస గిలుబాడుపసల
ఘుందంబు గలుగు నీయడుగుఁదమ్ములకుఁ
బూనికతోడ నెప్పుడు బంటనైన
యేనును నీవును నెర వింత లేక

యొనఁగూడియుండెడియునికి కెంతయును
నెనసియుండంగఁ బెక్కేండ్లు మంగళము
మంగళం బని సలుమాఱు ననంతు
సంగతి మంగళాశాసనం బిట్లు 7250

( 456. వాసుదేవ వైభవగుంభితద్రవిడప్రబంధసమర్పణ క్రమము. )

సపరించి మఱియు నాశౌరినందనుని
యవతారములయందు ననయంబుఁ జిక్కి
దామోదరుని యవతారాదిలీల
లామోదమాలిక లై యొప్పుచుండఁ
బ్రామాణికోక్తిగర్భంబు లై యొప్పు
ద్రావిడోక్తులఁ బ్రబంధంబుఁ గావింప

( 457. భగవదాజ్ఞాప్రకారకథనము. )

ననయంబు హర్షించి యారమావిభుఁడు
తనదివ్యశక్తి యాతనియంద నిలిపి
శ్రీవల్లిపుత్తూరఁ జెన్నొందుచున్న
యావటదళధాముఁడై యనువొంద 7260

నరుదెంచి యప్పు డాయుపనిశతిలకుఁ
శిరవొందఁ బురమెల్ల నేగించి పిదప
ననురాగ మిగురొత్త నావిష్ణుచిత్తు
ననుపమసింహాసనాసీనుఁ జేసి
మండితకాంచనాంబరభూషణముల
నెండియుఁ బూజఁ గావింప నయ్యోగి

( 458. నిజనగరప్రాప్తిప్రకారము. పౌరజనవందనానందనాది. )

నరనాథుఁ బెక్కుచందముల లాలించి
కరివరారూఢుఁడై క్రమ్మఱ మరలి

తనపురి కేగున త్తఱిఁ బౌరజనులు
వినఁ గ్రొత్తయైన యవ్వృత్తాంత మెల్ల 7270
విని పురిఁ గైసేసి వేవేగ నెదురు
చనుదెంచి ప్రణతు లర్చనలు గావింప
భూరిరత్నాంబరభూషణావళుల
వారి సంభావించి వారనివేశ్య-

( 459. వటపత్రశాయినామకహరిమందిర ప్రాప్తిప్రణామాదిరచన. )

వారునుం దాము నావటధామునఁ డైన
నీరజనేత్రుసన్నిధికి నేతెంచి
యతనిపాదంబుల కందంద వ్రాలి
నుతి సేసి భక్తి కన్నుల నామతింప
నోతండ్రి ! నాలోన నుండి వేదార్థ
జాతంబు భువిలోని జనులెల్ల వినఁగఁ 7280
బలికించువాఁడను బల్కు- శుల్కంబు
వలనొప్పఁ గైకొనువాఁడను నేన
యని యానతిచ్చితి రారీతి నయ్యో
ధన మిదే భద్రదంతావళం బిదియె
యని సమర్పించి నిజావాసమునకుఁ
జనుదెంచి యొప్పటిసరవి నిచ్చలును

( 460. హరికైంకర్య నిరతత్వ ప్రకారము. )

నతులితం బగుభక్తి నారమాపతికి
నతనియుత్సవబేరమై ప్రకాశించు
నలఘువిద్యాపూర్ణుఁ డౌమురారికిని
నలరుదామంబుల నర్పించికొనుచుఁ 7290
బరమవిరక్తిఁ బ్రబంధయుగ్మంబు
విరచించి లోకైకవిదితుఁ డై యుండె

(461. విష్ణుచిత్త యోగిచరిత్రశ్రవణపఠనాదిఫల కథనము.)

నెన్న శక్యముగాక యిలలోన నున్న
తోన్నతంబైన యియ్యోగీంద్రుచరిత
ననలొత్తుకూర్మిమై నరు లెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను
భయములు దార్చు శోభనములు చేర్చు
జయముల నిచ్చు దుర్జయము లడంచు
నట ధన్వినగరవరావాసుఁ డైన
వటధామపాదజీవనషట్పదంబు 7300

(462. విష్ణుచిత్తయోగి కలితపుష్పారామాది కైంకర్య వైఖరి.)

చిరతపోనిధి విష్ణుచిత్తుఁడు హరికిఁ
గరమర్థి సుమదామకైంకర్యపరత
ననిశంబుఁ దనసేయు నారామమునకుఁ
జనుదెంచి యవ్వనస్థలిఁ బొదుకొన్న
పొన్నమ్రాఁకులకెల్ల బోది గావించి
కన్నియమొగలిమోకల సేద్యపఱిచి

(463. కరవీరపారిజాతాది వృక్షలాలనాది రచనావర్ణనము.)

గొజ్జంగిపొదలకుఁ గుదురు లమర్చి
గుజ్జుమొల్లల కాముకొన నీరుగట్టి
కరవీరములదండఁ గాలువల్ దీర్చి
విరవాదిపాదులు విరివి యొనర్చి 7310

కలయంగ మరువంబుకల పేర్పరించి
యలవిరిఁజాజినమల్లియల కంటులొత్తి
పారిజాతములకుఁ బాదు లమర్చి
యీరీతి మఱియు ననేకవైఖరుల

నారామసీమ సొంపారెడుపుష్ప
భూరుహవల్లికా భూరిసంతతికి
నవవసంతుఁడపోలె ననలొత్తఁజేసి
నవరగా నచట నేచక్కిఁ జూచినను
మిసిమిగా నల్లడ మిఱ్ఱు బల్లంబు
కనవుఁ గట్టియు తాయుఁ గంప లేకుండఁ 7320

( 464. నిజకైంకర్య సంతోషప్రాప్తి ప్రకారము. )

బన మించు కన్నులపండువు గాఁగ
వసుమతీసతికన్నువలె నుండఁజేసి
పరిమళమిళితపుష్పంబుఁలు గోసి
కరమర్థి నించిన కరఁడిచే బలసి
పనుపడ మనురాజపఠనచే వెలసి
మనమున సంతోషమగ్నుఁడై తులసి

( 465. ఆరామశోభావర్ణనానుభవ ప్రశంస. )

పొలుచు క్రొన్ననలతోఁ బొలుచునెత్తావిఁ
గలసి వన్నియమరకతముల సొలసి
వరపుష్పములసౌరభంబులఁ గలసి
సిరిమించు తులసి వేంచేయింపవలసి 7330

తొలఁగెడు బహుపుష్పధూళిమధూళి
బెరసి పంకముగఁ జిప్పిలు-చోట్ల దాఁటి
తవిలి యావనదేవతలు వపశ్రీకి
నవరించుదీపికాస్తంభంబు లనఁగ
మొగశిరోమాణిక్యముల పాఁరేలు
తగిలి వేఁడించుచందనములు గడచి
ప్రవహించుచున్న మరందవాహినులఁ
దివుటమై దాఁటి యెంతే వేడ్కతోడఁ

గట్టిగాఁ బువ్వులకరఁడి యొక్కఁడను
బెట్టి గుద్దలిఁ గేల బిగ్గ సమర్చి 7340

( 466. ఆషాఢమాసపుబ్బానక్షత్రదినములో భూమిదేవ్యంశ భూసురకన్యామణి ప్రాదుర్భావ కథనము. )

ననుపారఁ దులసీవనంబు నల్గడలఁ
దనరఁ ద్రవ్వుచునుండి తన్మధ్యమునను
శుచిమాసమునఁ బుబ్బశుభముహూర్తమున
రుచిరగారుత్మతరుచిరేఖ వోలెఁ
దోరమౌ నొకమంచితులసిమూలమున
ధారుణియంశ యుద్భవమై చెలంగి

( 467. తులసీమూలజనితకన్యకాదర్శనప్రాప్తసంతోషక్రమము. )

బాలయై యెదుటఁ జూపట్ట నయ్యోగి
చాల నక్కజమంది సంతసింపుచును
బ్రతిలేనిశృంగారరాశియో యనఁగ
రతిరాజుకేలికై రవబాణ మనఁగ 7350
లలిమించు నవ్వనలక్ష్మియో యనఁగ
నెలకొన్న విదియక్రొన్నెలసోఁగ యనఁగఁ
గనుపట్టు నాకన్యకరపల్లవముల
నినుమడించినకూర్మి నెత్తి ముద్దాడి

( 468. తత్కన్యకాపైభవస్మరణ ప్రశంసాది. )

తలపోయ నిచట సీతామరకంటి
తులసిమూలంబునఁ దోఁచు టద్భుతము
మానవబాలికామాత్రంబు గాదు
జానకిసరిఁ బోల్పఁ జను నీలతాంగి
యనుచు వెండియు వెఱఁగంద నందందఁ
బనుపడ నశరీరి పలికె నభ్రమున 7360

(469. పూర్వావతారవైభవప్రతిజ్ఞాకథనాది.)

హరి పూర్వమున వరాహావతారమున
ధరణిఁ గొమ్మున సముద్ధరణంబు సేసి
యెనయఁ గౌఁగిటఁ జేర్చి యెలమిగావింపఁ
దనపతిఁ జూచి యాధాత్రి యిట్లనియె
ననిశంబు నీ కిష్టు లగువార లెవ్వ
రనిశంబు నీకిష్ట మగుపూజ యెద్ది

(470. కమలాహరిపరస్పరసంభాషణా ప్రకారము.)

యానతి మ్మనఁ బ్రియురాలి నీక్షించి
శ్రీనాథుఁ డనియె నోశీతాంశువదన!
పొలుపార ననుఁ గూర్మిఁ బొగడెడువారు
నలరులదామంబు నర్పించువారు 7370

నిష్టులు మిగుల నాకీపూజనములె
యిష్టముల్ వారికి నెనలేనియట్టి
చెడనిసంపద లిచ్చి చేసేఁత నెపుడుఁ
గడువేడ్కఁ బ్రోతు నోకల్యాణి! యనిన
విని యది మొదలు నవ్విపులావధూటి
తనపతిమాట యెంతయు మది నాట
నిలలోన జనియించి యీపూజనంబు
జలజోదరునకు నే సవరింపవలయు
నని మెచ్చి నీవు మహాయోగివరుఁడ
వని నీకు నందన నయ్యెద ననుచు 7380

(471. సీతాజనక దృష్టాంత ప్రదర్శనము. ఫలశ్రుతికథనము.)

సీతోఁటలో జనియించెఁ బూర్వమున
సీతాంతరంబున సీతావధూటి
జనియించి జనకుని సత్పుత్రి యైన

యనువున నీకు నీయరవిందనయన
నందన యయ్యె నీనాళీకవదనఁ
బొందుగాఁ గొనిపోయి పోషింపు మింక
నకలంకశుభములు నభిమతార్థములు
సకలసిద్ధులు నీకు సమకూరు ననిన

( 472. విష్ణుచిత్తయోగి సంతోషప్రకారము. కన్యాస్వీకరణము.)
నిజమందిర ప్రాప్తిక్రమము. అశరీరివాక్యశ్రవణము. శుభశకునదర్శనాది.

నుప్పొంగి యప్పు డయ్యోగీంద్రచంద్రుఁ
డప్పయోరుహనేత్ర నక్కునం జేర్చి 7390
కొని యింటి కేగి మక్కువతోడఁ బిలిచి
తనభామచేతి కాతన్వంగి నొసఁగి
యలకన్య పొడమినయట్టిచందంబు
వెలయంగ నశరీరి వివరించుపలుకుఁ
దెలిపినప్పుడు మ్రోసె దేవదుందుభులు
వెలువక జడిపట్టె విరివాన మింటఁ
గీర్తింపఁ దొడఁగిరి కిన్నరాంగనలు
నర్తించి రప్సరోనలినలోచనలు
నయమార నింద్రాదినాకలోకంబు
జయజయశబ్దముల్ సవరింపఁ దొడఁగె 7400

( 473. బంధుజనకలిత భట్టనాథయోగి సంమానక్రమము. )

సనకసనందనసన్మునిముఖ్యు
లొనరించి రభినుతు లుపనిషత్తులను
ఆవిష్ణుమానసుం డాబాలఁ గన్న
యావార్త విని వెఱఁగంది యంతటను
సకలశోభనవస్తుసంతతితోట
సకలబాంధవులు నచ్చటి కేగుదెంచి

భట్టనాథునిఁ బ్రేమఁ బ్రణుతించి యతని
పట్టి నీక్షించి సంబరము రెట్టింప
నీవాలుఁగంటి నీవిటఁ గన్నయపుడె
యీవు ధన్యుఁడ వైతి విధికారణమున 7410

( 474. మహాసంతోషన ర్తనప్రశంసాది. )

నేము ధన్యుల మైతి మిందఱ మిప్పు
డో మహాభాగవతో త్తంస ! యనుచు
నాడుచు నద్యోగి నందింద పొగడి
పాడుచు నేతులం బసపునూనియలఁ
గపురంపుధూళులఁ గమ్మపన్నీట
గప్పరమించిన యరగనువిచ్చువిరుల
నాడుచు సరసంబు లాడుచుం జల్లు
లాడుచు వడిఁ బ్రేటు లాడుచుఁ జెలఁగి
యొండొరుం దమలోన నుప్పొంగి యిట్లు
దండిపై నందనోత్సవముఁ గావింప 7420

( 475 కన్యాజననకాల ప్రభృతి నానావిధసంపదభివృద్ధిక్రమము. )

సిరితోడునీడనెచ్చెలి తనయింటి
కరుదెంచినప్పుడే యఖిలసంపదలు
తముదామె వచ్చి న ర్తనమాడుకతనఁ
బ్రమదంబుతోడ నా భట్టనాథుండు
బంధురభూషణాంబరకాంచనముల
బంధుమిత్రాళి సంభావించె నంత

( 476. భట్టనారాయణదంపతి సంతోషాతిశయము. )
జాతకర్మనామకరణాది శుభకార్యాచరణవర్ణనము.

భట్టనాథుని దేవి పరమానుర క్తిఁ
బట్టి హ స్తంబులఁ బట్టి నేరుపున

జగములఁ బొడమించు జలజసంభవుల
నగణితంబుగ బోరుకాడింపుచున్న 7430

జగదేకమాతహస్తపుటంబునీటఁ
దగ బోరుకాడించి తడివాయ నొత్తి
జడియక బ్రహ్మాండజాలంబు లెపుడుఁ
గడుపులో నీడున్నట్టు గరిత నొక్కఁగిత
విలసిల్లుసేవంతివిరుల చందమునఁ
దుళగించుచిన్నిపొత్తులలోన నుంచి
ప్రియమునఁ జన్నిచ్చి పెంచి లోకములు
నయమారఁ బోషించు ననుఁ గన్నతల్లిఁ
జన్నిచ్చి పెనిచె నీసరవి నయ్యోగి
కన్నియ కట జాతకర్మముల్ దీర్చి 7440

యీదేవి హరి నెన్ను నిటమీఁద ననుచు
గోదాభిధాన మాకొమరితె కొసఁగి

( 477. గోదానామక కన్యకామణిహస్తరేఖాశుభఫలప్రస్తావము. )

యాకన్య నిజసవ్యహస్తంబు చూచి
యీకొమరిత జగదీశ్వరుం డైన
రమణుని పట్టంపురాణియై యుండు
క్రమమున ననుచు నాకలకంఠకంఠి
పల్లవాంబుజరాగపాటలపాద
పల్లవంబుల నున్న భాగ్యచిహ్నములు
గని సర్వగీర్వాణకామినీమణుల
మినుకారునెరుల తుమ్మెదలవేడించు 7450

పదపంకజములఁ జొప్పడ నంచుమిగుల
మది సంతసించి ప్రేమమున నాబాల

( 478. కన్యకాభివృద్ధి వర్ణనక్రమము. )

బాలకైరవమిత్రఫాల, గోపాల
బాలవక్షోగంధ పటలజంబాల
జనకుండు వైదేహి, శరధి యిందిరను
బెనుపుచందంబునఁ బ్రేమ దైవాఱఁ
బెనుప రాగములం బెరుఁగుచుఁ దమ్మి
ననఁబోఁడి కిలకిల నవ్వంగనేర్చి
యొయ్యన నుయ్యాల లూఁగుచున్నెడను
నెయ్యంబుమైఁ దల్లి నిదురబొమ్మనుచుఁ  7460

బాటించి వేఱొకపాట పాడినను
పాటించి వినక యెప్పాటఁ బోరిచుడు

( 479. బాలకన్యారచితనానావిధలీలావర్ణనము. )

బలసోదరునిమీఁదిపాటఁ బాడినను
గిలకిల వాయెత్తి కేరినవ్వుచును
అంత నొయ్యన డొంగి యాడంగనేర్చి
నంత బంగరుగజ్జియలు నందియలును
గలకల రవణింపఁ గారుమెఱుంగు
పిలుప నానింటిలోఁ బిలిపిలినడల
మెలఁగుచు మోముదమ్మికి మూఁగుకొన్న
యలకభృంగముల నొయ్యన కరాబ్జమునఁ  7470

జక్కనొత్తుచు డాలు జళిపించుమణుల
నక్కలమించు సన్నపురావిరేక
నునుపారువేల్పు లేనుఁగుపిల్లకొమ్మ
లను గట్టులొనరించులాగున నొప్ప
పుత్తడిబొద్దులుఁ బువ్వుదండలును
గుత్తంబుగా వలగొను తేఁటిజాలు

లాగై నయింద్రనీలంపుగాజులును
బాగై నతరపనివడంపుసరులు
విలసిల్లుతేనియవిరిదమ్మి దొరఁగు
చెలువున లాలగెంజిగిమోవి జార 7480

( 480. జనకజననీనామ కథనప్రకారాః. )

నల్లన లోకసంహాతిఁ గన్నతల్లి
తల్లితండ్రులపేరు తాఁ జెప్పఁదొడఁగెఁ
గరమర్థి దాదిచెంగట చేరఁ బిలిచి
కరతాళగట్టనల్ గావించుగతుల
విన నవ్వుకొనుచు గోవింద! ముకుంద!
యనుచు వేడుక నృత్యమాడు నీరీతి
నింతయై యంతయై యెదిగి నానాఁటఁ
గుంతలంబులగురుల్ గూడుప్రాయమునఁ
దనయీడుచెలులును దాను ప్రేమమున
నెనసి యొక్కెడ బొమ్మరిండ్లాట లనుచు 7490

( 481. వయఃక్రమలీలా వినోదవర్ణనము. )

జగములు నందుల సాగరగహన
నగనగరాదు లున్నతి లిఖింపుచును
నంతంతఁ జిత్రంబులగు నజాండములు
దొంతు లటంచు సంతోషించుకొనుచు
వరుస గుజ్జనగూళ్ళు వండుద మనుచు
నరవిరిదాసనం బనలంబు గాఁగఁ
బూనిక నొకకల్వప్రోయి యమర్చి
పూనీటిమొసరునం బొలుపారుచున్న
యొకతమ్మిపూగుండ యునిచి సన్నంపు
టకరువు లనుబియ్యమంచులో నునిచి 7500

కన్నె గేదంగిని గలయఁ బెట్టుచును
గన్నియల్ వొగడ నిక్కరణి నాడుచును

( 482. పాంచాలికానామకకృత్రిమపుత్రికాది లీలాసామగ్రీరచితదివ్యవివాహప్రస్తావము.)

బురుడింపదగు రెండుబొమ్మలు దెచ్చి
హరియును వైదర్భి యని పమకట్టి
కూరిమి నేఁ బెండ్లికూఁతురిదానఁ
గోరి మీరలు పెండ్లికొడుకువా రనుచు
సారచంద్రికల పైచాయలం దెగడు
చారుపటీరంపుఁ జవికెమీఁదటను
పవడంపుటనలుదీపై క్రమంబునను
నవరనిగందంపునమిధ లమర్చి 7510
జాతిముత్తియపులాజలు వేలుపించి
జాతిగా హోమంబు నవరించి మఱియు
మనము పన్నిదపుటమ్మనము లాడుదము
మనమునఁ గపటంబు మాని ర మ్మనుచు

( 483. నానావిధబాలికా లీలాప్రదర్శనము. రమణీయయౌవనదశాప్రాప్తిక్రమము. )

నోడక చెలు లాడుచున్న చందమున
నాడలేకున్నవా రద్దిరా యింకఁ
జిక్కితి పతిపేరు సెప్పుమటన్నఁ
జక్కని పటపత్రశాయి నామగఁడు
అనిచెప్పి వారల నారీతి గెలిచి
యనయంబు మగలపే రడిగి చెప్పించి 7520
యీలీల మఱియు ననేకమార్గముల
బాలికాలీలలం బ్రబలుచునుండి
యెలజవ్వనము మేన నిగురించుతఱిని
నలినాక్షి యాభట్టనాథతనూజ

తనతండ్రి వరసుమదామంబు లచటి
వనమాలి కర్పింపవలసి నిచ్చలును
గట్టిగా మాలిక ల్గట్టి పూసజ్జఁ
బెట్టి యావేళ నర్పించెద ననుచుఁ
జనినపిమ్మట నలసౌమదామములు
తనకొప్పునం బూని తనకొప్పుతోడ 7530

( 484. గోదాఖ్య కన్యాధృత పుష్పమాలావైభవాది. )

మించులు జలదంబుమీఁద వేడించు
సంచున నొసవరి సవతుగాఁ జుట్టి
యొడసావిగాఁ జూచి యింటిలోనున్న
నడబావిలోనఁ గ్రన్నన నీడఁ జూచి
చుఱడ నొప్పెడు తనచూడ నున్నట్టి
జాడయంతయుఁ గని సంతసింపుచును
వెండియుఁ దొల్లింటివిధమునం బువ్వు
దండ లాకరఁడిలోఁ దనరార నునిచి
యాండుచుండెడుసమయమున నేతెంచి
వేడుక నవి తెచ్చి విష్ణుచిత్తుండు 7540
నేర్పున వటధామనీరజోదరుని
కర్పింప నిరతిశయానందుఁ డగుచుఁ

( 485. హరిసంతోషహేతుకథనము. )

కల్పసూనంబులకంటె మానీంద్ర
కల్పితవినుతులకంటె దేవతలు
నెడపక యుపహార మిచ్చుటకంటెఁ
గడపట నేమిటికంటె భోగ్యముగఁ
దలఁపుచు వటపత్రధాముఁ డుప్పొంగి
తలఁపులోపలఁ గొండఁ దాఁకుచునుండె

నీలీల మఱియు ననేకకాలంబు
బాలిక ముడిచిన ప్రసవమాలికలు 7550

హరిచిత్తుఁ డనిశంబు నాబాల ముడుచు
టరయక శౌరికి నర్పింపుచుండె
ననయంబు దాను నయ్యరవిందనేత్ర
జనకునితోఁగూడఁ జని తోఁటలోన
విరులుగోయుచు నవి వింతవింతలుగ
సరులుగా సవరించుఁ జాటున కరిగి
తా మున్ను ముడిచిన దామముల్ పిదపఁ
బ్రేమమైఁ దండ్రిచేఁ బ్రియుని కంపించు
నీరీతినటియించు నెడ నొక్కనాఁడు
కూరిమితోడ నాగోదావధూటి 7560

జనకుండు వటపత్రశాయికై యిడిన
ననగూడలోనిక్రొన్ననదండ లెత్తి
యొనఁగూడుకొప్పున నొప్పుగాఁ జుట్టి
నినుపారుబావిలో నీడ చూడంగ

( 486. నిజతనయాధృత పుష్పమాలా సమర్పణాయుక్తత్వ విమర్శనము. )

నేమరిపాటుగా నేతెంచి తండ్రి
కోమలిదిక్కుఁ గన్గొని తల్లి! యిట్లు
హరిసమర్పణమున కమరించుపుష్ప
సరములు నీకు శేషముఁ జేయఁ దగునె
యనుచు వేఱొకకొన్ని యలరులు గోసి
చని నాఁటి కావటశాయి కర్పింప 7570

నప్పు డాగోవిందుఁ డాతెచ్చువిరుల
నొప్పకయంతయు నొల్లంబు సేసి

కడుఁ బ్రేమ నీచిన్నికన్నె గ్రొమ్ముడిని
ముడువనివిరుల నే ముడువ నెంతైన

( 487. కన్యానుభుక్తమాలాధరణ సంతోషకథనము. )

నీకన్యకామణినెరితావి లేని
యీకుసుమములు నా కితవుగా విపుడు
కువలయనేత్ర కై కొని చేతఁ గొన్న
యవియె తెచ్చితివేని యంగీకరింతు
నన విని వెఱఁగంది యనురక్తి నరిగి
తనుజాత ముడిచిన దామము ల్గొనుచుఁ 7580

దనయఁ దోకొనుచు శ్రీధవునిసన్నిధికిఁ
జనుదెంచి కరజలజాతయుగ్మంబు
మొగిచి దేవరచిత్తమున కింతయిష్ట
మగుట నేనెఱుఁగ నయ్యబ్జాక్షి యిదియె
యీలేమ కొప్పున నెనయించినట్టి
మాలిక లివె గోపమానినీవరద !

( 488. హరిసంతోష ప్రాప్తిక్రమము. హరిపరిణయాలోచనాది. )

యన విని గోవిందుఁ డాదండ లంది
యెనలేనివేడ్కతో నెదమీఁదఁ జేర్చి
నుదుటఁ గీలించి కన్నుల నొత్తుకొనుచు
ముద ముప్పతిల శిరమునఁ జుట్టికొనుచుఁ 7590

నీమానినీమణి నిటమీఁద నేన
ప్రేమ దైవాఱంగఁ బెండ్లియాడెదను
ఈకోమలాంగి నీ వెప్పటియట్ల
తోకొనిపొమ్ము నీతోఁగూడ ననిన
సంతసింపుచుఁ దనుజాతయుం దాను

నంతట హరిచిత్తుం డరిగె నింటికిని
ఆచెల్వ కదిమొదలై చూడికుడుత
నాచారి యనియెడునామంబు గలిగె

( 489. అపరనామధేయ ప్రాప్తిక్రమము. నిజకన్యాయౌవన రామణీయక కథనము. )

నానాంట నాభట్టనాథతనూజ
మేనం దారుణ్యంబు మించి రా నంత 7600

నెలనాంగ చెలువపుం బేటిలో మెలంగు
వలుదజక్కవ లన వలిగుబ్బ లమరె
వనిత జవ్వన మనువనములోం బొడము
ననటులగతి నూరు లమరె నెంతయును
హరిని మోహించుచు హరమనోధైర్య
హరుమోహనాస్త్రంబు లనం గన్ను లమరెం

( 490. గోదాఖ్యసుందరీ యౌవన సౌందర్య విశేషవర్ణనము. )

గలకంఠికనుదమ్మి కవంజేరియున్న
యలిపంక్తు లనంగం జెన్నారె భ్రూయుగము
ప్రాయంపుంగడలిం జొప్పడుతరంగముల
చాయల బాహుపాశములసొం పెసంగె 7610

వలరాజురాచిల్క వమ్యాళిబయలు
తెలివిమైనసదుం గోదీవ చూపట్టెం
గారుమెఱుంగుపైం గనుపట్టునీల
ధారాధరం బనం దనరారెం దుఱుము
మరునిపట్టపుదంతిమస్తంబుకరణిం
గర మొప్పు జఘనచక్రము తేటబడియె
లాలతరోమాళి లతికజనించు
నాలవాలం బన నసలారె నాభి

తగముఖపద్మయంత్రం బిరుగడలఁ
బొగడొందు శ్రీలునాఁ బొలుపారె శ్రుతులు 7620

కాముకఁ డగుసోము గాడి చూపట్టు
కాముసంపఁగితూపుగతి నాస యమరెఁ
బంకజోదరుని శోభనపల్లవముల
బొంకంబునను బదంబులు చెన్నుమీఱె
ననబోఁడి కిట్లు నానాఁట సమ్మెన
ననలొత్తు నెరజవ్వనము దయివాఱ

( 491. మాలాసమర్పణ కైంకర్యవర్ణనము. )

నందంద గోవిందుఁ డగుచిదానందు
నందు మిక్కిలి చిక్కి యాసక్త యగుచుఁ
గమ్మనితావులు గలుగుమాలికలు
నెమ్మితో వటధామునికి సమర్పించి 7630

చను దెంచుతండ్రి కిచ్చులు నుపచార
మొనరించి యాతనియొద్దఁ గూర్చుండి
మురిపంబు నొయ్యారమును దళ్కుకొనఁగ
నొరయుముద్దులు గురియుచు నొక్కనాఁడు

( 492. అర్చావతార హరిమందిర విషయకప్రశ్నాది.)

కడుమనోహరము తోఁ కమలాక్షుకథలు
కడపట నీ వెఱుఁగని చెప్ప లేవు
ధరలోన సర్వావతారరూపముల
హరి యున్ననిలయంబు లవి యెన్ని కలవు
అపరిమితంబు తోఁ నందులో జగతి
నిపు డెఱింగినవి నీ వెన్ని ? తెల్లముగ 7640

వెన్ను నికథవిన వేడు కయ్యెడిని
యన్న నా కెఱిఁగింపు మనిన నుప్పొంగి

కన్నియఁ జూచి క్రేగంట నవ్వుచును
మన్నన నెమ్మేనిపై కేల నిమిరి
కురులు గూడఁగదువ్వి క్రొన్నెలసరుల
వరుస దిద్దుచు గారవంబు దైవాఱ

( 493. అష్టోత్తరశతహరి క్షేత్రస్థానవైభవాది ప్రదర్శనము. )

నమ్మ! చెప్పెద వినవమ్మ యింపార
సమ్మాధవుని నిలయములుఁ దత్కథలు
సనయంబు మానివేద్యములై నూట
యెనిమిది తిరుపతు లిలలోనఁ గలవి 7650

యీయెడలందు నయ్యిందిరావిభుఁడు
పాయక యుండు సభంగవైఖరుల
నరయ నీకథ వినునట్టివారలకుఁ
గరతలామలకంబు కైవల్యపదము

( 494, విష్ణుచిత్తయోగికథితాష్టోత్తర శతహరి క్షేత్రవైభవాది. )
నిచుళానగరవాసి రమాపతి వైభవప్రశంస.

అనుచు వేంకటపతియాదిగా నూట
యెనిమిదినెలవుల నెసఁగుమూర్తులను
వినుపింపఁదొడఁగె వేర్వేఱ చిత్రముగ
జవనుతవైభవసంయుతం బగుచు
నిచుళలో శ్రీధరానీళలం గూడి
యచలుఁడై యుండుఁ దోయజసూతితండ్రి 7660

( 495. తంజాపురీ శ్రీముష్ణక్షేత్రవాసి మురారివైభవప్రశంస. )

తంజాపురంబున తంచద్దైత్యారి
యంచితమనుజపంచాస్యుఁడై యొప్పుఁ
గటిగదాదరచక్రకలితహస్తుండు
కిటిమూర్తిదండను గెడపినవాఁడు

శ్రీమణిమౌక్తికసింధుశోభితుఁడు
శ్రీముష్ణపురమునం జెన్నొందియుండుఁ
దొలుతఁ దా దక్షినదోషంబు వాయ
నలమాని తపము సేయఁగ మెచ్చినట్టి
ప్రేమాలయాఖ్యుండు పృథుభోగశాయి
కాముని గన్న చక్రనితంద్రిమొకఁడు 7670

( 496. కదంబపురాదిదివ్యక్షేత్రనివాసిదామోదర వైభవ ప్రశంస. )

హరపితామహసేవ్యుఁ డగుచుఁ గదంబ
పురమున శేషతల్పుఁడు చెన్నుమిగులు
దేవియాజ్ఞలకు విధేయుఁడై యుండు
దేవుండు విశదాద్రిధీరుఁ డొక్కరుఁడు
శ్రీపతి భూతపురీపతి గాథ
చాపాఖ్యుఁ డగురామచంద్రుఁ డొక్కరుఁడు
అప్పాలకుండలో హస్తంబు చాఁచి
యప్పాలవెల్లికన్యకఁ గూడియుండు
ననిలాశనేంద్రపర్యంకపలాశ
వనగుహాపురవాసి వనజోదరుండు 7680

అండజనాథవాహనుఁ డారునూర
నుండు వేడుకతోడ నురగేంద్రుమీఁద
భాసిల్లు రథమగ్నపట్టణంబందు
గోసహాయుండను కుసుమాస్త్రితంద్రి

( 497. వ్యాఘ్రనగరాదిదివ్యక్షేత్రనివాసిమురారివైభవ ప్రశంస. )

పొలఁతుక యలవ్యాఘ్రపురిని యపూర్వ
జలధినామంబున శౌరి చెన్నొందు
గంగ మించినశక్తి గలుగంగ వనము
చెంగటం దప మొనర్చిన కవేరజకుఁ

లాడకట్టి శ్రీసారభూపురిసొంపు
లడరంగ శిశునాథుఁ డన నుండుశౌరి 7690

నవరత్నై యొప్పు మస్తక శంఖపురిని
నపచంద్రుఁడను రమానాథుఁ డింపొందుఁ
గోమలవల్లి చన్గొనలపాదంబు
లామతి కొల్పి హేమాబ్జినిచెంత

( 498. కుంభఘోణాదిదివ్యక్షేత్రనివాసిహరిమూర్తిచైభవకథనము. )

నగధారి కుంభఘోణమ్మునఁ జంద్రు
నగు నత్పృస్తామృతనాథుండు వెలయు
హరు బ్రహ్మహత్య పాయఁగఁజేసి జగతి
హరశాపమోచనుఁ డనుపేరఁబరఁగి
నగరాజకుచ ! ఖండనగరంబునందు
నగణితభుజమూర్తి యచ్యుతుండొప్పు 7700

జపితలై రో మశాష్టావక్రమునులు
తపము సేయంగఁ బ్రత్యక్షమైనట్టి

( 499. అంతరిక్షపురాదిదివ్యక్షేత్రనివాసి మధుసూదనమహిమ. )

శ్రీమించి యపు డంతరిక్షాఖ్యపురిని
వామనుండనుపేర వనమాలియుండు
నరుదార శబరి రాజనఁగ శ్రీకృష్ణ
పురమున నెంతయుం బొలుపొందుచుండుఁ
బరిరంభపురమునఁ బద్మాయతాక్షి !
మురవైరి కేదారమూర్తినాఁ బరఁగు
ఘననాగపురమున కడలిచెంగటను
దనరు సుందరుఁడను దనుజమర్దనుఁడు 7710

మణిమా క్తికానదీమణి సమీపమునఁ
బ్రణుతింపఁదగు గంధపట్టణంబునను
అనురక్తి మేధావి యనుమానివరుని
తనయుఁ గై కొన్న శ్రీధరుఁడు శ్రీమించు

( 500. నందిపుర క్షేత్రాదినివాసిహరివైభవ కథనము. )

నందిపురాంబర నగరఁబునందుఁ
గందర్పగురుఁ డుండుఁ గడుచిత్రగతుల
వనజాక్షి ! సచ్ఛీలవల్లభాఖ్యునకుఁ
దనయుఁడై శశికిఁ బ్రత్యక్షమైనట్టి
భువనసన్నుతుఁ డిందుపురమున నెప్పు
డవిరళశ్రీలచే ననువొందియుండు 7720

( 501. చిత్రకూటాదిదివ్య క్షేత్రనివాసిరమాపతివైభవము. )

గురుతిల్లవనచిత్ర కూటంబునందు
హరుఁడు నర్తించు నృత్యము చూచికొనుచు
సురగేంద్రశాయియై యుండు గోవిందుఁ
డరయ నాతఁడు నందు నాత్మసంభవుఁడు
రవితేజుఁ డగుచు శ్రీరామాభ్రపురివి
నవనీతచోరుండనా వెన్నుఁ డొకఁడు
కమనీయమూర్తి సంగమపురి, లోక
రమణుండు లోకాభిరక్షణం బ్రబలు

( 502. కృష్ణపుర క్షేత్రాదినివాసి భగవన్మహిమ. )

నర్థికల్పకము శ్రీహరి కృష్ణపురిని
పార్థసారథి యనం బరఁగు నబ్జాక్షి ! 7730

శ్రీపార్థసఖమహిమీపట్టణమున
శ్రీపరతంత్రుఁడై సిరులు పైపైని

దసరంగ సకలభక్తప్రాణనాథుఁ
డనియెడు గరుడవాహనుఁడు సొంపొందు

( 503. కపిస్థలక్షేత్రాది పద్మనాభమాహాత్మ్యాది. )

జననుతం బగుకపిస్థల పట్టణమున
వనజాక్షి! యొప్పు దేవకికూర్మిపట్టి
పాదుగా నిల రౌప్యపట్టణంబునను
గోదండరాముఁడై కొమరుదీపించు
శ్రీనాగపురమునఁ జిగురాకుఁబోఁడి
శ్రీనాథుఁ డెసఁగు నాశ్రితకల్పతరువు 7740
ఆపట్టణమునకు ననతిదూరమున
నేపారుసిరులతో నెనసియున్నట్టి

( 504. మణిధామపురక్షేత్రాదినివాసిహరివైభవకథనము. )

మణిధామపురమున మధువైరి చెలఁగు
నణిమాదిసిద్ధినాయకుఁడు బింబోష్ఠి!
ప్రసవసాయకపుంఖపట్టణంబునను
బ్రసవాస్త్రగురుఁడు చూపట్టును జెలువ!

( 505. పురుషోత్తమముఖాదిదివ్యక్షేత్రనివాసివైకుంఠనాథవైభవము. )

యోతలోదరి! పురుషోత్తమనగరి
నేతయై వెలుఁగొందు నిగమవేద్యుండు
హైమధామపురంబునందుఁ జెన్నొందు
హైమాంబరుఁడు కాంచనామలదేహ 7750
బలుఁడు శ్రీసక్తసభాపురినాథుఁ
డలరువిల్తునితండ్రి యలరు తన్వంగి!
యనవాప్యగగనపురాంతరసీమఁ
గనుపట్టువిష్ణుండు కలకంఠకంఠి!

కలికి వైకుంఠపుష్కరమనుపీట
నెలకొని యుండుఁ గ్రొన్నెలప్రొద్దుకంటి
ధవళపుష్కరిణి గాఁ దనరుగ్రామమున
ధవళాక్షుఁ డరుదారు ధవళాయతాక్షి !

( 506. వనాద్రిప్రముఖదివ్యక్షేత్రనివాసికేశవవైభవ కథనము. )

యలనూపురాపగాప్రాంతంబునందుఁ
జెలఁగు వనాద్రిపైఁ జెన్నొందు నంద 7760

సూనుండు మలయధ్వజునకుఁ బ్రత్యక్ష
మైనట్టివాఁడు భక్తామరతరువు
సుందరపల్లి వక్షోవీథి నొప్ప
సుందరుఁ డరుపేరఁ జూపట్టు నమ్మ !

( 507. గోష్ఠిపురపురప్రముఖదివ్యక్షేత్రనివాసిగోవింద వైభవము. )

శ్రీగోష్ఠిపురమున శేషపర్యంకుఁ
డాగమేశుఁడు నైన హరి గలం డబల !
సత్యపట్టణమున శారద మామ
సత్యనాథుండునాఁ జను గీరవాణి !
జలధిఁ గట్టగ దర్భశయసంబునందు
వెలయుఫుల్లాటవీవిభుఁ డిందువదన ! 7770

కనకాంబరుఁడు సితకాసారతిలకుఁ
డననొప్పు మున్నీటియల్లుండు తల్లి !

( 508. మోహనపట్టణాదిదివ్యక్షేత్రనివాసిపుండరీకాక్ష మహిమ. )

యాలోలనేత్ర ! మోహనపట్టణమునఁ
గాలమేఘుండునాఁ గంసారి ప్రబలు
మనసిజజనకుండు మధురాపురమునఁ
దనదేవితోడఁ బ్రత్యక్షమై మున్ను

చేడియ కూర్మినాచేతఁ బల్లాండ్లు
పాడించుకొన్న శ్రీపతి సొంపుమీఱు

( 509. వటపత్రశాయినామక వైకుంఠనాథమహిమ. )

వటపత్రశాయినా వాసుదేవుండు
వటఫలాధరి ! యిందు వలనొప్పుచుండు 7780

నలవడం గురుఁ కసౌమ్యస్థితాదీశుఁ
డలివేణి ! మీతండ్రి యఁపరాంకుశుని
యతులకావ్యామృతం బనిశంబుఁ గ్రోలుఁ
చతురుఁ డందటిలోనఁ జక్కనివాఁడు
అరవిందలోచనుఁ డనుపేరఁ బరఁగి
యరవిందభవుని గన్నట్టి దైత్యారి

( 510. తొలవిల్లిమంగల ప్రముఖదివ్యక్షేత్రనివాసి దేవేశమహిమ. )

మఱి తిరుత్తులవెల్లిమంగళపురిని
తెఱవ ! పోయగములఁ దెఱఁగొప్పుచుండుఁ
గలికి ! నక్రాయతకర్ణపాశాఖ్యుఁ
డలఘుదక్షిణాపురి ననువొందుచుండు 7790

వైకుంఠపురిఁ జోరవరుఁ డనుపేరి
శ్రీకామినీపతి సిరిఁ దెలుచుండు
దర చక్రధరుఁడు కైతవనటాహ్వయుఁడు

( 511. కుళిందపురాదిదివ్యక్షేత్రనివాసి హృషీకేశవైభవము. )

తరుణి ! దక్షిణకుళిందపురిరాజిల్లు !
నమరనాయకుఁడు వారాంగనాపురిని
గొమరారుచుండు నెక్కొనిపుప్పబోఁడి
నాతి చించాపురినాథుండు నిత్య

మాతతశుభమూర్తియై ప్రతాపించుఁ
దగుగుణవతి సతీధవుఁడు మాధవుఁడు
మృగశాబనేత్ర ! శ్రీమెఱయుచునుండు 7800

నెలకొని విత్తమానిధియును విధుఁడు
పొలఁతుక ! సూచకపురి యేలుచుండు

( 512. కురుకానగరాఖ్యదివ్యక్షేత్రనివాసిమగుకైటభమర్దిమహిమ. )

పేరలు కురుకాధివిభునిసమీప
ధారుణీస్థలి నున్న ధవళలోచనలు
వనిత ! వామనపురీశ్వరుఁ డై నదీర్ఘ
కనకవర్ణాఖ్యుండు కంససంహారి
తనచెంతఁ బార్వతీధవశాపమోక్ష
మొనరించి పెక్కేఁడు లుర్విభాగమునఁ
బన్ని దెబ్బదిపద్మభవులచేఁ బూజ
గొన్నవాఁ డెంతయుఁ గోమలగాత్రి ! 7810

( 513. అనంతపురాదిదివ్యక్షేత్రనివాసి పుండరీకాక్షుమహిమ. )

యతివ యనంతపురావాసుఁ డురగ
పతిశాయి యొప్పు శ్రీపద్మనాభుండు
వరదుండె యలతిరువణ్ణావరశార
పురమునఁ గృష్ణుండు పొలఁతుక చెలఁగు
దవిలి దక్షిణమరుత్తటపురిలోక
ధవుఁ డై నయప్పుడు తనుమధ్య ! యొప్పు
శ్రీమూళిధామపురీ సీమశౌరి
కోమలి ! విఘుటవర్తకుఁడునా నుండుఁ

( 514. శార్దూలపురాదిదివ్యక్షేత్రనివాసిభగవద్వైభవము. )

ప్రోదిమై శార్దూలపురిరమానాథుఁ
డాదిమాహ్వయుఁడునా నలివేణి ! వెలయు 7820

నారాయణాఖ్యుండు నా పురస్థలిని
నీరజోదరుఁ డొప్పు నీరజగంధి
లలన ! శ్రీవళ్ళనాళపురంబునందు
బలిచిరశ్రేయమాణపతి యనం గలఁడు

( 515. శ్రీసారభృంగపురాదిదివ్యక్షేత్రనివాసి కేశవమూర్తి వైభవము. )

శ్రీసారభృంగపురీవాసుఁ డైన
యాసారసాక్షుఁ డోయమ్మ ! భాసిల్లుఁ
బ్రతిలేని నిద్రాణపట్టణేశ్వరుఁడు
చతురుఁ డోపడఁతి ! కేశవుఁ డన దగును
సకియ పరుష్ణిహేశ్వరనగరమున
సకలాధిపతి దనుజద్వేషి మెఱయు 7880

నాతి విద్వద్ఘనగరంబునందు
మాతలుం డను పేరి మరుతండ్రి యొప్పు

( 516. శ్రీకపిస్థానపురాదిదివ్యక్షేత్రనివాసిమాధవ మహిమ. )

శ్రీ కపిస్థానపురీవాసుఁ డగుచు
నోకొమ్మ ! తాతనా నొప్పు శ్రీవిభుఁడు
మాయమ్మ ! సద్వృష్టి మత్స్వరం బేలు
నాయార్తసంహారుఁ డసురజనారి
యతిప శ్రీదేవనాయకుఁ డైంద్రనగర
పతి యైనవాఁడు గోపాలపాలకుఁడు
తలపోయ మీ పెదతండ్రు లై వట్టి
యలసరోభూతమహాయోగులకును 7840

ప్రత్యక్షమైన గోపాల శేఖరుఁడు
సత్యసంధుఁడు జగజ్జనవశ్యకరుఁడు
శ్రీవామనుండు దక్షిణశంఖధరుఁడు

( 517. గోపపుర-హస్తిగిరినివాసి-హరివైభవ కథనము. )

భూవినుతుండు గోపపురవల్లభుండు
శ్రీమంతుండైన హస్తిగిరీశుండజుని
హోమగుండంబులో నుదయించినట్టి
వరదుండునా నొప్పు వనమాలి కాంచి
నరుణావల్లవపాద! యఖిలైకవిభుండు
ధీరుండు వేగవతీతటాహ్వయుండు
సారసాక్షుండు శేషశాయి భూవిభుండు 7850

పడంతి మీపెదతండ్రి భక్తిసారుండు
చిడిముడిం దనుం బిల్చి చెప్పినయట్లు
యొనరించినట్టి యథోక్తకారీశుం
డనుపమకరుణాకటాక్షుండై యుండు
నిరవొందంగాం బరమేశ్వరవిణ్ణ
గరమునంగలం డబ్జకరుం డెలనాంగ!
చూపట్టు హాటకేశుండునాం బడంతి!

( 518. కాంచీక్షేత్రనివాసిపాండవదూతాఖ్య హరివైభవము. )

యాపాండవలదూతయై కృష్ణసఖుండు
శిశిరోపవనపురిం జెన్నొందుచుండు
శిశిరాంశుబింబాస్య! శిశుపాలవైరి 7860

కామపురంబునం గనుపట్టుచుండు
శ్రీమంతుండనిశంబుం జిలుకలకొలికి
సురవంద్యుం డెలమితో జ్యోత్స్న్యాందుఖండ
పురమున నొప్పుం గప్పురములచాయ
నీరధిశయనుండు నీరఘుపురిని
నోరామ! పాయకముండుం బెంపెసంగం

బడఁతి వర్షాకాశపతినాఁగ నందు
కోడుకు సంపదలమైకొని బిత్తరించుఁ

( 519. కామపురాదిదివ్యక్షేత్రనివాసికమలేక్షణ వైభవము. )

గామపురంబునం గల్పరయనఁగఁ
గామిని విలసిల్లుఁ గామునితండ్రి 7870

కలకంఠిరో! త్రివిక్రముఁ డూరకంబు
నెలకొని పాలించు నిగమవేద్యుండు
పురవైరినుతుఁ డష్టభుజకరుం డనఁగ
సరభోజనారి యొంతయునొప్పు బాల
తిరునిన్నయూర వర్తిలుచక్రవర్తి
కరమర్థితోడ సైకతనిభశ్రోణి!

( 520. శ్రీపక్షికుండాదిదివ్యక్షేత్రనివాసి శ్రీధరవైభవము. )

కూరిమి శ్రీపక్షికుండంబునందు
వారిదవర్ణుండు వానూక్షి! మెలఁగు
తోయమహీంద్రనాథుండునా జగతి
వేయుభంగుల నొప్పు వీణావినోద 7880

మానినీ! వినుము శ్రీమస్థలేశుండు
నానొప్పు నవదాత నలినలోచనుఁడు
కనకాంబరుండు సాగరమల్లనాథుఁ
డనువాఁడు విలసిల్లు హరిరాజమధ్య!
మనుజసింహాఁడు మున్ను మహాసప్తమునులు
వనిబూని గడియ దపంబు గావింప

( 521. ఘటికాచలనివాసి శ్రీనరసింహమూర్తి వైభవకథనము. )

నటవచ్చి ప్రత్యక్షమైనట్టివాఁడు
ఘటికాచలేశుండు కలహంసగమన!

వీరలు తుండీరవిభులు కల్యాణి !
చారుగుణోదార సౌభాగ్యయుతులు 7890

కోమలీ ! భక్తులం గూడి మాటాడు

( 522. శ్రీవేంకటాచలనివాసిపరమపురుష వైభవాదిప్రదర్శనము. )

స్వామి పుష్కరిణీపజ్జనె చెన్నుమిగిలి
యానందనిలయమై యనువొందుచుండు
యానందనిలయాఖ్య మగుమేడ నుండు
భూలోకవైకుంఠమున వేంకటాద్రి
నీలోకములనెల్ల నీడేర్చుకొఱకు

నలమేలుమంగ బాహాంతరసీమ
నెలకొల్పి నిఖిలావనీస్థలిలోన
శరణని వచ్చినజనులకు నిష్ట
వరము లిచ్చుచు గారవమున వెండియును 7900

బంధురకరుణతోఁ బంగున పంగు
నంధున నంధుగా నలపరింపుచును
ననయుంబు ననపత్యు సాపత్యు గాఁగ
ధనహీను ధనదుగా దయసేయుచుండుఁ
దరుణులు వలచు టందఱకును గలదె
పురుషులు వలతు రప్పురుషోత్తమునకుఁ

దెలియంగ నిచట ముక్తిని గడుఁ జూడఁ
గలవారిలోఁ జూడఁ గలవాఁడు వాఁడె
గోదాసతీ ! వాఁడెగో ! దానవారి
వేదగోచరుఁడు శ్రీవేంకటేశ్వరుఁడు 7910

లతికాహ్లాదంబున లావణ్యమూర్తి
లతికాంగి ! యొప్పు నీలామనోహరుఁడు

(523. సాలగ్రామక్షేత్రనివాసిముకుంద మహిమ.)

అలగండకీ నదీప్రాంతంబునందు
లలన ! యింపొందు సాలగ్రామవిభుఁడు
ఘనభుక్తి ముక్తులం గడిబెట్టి యమ్ము
ననవిల్తుతండ్రి మానారాయణుండు
తోయ్యలి ఘనవియత్పురిసేంద్రుఁడనఁగ
నయ్యచ్యుతుం డసురారి యొప్పారుఁ

(524. నైమిశారణ్య ఖండనగరక్షేత్రనివాసిహరిమహిమ.)

దొలుత ధర్మములు సూతునికి సర్వంబు
దెలిపిన నైమిశాధిపుఁ డైనవాఁడు 7920
యోగముద్రాకరుం డుత్పలనేత్ర !
నాగారిగమనుండు నలువొందుచుండు
గంగాతటాక్రాంతఖండపురీశుఁ
డంగన ! కలిదోషహారి యైయుండు

(525. పురుషోత్తమ-బదరికాశ్రమనివాసినారాయణ వైభవము.)

నరయుంగఁ బురుషోత్తమాధీశుఁ డనఁగఁ
గరమొప్పు ముద్దియ ! కాళియభేది
రాజస్య ! యష్టాక్షరము మానివరుల
కోజమై నుపదేశ మొసగినగురుఁడు
శౌరి శ్రీబదరికాశ్రమవాసుఁ డైన
నారాయణుండు జగన్నాథుండు వెలఁగు 7930

(526. గరుడాద్రి (అహోబిల) నివాసి శ్రీనరసింహ వైభవకథనము.)
శ్రీపతిపురక్షేత్రనివాసిహరిమహిమ.

గరుడాద్రివాసుండు కాంచనకశిపు
హరణుండు యోగముద్రాసనాయతుఁడు

నరసింహుఁ డనయమానవభక్తవరదుఁ
డిరవొందు నెంతయు నిభరాజగమన !
కీరవాణిరో ! విను కేరళపురిని
వీరరాఘవుఁ డన వెలయుచునుండుఁ
బోరిబోరి శ్రీపతిపురమధ్యమునను
నరసింహుఁ డనువొందు నరసఖుఁ డబల !
త్రిదశులు వెఱఁగందఁ దృణగుల్మలతలు
మొదలై నవానికి ముక్తి యొసఁగె 7940

( 527. అయోధ్యాపుర - మథురానగరక్షేత్రనివాసిదామోదర వైభవము. )

దానవాంతకుఁ డయోధ్యావల్లభుండు
జానకీపతి రామచంద్రుఁ డేపారు
మథురలో నెపు డష్టమహిషులంగూడి
మధువైరి కనుపట్టు మధుకరచికుర !
వ్రేతలతోఁగూడ వ్రేవల్లెశకట
పూతనాదుల నెల్లఁ బోరిగొన్నవాఁడు
నలచింతయంతికి నపవర్గ మొసఁగి
నెలకొన్నసిరులకన్నియ బిటారించు
షోడశసాహస్రసుందరీమణులఁ
గూడి ద్వారక నెలకొనియుండు నెపుడు 7950
కందర్పకోటిసంకాశమోహనతఁ
జందనగంధి ! వాసవవంద్యుఁ డొప్పు
బలసోదరుఁడు నిచ్చ బాయకయుండుఁ
గలశాబ్ధిలో హేమకలశవక్షోజ !

( 528. వైకుంఠలోకనివాసిపరవాసుదేవ వైభవము. )

వైకుంఠపతి పరవాసుదేవాఖ్యుఁ
డేకొని వరముక్తిసీమఁ బాలించు

వ్యూహాదు లైన పద్మోదరమూర్తు
లాహారితనువున నవతారమొందు
మానుగా నలమేలుమంగావిభుండు
స్థానమై శ్రీరంగధామంబునందు 7960

( 529. శ్రీరంగక్షేత్రనివాసిపరమపురుష వైభవకథనము. )

సజునకుఁ బ్రత్యక్ష మైనట్టివాఁడు
భుజగపుంగవతల్పమునఁ బవ్వళించి
వెలుఁగొందుచుండుఁ గావేరినెన్నడుమ
సలలితచంద్రపుష్కరిణిచెంగటను
మగువ కల్హారదామకశోభిభుజుఁడు
మృగమదపుండ్రముఖేందుచిహ్నుండు
కంతుకంతుఁడు జగత్కల్యాణమూర్తి
కాంతోపయంతనాఁ గర మొప్పు ననుచు
వినుపింప వారల విభవచరిత్ర
మనువొంద విని విని హర్షించి మిగుల 7970

నభిరామనాయకుం డగుశౌరి సిరుల
కభినవోత్సవలీల నలరి యుప్పొంగి
సుందరనాథునిసోయగంబునకు
నందంద వెఱఁగంది యతనికిఁ జిక్కి
శ్రీవేంకటేశ్వరుచెలువంబుకలిమి
భావించి పులకించి భావంబు కరఁగి

( 530. హరివైభవ శ్రవణసంతోషవిశేషవర్ణనము. )

యంగన వయనమోదాశ్రుపూరములు
తొంగలి ఱెప్పలతుది నాటుకొనుచు
సరుదందితన్మయయై పెద్దతడవు
పరమమౌనియుఁ బోలెఁ బరచింత లుడిగె 7980

సర్వంబు నెఱుఁగు నాఁడగు నాజగదేకమాత
సర్వేశుఁ డగులు టాశ్చర్యమే తలఁప
నావంటిపామరునకు నైన నతని
సేవింప నతనికిఁ జిక్కు డెందంబు

( 531. గోదాదేవీ ధైర్యాంకుర ప్రాప్తిక్రమము. )
శ్రీరంగరాజానురాగప్రదర్శనము.

అంత నాలలితాంగి యంతరంగమునఁ
గొంతధైర్యము దెచ్చుకొన్నది యగుచు
రంగేశువైభవరాజసంబులకుఁ
బొంగి యాతనికి నబ్బురమంది చిక్కి
ముదమునఁ దనతండ్రిమోము వీక్షించి
విదితంబుగా రంగవిభు చరిత్రములు 7990
విన విన వీనులవిందు లయ్యెడిని
వినుపింపు నాకు సవిస్తరంబుగను

( 532, భట్టనాథయోగికథితప్రణవవిమానవృత్తాంత క్రమము. )

అన విని భట్టనాథార్యుఁ డాతనయఁ
గనుఁగొని పలికె నగ్గలమైనకూర్మిఁ
బద్మాసనుఁడు మున్ను పాలమున్నీటి
బద్మాక్షు గుఱిచి తపంబు గావించి
బహువేదశృంగంబు ప్రణవాత్మకంబు
మహితంబు నైన విమానంబుతోడఁ
బంకజాక్షుఁడు శేషపర్యంకుఁ డగుచుఁ
బంకజాసనునకుఁ బ్రత్యక్ష మయ్యె 8000

( 533. పంకజాసనరచితమధుసూదన సపర్యాది ప్రకారము. )

నైన నయ్యసమాన మగువిమానంబు
తోనఁ గైకొని వేగ తోయజసూతి
సత్యలోకమునకుఁ జని నిజవసతి

సత్యాంతసంకలితాత్ముఁ డై నిలిపి
యోజదప్పక వివిధోపచారములఁ
బూజ సేయుచు నుండి పుష్కరాత్మజుఁడు
నత్రంబు నలుప నచ్చటికి దేవతలు
ధాత్రిఁ గల్గినయట్టితపసులు ననగఁ
వారితోఁగూడ నిక్ష్వాకుండు నేగి
సారసాసనుమేటిజన్నంబుఁ జూచి 8010

( 534. ఇక్ష్వాకుభూపరచిత తపః ప్రకారము. హరివిమాన ప్రాప్తిక్రమము. )

యతనియింటను విమానాంతరసీమఁ
బ్రతిలేని యారమాపతిని సేవించి
చలపట్టి యతనిఁ బ్రసన్నుఁ గావించి
యిలువేల్పుగాఁ గొల్తు నిలలోన ననుచుఁ
గనకగర్భునిచెంతఁ గ్రమ్మఱ నిలకు
ననిపించుకొని వచ్చి యతిఘోరతపము
నొనరించి యారమాయుతునిఁ బ్రత్యక్షు
మొనరించికొని యంతనుల్లసింపుచును
దనయేలు నాయయోధ్యాపురంబునకుఁ
గొనివచ్చి నిజభక్తిఁ గొలిచె నంతటను 8020

( 535. శ్రీరామపర్యంత విరచిత సపర్యాది. విభీషణ పారితోషిక -
సమర్పణ ప్రకారము. )

గ్రమమున నలదశరథునిపర్యంత
మమితభక్తిని గొల్చి రతనివంశజులు
అవిష్ణునిజరూప మగు రామవిభుఁడు
రావణుఁ జంపి వారవివేద్కతోడ
ధరణిజతో నయోధ్యకు నేగుదెంచి
సరసాత్ముఁడై విభీషణుని మన్నించి
తానైన యాశేషతల్పుని నొసఁగి

మానుగా లంకకు మగుడఁ బంపుటయుఁ
గోరి యాదేవుఁ గైకొని విభీషణుఁడు
బోరన నిజపురంబునకు నేగుచును 8030

( 536. కావేరీమధ్య సైకతతలప్రాప్తిక్రమము. )

బగలింటి సంధ్యఁ దీర్పఁగఁ జూచి యమల
యగునట్టి సహ్యకన్యకతటంబునను
సైకతభూమి నా జగదీశు నునిచి
యాకవేరజను సంధ్యావిధుల్ దీర్చి
యుత్తటంబున నున్న యాదేవు మగుడ
నెత్తిన నెంతైన నెత్తరాకున్న

( 537. శ్రీరంగక్షేత్ర నివాస సంకల్ప ప్రదర్శనము. ధర్మవర్మభూమిపాల ప్రత్యక్షప్రకారము. )

ననయంబు శోకించు నాభక్తుఁ జూచి
యనియె శ్రీహరి మింట నశరీరివోలె
నీయెడ శోకింప నేటికి వలవ
దియ్యేటి నడుమ నా కింపు పుట్టెడిని 8040

జటుల వైఖరుల నీ చంద్రపుష్కరిణి
తటమున ననుగూర్చి తప మాచరించు
వరగుణోన్నతు ధర్మవర్మఁ బ్రోచుటకుఁ
బరమపావనము లై పరఁగు నిచ్చోటి

( 538. మునిగణ సంమానన ప్రకారాది. )

నవతీర్థములనుండి ననుఁ గూడి మౌని
నివహంబులెల్ల మన్నించుట కిచట
ముదమున లంకాభిముఖుఁడనై శేష
మృదులభోగమున నర్మిలి యోగనిద్ర

నుండెడ నీలోన నుడివోని కరుణ
నుండెడ వెఱవకు మోహవిభీషణుండ ! 8050

( 539. చోళరాజకన్యా పరిణయ వృత్తాంతము. )

యని యమ్మహాత్ము నిజావాసమునకు
ననిచి యచ్చోట నిల్చి యా రంగవిభుఁడు
కరమర్థిఁ జంద్రపుష్కరిణి చెంగటను
సొరది లోకములఁ బ్రోచుచు నున్నవాఁడు.
అతఁడు చోళకన్యక రమాంశజను
బ్రీతిమై నిచుళలోఁ బెండ్లియై జనులు
జగతిమైఁ దను సౌమ్యజామాత యనుచుఁ
బొగడంగ మిక్కిలిఁ బొలుపొందువాఁడు

( 540. శ్రీరంగరాజానురక్తి కారిత ప్రాశస్త్యప్రకాశము. )

సరవి నవగ్రహ చక్రంబులోన
నరుణకైరవ మిత్రులను బోలునగిటఁ 8060
ప్రతిలేని యీ తిరుపతులలో నాఁగ
పతికై లరంగముల్ భాసిల్లుచుండు
మొలఁగెడు నూటయెన్మిది తిరుపతులు
నలరంగ విభుని విహరసౌధములు
వెలఁగైన యారంగవిభు మహామహిమ
మఱి వేల్పులకు నవాఙ్మనసగోచరము

( 541. శ్రీరంగరాజవరనిర్ణయ ప్రకారము. )

అని తండ్రి రంగనాయకుని వైభవము
వినుపింపఁగా నీలవేణి మోదించి
రవికాంతి గనిన సారసము చందమున
నవిరళానందమయాంగయై పొంగి 8070

యంతరంగంబున నా రంగవిభుని
జింతించి ధ్యానంబు సేసి వేమరును
నఖిలంబు తన్మయం బనుచు భావించి
యఖిలైకమాత తదాసక్త యగుచు
జనకునిఁ గాంచి హస్తంబులు మోడ్చి
యనియె నీయిలఁ బుట్టినట్టికన్యలకుఁ
బ్రతిలేని శ్రీపతిఁ బతిగా వరించు
గతి యెద్ది యనుఁడు నా కల్యాణిఁ జూచి

( 542. మార్గశీర్షమాసవ్రతాచరణ ప్రస్తావము. )

యక్కంతుజనకునకై కంతుబారిఁ
జిక్కి వ్రేతలు మార్గశీర్ష వ్రతంబుఁ 8080

గావించి కృష్ణుని కాంతలై రీవుఁ
గావించితేని నిక్కంబుగా నిపుడ
శ్రీవధూనాయకుఁ జెట్టఁబట్టెదవు
నావుఁడు బసకు నానతిఁ బూని గోద

( 543. వ్రతాచరణోపాయానుష్ఠేయ క్రమాలోచనాది. )

తనలోన నెంతయు దద్వ్రతాచరణ
మును దుపాయము గ్రమమున వితర్కించి
మానసంబున రంగ మందిరుం జేరి
యా నోము తానోమి యా నోముకరణిఁ
బనుపడ గోపికాభామను దానె
యని తలంచుట యది యాచరించుటయు 8090

నెలయు ముప్పదివాట విశదమ్మై మిగులఁ
దళుకొత్త నొక ప్రబంధంబుఁ గావించె

మఱియు నాతనిమీఁది మమత ల్లోదవఁ
జెఱకువిల్తుని తూపుచెరకు లోఁగాక

( 544. ఉత్తమకావ్య గుంభన సమర్పణాది. )

నలినాక్షునిపై నూట నలువది పాట
వలనొక్క కావ్యంబు వరుసఁ గావించి
వెండియు శ్రీరంగ విభునిపైఁ బ్రేమ
కొండలై కొల్లలై కొలఁదికి మీఱఁ
దలిదండ్రులు చెలిమిపైఁ దనుఁ బిల్వ మూఁటు
పలుక న త్తఱి రంగపతి యంచు గ్రుక్కఁ   8100

గనుఁగొన్న యదియెల్లఁ గావేరి యనుచుఁ
గనుగొల నజ్జపుష్కరిణి యటంచుఁ
గనక చేలాంకు విగ్రహములు వేనఁ
గనుఁగొన్న శ్రీరంగకాంతుఁడ యనుచుఁ
గనుగొల నేయిల్లు గన్న విమాన
మనుచు నెక్కడఁగన్న యది రంగ మనుచుఁ
దలఁపుచు మది నన్యథా బుద్ధితోడ
నలరంగ ధాముని యందునే తవిరి
శ్రీరంగనిలయుండు చెలిమిపై నన్నుఁ
జేరంగవచ్చి మచ్చికతోడ ముద్దు   8010

( 545. నిద్రాసమయ సంప్రాప్తరంగ రాజ సరసకళావిలాస నివేదనము. )

గారంగఁ దనుఁ దనకరముల నింపు
గూరంగ నెలమి పైకొనునొక్క నన్ను
హత్తి నా జవ్వన మనునిధానంబు
రిత్తపుచ్చక తనరించి కైకొనునని
యని తదాసక్తయై యలరుల సెజ్జఁ
గనుమూసి నిద్రింపఁగా నొక్కనాఁడు

శ్రీరంగపతి కృపాసింధుఁ డేతెంచి
సారంగనయన ముచ్చటవాయఁ గదిసి
సరసకళావిలాపములఁ జెంపెసఁగ
మరుకేళిఁ దేల్ప నమ్మానినీమణియు 8120

ననఁగి పెనంగి ప్రత్యక్ష మాదేవు
నొనగూడినటుపలెనుండి మేల్కాంచి

( 546. రంగరాజవిరహతాపాధిక్య ప్రాప్తిక్రమము. )

కలగా నెఱింగి వెగ్గలమైన రంగ
జలజాక్షువిరహంబు సైరింపలేక
దారుణకందర్పతరవారిదారి
బారికినోడి నిబ్బరమైన తమిని
హారంబుమీఁద నాహారంబుమీఁద
నారామకేళివిహారంబుమీఁదఁ
బ్రియ మోసరించి పొంపిరిపోవుమేని
భయదకందర్పతాపము నీఁదికొనుచు 8130

సవరనిమందారశాఖయందమున
నవచంద్రరేఖచందమున దీపించి
యిజ్జాడఁ బెరవార లెఱిఁగెద రనుచు
లజ్జించి తలిదండ్రులకుఁ జెప్ప నోడి

( 547. చామరగ్రాహిణీనామక సుందరీ సమాగమనము. )
కుందరరుశృంగారోహణాదిభావకథనము.

కమలాక్షు చామరగ్రాహిణియైన
కమల కోమలి యనుగ్రహపేరి తనదు
నెచ్చెలి తనతోడ నెఱి నేగుదెంచి
యచ్చట మనుజకన్యావేష మంది

యున్నట్టిచెలియు నెయ్యురాలై నయట్టి
కన్నియ ల్ధోలువ నాకాకకోర్వమిని  8140

మాకందతరుసుషమాకందకుంద
శాకోటతటవికస్వరపికస్వరము
పూగపున్నాగకర్పూరనారంగ
నాగరంగోత్తుంగ నాగకేసరము
రాజితచంపకారామంబుఁ జొచ్చి
రాజీవలోచనారాజితోఁగూడ
మెలఁగుచు వనములో మెలఁగుచునుండి
కలకంఠమధుకరకలకంఠసమితి
కోలాహలంబు డాకొన్న సైపమిని
హాలాహలం బని యాలింప నోడి  8150

చెలులు గానుక లిచ్చి చెంగల్వతావి
యలరులు మరుతూపు లని యంట వెఱచు

( 548. గోపకాంతాస్వరూపత్వప్రాప్తివర్ణనము. ).

విరిదేనియలఁ జూచి వికచాంబుజాస్త్ర
కరహతవిరహిరక్తము లని యలికి
కాళింది మును గోపకాంతల శౌరి
పాలించుచందంబుఁ బడఁతి భావించి
తాను నాగోపకాంతాభావ మంది
పూని తదంబరంబులు ప్రుచ్చలించి
మును కుందతరుశృంగమున యున్నయతని
గనుఁగొని. శిరముపైఁ గరములు మోడ్చి  8160

యిమ్యెడ మాచీర లిమ్ము వేవేగ
నెయ్యమారఁగ నని నిక్కి మ్రొక్కుచును

జెలిమిమై నెపుడువచ్చెదవు నీ వనుచు
నెలనాఁగ హరిరాక కెదురుచూచుచును
గోరికి ముత్తెంపు కొలుచుమీఁదటను
సారెకు జానకీచక్రంబు చూచి
వెండియుఁ దనవనవీథిలోనుండు
గండుగోయిలఁ బెక్కుగతుల నంకించి
తనపతియగు రంగధాముఁ డెచ్చటికిఁ
జనుదేరఁ గొల్చినజాడతో నుండు 8170

కానున్న నీకన్నగలిని వేవేగ
నేకాన్తకైన నీ విపుడు పొమ్మనుచుఁ
బలుమఱు హరిబాళిఁ బడి తాప మొంది
యలయుచు నిదురించు నలకలలోనఁ
బంబినతమి వేయుభంగులతోడ
నంబుజోదరుఁ బెండ్లియాడు మేల్కాంచి

( 549. పాంచజన్యప్రశ్నకథనాదిప్రస్తావము. )

తలఁపులో వెండియుఁ దన్మూర్తిఁ దలఁచి
బలసోదరుని కేలి పాంచజన్యంబుఁ
గనుఁగొని శ్రీరంగకాంతునిమోవి
యునిశంబుఁ జవిచూతు వాయుధరంబు 8180

కి పురంబుతావిరో కమలవాసనయొ
యుపమింపఁ దియ్యనై యుండునో చెప్పుమ
యని మొన్న యతనిబింబాధరామృతము
మనమునం గ్రోలి నెమ్మదినుండు మఱియు
ముంగలి తొలుకారుమొగులు నీక్షించి
యంగన తను నేలు మని చెప్పు మనుచు

(550. శ్రీవేంకటాద్రిగమనానుగుణదూత ప్రేషణాది.)

నావేంకటాద్రీశుఁ డగుశౌరికడకు
వేవేగ దూత గావించి తా ననుపుఁ
జిగిరించురోర్కి నెచ్చెలుల వీక్షించి
యొగి నన్ను మరుబారి కొప్పింప నేల 8190

ఖగరాజశైలరంగద్ద్వారకాదు
లగునట్టి తిరుపతులందు నింపొంద
భావజాలము తాపముఁ జెందకుండ
వేవేగ నను మీరు విడిచిరం డనుచు
గట్టిగా హరి తనకరపల్లవంబు
పట్టి కంకణమందు పతిగాఁ దలంచి
తనకేల మిగుల నిద్దపుశంఖ మరల
తనకేలిశంఖంబు తన కేల యనుచుఁ
గేలిమై బలిదైత్యు కేలికంకణము
చాలక నాదుహస్తంబుకంకణము 8200

నడిగెడి నితఁ డేమి యని చాల నవ్వి
నుడివి బాష్పములు కన్నుల నిగిడించు

(551. మత్స్యవరాహావతారాది వైభవకథనము.)

రాముఁడై నట్టి శ్రీరంగనాయకుఁడు
రామకై పూని వారాశి బంధించి
ప్రళయకాలమునఁ గోల్పడిపోవు భూమి
నలమహాకిటిమూర్తి యై యుద్ధరించి
తనుఁ గోరియున్న వైదర్భికై మున్ను
మొనసిన శిశుపాలముఖుల దండించి
పరచింత లుడిగి నిర్భరవృత్తిఁ దనదు
చరణపద్మంబులు శరణొందునట్టి 8210

( 552. ఉత్తమభక్తరక్షణవ్రతత్త్వ నిదర్శన క్రమము. )

దంతిపాలస్త్ర్యగాత్రమసతీవిహంగ
కౌంతేయసుతులాదిగాఁ గలవారిఁ
బాలించినట్టి శ్రీపతి రంగనాథుఁ
డేలకో నను నింత యెరపుగాఁ జూచె
నలకలలోన న న్నంగజకేళి
నలుకలు దీర్చి నాయలుకలు దీర్చి
యెనసి నిమేషంబు నెడఁబాయ నన్ను
నని బాస యిచ్చి తా నరిగి రాఁడయ్యె
డక్కులరేనిమాటలు పల్కువార
లెక్కడఁ గల రతం డేమికావించుఁ 8220

( 553. గోదాఖ్యకన్యకామణిశరీరజ్వలితవిరహతాపక్రమము. )
విరహతాపోపశాంతిరచనాకథనము.

దహాతహా లేల యాతనిసద్విజిహ్వ
సహవాస మీరీతి సవరించెఁ గాక
యని యిట్లు దూరుచు నాకోమలాంగి
మనసిజువేడిఁ గ్రుమ్మరుచున్నయప్పుడు
వెడవిల్తునెరప్రొద్దువిరహంపుటెండ
వడదాఁకి యున్నచెల్వను విలోకించి
చెలువెల్ల వెఱఁగంది చేర నేతెంచి
పలుమఱు నాయింతిభావంబుఁ జూచి
యేమొకో యీచంద మేటికి మున్ను
రామొకో వచ్చి యారామకోణముల 8230

రామకోరికలు వారకతీర్చి మగుడఁ
బోమొకో యేటి కీపాలఁతి కీవేళ
నాటలు మనతోడ నాత్మ వేరొకటి

మాటలు మనవంక మన సోకవంక
దగిలియున్నది యెట్టిదవునిప్డు మనసు
దగిలియున్నదియొ యీతరుణికి ననుచుఁ
గోమరొందు చెంగల్వకొలనిచెంగటను
సమకొన్నగొజ్జంగిచవికె నన్నడుమఁ
బన్నీటికాల్వడాపలఁ గప్పురంపుఁ
దిన్నెపై నెలచుట్టుతిన్నెమీఁదటను 8240

బలుచగాఁ బుప్పొడిపరు పొనరించి
చలువగాఁ దలిరుపచ్చడ మప్పళించి
చెలగెడు నాపూవునెజ్జపైఁ జెలువఁ
జెలువార నునిచి నెచ్చెలులెల్లఁ గూడి
పన్నీటికేల రెప్పలమీఁదఁ దుడిచి
చెన్నారు వలిపంపుఁజెంగావి గట్టి
కలయంగఁ బన్నీటఁ గపురంబుతోడఁ
గలపనసేసిన కలపంబు మెత్తి
తుళకింప నుదుటఁ గస్తురిబొట్టు దీర్చి
వెలిదమ్మివీవన వీవ నావేళఁ 8250

జిలుకవారువము కెంజిగురునారంజి
తళుకుగల్వలజోడుతమ్మిబొమ్మికము
చెఱకుసింగిణియు గొజ్జంగికేవడము
దరమైనవిరియంపతరకపంబులును
నలవడ నంగజుం డరుదెంచి పొంచి
నిలువుగన్నులవిల్లు నెరినెక్కుద్రోచి
చిమ్మచీఁకటినింపు శింజిణిదండి
తుమ్మెదగఱిపూవుతూపు సంధించి
నెలవులనైదింట నిలిచి నేరుపున
లలిమించి కదిసి వోలము ముంచి పొంచి 8260

తీరుగాఁ జెగనిండ దిగిచి జెందంబు
ద్వారి పారఁగనేసి తోన యూర్చుటయు
సకియపాలిండ్లపైఁ జందనచర్చ
తుకతుక నుడుకంగఁదొడఁగె దాపమున
నువిదకుఁ గనుదోయి యొప్పె నావేళ
రవి డేరకొన్న కైరవములభాతి
నురుగులై చూపట్టె సూనంబులెల్ల
సరులెల్ల నీలంపుసరులజాడయ్యె

( 554. సఖీజనరచిత విరహతాపోపశాంతి రచనాది. )

నప్పు డాసఖులెల్ల నాపుష్పబోఁడి
తప్పక చూచి యెంతయు విన్నఁబోయి 8270
కనుఁగొంటిరే కల్పకంటి యున్నట్టి
యునికి యిందఱుగూడి యొనరించినట్టి
యుపచారవిధుల నెయ్యురు బగసేయ
నిపుడు క్రమ్మఱ మన మేమిసేయుదము
వెడవింటివాఁడు గర్వించి యుప్పాట
నోడ లెఱుఁగక మెఱయుచునున్నవాఁడు
పెలుచఁ గోవెల యన్నఁ బెంపుడుఁబేయ
కెలయు గీరంబు మిక్కిలి వాత్రరట్టు
తలపోయ నీతుమ్మెదలుగూడ గొట్లు
మలయమారుతము ద్రిమ్మరిదిప్పకాయ 8280
యెవ్వరి మన మింక నిట వేడుకొంద
మివ్వాలుగంటికై యేమిసేయుదము

( 555. అనుగ్రహాఖ్య దేవీసమాగమన ప్రస్తావము. )

అని శీతలక్రియ లాచరింపుచును
గనకవిగ్రహ యనుగ్రహ చేరవచ్చి

కన్నియ లాలించి కరపంకజమునఁ
గన్నీరు డించి యంగములెల్ల నివిరి
జాఱినపయ్యెదఁ జక్కఁగా నొత్తి
మీఱినతాపంబు మెల్లంబుసేసి
యీతఱి నీమది నెనఁగినకోర్కి
నాతోడఁ జెప్పవే నాతోడ! నీవు 3290

ఎక్కడఁబొడమింప నేల కొంకెదవు
నిక్కంబు చెప్పవే నీయానయట్ల
కాక బొందులు వేఱె కాని ప్రాణంబు
లేకంబులై యుండు నిద్దఱి కెపుడు

( పరి. విరహాధిక్య కష్టదశావర్ణనాది. )

నని కూర్మిఁ గొసరియొయ్యన నొత్తియడుగ
నునుసిగ్గు వాలుగన్నుల నామతింపఁ
జెప్పనుంకించు లోఁ జిప్పిలునానఁ
జెప్పనోడుచు నరచెప్పి గ్రుక్కుచును
దనుదాన యొకకొంతతడవున కిందు
కొని ప్రియసఖి దేరకొని యేకతమున 3300

నీతోడునీడనై నీమాట మీఱ
నేతఱి నేర నే నెంతగానైన
వినవె నాకలలోన వెన్నుఁ డేతెంచి
నను గూర్మి నాలింగనమున లాలించి
మరుకేళిఁ దేల్చి వేమఱుఁ జెప్పరాని
పరవులు నీరానిచనవులునొసఁగి
యనిశంబు నన్నుఁ బాయ నని తలం జేయు
యొనరింపఁ గడునమ్మియుండి మేల్కాంచి

యడపక యదిమొదలై వానిబాళిఁ
బడి చిత్తజునిబారిఁ బడి యింటిలోన 8310
నెక్కడ నింటివా రెఱిఁగెద రనుచుఁ
గ్రుక్కుచు లోలోన గుబ్బతిల్లుచును
నుండితి నిన్నాళ్ళు నొకరీతి నింక
నుండు టేగతి వాని నొనగూడ కింతి
యని చకోరములు నీరాడి జాడించు
ననువునం గన్నుల నానుబాష్పములు
తొంగలి రెప్పలతుద జాఱి మీఱి
పొంగారుకుచకుంభములమీఁదఁ దొరుఁగ
నున్నకోమలిఁ జూచి యూరార్చి పిదపఁ
దిన్ననిపలుకులం దెలివి నొందించి 8320
యింతమాత్రమునకు నేటికి నీకు
వంతలఁ బొంద నోవనజాయతాక్షి !

( 557. శ్రీరంగరాజవరనిశ్చయ ప్రస్తావము. )

నీవు నోమిననోము నిక్కమై నీకు
భావింప శ్రీరంగపతి పతి యగును
ననుచు నూరార్చి యయ్యెలివఁ దోకొనుచు
ననుఁగుఁజేడియలతో నరిగె నింటికిని

( 558. విష్ణుచిత్తయోగిరచిత శ్రీరంగక్షేత్రయాత్రాప్రకారము. )
నిజతనయాశిబికారోహణమై ఖరి.

యంతట నొకనాఁడు హరిచిత్తుఁ డాత్మ
జింతించి రంగేశు సేవింపఁ గోరి
ఆసతిఁ జతురంతయానాధిరూఢఁ
జేసి యొంతయువేడ్క శ్రీరంగమునకుఁ 8330

జనువేళ నాకన్య జనకునిం బిలిచి
యనిమె శ్రీరంగనాయకునిగోపురము
నెచటికిం గనవచ్చు నేవేళ నప్పు
డచటం జల్లకి డించు మన సమ్మతించి

(559. శిష్యసహితయోగివరరచిత శ్రీరంగక్షేత్ర యాత్రాక్రమము)

ఘననదీశైలసంఘంబులు గడచి
చనుదెంచి నిజశిష్యసహితుండై యంతం
దుదలువిప్పక విప్పం దొడరుచు గడలు
మృదులకోరకముల మెదలుతుమ్మెదలు
నించువిల్తునికేళి నెలదమ్మియిండ్ల
నించువేడుక రచియించి చంచువులం 8840

జించి కొమ్మలకుం గొంచెపుమృణాళములు
కొంచక యొసంగెడు కొంచలంచలును
లోలంబులైన కల్లోల డోలికల
నోలి నూంగుచుం గేలి నోలయువోటులను
నవలచెందొవలలో నలరుతేనియలం
దవిలి యందిచ్చు నిద్దంపుజక్కవల
వలగొన్న నల్లగల్వల వాలుమీలు
పొలయంగ వెలయు పుష్పాళ్ళ తెట్టువలు
పలుమఱుం దరులం జొప్పడు నాగపూంగ
మలయజంబుల తావి మలయు తెమ్మెరలు 8850

కాకమైం బోకమోంకల నూంకి దరుల
వీంకమై గోరాడు ద్విరదదంతములు
తాంకుల నంతరాంతరములైనట్టి
ప్రేంకంపునెలచల్వ వెడదనిచ్చెనల

( 560. జలకేళిప్రస్తావభూషణాంబరాదిధారణక్రమము. )

జలకేళి సవరించి సఖులతోఁగూడ
విలసిల్లి యేగెడువేల్పుబైదలులు
కలకలమను పాదకమలమూలముల
మలకలసొమ్ము లుమ్మడి నొప్పమిగుల
వలవెలువడుజక్కవలరీతిఁ బయ్యె
దలఁ బాసి కుచపర్వతములు గీఁటాడ 8360
నాలోలకర్ణభూషావళుల్ గండ
పాలికాతటములఁ బంటిళ్ళు ద్రొక్కఁ
ధరణిబింబము లభ్రతలములనొప్పు
కరణి గ్రొమ్ముళ్ళు బంగరుబొట్టులమరఁ
బసనైన తమమించుపాలిండ్లఁబోలు
పసిఁడికుండలు పట్టి పరతెంచుచున్న

( 561. కావేరీతరణపూర్వక శ్రీరంగక్షేత్రప్రాప్తిప్రకారము. )

ద్రావిడాంగనల నెంతయు నొప్పనొప్పు
కావేరి దాఁటి రంగపురంబుఁ జేరి
తఱచైన ద్రవిడవేదముల వేదములఁ
బెఱమాట వినరాని పెనువీథిఁ గడచి 8370
మలయజయుతమైన మంచిపన్నీటి
కలయంపి గలగృహాంగణములు దాఁటి
యూరయు దామోదరాహ్వయం బగుచు
శ్రీరమాయావనశ్రీలఁ జొప్పడుచు
నుడురాజకలశమై యొప్పారుచున్న
పొడవైన తూర్పుగోపురము సాత్త్రేర
నంతకుమున్ను యయ్యలివేణి రంగ
కాంతునిచెంతకు గగనమార్గమున

నరిగయుండుటఁ దెలియక భట్టనాథుఁ
కరుదారఁ దనపట్టి యనుమాటఁ దలచి 8380

( 562. శిబికారోహణపూర్వక హరిమందిరసమీపప్రాప్తికథనము. )

పల్లకి దింపించి పరమానురక్తి
నల్లనఁ దనుజాత నంకించి పిలిచి
పంజరం బెత్తిలోపలఁ జిల్కలేని
పంజరంబునుబోలె పట్టి లేకున్న
యానంబుఁ గనుఁగొని హా యంచుమూర్ఛ
నూని తెప్పిరి మఱియును విచారించి
మదిలోన రంగేశుమాయగా నెఱిఁగి
గుదిగొన్న నెవ్వగం గ్రుమ్మరిల్లుచును
పాయని కూర్మిచే బాష్పంబు లురులఁ
దోయజోదరు నాత్మ దూరి యిట్లనియె 8390

( 563. గోపాంగనా నవనీతప్రస్తావకథనాది. శ్రీరంగనాథసేవాప్రకారము. )

నకలంకనిజకీర్తివై నీతి దొరఁగి
యకట ! నీకిటు తగునయ్య రంగేశ !
యీరీతిఁ దొంగిల నీకొమ్మ గోప
నీరజాక్షుల నవనీతమే తలఁప ?
బలిమిఁ గైకొన రాజబాలికామణులె ?
తలపోయ కిటు సేయఁ దగునె ? గోపాల !
మన్నుగా జనని యీ మ్రుచ్చిలువిద్య
వెన్నతో నిడినదే వివరించి చూడ
వనజాక్షి వలసినవాఁడవై తేని
ఘనతమై మాయింటికడ కేగుదెంచి 8400

( 564. మురారివైభవకథనాది. )

యడగి చుట్టఱిక మేపారంగ సేన
యిడి నీవు గొనిపోవు టింతియకాక

జగదేకసాక్షివై సర్వనాయకుఁడ
వగునట్టి నీవ యన్యాయంబు సేయ
మితిలేని మున్నీరు మేఱమీఱంగ
నితరులు వారింప నెట్టులోపుదురు ?
అనుచు శ్రీరంగనాయకునిసన్నిధికి
జనుదెంచి పాదాంబుజములపై వ్రాలి
తొరఁగెడి కన్నులతోయపూరములు
చరణాంబుజముల మజ్జన మాచరింప 8410

( 565. శ్రీగోదాదేవికలితశ్రీరంగరాజవామభాగస్థితికథనము. )

వనజాక్షునాజ్ఞ శ్రీవరచిత్తకన్య
తనతండ్రిశోకంబుఁ ధరియింపఁ దలఁచి
యతులనాగేంద్రశయానుఁడై యున్న
కమలాక్షు వామభాగమునందు నుండి
కడునొప్పు నీలమేఘములోననుండి
వెడలుశంపాలతవిధమున వెడలి
కంకణమణిరుచు ల్గడలుకొనంగఁ
బంకజానన పాణిపల్లవం బెత్తి
యన్న ! నీకేటికి నడల నిచ్చోట
నున్న నన్నిటు చూడు; మోతండ్రి ! యనినఁ 8420

( 566. గోదాఖ్యకన్యకామణిపరిణయామోదప్రస్తావము. )

దోన శ్రీరంగనాథుఁడు తెలిగన్న
గోనల నమృతంబు గులుక నిట్లనియె
నడలకు నీవన్నయట్ల నీయింతి
కడకుఁ బసిఁడిపెక్కెలతేజి నెక్కి
ననుపార సకలసన్నాహంబు మెఱసి
ఛనుదెంచి నీకూఁతు జలజాతనేత్ర

సురలు నచ్చరలును జోద్యంబునంద
వరియింతు నీచెలునను సొంపు మీఱ
వలసనిశోకంబు వలదు క్రమ్మఱను
బాలఁతుకఁ దోకొనిపోయి రమ్మనిన 8430
నలరి శ్రీరంగనాయకుపాదపద్మ
ములకు సద్భక్తిని మ్రొక్కి యగ్గించి
కూరిమితోఁ దనకూతుఁ దోకొనుచు
భోరున నిజపురంబున కేగుదెంచి
యనఘు భూమీశు లోకైకపంకేజ
దినమణిపల్లభదేవు రావించి
యరవిందలోచనుం డాత్మసంజాత
వరియింతు ననుటయు వరుసతోఁ దెలిపి
యెన్నిక మఱియు నేమేమి గావలయు
నన్నియు సమకూర్పు మని సమకట్టి 8440

( 567. పాండ్యభూపతిదత్తశ్లాఘ్యయౌతకద్రవ్యసమర్పణక్రమము. )

పనిచిన నరిగి యాపాండ్యభూనాథుఁ
డనుపమకనక రత్నాదివస్తువుల
రమణీయమౌక్తిక రంగవల్లికలఁ
గమనీయకాంచనకదళికాతతుల
సిరిమించుపురముఁ గైసేయించి మగుడి
యరుదెంచి యెఱిఁగింప హరిచిత్తయోగి
పనిఁబూని సకలశోభనవస్తువులును
నొసర నాయితపడుచుండె నున్నంతఁ
జక్కని వేంకటశైలనాయకుఁడు
చొక్కించుచూపుల సుందరేశ్వరుఁడు 8450

రెపుడు గోదాసతియెద నుండు ననుచుఁ,
దప మొనర్చినవటధామమూర్తి యను
నొకటియై యెంతయు నొప్పారుచుండఁ
జికిలిలేసగవుల శ్రీరంగవిభుఁడు

( 568. ఆదిశేషచంద్రసూర్యదిక్పాలాదిర-చితనానావిధోపచారవర్ణనము. )

తెలిపావసమకట్లతేజియై నెక్కి
తొలఁగక నిత్యముక్తులు చేరి కొల్వ
ఫణమణిద్యుతులు దిక్పటలంబుఁ బొదువ
ఫణిపతి ముక్తాతపత్రంబుఁ దాల్ప
మఱి గంధవాహుండు మరకవాహుండు
ముఖ్యులై న చామరములు పూని వీవ 8460

చెలరేంగి భానుండు శీతభానుండుఁ
దళుకొత్తు తాళవృంతంబుల వీవ
హరుఁడు శచీమనోహరుఁడు ముంగలిని
దరమిడి తోత్రవేత్రములంది నడువఁ

( 569. వందిజైతాళికప్రవృత్తిప్రస్తావము. )

గేలి నాసురరాజు కిన్నరరాజుఁ
గాళాంజిహడపంబుఁ గైకొనినడవఁ
బెక్కుచందంబులఁ బెక్కుచందములు
గ్రిక్కున వందిమాగధ వృత్తి గొలువ
నరసురాసుర యక్షనాగ గంధర్వ
వరులు సేవింప నా వనజలోచనుఁడు 8470

నేతేర నప్పు డెదురేగి యాయోగి
యాతతభక్తిమై నడుగుల కెరఁగి
సకలోపచారము ల్సవరించి భక్త
నికరంబుతోఁగూడ నిజగేహమునకు

(570. వివాహార్థమంగళస్నానాచరణాది.)

నాకంజలోచను నతిసంభ్రమమునఁ
దోకొనిపోయి బంధురపీఠి నునిచి
యలవడ సోపానలయిదున ల్వాడఁ
జెలు లంత నాహరించి తత్పుత్త్రికిని
గుంకుమ నలుగిడి గొజ్జంగినీరు
పొంకంపుఁబసిఁడితంబుగలచే ముంచి 8480
సరగున మంగళస్నానమాడించి
తరుణికి జిలుగారుదడిసుడు లిచ్చి

(571. నానావిధాలంకారాభరణాదిధారణము.)

వెలఁది చుక్కల వికవిక నవ్వుచుండఁ
దెలిమించు మెఱుగుముత్తియపు గొండెముల
గనకంపుఁజెరఁగులఁ గనుపట్టు పట్టు
జినుగుదువ్వలువ కుచ్చెలవట్టికట్టి
మొగము గబ్బునగూర్చి మొగసినదిశల
భుగభుగమను గంధవొడి మేన నలఁది
నొగినల్ల మొగులులో నొదిగి తారకల
పగిది క్రొవ్విరులు లోఁబడ బిటారముగ 8490
మినుకారుగండుతుమ్మెదతెక్కెముబ్బఁ
దనికెదుకురుల బిత్తరముగాఁ దురిమి
వెన్నుపై నెడమించు వేడించుకరణిఁ
గ్రొన్ననవిరిదండఁ గ్రొమ్ముడిం జుట్టి
పొగరారు నెరసమ్మెపురివిచ్చుపగిది
మొగలి రేకులు వింతమురువుగాఁ జెరివి
యసమానవదన చంద్రాకురం బనఁగఁ
బసని ముత్తియపుఁ బాపటచేరుగీల్చి

సారెకుఁ దనుమించి చనుకాంతిఁ బొదలు
నీరసంబును వదనేందుబింబమును 8500

( 572. తాటంకాద్యాభరణరచనాప్రకారము. )

గచభారరాహువు గబళింపకుండ
రచనఁగాఁపిడినచక్రంబులో యనఁగ
మూలలెన్నిదిరైన మొగమానికముల
డాలించువియలతాటంకముల్ పూని
తెలిదమ్మికొనలను దేఁటినూగెనఁగు
కలికిబాగులసన్న కాటుకఁ దీర్చి
మదనుండు ముక్కుసంపంగిలాలమున
నొదవించుకపురంపుటుండయో యనఁగఁ
గనిరాజవరదుని ఘనకీర్తిఫలము
కరణి నింపొందు ముంగరఁ గీలుకొలిపి 8510

యలసయానముల రాయంచలం గెలిచి
పెలుచఁ బెట్టినవాదు పెండేర మనఁగఁ
గమలాప్తబింబంబుగతి నొప్పుమణుల
రమణీయ మగునూపురముఁ బొందుపఱచి
కమలమూలములఁ గంకణగణం బమరు

( 573. రత్నకంకణకస్తూరీతిలకధారణప్రకారము. )

క్రమమున రత్నకంకణములు దొడిగి
ఘనతరశైలశృంగంబులమీఁదఁ
గనుపట్టు సెలయేటికాలువ లనఁగ
ననువుగాఁ గస్తూరి యలఁదినగుబ్బ
చనుదోయిమై బన్నసరములు వైచి 8520

నలినారిమైతారసకరాంక మొప్ప
నలువునం గస్తూరినామంబు దిద్ది
చెలులు నేరుపునఁ జూచినకల్పలతిక
చెలువున నిట్లు గై సేసి తోతేర
దినకరచంద్రులు తెరవట్టిరపుడు
తనుజాత నయ్యోగిధవుఁడు తోతెంచి

( 574. వివాహానుగుణమధుపర్కప్రదానాది. )

మకరకుండలునకు మధుపర్క మొసఁగి
సుకుమారి నిచ్చె కృష్ణునకు నవ్వేళ
సురలోకవరుమంత్రి సుముహూర్త మనిన
నిరువు రొండొరుమోము వీక్షించుతఱిని 8530

జలజాక్షి మున్నుగా నగుడజీరకము
చెలఁగి రంగేశ్వరుశిరమున నిడియెఁ
గవమొగుళ్ళను జంద్రికలు పర్వినట్లు
తవిలి యొండొరులమైఁ దలఁబ్రాలు నించి
కరకల్పశాఖలం గనుపట్టువిరుల
సరవిముత్తియపుసేసలు దోయిలించి
గట్టిగా నాగమోక్తప్రకారమున
గట్టిరి హస్తకంకణము లొండొరులు

( 575. శాస్త్రోక్తసాంగవివాహాచరణరచనావర్ణనము. )

నలవధూవరులఁ జయ్యన దివ్యరత్న
సలలితం బగుపెండ్లిచవికెమీఁదటను 8540

బనుపడ గొనబు చూపట్టునుత్తరపు
కొనలుగా వేయుచుంగుల చేలవఱచి
చెలువొందుపీఁట నాసీనులం జేసి
జలజసంభవుఁడు శాస్త్రప్రకారమున

( 576. లాజహోమాచరణము. సప్తపదీకలనాది. )

ననలుని నెలకొల్పి సాంగంబు గాఁగ
మనమార లాజహోమములు సేయించి
యలవధూవరులు హోమాగ్నికిం బ్రేమ
వలచుట్టిరాఁగ నవ్వనమాలిఁ జూచి
పనుపడ నిడె సప్తపదులు మెట్టింపు
మనిన గంగాధరుం డమరనాయకుఁడు 8550

నలఁతినవ్వొలయ నేమయ్య యీవేళ
వలవనిసిగ్గేల వనజాక్షిపదము
గట్టిగా నీనాల్గుకరములఁ బట్టి
మెట్టింపరాదె యన్మాలి నవ్వు నగుచు
భామినిచే సప్తపదులు మెట్టించి
హేమాంబరుఁడు తొంటియిరువున నున్నఁ
గలికిలాగుల యక్షగంధర్వ సతులు
సొలపులు మీఱంగసోబానవాడ
ముత్తెంపుబొగడల మొనయుబాసికము
నత్తటి నజుఁడు గాయజుఁడు గట్టంగ 8560

( 577. కనకపాత్రకలితనీరాజనప్రదర్శనాది. )
ఆశీర్వాదరచన. అక్షతారోపణాది.

వాణి శర్వాణి సౌవర్ణపాత్రికల
రాణించురత్ననీరాజన లొసఁగ
హరిదీశముఖులును హరిచిత్తముఖులు
విరివిగాఁ దమలోన వీడులు జదువఁ
త్రిదశార్యముఖ్యులు దివ్యసంయములు
పొదవి యాశీర్వాదపూర్వంబు గాఁగ

నక్షతులైన యయ్యాదిదంపతుల
కక్షతంబులు వెట్టి రాగమొత్తముగ
హరియాజ్ఞ నవనిధు లట కేగుదెంచి
కర మర్థితో నూడిగంబులు సలుప 8570
శ్రీరంగనాథుని సేనానిభుండు
కాగినందనుఁ డాదిగాఁ గలవారిఁ

( 57-. పాండ్యరాజకలితరంగనాథసేవాప్రకారము. )
భక్తజనవరప్రదానాదిమహిమ.

గమలసంభవుఁ డాదిగాఁ గలవారి
బ్రమదంబుతోడ సంభావించెనపుడు
వల్లభదేవుండు వరుసతో భూమి
వల్లభులను గారవమునఁ గావించె
నీవిధి రంగమహీనాయకుండు
శీవిమై నలవధూటిని వరియించి
మోదించి కాసారముఖ్యయోగులకు
గోదనెచ్చెలులకుం గురుకాధిపతికి 8580

( 579. శేషతల్పప్రాప్తిప్రకారము. )

వలయువారికి నిష్టవరముల నొసఁగి
యలరుచు నుండి నాలవనాఁటి రాత్రి
యురగతల్పమున నయ్యుడురాజవదనఁ
దిరమొంద మరుకేళిఁ దేలించి తేలి
యోగనిద్రాసక్తి నుండఁ బూర్వాద్రి
జేగురునెరసినచెలువు దీపింపఁ
బ్రొద్దుసారథిపొడుపులచాయ లెసఁగఁ
దద్దయుఁ బ్రేమనత్తఱి నేగుదెంచి
యలపరాంకుశముఖ్యు లగుయోగివర్యు
లలరి గోదాయుక్తుఁ డగురంగవిభుని 8590

( 580. ద్రవిడప్రబంధగుంభితప్రథమపద్యపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

సొరిదిఁ బ్రాబోధకీస్తుతిఁ బాడఁదొడఁగి
యరుణబింబం బుదయాద్రిపై నిలిచెఁ
బలపల వేగి పీడ్వడ మబ్బు లడఁగె
నలరుచుఁ బూదేనియలసోన గురిసెఁ
బాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె

( 581. ద్వితీయగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

ములముల వికసించు మొల్లక్రొన్ననల
వలపులఁ దూర్పువీవలు లెచ్చరింప
మంచుగుబ్బలుల వేమరును గేలించు
నించురెక్కల మించులెసఁగ జాడించి 8600
నెత్తావియిండ్లలో నిదురించుచున్న
మత్తహంసలు నంచమగలు మేల్కనిరి
పాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె

( 582. తృతీయగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

చుక్కలరుచి డొంకె సోముండు గ్రుంకె
దిక్కలరవికాంతి దీండ్రింపఁ దొడఁగెఁ
బోఁకపూఁబాళల బొదిగొన్న తావి
సోఁకులవలిగాలి సొలయంగఁ దొడఁగెఁ
బాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె 8610

( 583. చతుర్థగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

వ్రేపల్లె గోవుల వేణునాదంబు
లేపారె రవళించి వృషభసంతతుల

గాటంపుమేతల గబ్బుల మీాఱెఁ
దేఁటిదాఁటుల మ్రోఁత దెసలఁ బెల్లొదవెఁ
బాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె

( 584. పంచమగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

రాత్రి దొలంగె నారామభూజములఁ
బత్రంబు వికసితపత్రంబు లయ్యె
నలరె నంబుధిఘోష మమరబృందంబు
దళుకొత్తు వెక్కుపూదండకానుకలు 8620

పూని నీపదపద్మములసేవఁ గోరి
యూనినవేడ్కతో నున్నారు వీరిఁ
బాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె

( 585. షష్ఠగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

తేరుల నిలిచి యాదిత్యవర్గంబు
లారూఢవృషభేంద్రులై పశుపతులు
కమనీయశిఖి నెక్కి కార్తికేయుండు
నమరులఁగూడి నృత్యమును సేయుచును
వినుతించి నిన్ను సేవింప నీవేళఁ
జనుదెంచి నీదుమోసలనున్నవారు 8630

పాలించి కరుణఁజొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె

( 586. సప్తమగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

యమర గంధర్వ విద్యాధర దైత్య
సముదయయుక్తుఁడై సంక్రందనుండు

కరి నెక్కి- ఘనమునిగణమును దాను
దొరసి ద్వారమునఁ దోదోపులాడెదరు
పాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె

( 587. అష్టమగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

నిధులు నంబుధులును నిర్జర కపిల
బుధులు నచ్చరలుఁ దుంబురు నారదులును 8640
మునులు నీముందర మొనసియున్నారు
వనజాప్తకాంతి తీవలువాఱె దెసలఁ
బాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె

( 588 నవమగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

కరమర్థిఁ గిన్నర గరుడ సిద్ధాదు
లరిది మృదంగవీణాదివాద్యముల
పరవిమై నీమీఁది సంకీర్తనములు
పరిపరిలాగులఁ బాడుచున్నారు
పాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె 8650

( 589. దశమగాథాపఠనద్వారా శ్రీరంగరాజప్రబోధనక్రమము. )

తమ్ములు వికసించెఁ దరణియుం బొడమెఁ
గొమ్మలు పసపాడి కోరి నీరాడి
కట్టిరి పుట్టముల్ కావేరినడుమఁ
బుట్టక పుట్టిన పూసెజ్జ నున్న
నీలనీరదవర్ణ ! నీయోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె

(590. శ్రీరంగనాథమంగళాశాసనప్రకారము.)

శ్రీరంగనాథుఁ బూజింపంగవలసి
పూరించియున్న యాపూవులకరఁడి
నందంబుగాఁగ భుజాంతరసీమ
యందుఁ గైకొన్న భక్తాంఘ్రిరేణుండు 8660
గావించె నీదశగాథలచేత
భూవినుతముగఁ బ్రబోధకీకృతిని
అనుసర్థముల నొప్పు నలభక్తపాద
వనజాతరేణుకావ్యంబుఁ జొప్పడఁగ
గురుభక్తి నలపరాంకుశముఖ్యులెల్లఁ
గరమర్థి మంగళగానంబు సేయ

(591. శ్రీరంగరాజప్రసన్నత్వాదివైభవప్రశంస.)
హరికరుణాకటాక్షవీక్షణాది.

సురగేంద్రశాయియై యున్న శ్రీరంగ
వరుఁడు మేల్కాంచి యవ్వనితయుఁ దాను
గనువిచ్చుపుండరీకములచందమునఁ
గనువిచ్చి యంతయుఁ గ్రమము దీపింప 8670
నుచితసత్క్రియలెల్ల నొనరించి భక్త
నిచయంబు దేవతానికరంబు మునులఁ
గరుణాకటాక్షవీక్షణసుధాధార
బెరయించి యెంతొసంప్రీతి రెట్టింప
నారామతోఁగూడ నభినవలీల
శ్రీరంగమునకు వేంచేయంగఁ దలఁప
ననుగు రెట్టింపంగ హరిచిత్తుదేవి
తనపట్టిఁ జేరి యెంతయు బుజ్జగించి
యమృతంపు జెల్లంపు టచ్చులు మంచి
యమరేంద్రు నెలదోఁట యరటిపండులును 8680

( 592. దివ్యదంపతివిషయకానందానుభవప్రకారము. )

గడుమించు నపరంజికమ్మదోపులును
నొడి బియ్య మిడి కూర్మియొలయఁ గౌఁగిట
నలమి యానంద బాష్పాంబుపూరములు
తళుకుజెక్కులజార తనయ నీక్షించి
ననబోఁడితో రఘునాథునివంటి
పెనిమిటి నీకు నబ్బెను నోఁచినట్లు
మరమాన విను పిల్చి మగఁడు నెయ్యమున
ననయంబుఁ జేరరమ్మని చన వొసఁగి
మేలమిచ్చిన మందెమేలంబు మాని
తాలిమితోడ నాతనిచిత్తమెఱిఁగి 8690

సవతుగా నీతోడిసవతులు చూచి
యవునౌనె యని కొనియాడ నెల్లపుడుఁ
గనలక భూదేవిగతి నుండుమమ్మ
మనసిచ్చి మీలోన మగఁ డేరిపైనఁ
దలమీఁద నిడికొనఁదలఁచిన నిన్నుఁ
దలమీఁద నిడికొన్నదానిగాఁ జూడు
మిరవొంద నురముపై నిడికొన్న భక్తి
నరసి నీవున్నట్ల యాత్మ భావింపు
తరలకు మఱికొకదాక పోకాదు ?
తరవాత మది నెల్లిదము వలదమ్మ 8700

తనయను మగనిడెందములోన నుండు
మని బుద్ధిచెప్పుచో హరిచిత్తమొగి
యాకన్నె రంగనాయకునిచెంగటికిఁ
దోకొనివచ్చి సంతోషంబుతోడ

( 593. నిత్యముక్తాదిభక్తజనసేవాప్రకారము.
గోదాదేవీసహితశ్రీరంగరాజాస్థానవైభవప్రశంస. )

సురుతరపీఠిపై నునిచి కట్టణము
లిరువుర కొసఁగి యోగీశుఁ డావేళ
మఱియు నావంటిపామరుల నీడేర్చ
గురుగాఁగఁ జేపట్టికొనఁగఁ దలంచి
..............................
.............................. 8710

యలవడ నిత్యముక్తాళి సేవింప
నలవిష్ణుచిత్తకన్యకతోడఁగూడఁ
జక్కనితొలుబల్కు సెకలింపుతేజి
నెక్కి సొంపెక్కి యాఋజుమార్గమున
రాజిల్లు శితచామరముల హారముల
భ్రాజితరత్నదీపముల ధూపములఁ
గొనబుముత్తియపుముగ్గులను నిగ్గులను
దనరారు వివిధనేత్రముల ఛత్రములఁ
గనకంపుటనఁటిమోఁకలను బోఁకలను
ననుపారుపుష్పగంధముల గంధముల 8720

( 594. పౌరజనసంతోషాతిశయప్రశంసాదివైఖరి. )

విలసిల్లు నారాజవీథి నేతేర
నలవధూవరులసోయగము సేవింపఁ
బరువడివచ్చు సంభ్రమమునఁ బౌర
తరళాయతాక్షు లెంతయు వేగపడుచు
సందడిపడుచులో సంతోషపడుచు
నందంద వీక్షించి యాశ్చర్యపడుచుఁ

గడునాసపడుచు వేడ్కలఁ దడఁబడుచు
నడరుమేడలమీఁద నాయత్తపడుచుఁ
దిలకంబు కామినీతిలకంబునొసలఁ
జెలివిమీఱఁగఁ దీర్చి తీర్చి యేతెంచి 8730

తివిరి కాటుక కంటఁ దీర్పంగఁ బోయి
శ్రవణావతంసకైరవమునం దీర్చి
చనుదెంచె నొక్కర్తు, చంద్రాస్యయోర్తు
తన కేలినులివు మధ్యమునఁ బొంకించి
యరుదెంచి యొడ్డాణ మఱుతఁ గీల్కొలిపి
పరువడి నేతెంచె; భామయొక్కర్తు.

( 595. శ్రీరంగరాజనివాసంతోషప్రకారాది. )

చేచేతఁ దాముడిచినదండ లొసఁగ
నీచెలిఁ గరుణించె నీరంగవిభుఁడు
సరగున నేడట్ల సవరించి యతని
వరియింతు నని వచ్చువడువున నొర్తు 8740

సిరమించుకొప్పు గొజ్జఁగదండ రంగ
వరుని చెంగట పీడిత్రావాల నేతెంచె
నీరీతి వచ్చి యయ్యింతు లాచెలువ
శ్రీరంగనాథుని సేవించి పొంగి
కొమరార నిటువంటి కొమరితె గాంచి
కమలభవాదులుం గనలేనియట్టి

( 596. శ్రీరంగరాజశ్వశురత్వాదిభాగ్యభాసురవిష్ణుచిత్తయోగివైభవము. )

ధవళాక్షు నీరంగధవుని నల్లునిగ
సవరించికొన్న యాజగదేకసుతులు

వారెపో మహి భాగ్యవంతులయైన
నారయఁ గన్యకయైన నిట్టిదియె                8750

తోయజాలయనయిదోడు దా నగుచుఁ
దోయజనాభుపొందులు సందుకొనియె
ధరలోన నర్చావతారులై నట్టి
మురసూదనుని దివ్యమూర్తులలోన
నిట్టిబంగరుకుండ నిల్లాలి గాఁగఁ
బెట్టపట్టినయట్టి శ్రీరంగవిభుఁడు
వీఁడెపో ధన్యుండు వివరించిచూడఁ
బోడిమిగా నిట్లు పొగడి వెండియును

( 597. దివ్యసౌందర్యప్రశంసాప్రకారము. )

గన్నియకన్నుల కలికిబాగులను
జిన్నారివదనంబు జిగితావిమోవి                8760

తిన్నదనంబుఁ గోఁదీఁగబిత్తరముఁ
బ్రన్ననిమెఱుఁగు గుబ్బలమిటారంబు
గురులసోయగముఁ జెక్కులనిగాఁదిమిసిమి
కరములయొప్పును గచముబెడంగు
నాసలియొప్పిదము వీనులచక్కఁదనముఁ
బపమించునారు లోపలిసైకదనము
నడుగులవిన్నాణ మందంద చూచి
యుడివోనికూర్మిమై నొండొరుఁ జూచి
కలకంఠి జఘనంబుకలిమి యందఱుఁ
గలుగుపంగడిబారగనుబండికల్లె                8770

హరిమధ్యగళముసోయగ మందఱును
దొరక నేమేనిపొత్తులఁ బెట్టినదియొ

కుందకుట్మలదంత కోప్పువిన్నాణ
మందఱకును గల్గ నల్లాడనిడిరె
యిందుబింబానన యెలగొనుచంద
మిందఱకును గల్గ నింతయల్పంబె
యన్నియు నేల ? యీయలివేణిచెలువ
మెన్నిన జగతి నహిప్రతి యనఁగ
వినుచు నా శ్రీరంగవిభుఁడు వారలను
గని కరుణాకటాక్షముల ముంపుచును 8780

( 598. శ్రీరంగరాజసంతోషప్రకారము. )
దేవాదిభక్తజనస్వస్వస్థానప్రాప్తిక్రమము.

నత్యంతసంతోషితాత్ములై యెదుట
నిత్యులు ముక్తులు నెలకొనికొలువ
నమరులు నిజవాహనారూఢు లగుచుఁ
గ్రమమునం దమయూఁడిగములు గావింప
నంచతేజీ నెక్కి యరవిందసూతి
యంచబాయక వేత్రహస్తుఁడై నడవ
నీరీతి విలసిల్లి యెంతయు మగిడి
భోరునం దనపురంబున కేగుచుండి
శ్రీరంగచంద్రుఁ డాశీతాంశువదన
గారవం బెలరారఁ గనుగొని పలికెఁ 8790

తెరవ నీవంటిపుత్రీమణీతతుల
నెరయంగఁ దా గాంచు నిచ్చ నిచ్చలును
లలితకల్లోలలోలన్ముక్తమైన
నెలఁత యీతామ్రపర్ణీనదిఁ గంటె
మంచుబంభరచక్రమంజీరమైన
మంజీరనదిచెంత మానైనయట్టి

యారామగిరిరాజ మది గనుఁగొంచు
యోరామ ! నే భాయకుండెదనెలవు
లదె చోళ పాండ్య మధ్యస్థితం బగుచు
విదితమై యొప్పెడువిపినంబు గంటె 8800

యినకాంతి సోకయింతయెడమీక యలరి
కనిన కన్నులకుఁ జీకట్లు గ్రమ్మెడిని
యలచోటిచెంచత లహిశిరోమణుల
బలుపొదరిండ్ల దీపంబు లెత్తెదరు
శ్రీలిచ్చుకావేరిచెంగట నొప్పు
చోళదేశం బదే శుకవాణి ! కంటె
కంటివే యోతమ్మికంటి ! ముక్కంటి
వంటిల్లు సురనాగవరు పుట్టినిల్లు
మామతశయనసద్మంబును జంద
మామగన్నతఁడు మామానినీగురుని 8810

మామామ సీక్షింపు మామహాంబుధిని
సీమంతినీమణి చిగురాకుబోఁడి !
యనుచు నానతి యిచ్చి యతిసంభ్రమమునఁ
దనపురంబునకు నత్తటి నేగుదెంచి

( 593. నిజావాసప్రాప్తిక్రమవర్ణనము. )

శ్రీవిలసిల్ల నచ్చెలువలశోడ
వేవేగ సదనప్రవేశంబు సేసి
ఫాలకీలితహస్తపద్ములై నట్టి
నాళీకసంభవనాకేశముఖుల
మునులఁ గృపారసంబునఁ దెప్పఁదేల్చి
కనకాంబరాదులు గట్టంగ నిచ్చి. 8820

కరమర్థి వేర్వేఱఁ గరుణార్ద్రవాణి
సరగున నిజనివాసములకు ననిచి

( 600. శ్రీభూమినీళాగోదాదేవీసహితశ్రీరంగనాథసరసకేళివైభవము. )

నెలకొని శ్రీభూమినీళలతోడ
నలవిష్ణుచిత్తకన్యకతోడఁగూడ
సరసకేళీలోలసంపత్తికలిమి
సిరులు దైవాఱంగ శేషతల్పమునఁ
బవళించి నిజభక్తిఁ బరిజనుల్గొలువ
నవిరళశ్రీమంతుఁడై యుండె ననుచు

(601. గ్రంథసమర్పణక్రమము. కవివంశమహిమ. నిజకావ్యప్రశంస. )
పంచమాశ్వాసపరిసమాప్తిక్రమము.

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని 8830

అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందనరత్నశుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాద సంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ 8840

కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగఁ బంచమాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## షష్ఠాశ్వాసము.



( 802. శ్రీదేవీవైభవప్రశంస. శ్రీవేంకటేశస్మరణాది. )

చోళమండలసారత్వప్రశంస.

[ ద్విపద ]

శ్యామసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యవధారు వరదానశీలి!
దండిమైఁ గావేరి దండసంపదల
మండలం బగుచోళమండలంబునను
గడలేని యలపూర్వకడలికిం జక్కఁ
బడమటిదెస నొక్కపట్టణం బొప్పు 8850

( 803. పద్మాలయారచిత బిల్వవనతపఃప్రకారప్రస్తావము. వరప్రదానశైలి. )

మునుపు నచ్చోట సమ్మునిసేవ్యబిల్వ
వనభూమిలోన నవ్వనజాతనిలయ
హరిఁ గూర్చి తపముసేయఁగ శౌరి వచ్చి
వరమిచ్చి ప్రేమ నివ్వటిలంగ మెచ్చి
పరిరంభణము సేసి పాలించుకతనఁ
బరిరంభపురినాఁగఁ బరఁగునప్పురము
దొరయంగఁ గృతయుగాదులనుండి వరుస
హరిణాదివర్ణయుక్తాంగము ల్గలిగి

శ్రుతు లుద్ధరించి యచ్చోఁ గర్దమాది
వితతభక్తికి మెచ్చి వేల్పులు గొలువ 8860

( 604. శ్రీహరిప్రత్యక్షరీతికథనము. కమలాపూర్ణనగరస్థితికథనము. )

జలజలోచనుఁడు ప్రసన్నుఁడై యెపుడు
నెలకొనియుండు దానికి సమీపమున
ననుపమం బగుకమలాపూర్ణనగర
మననొప్పుపురవరం బాపట్టణమునఁ
గమలామనోహరుకార్ముకాంశంబు
కమలలోచను పాదకమలవంశమున

( 605. వృశ్చికమాసకృత్తికానక్షత్రదినమలో హరికార్ముకాంశభాసురద్వాదశయోగి ప్రాదుర్భావము. జననకాలప్రభృతి హరికటాక్షప్రాప్తయోగధ్యానాది. చతుర్విధకవితాచాతురీప్రాప్తిక్రమము. )

ఘనతకార్తికకృత్తికను జనియించి
యనుపమయోగవిద్యాసక్తుఁ డగుచు
జననవేళనె రమాస్వామికటాక్ష
మును జెంది తద్ధ్యానమున విలసిల్లి 8870
కామినీమణులకుఁ గందర్పుఁ డర్థ
కామలోకమునకుఁ గల్పభూజంబు
పరులకుఁ గాలుండు పరమయోగులకుఁ
బరతత్త్వ మఖిలభూప్రజలకు రాజు
వివరింపఁగాఁ జతుర్విధకవిత్వములఁ
గవివరేణ్యులకెల్లఁ గర్తయు నగుచు

( 606. పరకాలనామనిర్దేశవర్ణనము. రిపుసేనానిరసనద్వారాకీర్తికుసుమధారణక్రమము. )

మును రంగముననొప్పు మురవైరికరణి
జనులెల్లఁ దనుఁ బెక్కుసరణులఁ బొగడ

బరకాలుఁ దనుపేరఁ బరఁగునాథునుని
కరలాలితంబైన కరవాలవల్లి 8880
యరివీరరక్తతోయంబుచేఁ బ్రబలి
పరఁగ సత్కీర్తిపుష్పంబుల నగుచుఁ
బరమయోగీంద్రుఁ డాపరకాలుఁ డఖిల

( 607. నిజకవితాపటుత్వప్రాప్తబిరుదావళి. చోళరాజ్యమంత్రిస్థానప్రాప్తిక్రమము. )

ధరఁ జతుర్విధకవిత్వస్వామి నాఁగ
బిరుదంబు నలరమాప్రియునిచే నంది
సిరిమించి వరకవిసేవ్యుఁడై మించె
నీరీతిఁ జోళరాజేంద్రునిరాజ్య
భారమంతయు భుజాబలముచేఁ బూని
జనులెల్లఁ దనుఁ గాంచి జయవెట్టుచుండ

( 608. నాగపురిక్షేత్రభాసురములారికైభవప్రశంస. )

ననుపముండగు మంత్రి యైయుండెనంతఁ 8890
బరిరంభపుర సమీపంబున నాగ
పురి యన నొకమహాపురము శోభిల్లు
మదనునితండ్రిసద్మంబు లచ్చోటఁ
బదునొకం డొప్పు నభంగవై ఖరుల
రంజితకిన్నరీరత్నాంఘ్రికంజ
మంజీరశింజితమంజురఝంకార
చలదలమకరందసంకీర్ణ విమల
నలినకైరవకోకనదపుండరీక
కలకంఠచక్రవాకక్రౌంచహంస
కులకలరావసంకుల మైనకొలను 8900

( 609. కుముదపుష్కరిణీస్థితిప్రకారవర్ణనాది. )

అరయంగఁ దత్పురప్రాంతంబునందుఁ
గరమొప్పు ధవళపుష్కరిణి యనంగఁ

కమలాక్షు నాజ్ఞ నక్రమలాకరమునఁ
గామపొందు నొకదివ్యకుముదంబునందుఁ
గడివోని పూముల్కిగతి వేల్పుఁజెలువ
పొడమి యవ్విరిసెజ్జఁ బొలుపొందునంతఁ

( 610. వైద్యశ్రేష్ఠభూషణాలంకారాదివర్ణనము. )

జంక మందులనంచి జగజంపువలువ
పొంకమై నిజకర్ణముల నొప్పుదూది
కునివడఁ జుట్టిన కుళ్ళుమాపుపాగ
యనువంద పంచలోహంపుటుంగరము 8910

నురుతలం బైనట్టి యూర్ధ్వపుండ్రంబు
కరమొప్పు వలకేలికరకకాయలును
బెరయఁ బచ్చడముతోఁ బెనుపడసంది
నరగనుపట్టు బాహాటపుస్తకముఁ
బనుపడలో గుణపాఠంబుఁ జదివి
కొనుచు మూలికలు దిక్కులఁ జూచికొనుచుఁ
గమలాక్షపాదపంకజభక్తినిరతుఁ
డమృతహస్తి యనంగ నలవడువాఁడు
నెన్న ధన్వంతరికెనయైన వైద్యుఁ
డన్నగరన యుండునతఁ డేగుదెంచి 8920

( 611. వైద్యకలితతటాకస్నానాచరణము. కన్యామణినిరీక్షణక్రమము. )

కొమరారు నెద్దుట్టి యూకోల్లను వీక్షించి
క్రమమునం దత్తటాంగణసీమఁ జేరి
స్నానంబు సేయంగఁ జని సరోవరము
లోనఁ బూవిల్తువాలును గేలికొనుచు
నొకతెల్లగలువలో నున్నపూబోఁడి
సుకుమారి యగు వేల్పు జూలి వీక్షించి

మెలమితో రేయి మున్నే తెంచి కలువ
నిలిచిపోకున్న వెన్నెలసోఁగ యనఁగ
నావనజాస్త్రపుష్పాస్త్రమంత్రాధి
దేవతయో యనఁ దెలివొందఁ జూచి 8930

( 612. కన్యాస్వీకరణము, నిజమందిరప్రాప్తిప్రకారము. )

తనయులు లేమి నాతరళాయతాక్షి
గొవకొన్న కూర్మి నక్కునఁ జేర్చుకొనుచుఁ
దనరార నిజనిశాంతమున కేతెంచి
తనసాధ్వి చేతి కాతన్వంగి నొసఁగి
యక్కన్యఁగొనివచ్చినట్టియాచంద
మక్కజంబుగఁ దెల్పి యాత్మ నుప్పొంగి

( 613. కుముదవల్లీనామకరణప్రస్తావము, కుముదవల్లీబాలలీలాభివృద్ధిక్రమము. )

యల్లిలో నుదయించె నని మున్ను కుముద
వల్లినామము బిడి వారనిప్రేమఁ
బదివేలతెఱఁగుల బాల నిర్వురును
ముదమున మిగుల గోమునఁ బెంపుచుండ 8940
నానాఁటఁ బొదలి యానాళీకవదన
యేనాఁట ఫెఱఁగైన మెలకించుహొల్లెఁ
చిప్పరువిల్కాని తేజీకూన యనఁగ
నవకమై యపరంజివక్కడెందమున
నెలజవ్వనం బన్న నెలతోఁటలోన
మొలగుమంజడు కోశిమొకమో యనఁగ
వలనొప్పు శృంగారవాహినిలోన
బెలకొడు క్రొమ్మించుబేడస యనఁగఁ
గనుపట్టియున్న చక్కనిపట్టిఁ జూచి
జననియు జనకుండు సంతసం బెనఁగ 8950

( 614. పరిణయానుకూల యౌవనదశాప్రాప్తిక్రమము. )

నివ్వాళులుగంటికి నివ్వాళులైన
జవ్వనం బొయ్యన నసులొత్తఁ దొడఁగెఁ
దగువరుఁ డెవ్వఁ డుద్వాహంబు సేయ
జగతి నాగతి వాఁడె సంభవించినను
గుటిగ నేతత్కులగోత్రనామంబు
లెఱుఁగక యీకన్య నీనెట్లువచ్చు

( 615. కన్యాకుల గోత్రజ్ఞానవాప్తి చింతాప్రకారాది. )

నని యిట్లు చింతింప నంతఁ గంధర్వ
వనవల్లి కైరవవల్లి నిచ్చలును
బరకాలుగుణము రూపము నుదారతయు
సరసత్వమును భువిజనులచే వినుచు 8960
హరిరూపసంసక్త యైన వైదర్భి
సరవిఁ బరాంతకాసక్త యైయుండెఁ

( 616. పరకాలయోగివరవిస్మయ ప్రాప్తికథనము. )

కనకాంగవల్లియా కైరవవల్లి
యనుపమరూపరేఖాదిసంపదలు
జనులెల్లఁ బొగడ నాశాత్రవాంతకుఁడు
విని డెందమునఁ గడువిస్మయం బంది
యనపత్యుఁ డావైద్యుఁ డమ్మహాత్మునకుఁ
దనుజాత లెవ్వ రింభేరుమున్ను లేరు
అరయ సకలలోకాద్భుతం బగుచు
నీరీతిఁ గల్గెనో యీకోమలాంగి 8970

( 617. కుముదవల్లీరూపాతిశయానురాగ ప్రాప్తిక్రమము. )
పరకాలకృతనాగపట్టణాగమనము.

యని తదాసక్తుఁడై యతఁ డొక్కనాఁడు
తననీషు రేగుచందంబునం దగలి

చనుదెంచి హితబంధుసహితుండై మోద
మున నాగపట్టణమ్మున కేగుదెంచి
యాపండితునియింటి కరిగి చుట్టరిక
మేపార నాతని నెలమిఁ గైకొనుచు

( 618. కుముదవల్లీసమీపదర్శన (ప్రాప్తిప్రకారము. )

మెల్లనె యింటిలో మెలఁగెడుకుముద
వల్లి సౌదామినీవల్లీమతల్లి
యరవిందశరునియూజివసాయకంబొ
వరయోగిదృష్టికవాటకుంచికయొ 8980

యనుచు నంతంత రెప్పార్పక చూచి
యనియె నావైద్యుతో నాపరాంతకుఁడు
పరితిఁ గాంచితి నీచంద్రవదన
నీరామ నీవు నా కిమ్ము వేవేగఁ
బలుమాట లేల తప్పదు విను తుదిని
నిలువెడుధనమైన నీకు నిచ్చెదను

( 619. భిషగ్వరకథితకుముదవల్లీనామకకుమారీ జననక్రమము. )

అన విని మోదించి యాసుధాహస్తి
యనియెఁ గ్రమ్మఱ శాత్రవాంతకుఁ జూచి
రమణియొకండు నిన్నగరంబుచెంగటను
గమలినిలో నొక్కకలువ నీచెలువ 8990

చెలువార నుదయించి చెన్నొందువేళ
నలకొలంకునకు నీరాడంగ నేగి
యచ్చటనున్న యీయరవిందనయన
మచ్చికఁ దెచ్చి యిమ్మాడ్కి నిర్వరము
కన్నబిడ్డలకన్నఁ గడువిశేషముగఁ
జెన్నార నెత్తి పెంచితి నింత గాఁగఁ

దలపోయ నీవంటిధన్యుఁడు కన్నియకుఁ
గలుగుటకంటె వెగ్గలమె యీపసిఁడి
కోరికె నీవంటిగుణనిధానంబు
చేరె నీచెలువ నిచ్చెదనైన నొకటి 9000

( 620. శంఖచక్రచిహ్నాదిధారణ ప్రకారము. )

పడుచువాఁడే పిన్నపడుచు మాతోడ
నోడఁబాటుఁ గావించె నొండుచెప్పెదను
సరసిజాక్షుని శంఖచక్రచిహ్నములు
ధరియించి పరమప్రసన్నుఁడై యెప్పుడుఁ
జారువైష్ణవసహస్రమున కన్నహము
నారగింపొనరింతు నని యొడఁబడిన
వానికిఁ గాని యీవలదని యనియెఁ
గాన నీ వారీతిఁ గావించితేని
వరియింపు మనిన నావైద్యు నీక్షించి
పరమానురక్తుఁడై పరకాలుఁ డనియె 9010

( 621. శ్రీవైష్ణవ సేవాసక్తిప్రకారము. రుక్మిణీశౌరిద్వస్ఠాంతవర్ణనము. )

శ్రీకాంతువరచక్రచిహ్నములు మున్న
నాకుఁ గలిగెనవి వైష్ణవుఁడ నామీఁద
నతిభక్తి నీవన్నయట్ల వైష్ణవులఁ
బ్రతివార మారగింపఁగఁ జేసి కాని
పునిగి యే సుందరభుజియింప నొల్ల
ననుచు నాడినమాట కంగీకరించి
శ్రీమించ దివిజులచ్చెరువొంది పొగడ
రామాభిరామఁ గైరవవల్లి నప్పుడు
వరదైభవంబుల వైదర్భి శౌరి
వరియించు తెఱఁగున వరియించె నంత 9020

కుటిలకుంతలఁ దోడుకొని సంభ్రమమున
నటనమై సకలసన్నాహంబు మెఱసి
యగణితబంధుమిత్త్రాళి సేవింపఁ

( 622. సహస్రవైష్ణవసంఘప్రతిదివ భోజన ప్రదానాదికథనము. )

బొగడొందు తనపురంబున కేగుదెంచి
ప్రతిలేనిప్రతిన దప్పక నెమ్మితోడ
సతతంబు వైష్ణవసాహస్రమునకు
నియమంబు వాటిల్ల నిజనివాసమునఁ
బ్రియమార షడ్రసోపేతంబు గాఁగ
నారగింపఁగఁ జేసి యటమీఁదఁ దాము
నారగింపుచు మఱి యంతటం బోక 9030

( 623. బ్రాహ్మణభోజనాహారాధనసంపాదన వర్ణనము. )

కలధనం బెల్ల నీగతి వైష్ణవులకు
నలసినవారి కవ్వారిగా నిడుచు
నతండు చోళాధీశుఁ జోటయు మఱచి
యతనికిఁ దా మంత్రియగుటయు మఱచి
కడపట నెవ్వ రెక్కడఁ బోయిరేని
యెడపడకుండ నాకివ్విధంబునను
శ్రీవైష్ణవులసేవ సేయంగఁ గలిగె
నే వెఱవను సురానీక మెదుర్ప
వనమాలి జగదేకవల్లభుం డతని
తనయవర్గంబు తద్దాసవర్గంబు 9040

వారలు తమసొమ్ము వారక తాము
యారగించెదరుగా కనియెడు తలఁపు
మదిలోప నిలిపె నెమ్మదిఁ బరాంతకుఁడు
పొదలి శంకాతంకములు లేకయుండ

( 624. పరకాలయోగికృతధనవ్యయాదికథనము. – చోళరాజకోపావేశాది. )

జనులుచే నీతనిచందంబు చోళ
జనవల్లభుండు సవిస్తరముగా నెఱిఁగి
పడతాళ్ళచేతఁ దీర్పరుల మన్నీలఁ
దడయక పిలిపించి తద్వార్తఁ జెప్పి
పనిబూని ఘనరాజ్యభార మంతయును
దనమీఁద వైచి తద్దయు నమ్మియుండ 9050

నేపున నాసామ్ము హితుఁడునుబోలె
బాపురే దాసర్లపాలు సేయుచును
అకట ! యెన్నాళ్ళాయె నౌరౌర ! నగరి
కొకకాసు చెల్లింపకున్నాఁ డటంచుఁ
గరముల మీఁస లొక్కటఁ దీటికొనుచు
బెరయంగఁ గరణాలఁ బిలువుఁ డటన్నఁ
పసమించు తెలివలిపంపుబింజియలు
పొసఁగఁ జుట్టినయట్టి బోడకుల్లాలు
చింపికుప్పసములు చెవిదోరములును
సంపుటంబులతోడ జంపాడునొడలు 9060

( 625. ధనవ్యయకారణాదిప్రశ్నక్రమము. పంచకాదిదోషారోపణము. )

బిగువుగాఁ జెంపదోపినభళపములు
తగనలవడఁగ నత్తలేఁ గరణికులు
చనుదెంచి నిలిచి హస్తములు మోడ్చుటయుఁ
గని వారితోఁ జోళకాంతుఁ డిట్లనియె
నేమోయి ! పరకాలుఁ డేలుచునున్న
సీమ దానెంత సేఁ జేసినయట్టి
యుమ్మడియును రాజె. యుత్తరు వమర
మిమ్మియి డింప మ్మా. కియ్యోటివఖఖుఁ

జెల్లినధన మెంత చేసెత నతఁడు
చెల్లింపఁగావలసిన ధన మెంత 9070

యడరక మీర లున్నది యున్నయట్లు
తడయక చెప్పఁ డాతనిచేత మీరు
లంచపంచంబులు లావుగా నంది
వంచన చేసి విశ్వాసంబుఁ దక్కి
తోడిబడ నెవ్వఁ డిఁదులలోన నేమి
యడఁచిన మీయాట లాడెదు నని సఁ
గరణముల్ తమపంచకరణముల్ బెగడఁ
జరణముల్ దొట్రిల జననాథుఁ జూచి

( 626. పరకాలయోగికృతప్రత్యుత్తర ప్రకారము. )

దేవర ! యిన్నాళ్ళుఁ దెగి విచారంబు
గావింపకుండ నీగతి యడ్యోఁ గాక 9080
నీవచెప్పుమటన్న నిమిషంబులోన
నే విన్నవింతుము నీపాదమాన
నెఱవుగాఁ బరకాలునికి ననిశంబు
నెఱచినగతి మీకు నెఱవ మెన్నఁడును
ఘనరాజ్యభార మొక్కట నాపటించి
జనులకు రెండవస్వామి వైయుండు
కతన నాతనిమీఁదఁ గలిగినలెక్క
క్షితినాథ ! యేము దాఁచితి మింతదాఁక
నీలీల మీ రానతిచ్చిన నాతఁ
డే లెక్క చెప్పెద మేలెక్క యైనఁ 9090

( 627. చోళరాజకోపావేశాది. చోరత్వదోషారోపణ కథనము. )

జెన్నుగా మీచేత సీమ దాకట్టు
కొన్నది మొదలు పైకొని యొక్క కాసు

సెలవుసేయక తుది చెల్లింపలేను
పలుమాట లేటికిం బలుమాఱు నింక
నన విని కనలి చోళాధినాయకుఁడు
కనుగవ విస్ఫులింగము లుట్టిపడఁగ
నోలగం బిరుమేల నొసరింపుచున్న
కాలకింకరభయంకరులఁ గింకరులఁ
గని మీఱు చని పరకాలచోరకుని
ఘనరోషమున నొంటికాలనె యీఁగి 9100

(628. చోళభూపాలాజ్ఞాక్రమవర్ణనము.)

తరవిడివెనక ముందరిధనంబునకు
హరువుగ్గై కొనుఁడు లేదనిన నాగడుసుఁ
గుదియంగఁ గట్టి తోకొని రండటన్న
ముదమునఁ గరములుమోడ్చి యాభటులు
పరువడి నేగి యాపరకాలునగరి
కరిగి లోపలనున్న యరిదండధరుని
జేరి కేల్మోగిచి వచ్చినరాకఁ దెలిపి
ధారుణీనాథునిధనము వేవేగ
లెక్కించి కలది చెల్లింపు కాదేని
గ్రక్కున పతిసముఖమున కేతెమ్ము 9110

అమరంగఁ జెప్పెద మని తలంపకుము
తమ కిది మిగుల నుత్తరువైన తెరువు
అన విని తనయేలునట్టిరాజ్యంబు
ధనమెల్ల వైష్ణవార్థము వెచ్చపెట్టి
భూనాథుధనమెల్లఁ బొందుగా నొసఁగ
లేనివాఁడయ్యుఁ దాలిమి వోవనీక
వెనుకద్రొక్కక గుట్టు విడువక భటులఁ
గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప

నాసీమ నసిఁడియంతయు నాఁడునాఁడె
చేసేత మునుపుగాఁ జెల్లించినాఁడ      9120

నిలువ యేమాత్రము నిలిచియున్నదియొ
తలపోయ నదియు నుత్తరుపు ఘుమ్మళియుఁ
ద్రోయంగ మఱియు నందులకు నిందులకుఁ
బోయెఁ బొమ్మనివాఁడఁ బులిమిపుచ్చుటయుఁ
గనలిభూపతి బోదుకలు కొంగునట్టి

( 62 . చోళరాజభటదండన ప్రకారము. )

పెనచి రాఁదిగిచి గుంపించి యీడ్చుటయుఁ
గుపితుఁడై పులి మేలుకొన్నచందమున
నపుడు వారలఁ జూచి యందంద కినిసి
గట్టులగతి నిరుగడల నున్నట్టి
జెట్టులఁ జూచి గర్జించి యాఘనుఁడు      9130

పొట్టక్రొవ్వినవీండ్రఁ బోనీక వేగఁ
బట్టుకొమ్మన విని భటులనందఱను
మొత్తి మోదరలాడి మొనసి గుండెలకు
నెత్తురుదిగఁదన్ని నీల్గెల్లఁ జెఱిచి
శౌరికింకరులు నిచ్చలుఁ గాలదండ
ధారికింకరులఁ బోఁ దఱుముచాదమున
మొగము క్రిందుగఁ దల మోసాలదనుకఁ
బగలెల్లఁ జెడఁ గాళ్ళుపట్టి యీడ్చుటయు
నవశులై తెలిసి చోళాధీశుభృత్యు
లవిరళ శోకార్తులగుచు వేఁబోయి      9140

యోలగం బొనరింపుచుండినయట్టి
చోళేంద్రుంగని మ్రొక్కి మ్రుక్కి యిట్లనిరి

స్వామియానతి జూడఁ జని పరకాలు
నేమందటిము ధన మిమ్మని యడుగఁ
జడిముడిచే జెట్లచేత గుద్దించి
కడకాలు వట్టి డిగ్గన నీడిపించి
కనలి మీకును దిక్కు గలిగినవాని
కిని జెప్పికొండని గేలిబెట్టినను
ఇచ్చలో నెంతయు నీవె దిక్కనుచు
వచ్చితి మింక దేవరచిత్త మనుచుఁ 9150

( 630. పరకాలయోగివరసమానయనప్రస్తావము. )

గడపటఁ దమమేనిగాయముల్ చూపఁ
గడునుగ్రుఁడై చోళకాంతుఁ డవ్వేళ
దళవాయి రావించి తడయక నీదు
దళములు నీవు నెంతయుఁ బ్రతాపించి
యరిగి నీసాహసం బంతయు మెఱసి
పరకాలు నిటకు వే పట్టితెమ్మనుచు

( 631. చోళభూపాల సేనాగమనాది వర్ణనము. )

సెలవుపెట్టిన నంది సేనాధివిభుఁడు
బలిమిమైఁ జతురంగబలములతోడ
నరపాలునగరు గ్రన్నన వీడుకొనుచుఁ
బరకాలునగర ముద్భటవృత్తి జుట్టి 9160
గవనులఁ బొడిపింపఁ గదలి జంకించి
తివిరి యేనుంగుల దీకొల్పువారు
తలకక వడి నగడ్తలు పూడ్చుకొఱకు
దళముగా నందంద తళివెట్టువారు
కెరలుచు నురకుపక్కెరలగుఱ్ఱముల
నిరుమెలం జేరంబు లెక్కువారలును

మదసాహసమునఁ బల్మఱు కత్తులంది
పొదలుచుఁ గూఁతలార్పులు సేయువారు
నగుచు యాదవపురి యమునందుచుట్టు
సగిది నిప్పగిది నిర్భయవృత్తిఁ దొడరి 9170

కడఁకమైఁ గోట లగ్గలువట్టిగిట్టి
కడుభయంకరలీలఁ గదనంబుసేయఁ

( 632. పరకాలయోగిస్థైర్యశౌర్యాది ప్రకటనము. తురంగారోహణవైఖరి.

బరకాలుఁ డాజి తత్పరకాలుఁ డపుడు
కరముఁ గోపంబునఁ గరవాల మంది
గరుడనిపై నొప్పు కంససంహారి
కరణి బంధురతురంగంబుపై నెక్కి
యరిమురి రేవంతునైనఁ గయ్యమున
నొరయ నుంకించు రావుతులతోఁగూడ
గవసులు దెరపించి ఘనవాద్యతతుల
రవము లెచ్చిలఁగ ధీరతఁగోఁట వెడలి 9180
కార్చిచ్చు మిడుతలగమి సేర్చుపగిదిఁ
బేర్చి తేళ్ళను డాయుబెబ్బులికరణి

( 633. పరసైన్యవిమర్దన ప్రకారకథనాది. )

నెఱి హరి కుంజరనికరంబుమీఁద
నుఱుకుచందంబున నురగాళిఁ బొదువు
గరుడనిగతి విశృంఖలగతి మెఱసి
తరవారి యంకించి దారుణార్భటుల
లగ్గలు డించి యుల్లముపల్లవింప
నగ్గరి కగ్గలం బగుమొగ్గరంబు
డిగ్గనం జొచ్చి యేపార వీరవరుల
నుగ్గుసూచంబుగా నురుమాడఁ దలఁచి 9190

మెడరు గైకొని యొక్కమొడల శాత్రవులఁ
గడికండలుగఁ దలల్ గత్తిరింపుచును
దోస నెత్తురు నేలఁ దొఱఁగకమున్నె
మేను లింతింతగా మెదుగఁగొట్టుచును
లలిమీఱి కొంతు బల్లంబు గుఱ్ఱంబుఁ
గలయంగ వ్రేటూఱుగాఁగ వేయుచును

( 684. కళింగభూపాలసేనానృత్తాంతము. )

గొడిబడ రెండువీథుల నేర్పటించి
కడలకొత్తుచు గిట్టి కనుపుగొట్టుచును
గసిమసంగినశత్రుగణముల జముని
నసముచేయుచుఁ బరవసముఁ జూపుచును 9200

లీలఁ జెండాడు కళింగభూవిభుని
పోలిక సరశిరంబులు నేర్పుమీఱఁ
దొలగక పజ్జ కొంతులఁ దానుఁ గూడి
యుల ప్రాలకుండంగ నెగురఁగొట్టుచును
మిడుగులు నుడుగులు మెడలు లేదొడలుఁ
దొడలును నొడలును దొనలు కన్గొనలు
హరులును గరులును నరులు ముంగురులు
సరులును బరులును జడలు జల్లెడలుఁ
బడగలు పడఁగ నిస్సగిదిఁ జక్కాడి
పుడమియు మిన్ను నార్పుల బీటలెగయఁ 9210

( 685. రిపుసేనాజనప్రాణహానికథనము. చోళభూపాలసమీప ప్రాప్తిక్రమము. )

దరమిడిలయదండ ధరుని చందమునఁ
బరదండధరుఁ డిట్లు బవరంబు సేయఁ
గలసైన్యముల సేలఁ గలియఁగఁ జేసి
కలఁగి యొక్కెడ కంఠగతజీవుఁ డగుచు

బలువేడి చోళభూపాలుసేనాని
తల మొల వీడ దుర్దశఁ బాఱిపోయి
తన పతిపాదపద్మములపైఁ వ్రాలి
తనచేటుపాటు నెంతయు విన్నవింపఁ
గడునుగ్రుఁడై కనుగవతామ్రరేఖ
లదరం గపోలంబు లదర హుంకించి

( 636. చోళభూపాలకృతచతురంగసేనా ప్రేషణాది.
భేరిమృదంగాదివాద్యతాడనరీతి. )

గద్దియ డిగి చోళకాంతుండు నగుచు
నద్దిరా ! యిటు సేసెనా పరాంతకుఁడు
అని యుద్ధసన్నద్ధుఁ డగుచు సామంత
జనము వారణముఖ్యచతురంగబలము
నిరుమేలఁ గొలిచి రా నేపు రెట్టింపఁ
దురగాధిరూఢుఁడై తూర్యనిస్సాణ
భేరీమృదంగాదిబిరుదవాద్యములు
భోరుకలంగ నంబుధులు కలంగఁ
దురగఖురోద్ధూతధూళి యంబరము
తరణిచంద్రులరీతిఁ దడబాటు గొలుపఁ

( 637. శత్రునగరప్రాప్తిక్రమము. దుశ్శకుననిరీక్షణాది. )

బురము వెల్వడి శత్రుపురముపైఁ గదలి
యరుగుచో దుర్నిమిత్తాళిఁ గన్గొనుచు
నరుదంది కోపంబు నలవు రెట్టింపఁ
బరకాలుపురవరప్రాంతంబుఁ గదియఁ
బ్రియురాలిఁ గనుఁగొన్న ప్రియునిచందమున
భయమేది యప్పుడాపరకాలు సేన

పదిలమై చోళభూపతి పరాంధునికి
యెదురుగాఁ జనుదెంచి యొలగోలు సేయ
నిరువాగుఁ గదిసి రయ్యెడ మింటనుండి
సురలు నచ్చరులునుం జూచి యగ్గింపఁ 9240

( 638. ఉభయపక్షసైనికసమయుద్ధవర్ణన క్రమము. )

గరియంత కరియంత కరియునుం గరియు
హరిసాది హరిసాది హరియును హరియు
రథియును రథియు సారథియు సారథియు
రథమును రథమును రాజును రాజు
భటుఁడు భటుండు సుద్భటప్రవృత్తి దిశలు
పెటులంగ మెఱసి యభేద్యమైపోర
నప్పుడు వివిధచిహ్నంబులతోడ
నొప్పారుబిరుదగాహత్తులు గొలువ
సాహసాటోపుఁడై చతురంగతురగ
వాహుఁడై పరిపంథిపై వస్వతుండు 9250

( 639. పరకాలకృతచోళసైనికనాశభంగాదివర్ణనము. )

అరుదెంచి విలయకాలార్కుచందమున
సరిసేన కుతికి మిన్నగలఁ బెల్లార్చి
యుడివోసి పెనుమంట లుడువీథి గెంట
నడిదంబు ఝళిపించి హరులఁ జక్కాడి
శిరములఁ దెగటార్చి శిర లుత్తరించి
కరిబృందములఁ ద్రుంచి కరములఁ ద్రెంచి
గొడుగులఁ గెడపి ముక్కలు చక్కఁజేసి
పడగలు చించి భూపతుల గాలించి
రథుల ఖండించి నారథుల తుండించి
రథముల నుగ్గాడి రథ్యాళిఁ జదిపి 9260

శరములు నుఱుమాడి చాపము ల్ద్రుంచి
ధరణీశవరుల నెంతయుఁ బోఱఁ జమరి

( 640. యుద్ధభూమిరక్తప్రవాహవర్ణనప్రస్తావము. )

కరవాళధార నీగతిఁ జిత్రగతులఁ
బరవీరబలములఁ బఱపె నవ్వేళ
నొఱఁగురక్తంబులు తోయపూరములు
శరము లండజము లాస్యములు తామరలు
కనుగవల్ తొగలు మీఁగాళ్లు తాబేళ్లు
మినుకారు నెఱికురుల్ మిండతుమ్మెదలు
కరటితుండములు నక్రములు కంఠములు
దరములు చామరల్ తరచైన నాచు 9270

ఘనశతాంగములు నక్రములు చక్రములు
పునుకలు వరహంసములు గాఁగ నొప్పు

( 641. చోళరాజసేనాభంగక్రమము. భూతగణసంతోషవర్ణనము. )

వడిఁ జోళవిభుసైన్యవనజాకరంబుఁ
గడిమిమైఁ బరకాలగంధసింధురము
బలువిడిఁ జొచ్చి యుద్భటకరస్ఫూర్తిఁ
గలఁచి పంకముసేసి కలగుండువఱప
మెత్తనిమాంసంబు మెదడునంజుచును
నెత్తురు పునుకగిన్నెల ముంచి త్రావి
పూని యాపరకాలుఁ బొగడుచుఁ బ్రేమ
నానంద మాడుచు నలరె భూతములు 9280

కర ముగ్రముగఁ జోళకాంతుఁ డవ్వేళఁ
బరువడిఁ దనవెన్నుబలమును దాను
బొట్టమైఁ బరకాలుఁ బొదివి పేచుట్టు
ముట్టె యందఱు నొక్కమొగిని బెల్లార్చి

( 642. నానావిధాయుధపరిగ్రహణకథనము. సింహగజపతనదృష్టాంతము. )

పరిఘగదాకుంతపట్టసప్రాస
పరశుతోమరభిండిపాలముఖ్యముల
నొక్కట నిగుడింప నొకయింతయైన
లెక్కసేయక యవలీల నామేటి
తరవారిఁ బెరవారి తళుకుగైదువులఁ
బోరిఁబోరి నింతింతపోడులు గావించి 9290

దనుజులమీఁద నందకపాణి గదియు
ననువున నాకొన్న హరికిశోరంబు
కరిసమూహములపైఁ గనలి లంఘించు
కరణిఁ దద్వైరిచక్రముమీఁది కుఱికి
శిరములు డెందముల్ చెవులుఁ జెక్కులును
గరములు కంఠముల్ కౌనులు బరులుఁ

( 643. పరకాలపరాక్రమశౌర్యవైఖరి. విజయప్రాప్తిక్రమవర్ణనము. )

దొడలు జానువులు లేదొడలుఁ బాదములుఁ
దొడవులు శిరలుఁ గైదువులు నొక్కటను
దుత్తునియలు సేసి దుర్దాంతవృత్తిఁ
గత్తికొక్కొక్కకండగాఁ జెండివైచి 9300

కలివేళ వరతురంగము నెత్తి జగతి
ఖలులపై మిట్టించు కల్కి చందమున
గురుతరనిజవాహఖురపుటాగ్రముల
నరిబలంబులనెల్ల నణఁగఁద్రొక్కింప
మొనచెడి సంగ్రామమున నుండ వెఱచి
చనియెఁ జోళుండు యోజన మోహటించి
యీరీతి దెసచెడి యేతెంచి మదిని
గూరినలజ్జచేఁ గుంది లోలోన

యకట! యీజగతి నోహరిని సాహరిసి
యొకఁడు నాతోఁ బోరనోపునే పోర
మఱి తనసరివారుమాత్రంబె కాక
పఱచనిసాటులఁ బఱచె నెందియును

( 844. చోళరాజకపటోపాయ కథనము. పరకాలతో స్వసంతోషప్రకటనము.
స్వాపరాధక్షమాపణా ప్రార్థన. కమలాంబుగ్రహోక్తిని [illegible]. )

గెరలి క్రమ్మఱఁ బోయి గెలిచెదనన్న
దురమున వీఁడసాధ్యుఁడు దేవతలకు
నని కపటోపాయ మాత్మఁ జింతించి
యనయంబు హితవరు లగువారిఁ బిలిచి
యని మొన నాతోడ నరిదండధరుఁడు
మొనసి చేసినకయ్యమునకు మెచ్చితిని
ఒకసీమ యేలుచున్న తానెంత
సకలభూమియు నేకచక్రంబు గాఁగ 98

నేలుచున్నట్టి యేనెంత తలఁప
నీలీల బవరాన నెదిరి నాతోడ
నడిగలబంటైనవాఁడు వో బంటు
కడపట నిలచీనిఁ గన్నది తల్లి
యని నంతసించువాఁడై వేగ మీరు
చని పరాంతకునకు సమ్మదం బొదవఁ
దనశౌర్యమునకు నెంతయును మెచ్చితిని
మును సేయు నపరాధమును దాళుకొంటి
నెన్న మున్నిటికంటె నిపుడు గాఁగ
మన్నింతు నని చెప్పి మఱియు నేమైన 9880
నడిగినమాటవట్టతనికి నిచ్చి
యెడపక తోడితెం డిపుడె నాకడకుఁ

జోఁడిమి నావీరపుంగవు నిటకు
నేఁడె తోతెచ్చువానికి మెచ్చుగలదు
అనుఁడు వారాకమలాపూర్ణపురికిఁ
జని కొల్వులో శత్రుశమను నీక్షించి

( 645. చోళరాజమనః సంతోషకథనాది. పరకాలదర్శనాపేక్షానివేదనము. )

కరములు మొగిచి కొంకక చోళభూమి
వరుఁడు పల్కిన సత్యవాక్యంబులెల్ల
వినువారి వీనుల విందులు గాఁగ
వినయంబుతోఁ జిత్తవృత్తి యెఱింగి 9340

మగఁటిమిఁ బరకాలుమనసు రంజిలఁగఁ
దగవు దీపింప నెంతయు నమ్మఁబలికి
నీసాహసములకు నృపుఁడు మోదించెఁ
జేసినచేతెల్ల జెల్లెను నీకుఁ
గనుగవ నినుఁ జూచు కాంక్షయే కాని
మనుజేశుతలఁపున మఱియొండు లేదు
నిచ్చలంబున నీవు నృపవరుకడకు
విచ్చేసి క్రమ్మఱ విచ్చేయు మనుఁడు
సమ్మదంబున శత్రుశమనుఁ డామాట
నమ్మి వారికి కట్టణములు పాలించి 9350

( 646. పరకాలకృతచోళరాజసమీపాగమనము. )

పరిమితపరివారపరివృతుం డగుచుఁ
గరమర్థిఁ జోళేంద్రుకడకు నేతెంచి
మునుకొన్నమై గాయములు లెన్నఁ గాంచు
కొనుమని యొసఁగులాగున నిమ్మపండ్లు
కానుక యొసఁగి ముంగిట నిల్వఁ జోళ
భూనాథుఁ డావీరపుంగవుం జూచి

సకలరాజ్యంబు నిశ్చలత నిన్నాళ్ళు
తెకతెరబుకొ్కాది దినియుండునీవు
కడపట నను( బాధ(గనవచ్చునప్పు
డుడుగరతరమైన యొకపచ్చడంబు 9860
చెల్ల(బో తనకు( దెచ్చెదనంత లేదె
నల్లనిచేత మానకపోయి తెపుడు
తనసీమ వెనుకముందరిధనం బెల్ల(
బునుగక యీక్షణంబున( బెట్టి పొమ్ము

( 647. చోళరాజకృతధననిబంధనప్రకారము. రాజధనప్రాప్తివిషయక సమాలోచన. )

అనుచు ధనాతురుండై చోళనృపతి
తనమంత్రివరుల కాతని నప్పగించి
యితనిపై( గలధనం బెల్ల నీక్షణమె
యతివేగమున( గొను( డని నియోగించి
యరిగె( బురంబున కంత నాసచివు
లరిదండధరు( జూచి యాత్మ( జింతించి 9870
యిప్పుడు మన చేతి కీతనిధనము(
దెప్పించుమంచు( బార్థివు( డిచ్చి యరిగ
నిట్టులంబుగ మన మీతని నడ్డ
పెట్టి మిక్కిలి గాసిపెట్టితిమేని
ధన మింతలోనె యీతనిచేత లేదు
పనివడి యీతడు పడుపాటు చూచి
ముప్పిరి( గొనుదైన్యమున( బూట దాట
చెప్పెదువారు చర్చించిన తేరు
ఇతని( దోకొనిపోయి యిత( డున్నపురిని
ఇతనిబంధువ్రాత మెల్ల నీక్షింప 9880

సదర వై చినసౌమ్య హారువగు నిచటఁ
బదరెన నింతయుఁ బనికిరా దనుచు

( 648. పరకాలకృతదినత్రయోపవాసప్రకారము. )
ధనాతురచోళరాజ దుష్టవృత్తాంతము.

దనుజులు మును వాయుతనయునిఁ బట్టి
కొనిపోవుగతిఁ జోళకులనాథుభటులు
పరకాలుఁ జేలెదుపట్టణంబునకుఁ
దిరుగఁ దోకొనివచ్చి ధిక్కరింపుచును
అచ్చటఁ గేశవుం డనుపేరఁ బరఁగు
పచ్చవిల్లునితండ్రి భవనంబునందు
నాఁగిన దివసత్రయంబు నొక్కింత
లోఁగక శత్రుకాలుండు డెందమున 9390

నరయ ధనాతురుం డగుమానవునకు
గురువు బంధువులు నెక్కడువారు గలరె
యీరానిమాటవ త్లెన్నెని నొసఁగి
రారమ్మటంచుఁ జేరఁగవచ్చినంతఁ
గల్లలాడుట నరకముత్రోవ యనక
చెల్లఁబో తనుఁ గాసిచేసి పట్టించె
మతిఁ దలంచిన మదోన్మత్తులౌ భూమి
పతులకు సత్య మెప్పట్టునం గలదె ?
వివరింపఁగా భూమివిభులలోపలను
చెవి చేద బిసిడి దుశ్శీలవర్తనుని 9400

దుష్టు జూదరి ధనాతురు నవివేకిఁ
గష్టు వైష్ణవనిందగావించువానిఁ
గన్నమాత్రనె దినకరు విలోకించి
వెన్ననినామంబు వినుతింపవలయు

నిన్నియు నెఱిఁగి నే నీదురాచారి
యున్న చక్కటికి రా నుచితమే యనుచు

( 649. సహస్రబ్రాహ్మణభోజనవ్రతభ్రంశత్వవర్ణనము. )
కాంచీవరదరాజస్వప్నప్రత్యక్షాగమనకథనము.

సారసోదరభక్తసాహస్రమునకు
నారగింపంగఁ జేయఁగలేనికతన
నుపవాసనియతుఁడై యుండె నుండుటయుఁ
గృపతోడ శ్రీహస్తిగిరిభూవరుండు 9410
చనుదెంచి యారేయి స్వప్నంబునందుఁ
దనదివ్యకరములఁ దను వొయ్య నివిరి
వలమురి యమృతంబు వారిచేసేత
జలజాతయుగళిమైఁ జల్లగాఁ దుడిచి
తనకటాక్షామృతధారలచేతఁ
దనివినొందించి యాదటనుండ నేలఁ
జేకొని యేగడించినధనం బెల్ల
నీకుఁ గాకేరికి నిర్మలాచార!
సిరిమించ నీవలసినధనం బిత్తు
నరుదెమ్ము కాంచికి ననుమాన మెడలి 9420

( 650. కాంచీనగరప్రాప్తివర్ణనము. )

యన విని మేల్కాంచి యలవారిఁ గాంచి
వినుఁడు కాంచికి నాదు వెంట నేతెండు
ప తేర మీధనం బెంతయు నిత్తు
దైతేయరిపునాన తప్పదు వినుఁడు
అనుఁడు చోళామాత్యు లక్కజ మంది
యనయంబు హర్షించి యాత్మ నొండొరులు
ఎప్పు డీఘనుఁ డీదికేశుపై నాన
తప్పఁడు తలమీఁదఁదారివచ్చినను

అనుచు నాత్మల నొచ్చి లట్లకా కనుచు
ననయంబు హర్షించి యతనిఁ దోకొనుచుఁ 9430

( 651. పరకాలయోగికృతవరదరాజస్తోత్రప్రకారాది. )

జనిరి కాంచికి నంత శాత్రవాంతకుఁడు
తనదుమంగల నొప్పు దైతేయనరదు
వనమాలి గజరాజవరదు నావరదుఁ
గనికరములు మోడ్చి కనికరం బొదవ
వనజలోచన ! భక్తవత్సల ! శౌరి !
దనుజారి ! హరి ! తండ్రితండ్రి ! నాంతండ్రి !
యనఘశరణ్య ! నీ వానతియొసఁగు
పనివింటి నిచటికిఁ బనివింటి నిన్నుఁ
గనుఁగొంటి లోఁ గలఁకలు వీడుకొంటి
వనజాక్ష ! యిందిరానల్లభ ! శౌరి ! 9440
జననాథువిత్త మేసరవిమోఁ దీర్చు ?
ఘనమైన యీబాధ కడతేరు టెట్లు ?

( 652. వేగవతీనదీతీరస్థితధనరాశిస్వీకరణాజ్ఞాప్రకారము. )

లానతి మ్మన విని యనుకంపతోడ
శ్రీనాథుఁ డతని వీక్షించి యిట్లనియె
వరవేగవతిచెంత దారును నీవు
సరియూఁక నుండెడుసమయంబునందుఁ
దనదుపేరరుళాలదాసనామమున
నానరియేఁ దగవరియునుఁ బోలె నటకు
వాళికుగతి వత్తు నప్పుడు నన్నుఁ
జాలింపు నిను నాఁకనలుపువారలకు 9450

( 653. పరకాలయోగిసంతోషవర్ణనము. వేగవతీతటప్రాప్తిక్రమము. )

ధనధాన్యములకుఁ జిత్రంబుగా నేన
మనవారివళుకు సమ్మతినె తీర్చెదను

నావుఁడు మదిలోన నమ్మి యాయోగి
యావేగవతిచెంత కరిగి యట్లుండఁ
బరమప్రపన్నులపాలి యావేల్పు
పరకాలుమీఁది కృపారసం బొలయఁ

( 654. ధనసూచకపురుషవేషధారణాదిక్రమము. )

బసపుచుంగులతలపాగ నెట్టంబు
కసిబిసి మెసఁగు బాగాలవీడియము
మిన్నదేరెడుదొడ్డజెండనూలు మిగుల
వన్నియగల మాధవళిపచ్చడంబు 9460
దళసరియగు దేవదారుగంధంబు
వలకేలఁ గనుపట్టు వంకుటుంగరము
డొల్లుబోఁగులును గాటుకకప్పుదేరు
పిల్లిగడ్డము వడిబెట్టుమీసలును
నలవడ నాందోళికారూఢుఁ డగుచు

( 655. వరదరాజస్వీకృతవీరపురుష వాక్యప్రకారము. )
చోళసచివకోపప్రకారాదికథనము.

నలనాఁటిపూర్వికుఁ డగు పెద్దిరెడ్డి
యనఁగఁ బేరరుళాలుఁ డనుపేరఁ బరఁగి
చనుదెంచి వారున్న చక్కి కేతెంచి
యనుఁగుమల్లఁడిఁ గొన నాత్మబంధువులఁ
గనినకైవడిఁ బరకాలు నీక్షించి 9470
వడి నందలము డిగ్గి వచ్చి డెందమున
నుడుగనిప్రేమతో నుప్పరం బెత్తి
కన్నీరు దొఱఁగ నీగతి నుండనేటి
కన్న ! నీకని కూర్మి నందంద వగచి
మనుజేశుభటులు పల్మఱుఁ జోద్యపడుచుఁ
గనుఁగొన మున్నెఱుంగనివాఁడపోలెఁ

దవిలి యాతనిచెంతఁ దత్క్రమం బెల్ల
వివరించి యంతయు విని వారిఁ జూచి
యింతమాత్రమునకై యీనంశపతిని
ఇంతగాసింపంగ నేటికి వలదు 9480

తొలఁగుమటన్న మంత్రులు కోపగించి
యలరెడ్డిఁ జూచి యిట్లని రొక్కమాట
బలువుగా విడుమంచుఁ బలికెడుభక్తి
గలవాఁడ వైన వెగ్గలమైన ధనము
గలవాఁడ వైన నీగడును మాకొసఁగ
వలయు సొమ్మెల్ల నివ్వల నొప్పఁజెప్పి
తోకొనిపొమ్మన్నఁ దొలఁగ కారెడ్డి
యాకాఁపువారితో ననియె వెండియును

( 656. ధనవిషయకనీచవాక్యకథనము. )

గడపట మీకు నీఁగల్లుసొమ్మునకె
కడిఁదిసేయఁగ మీరు కర్తలుగాక 9490

పనిలేనిమాటలఁ బని యేమి యెంత
ధన మెన్ని కొలుచెంత ధన మెన్నికొలుచు
వీసము నొకగింజ విడుమని యనక
చేసేత మీ కొప్పఁజెప్పెద ననుచు
వినఁజెప్పి పరకాలు వెనుకకుఁ దిగిచి
కొని చెంత భటుల వే కొనితె మ్మటంచుఁ
దనదైనమాయ నుద్భవమైన కొలుచుఁ
ధనముఁ దెప్పించి యత్తఱిఁ దూము వ్రాని
కొలఁదిమీఱెనరాశిఁ గొనియున్నకొలుచుఁ
గొలుచునప్పుడు తేరకొనువారికెల్ల 9500

( 657. రామబాణదృష్టాంతము. పరకాలయోగిదాతవ్యధనవిషయక భాషణక్రమము. )

రాఘవకార్ముకప్రవిముక్తబాణ
లాఘవంబునఁ గరలాఘవం బెసఁగ
నిక్కుచు గోవిందునికి ననుమాట
యొక్కటి యందఱు నోలి నాలింప
సెలగని పలుమాఱుఁ జెప్పెదుపల్కు-
లలవిమీఱంగ నాదారకయుండఁ
గొలుచు ముంచుట పారఁగొలుచుట యొండు
దెలియఁగారాక యెంతేచిత్రగతుల
భారంబు లేకయు భారంబు గాఁగ
వారికిఁ గొలువంగవలసిన కొల్చు 9510
కొలిచి మూడలుకట్టు గుండులఁ దూఁచి
నిలువ పూజ్యముగ నన్నియును జెల్లించి
క్షితినాథుచే సొమ్ము చెల్లినందులకు
నితనికి నిప్పింపుఁ డిటఁ జెల్లుచీటి
యని చెప్పి పరకాలు నరకాలుముల్లు
గొనకుండ నతఁడుమైకొనుసొమ్ము దిద్ది
యతనిసమ్మతిఁ దొంటియావాసమునకు
నతులమోహనమూర్తియై యేగె నంత

( 658. చోళరాజమంత్రికృతధనధాన్యాదిస్వీకరణము. )
పరకాలప్రాప్తధనాగమనక్రమనివేదనము.

జననాథుమంత్రు లచ్చట నున్నయట్టి
ధనము ధాన్యము సమస్తము వేడ్కతోడఁ 9520
గైకొని పరకాలు గౌరవం బెసఁగఁ
దోకొని మిగుల సంతుష్టులై యరిగి

ధరణీశునెదుటఁ దద్ధనము ధాన్యమును
నరిదండధరు నిడి యాత్రమంబెల్ల
వినిపింప నాశ్చర్యవివశుఁడై నృపతి

( 659. పరకాలయోగికై భవవర్ణనప్రకారము. )

తనమదిలోన నెంతయు సంతసించి
తననిష్ఠఁ దప్పక తరవాత మనల
ధనము చెల్లించె నెంతటిఘనుం డనుచు
నపుడు భాగవతార్యుఁ డగుపరకాలుఁ
డుపవాసమున నాక నుండుట కలిగి 9530
పారంబులేని తత్పాపంబు వాయ
భూరుణీసురులకు దానంబు లొసఁగి
పగలేది మఱి పట్టభద్రచిహ్నంబు
లగుచామరలు ధవళాతపత్రములు

( 660. చోళభూపాలుసంతోషకార్యాదివర్ణనము. )

మొదలైన తనచిహ్నముల నెల్ల నొసఁగి
తుదలేనిప్రేమ సంతోషింపఁ జేసి
తమ కిడువెనక ముందరి ధనం బెల్ల
తమకు నొప్పయ్యె నుత్తరువు గా ననుచుఁ
జెల్లుచీటియు నిచ్చి చేచేత మేలు
కుళ్లాయి గబ్బాయిఁ గొమ్మంచు నొసఁగి 9540
యున్నాళ్ళకరంబు సనేకవై ఖరుల
మన్నింతు నని నీమ మఱియును నొసఁగి
యనిపినఁ బరకాలుఁ డనుమోద మెసఁగఁ
దనపురంబునకు సంతట నేగుదెంచెఁ
జోళుఁ డాధనముఁ గొల్చును సచివులకుఁ
గేలిమై నొప్పరికింప మాధవుఁడు

నాయెడ మాయామయం బైనవాని
మాయ గావింపుచు మగుడఁ గైకొనిరె

( ౬౬౧ పరకాలయోగిమాయాస్వరూపవర్ణనము. )
ఇంద్రజాలదృష్టాంతకథనము.

నన్నేలఁ జోళజనాధీశ్వరుండు
నివ్వెఱపడి మంత్రినికరంబుఁ జూచి ౯౫౫౦
పరకాలుఁ డెటువంటి పరమమాయావి
ధర నెట్టివైష్ణవోత్తముఁడు జన్మించె
మనయాజ్ఞ కులికి నేమముతోడ మగిడి
చనుదెంచి మననిల్వసల్వలు మనకు
వాలాయ మొప్పించువాఁడనుం బోలె
జాలి నీగతి నింద్రజాలంబు సేసె

( ౬౬౨. మాయాధనప్రదానకథనాది. )

మాయాధనం బిచ్చి మగుడంగ దానె
మాయ గావించె నీమాయలవాని
నేరీతి నమ్మెద మిటువంటివాని
నేరీతి నాజ్ఞ సేయింపంగవచ్చు ౯౫౬౦
నితఁ డిచ్చుధన మేల యితఁ డేల తుదిని
యితని కిచ్చినసీమయెల్ల గైకొనుఁడు
ఇతనిఁ దత్పురి నుండనీక మీ రరిగి
యతివేగమున నెట్టకైనఁ బొమ్మనుఁడు

( ౬౬౩. భూపాలాజ్ఞానివేదనప్రకారము. పరకాలయోగికార్యకథనాది. )

అనిన మంత్రులు తదీయాజ్ఞఁ దత్పురికిఁ
జని పరాంతకునకు కీసరణిఁ దెల్పుటయుఁ
గొదుకక మీతోడికుసిగింపు చాలుఁ
బదివేలు వచ్చె మీపట్టణం బిదియె

యని వారి వీడ్కొని యనురాగవల్లి
ఘనతమై ననలొత్తఁ గౌరవవల్లి 9570
కడకేగి తమసేయుక్రమముఁ దత్క్రమముఁ
గడముట్టఁ దెలిపి భూకాంతు నెగ్గించి
యిచ్చోట నుండరా దిఁక మీఁద మనకు
నెచ్చోటికైన నింకేఁగంగవలయు
మనుజాధినాథుఁడు మాటపట్టుడిగి
తనసీమయంతయుఁ దానెకైకొనియె

( ౮౬౪. సహస్రబ్రాహ్మణభోజనసత్కార్యమహిమవర్ణనము. )

నజాతంత్రి భక్తసాహస్రంబు మున్ను
భుజియింప కటమున్న భుజియింపమెపుడు
విష్ణుఁడు సాక్షిగా వెలయ నేఁ జేయు
వైష్ణవార్చన విడువఁగరానివ్రతము 9580
విరికేఁగా ధరావిభునిఁ గ్రమ్మఱను
జేరి కొల్చెద నన్నుఁ జేపట్ట డతఁడు
చేపట్టి యతఁడట్లు సేసినఁ దుదిని
భూపాలునర్థ మీఁపోఁడమి నొసఁగ
హరిభక్తులకు నది యహరంబు గాదు
హరినీలవేణి యెట్లంటేని వినుము
తుది రాజవిత్త మెందులకంటె దోష
మొదవించు ననుచు మున్నొగి సప్తమునులు
ననుపమక్షామంబునందుఁ బీమంగుఁ
దినఁగోరి యది రాజు తెలిసి కాఁపిడిన 9590

( ౮౬౫. ధర్మాధర్మగహనస్వరూపవిషయపూర్వవృత్తకథనాది.
ప్రత్యాచరణోపాయవర్ణనము. )

జడిసి వారదియు రాజద్రవ్య మనుచు
విడిచి రాగమములు వివరించునట్లు

కావున నెన్నిసంగతుల వైష్ణవుల
కావిత్త మొసఁగుట యర్హణంబు గాదు
తనుగూర్చి చేయు సధర్మంబు ధర్మ
మనికాదె మున్ను శ్రీహరి యానతిచ్చె
నెన్నంగఁ బాపంబు నెసఁగించు హింస
జన్నంబునందుల సత్కర్మమైన
పదవున నేనును వైష్ణవార్థముగఁ
దొడరి దొంగిలిన నేదోషంబు లేదు 9600

ఈయుపాయము దక్క నీవ్రతంబునకు
నేయుపాయంబు లే దెలనాఁగ యేను
జోరత నవనీతచోరకింకరుల
కారగిం పొవరింతు నని నిశ్చయించి

( 886. పరకాలయోగికృతచౌర్యకార్యనిరతత్వక్రమము. )

తనుఁబోలు కోదండధారు లైనట్టి
యనుచరు లొకవేయి యుండంద గొలువ
మొగదారి హరి గయుమొడ మొట్టిగుదియ
చిగురులు వెడల గీల్చినకోరసికయుఁ
జేయుమ్మ నెకవారుచెప్పులు రాగి
చాయలు దేరునచ్చపు సీలిదట్టి 9610

మొలవంకియును గొనముక్కుతో నొరయ
బలువుగాఁ బెట్టిన పట్టెనామములు
నిసుముఁ గన్నపుగత్తిమొడదట్టిలోనఁ
బొసఁగిన దివ్యార్ప్యబువ్వులకోవి
తలముళ్లు చొక్కనిద్దపుగద్దగోరు
బలపంబు బదనికల్ బంతికత్తెరయు

( 867. మహారణ్యస్వరూపవర్ణనము. వనమృగనామాదికథనము. )

నలవడఁ దనప్రియురాలితోఁగూడ
వెలువడి వాహినీవిపినము ల్గడచి
శరధిచెంగట మత్తచమరసారంగ
శరభశంబరఖడ్గశార్దూలశల్య 9620

గండభేరుండగోకర్ణభల్లూక
శుండాలగండకసూకరప్రముఖ
బహువిధవిహగసంభ్రమనాదసింహ
కహకహాద్భుతమహాగహనంబుఁ జేరి
ఘనమైన కోనలంకలపట్ల కొంకు
లోనరించి తనదునెయ్యురుఁ దానుఁ గూడి

( 868. బ్రాహ్మణభోజనార్థసంపాదితద్రవ్యస్వరూపవర్ణనము. )

సరవిమై వైష్ణవసాహస్రమునకుఁ
గరమొప్ప పెనుమాళిగలు ఘటింపించి
యటకు మిక్కిలిచేరు వగుపయోరాశి
తటసమీపమున నిత్యంబు నోడలను 9630

బచ్చకప్పురమును బట్టుబట్టలును
బచ్చికస్తురి మేల్మిపసిఁడియిట్టికెలు
మణులుఁ జంద్రాననామణులుఁ బటీర
కణములు మొదలుగాఁగలువస్తువులు
నిరవొంద నెన్నికకెక్కుబేహారులు
హారులదంతులతోర హత్తుగాఁ దెచ్చి
యరానించి బేహార మాడంగ నటకు
వానికై చనుదెంచువారల వానిఁ
బూని బేహారమాడి పోవువారలను
బోనీక మీఁద కాఁపులుపెట్టి కాచి 9640

( 669. నానావిధచౌర్యప్రకారవర్ణనము. )

తెరువడ్డగించి గద్దించి ధైర్యంబు
చెరలంగఁ గొట్టి చేతిని యూఁదికొనుచు
వరుస నొక్కెడఁ జెరువరులచందమున
నరుగుచుం గనమసందరికట్టికొనుచుఁ
గిదుకక మొగమెఱింగినవారిఁ జేరి
పొదివిపట్టుచు నోళ్ల బొటుల ముందరిగి
గొబ్బునఁ దొలఁగఁ దోఁకొనిపోయి చెట్టు
గబ్బువీలగఁ గట్టుకాసెలం గట్టి
యదయులై కలవెల్ల నపహరింపుచును
నదయులై వెండియు సాగనంపుచును 9650

అరుదైన నగరంబులందు వెండియును
బరదేశముల నెల్లపగిది దిండుగను
బెల్లుచుట్టిన పెదపెదముడాసులును

( 670. నానావిధద్వీపనివాసిజనద్రవ్యాపహరణక్రమవర్ణనము. )

డొల్లుబొంగులును నీటుగఁ బొందుపఱచి
పొదిగల్లు నసిమల భుజములం బూని
వదలుగా రింజెముల్ నలెవాటువైచి
కొంకక జీనిపై గోవరకంగు
లంక యయోధ్య మలాక యీడాము
మొదలై నదీవులు మునుకొనివచ్చి
యదనఁ జేహారంబు లాడంగఁ జూచి 9660

మంచిరత్నములు హేమము లున్నయట్టి
నంచులు వారున్న నంచులు దెలిసి
నవరేయిమైఁ బొక్కు చల్లి సంధించి
తివుటమై దొంగిలితెచ్చుచు మఱియు

సునుపులు పెట్టుచు నొదిఁగి డాఁగుచును
గనుమలు గట్టుచుఁ గనుపుఁ గొట్టుచును
గబ్బునం బురములు గన్న పెట్టుచును
సుబ్బికం బెరచోటఁ బొప్పువైచుచును

( 871. పరకాలయోగికృతషడ్రసభోజనదానవైభవవర్ణనము. )

దెచ్చినధనమెల్ల దినదినంబునకు
వచ్చిన యలభాగవతులకు మఱియుఁ 9670

జనుదెంచునట్టి వైష్ణవులకు భక్తి
పెనుపొంద షడ్రసోపేతంబు గాఁగఁ
బొదలుచు నారగింపులు సేసికొనుచు
మదనమన్మథుఁ దనమైఁ బాదుకొల్పి
యీరీతి దొంగిలునెడ శంఖచక్ర
ధారులఁ దిరుమణి ధరియించువారిఁ
దడవక కన్న నెంతయు భక్తి సేసి
యుడివోనికూర్మిమై నుపచరింపుచును
బరమభాగవతసంభజనప్రియుండు
పరమయోగీంద్రుఁ డాపరకాలయోగి 9680

తనసేయు వైష్ణవోత్తమ పూజకొఱకు
ననయంబు నవసరమై యొక్కనాఁడు
గగనంబు భువి నీలికడవచందమున
మొగులుచేఁ గారుక్రమ్ముచునుండు రాత్రిఁ
బనిబూని యొకమహాపట్టణంబునకుఁ
జని యందు నొక్కవైష్ణవు నింటిపంచ
నొదిగి ప్రముచ్చిలఁబొంచియున్న యావేళ
వదలక జడివట్టి వర్షించుచుండ

( 672. వైష్ణవపాత్రాపహరణక్రమము. సద్వాక్యశ్రవణవృత్తాంతము. )
పరకాలభయప్రాప్తిక్రమము

నా వైష్ణవోత్తము నంగనారత్న
మా వేళ పతిభోజనానంతరమున 9690

లీలమై మగనిపళ్ళెరము కెంగేలఁ
గీలించి యపుడు వాకిటి కేఁగుదెంచి
తడియంగ నోడి యంతనవ్వంగి వంగి
కడపముంగిట నిల్చి కడిగి చల్లఁగను
గప్పినచీఁకటిగమి విచ్చిపాఱ
నప్పుడా ధళధళక్కన మెఱయుటయుఁ
గని పరకాలుఁ డాకల్యాణిచేత
నొనరినపాత్రంబు నొడిసి కైకొనిన
నుదిరి యస్మద్గురుభోన్నమో యనిన
సుదతివాక్యము చెవిసోఁకి సోఁకుటయు 9700

నావాక్య మపుడు విన్నంత నీసొమ్ము
శ్రీవైష్ణవులది క్రముచ్చిలితి నటంచుఁ
దలఁకి కెంగేలిపాత్రము వారికడప
దలకడఁ బెట్టి యెంతయు భయంపడుచు
నీవేళ వీరలహృదయంబులందు
నేవిధి నుండునో యెఱిఁగెద ననుచుఁ
బొంచి యాపంచఁ జప్పుడుసేయకున్నఁ
జంచరీకాలక చని లోననున్న

( 673. విప్రదంపతిచింతానుతాపకథనాది. భాగవతకైంకర్యవిఘ్నవిషయక
చింతాదివర్ణనము. )

ప్రియున కీసరవిఁ జెప్పిన నాత్మఁ దెలిసి
ప్రియురాలి డగ్గరఁ బిల్చి యిట్లనియెఁ 9710

బనుపడ వినఁగదే పరకాలనాము
ఘనుఁడు భాగవతకైంకర్యతత్పరుఁడు
శ్రీవైష్ణవార్థమై చేసె నీరీతి
నావైష్ణవుఁడు మనముగు మెఱుంగమిని
కైంకర్యమునకు విఘ్నము సేయవలవ
దింక భాగ్యముఁ జేసి తీవు నాపుడును
గొంచక తొంటిబాగున నావధూటి
సంచరింపుచు నలచక్కి కేతెంచి
తనదుముందరిదెసఁ దనరుపాత్రంబుఁ
గనుఁగొని యిటకు నేగలినచ్చె మగిడి 9720

( 874. బ్రాహ్మణదంపతివాక్యప్రకారము. హరిభక్తకైంకర్యప్రశంస. )

యనుచు నచ్చెరువంది యాత్మేశుకడకుఁ
జని పళ్ళెరం బున్నసరవిఁ దెల్పుటయు
నామహాత్ముఁడు పాత్ర మందెడునప్పు
డేమనియంటి నాకెఱిగింపు మనినఁ
నెలనాగ పల్కె నయ్యెడఁ జోరుఁ డనుచుఁ
దలఁకి యాచార్యులఁ దలఁచితిఁ గాని
పదరి యే నెగ్గుగాఁ బలుకుట లేదు
ఇదియుఁ దప్పిద మోట మెఱుఁగలేనైతి
ననిన నాభాగవతాగ్రణియింతి
కనియె నీ వప్పు డ ట్లననేల యనుచుఁ 9730
గనలి భాగవతకైంకర్యవిరోధ
మొనరించి తనుచుఁ బెట్టురరంగఁ బలికె
బ్రహ్మదిశాపముల్ పాపంగవచ్చు
బ్రహ్మహత్యాదులఁ బాపంగవచ్చు
నారయ శ్రీవైష్ణవాపచారంబు
నేరీతి నైన మాయింపఁగా వశమె?

( 675. పరకాలయోగికృతబ్రాహ్మణపూజాస్తోత్రాది. )
స్వాపరాధక్షమాపణప్రార్థనం.

యని యిట్లు కోపింప నావాక్యసరణి
విని పరాంతకుఁడు వేవేగ నేతెంచి
యామహాయోగీంద్రు నడుగుల కెరఁగి
వేమాఱు నుతులు గావించి కేల్మోడ్చి 9740
సమకూర్చు నాయపచార మీవేళ
క్షమియింపు మనిన నాసర్వజ్ఞమూర్తి
యాతనిఁ బరకాలుఁ డని యాత్మఁ దెలిసి

( 676. పరకాలయోగివిషయకప్రణామాది. )

యాతతభక్తిచే నతనియంఘ్రులకు
వినతుఁడై నుతులు వేవేలచందముల
నొనరింపఁ బరకాలయోగి చంద్రుండు
నాపనికై నచ్చు నాతల్లి నేర
మేపారఁగా క్షమియింపవే యిప్పు
డని విన్నవించి చయ్యనఁ బాళెమునకుఁ
జని సంతతంబు వైష్ణవపూజనంబు 9750
నెడఁబడకుండంగ నేకాగ్రబుద్ధి
నడుపుచునుండె వైష్ణవ దేవుఁ డనుచు

( 677. గ్రంథసమర్పణక్రమము, కవివంశప్రశంస, నిజకావ్యమహిమవర్ణనము. )

నలమేలుమంగకు నమలాంతరంగ
కలిసీలవేణికి నబ్జపాణికిని
అతిలోకపతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళపాకన్నయార్య

తనయ తిమ్మార్య నందనరత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త 9760

మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాద సంసేవకాబ్జ
సదనానధూాలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితం బైన షష్ఠాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## సప్తమాశ్వాసము.



( 678. శ్రీదేవీవైభవప్రశంస. శ్రీవేంకటేశస్మరణాది. )

[ ద్విపద ]

హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
ముతిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యవధారు వరదానశీలి! 9770

( 679. భాగవతార్చనవిషయకహరిప్రీతివర్ణనము. )

ఆసేయు భాగవతార్చనంబునకు
శ్రీసతీవిభుఁడైన శ్రీరంగశాయి
మెచ్చి రిక్కలతేజిమీఁద సొంపారు
లచ్చితోఁ గూడ నుల్లము పల్లవింప
నారూఢుఁడగుచుఁ దా నలపూజ చూడఁ
గోరి నిత్యులుఁ బరాంకుశయోగిముఖులు
జలజసంభవపాకశాసనాదులును
గొలువ నభోవీథిఁ గొని యేగుదెంచి
సరభసగతితోడ శరధిచెంగటికి
నరుదెంచి గరుడవాహన మంత నిలిపి 9780
కలిమిపూబోఁడి మొగంబు నెత్తమ్మి
మెలపునం జూపుతమ్మెద లెదురొత్తనఁగఁ

దనభక్తవరుఁ బరాంతకుఁ గేలఁ జూపి
యనియె నెయ్యమును దియ్యమును రెట్టింప
నాచెంత నొప్పు మహాటవిలోనఁ
గాచి పాంథులచేతఁ గలవెల్ల దోచి
సతతంబు వైష్ణవసాహస్రమునకుఁ
గృతనిష్ఠతో నారగింపంగఁ జేసి
మరికానితనకూర్మి మగువయుం దాను
దెరవ భుజింపఁడే తెఱఁగునన్నైనఁ 9790

( 880. హరిభక్తపూజోపచారాదిశైథిల్యకథనము. )

వరకాలుఁ డనుపేరి పరమభాగవతుఁ
డరయ మిక్కిలి నాకు నాత్మభక్తుండు
ఎడపక యిట్లు పెక్కేండ్లనుండియును
నడుపుచునుండు వైష్ణవపూజనంబు
వాఁడువోకంటె? యెవ్వరు తెరువరులు
నేఁడు రాకున్న నూనినచింతతోడ
మదిలోల నెప్పుడు మద్భక్తపూజ
వదలంగలేక యవ్వల ఖిన్నుఁ డగుచుఁ
గొమ్మ యూపెనురావి కొమ్మల మీఁది
కిమ్మల భటుల నెక్కించి యామీఁదఁ 9800

గడుగోపమున మోవి గంపింప హరిగె
పుడమిపై నూఁది మూపున వాలు సేర్చి
తెరువున నెవ్వ రేతెంతురో యనుచు
సురకగ నెదురుచూచుచు నున్నవాఁడు
కనుఁగొన మత్పూజకంటె మద్భక్త
జనులకుఁ జేయుపూజనలే ప్రియంబు

( 681. హయారూఢభగవదావిర్భావప్రకారవర్ణనము )

లటుగాన నీవైష్ణవాగ్రణి నిత్య
మిటు సేయుపూజకు నేను మెచ్చితిని
అతనిమనోరథం బంతయు మనము
హితమతితోడ నే డీడేర్పవలయు 9810

నని వైనతేయుని హయముఁ గావించి
మొనయ నిత్యుల నరాకృతులఁ గావించి
తనదైన యాజ్ఞచేఁ దక్కినవారు

( 682. మనుష్యదంపతిరూపపరమపురుషభూషణాలంకారాదివర్ణనము. )

మనుజభావము నొంది మహిఁ గొల్చి నడువ
హేమగర్భునిఁ బురోహితునిఁ గావించి
తామిరువురు మర్త్యదంపతు లగుచు
నగణితసకలభూషాన్వితమూర్తు
లగుచుఁ దత్కనటహయంబుపై నెక్కి
పసిఁడి వింజామరల్ బంగారుగొడుగు
లసమానమణిమయహేమపాత్రములు 9820

మొదలైనసిరులచే మొనసి యెంతయును
బదిమాఱువన్నెలం బరఁగుతామరలు
గలిగి యేతెంచుగంగాప్రవాహంబు
చెలువునఁ దనదైనసేన యేతేర

( 683. వీరభటపరకాలయోగిసమాగమనము. )

నాచేర్వ భటులతో నలపరాంతకుఁడు
గాచినక్రోధచక్కటి కేగునపుడు
మును రావి నెక్కి యిమ్ములనుండి యనువు
గనుఁగొను నలపరకాలకింకరులు

పొలయుకంజాప్తదీప్తుల కెంతె మాఱు
మలయుతేజములఁ బల్మరుఁ దళ్లుకొనుచు 9830
ననతిదూరంబున నావచ్చుసేనఁ
గనుఁగొని పరకాలుగాంచి యిట్లనిరి

( 684. భాగవతకైంకర్యానుకూలధనప్రాప్తివిషయకసంతోషక్రమము. )

మునుకొని యొకపెనుమూఁక యేతెంచె
వెనుక నెన్నఁడు కన్న విన్నదికాదు
మదిఁ గొంకు లేకయే మఱి చాలు గట్టి
యదె చేరవచ్చుచున్నది మహాసేన
యననేల పలుమాట లంతయు నెంత
ధనముకప్పది యొకింతయుఁ బొల్లులేదు
మనము భాగవతసమర్చనం బనిశ
మొనరింప నందులో నొకసొమ్మె చాలు 9840

( 685. పరకాలయోగికృతధనాపహరణకార్యయత్నాది. )

నన విని మోదించి యరిదండధరుఁడు
తనలోన నలరుసంతస మిగురొత్త
ఘనత భాగవతకైంకర్య మీడేరె
నని వాలు జళిపించి యందంద యాడి
తనయొద్దిభటులనందఱ మూఁడుమూఁక
లొనరించి చనుదెంచుచున్నట్టివారి
వెనుక ముందర నెడవేచి లావేది
గొనకొని తుండించుకొని కొట్టుఁ డనుచు
బనిచి కొందఱువీరభటులునుం దాను
ననిమొనగా నిల్చి యాయత్తపడుచుఁ 9850

( 686. సేనాభటకార్యవర్ణనము. )

దుదలేని తమిఁ ద్రోవఁ దొలఁగి లోఁగడఁక
పొదలఁ బెన్పొదలచాటునఁ బొంచియుండి

చక్కల నున్నభూజము లెక్కి కొంద
ఱెక్కవ చూపట్ట నీలలు వెట్టఁ
దవిలి కొందఱు వచ్చుదళముల దళము
చెవిసోఁకఁ గడనుండి చేబుఱ్ఱ లిడఁగ
నటువచ్చువారు డాయఁగఁవచ్చి రనుచు
దటముల రాలు కొందఱు పోటు కిడఁగ

( 687. పరకాలయోగిపటుతరలీలావినోదవర్ణనము. )

పరకాలుఁ డప్పు డాపరసేన కనుమ
సొరిది నొక్కట వడిం జొచ్చి రానిచ్చి 9860

తోరమై చీమవ దూరంగరాళ
కారుక్రమ్ముచుఁ జేంద్రుగలమొరపముల
జీబుకొల్చుచుఁ దమ్మచిట్టంబు గట్టి
గాబకోరిందలఁ గడుదట్టమైన
మొడిపికట్టకు వంక నొకవంక డిగ్గి
కడు నేమరిల సందుకట్టుగాఁ జూచి
యరియు నందకమును నంది రేతెంచు
హరినాఁగ హరిగేయు నడిదంబు పూని
పిడుగు వ్రాలినమాడ్కి పెళపెళ నార్చి
పొడు పొడు పొడుఁ డంచు పోనీకుఁ డనుచు 9870

విడు విడు విడుఁ డండు వ్రేయుండ యనుచు
గడ గడ గడ దిశల్ కంపింపఁ బలికి
బలువైన పెనుముచ్చుబంటులు దానుఁ
బిలపిలం జనుదెంచి భీషణాకృతిని
యలమి కుయ్యాకుఁడు కుయ్యాకుఁ డంచుఁ బట్టి
బలువిడి గద్దించి పటుతరలీలఁ

( ౮౮౮. దివ్యదంపతికనకాభరణాద్యపహరణము. )

బట్టుపుట్టంబులుఁ బసిఁడిజాళియలుఁ
బెట్టెలుఁ బసిఁడికొప్పెరలు సొమ్ములును
బరిమళంబులుఁ బట్టుబట్టలు మంచి
హారులు జల్లెడలును నాదిగాఁ గలుగు 9880

తగువస్తువులఁ గన్న దనియంగదోఁచి
తెగడుచుం గడుఁ దెప్పదేలి యామీఁదఁ
బరకాలుఁ దప్పు దుద్భటవృత్తి నెదుట
హరి నెక్కి వచ్చు నయ్యాదిదంపతులఁ
గని చేరఁ జని తదంగంబుల నున్న
కనకభూషలనెల్లఁ గైకొని యపుడు

( ౮౮౯. హరికరకమలాంగుళీయకాపహరణాదిప్రకారము. )

పోలించి చూచి యాపుండరీకాక్షు
ప్రేలనున్నట్టి పవిత్రంబుఁ గాంచి
యిది నాకుఁ బోవిడనేటికి నేఁడు
తుది నొకభాగవతునకైన వచ్చు 9890

నని ప్రేలియంగుళీయకము రాఁదిగియఁ
జెనఁగి రాకుండినఁ బెద్ద యుం గనలి
యరిమురి గద్దించి యాయుంగరంబు
కరచి రాఁదిగిచిన కలియనో యనుచు

( ౮౯౦. కలియనామధేయప్రాప్తివర్ణనము. )

హరి యానతిచ్చిన నది కారణమున
నరియమునకుఁ గలియనునామ మలరె
అప్పు డాసొమ్ములు నయ్యుంగరంబు
నొప్పారుచుండెడు నొకపెట్టెఁ బెట్టి

యెత్తఁబోయిన నిందిరేశుని యాజ్ఞ
నెత్తరాకున్నఁ బెల్లెసఁగుకోపమున 9900

నత్తటి మఱియు భృత్యాళితోఁ గూడి
యెత్తిన నెంతైన నెత్తరాకున్నఁ
గాలునిగతిఁ బరకాలుండు కినుక
నూలుకొనంగఁ గన్నులు జేవుఱింప
నద్దిరా యెంతమాయావి వీఁ డనుచు
గద్దించి కదసి ముంగలనున్నయట్టి

( 691. ఆభరణవిషయికమంత్రకలనాదివర్ణనము. )

భూసురవేషి నంభోజసంభవుని
దాసికంఠమున ఖడ్గంబు దొక్కించి
యిటుచూచి యాపెట్టె యెత్తరాకుండ
మటమాయలాడ నీమంత్రించినట్టి 9910

మంత్రంబు మాని క్రమ్మఱ నెత్తవచ్చు
మంత్రంబు చెప్పెదో మఱియుఁ గొట్టుదునో
యన విని బెగడొంది యాపెండ్లి యొజ్జ
యనియె నేర్పున ససహాయశూరునకుఁ
దానేమి యెఱుఁగ నోతండ్రి గుఱ్ఱంబు
మైనున్న యామహామాయావికాని
యన విని యతని డాయగ నేగి యట్ల

( 692. పరకాలయోగిప్రార్థనానుగుణమంత్రప్రదానము. )
అష్టాక్షరమంత్రోపదేశవర్ణనము.

యనిన రంగేశ్వరుం డలఁతినవ్వుచును
ఇప్పుడు నీకోరు నీమంత్రవరముఁ
జెప్పెద వేవేగఁ జేరర మ్మనుచుఁ 9920

బరకాలు మస్తంబుపైఁ గేలు సాఁచి
కరమర్థి దక్షిణకర్ణంబులోన
భావింప సంసారభవవార్ధి మునుఁగు
జీవుల నొకదరిఁ జేర్చునావనుచు
సనకసన్నుతమైన యష్టాక్షరంబు
నొనర సాంగంబుగా నుపదేశ మొసఁగి

( 693. భగవత్ప్రత్యక్షక్రమవర్ణనము. ఆదిదంపతిసౌందర్యాదిదర్శనము. )

యకలంకకంకణహారకేయూర
మకరకుండలయుతమహితవిగ్రహము
పంచాయుధోజ్జ్వలబాహుదండములఁ
బంచాస్త్రు మించినభావంబు గలిగి  9930

తగ రమాగోదానితంబినీ సహితుఁ
డగుచు నండజనాయకారూఢుఁ డగుచు
నిజరూపధరులైన నిత్యులు ముక్తు
లజశంకరాదులు నందంద కొలువ
నరుదారఁ బ్రత్యక్ష మగుచుఁ దన్మంత్ర
వరవాచ్యమైన దివ్యస్వరూపంబు

( 694. పరకాలయోగికృతదివ్యదంపతిసేవాప్రకారము. )

నతనికిఁ జూడఁజూప నాదివ్యమూర్తిఁ
బ్రతిలేని వేడుకం బరకాలయోగి
సేవించి యందునం జిక్కి సన్నుతులు
గావించి భావించి కడుసంతసించి  9940

కన్నులవేడుకఁ గన్నీరు జాఱఁ
గ్రన్నన మైదీఁగ గగుర్పాఱఁ జెలఁగి
ధరజాలతోఁగూడ ధన మెచ్చినట్లు
యరవిందనాభుఁ డీయష్టాక్షరమున

సవిభూతికముగ నిజస్వరూపంబుఁ
బ్రవిమలగతి నాకుఁ బ్రకటించె ననుచుఁ

( 895. ద్రవిడగాథావళీసమర్పణద్వారా అష్టోత్తరశతహరిమందిరసేవాప్రసంగము. )
దశావతారవైభవము. సంసారతాపతప్తజీవరాశిదృష్టాంతవర్ణనము.

బదిపద్యములఁ జెప్పి ప్రమదంబుతోడఁ
బదురుఁడై మఱి సాష్టశతధామపతులఁ
బంకజోదరులఁ బొంబదినూఱుపాట
నంకించి మఱి నూటయిరువదిపాట 9950

సర్ణవశయను దశావతారముల
వర్ణించి యాతరువాతఁ బదింట
ఘనవిషజ్వాలలు గ్రక్కుసర్పంబు
నొనఁగూడి యొకయింట నుండుచందమునఁ
గడలిసెన్నడుమ భగ్నంబైనయోడ
వడఁకుచుండెడి యోడవానిచందమున
వడిఁ గోసి పాఱుప్రవాహంబుచెంతఁ
బుడమినుండెడు మహాభూజంబుసరణి
నిడీయంగఁ దుదమొద లేర్చు కాష్ఠంబు
నడుమఁ జీమలపంక్తి నడికెడు కరణి 9960

సెడపకపాఱు నట్టేటిలోఁ జిక్కి
కడుభీతి నొందు సృంగాలంబుభాతి
తాపత్రయోర్మిసంతతుల నేపారు
నాపూర్ణసంసార మనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్న నన్నుఁ
బాలించి దరిఁజేర్చు పరమేశ! యనుచు
నీలీల నొప్పు వేయి న్నెనుబదియు
నాలుగుపాటల నవరసస్ఫూర్తి

నెక్కొని తనలోన నిండారి పొంగి
వెక్కసం బగుభక్తి వెలిమించె ననఁగ 9970

( 896. ప్రబంధాంతరసమర్పణాక్రమము. స్వార్జితవివిధైశ్వర్య సమర్పణాక్రమము. )

సిరివరునకు మహాశ్రీవచనాఖ్యఁ
బరఁగుప్రబంధ మర్పణముఁ గావించి
మున్ను గైకొనినసొమ్ములు నంబరములు
నన్నియుఁ దెచ్చి శ్రీహరికి నిందిరకు
సకలనిభక్తులకు సమర్పించి పెక్కు
నుతులు గావింప సద్మనిలోకవిభుని
ఆరంగపతి మెచ్చి యాళ్వారు నపుడు
చేరంగఁ బిలిచి మచ్చికఁ గౌఁగిలించి

( 897. మురారిపూజాతారతమ్యక్రమవర్ణనము. )

యీపావనజాత్మజుం డీశేంద్రముఖులుఁ
గావించుపూజలు గణుతించిచూడ 9980

నీవు గావించు మన్నిజభక్తపూజ
కావగింజంతకు నవి యీడు గావు
కడపట యోగివర్గంబు నామీఁద
నుడుగక కావింపుచున్న యర్చనలు
యోజమై నీసేయుచున్న భాగవత
పూజతోడను సరిపోల్పఁగఁ దగునె?

( 898. వైకుంఠనాథకృతపరకాలయోగికైంకర్యప్రశంస. )
వరప్రదానసుముఖత్వనివేదనము.

భాగవతోత్తమ! పరమప్రపన్న!
యోగికులోత్తంస! యురుభక్తినిరత!
యనుచు నిర్జరముఖ్యు లాశ్చర్య మంద
జనులెల్ల నన్ను నేసరవిఁ గొల్చెదరో 9990

యాలీల నినుఁగొల్తు రఖిల వైష్ణవులు
నీలీల మీరల నీపదువురను
గొలువనివాఁడు భక్తుండు గాఁడు మిమ్ముఁ
గొలిచినవాఁడె భక్తుఁడు మాకు ననుచు
వరమిచ్చి కడు గౌరవంబు దైవాఱఁ
బరకాలు నీక్షించి పలికె వెండియును
గ్రమమున నీచేతఁ గరుణతో నింక
నమితకైంకర్యంబు లవధరించెదము
అనుచు నానతి యిచ్చి యతనిఁ దోకొనుచుఁ
దనపురంబునకు నత్తఱి నేగుదెంచి 1000C

( 699. హరిపదసేవాప్రకారము. శ్రీవేంకటాద్రివైభవకథనము. )

సిరితోడ నెనలేని సిరితోడఁగూఢ
నురగేంద్రశాయియై యుండె నుండుటయుఁ
గొన్నిదినంబు లాకుసుమాస్త్రతండ్రి
చెన్నుఁ గన్నారంగ సేవింపుచుండె
నటుమీఁదఁ బరకాలుఁ డావేంకటాద్రి
కటకనివాసుని కథలుఁ జిత్రములు
సరసభావంబులుం జక్కందనములు
సిరులు నొయ్యారంబు చెలువంబు కలిమి
నటనలు నునికియు నయగారిపనులు
నటియింపు నీగి విన్నాణంపువగలు 10010

( 700. శఠకోపాదిదివ్యసూరిప్రబంధార్థశ్రవణానందానుభవశైలి. నిజశిష్య
పరివారసహితపరకాలయోగి వేంకటాచలయాత్రాక్రమము. )

ప్రాయంబు నెఱి ప్రతాపంబు రాజసము
సోయగంబునుఁ గడుఁ జోద్యంబు గాఁగఁ
గొవకొని యలశఠకోపాదికృతులు
విని విని క్రొత్తగా వేనోళ్ళఁ బొగడి

పలుమఱువిని నాగపతి శైలపతికి
వలచి యాతని జూడవలయు నటంచు
నలఘుమహాసీంద్రుల యనుమతిఁ గూడఁ
జెలఁగి శ్రీరంగ రాజీవాక్షు చేత
ననిపించుకొని తడయక మున్ను గొలిచి
చనుదెంచు తనభృత్యజనమునుం దాను 10020

సేవించువారి కిచ్చినదుర్జయములు
కావేరి కవ నొప్పు కావేరి దాఁటి
శ్రీనిధి లోకవశీకరదేహు

( 701. నానానగరశైలవనాదిసంతరణక్రమము. )

శ్రీనివాసుని భక్తి సేవించుతమిని
నగరశైలములుఁ గాననసమూహములు
నగసంతతులుఁ బెక్కునదులును గడచి
యయనంబు నందు జాగరి రెండు మూడు
పయనంబు లవి యొక్కపయనంబు గాఁగ
నరుగుచుఁ గాంచికి ననతిదూరమున
నరవిందకోకబకాకులం బగుచు 10030

మేలిమి చల్లదెమ్మెరలతో మింటి
పాలేరు నవ్వెడి పాలేరు చేరి
యెడగువ్వ తలచూపనీకుండ నుట్టి
పడు నెండవడి బెట్టువడిఁ దట్టుపడుచు

( 702. మార్గశ్రమహరణాదికథనము. )

శ్రమమార నానదీజలములఁ గ్రోలి
కొమరారునయ్యేటికురఁగట నొప్పు
పువ్వులనెత్తావిఁ బొదలు తేనియల
తువ్వరవడు నెల దోటలో నిలిచి

బడలి యూఁకటఁ జుట్టుపట్టులఁ బల్లె
బడుసర గానక పరగెడిత్రోవ 10040
మఱిచూడ మిట్టాడు మానిసి లేక
మెఱయువేఁడిమి మిటమిట నెండ గాయఁ
దనయుఁ జూఁకలిగొనఁ దాఁ జూడలేని
జననికై వడి లోకజననీవిభుండు

( 703. కాంచీక్షేత్రనిలయాష్టభుజనామకహరిప్రసన్నత్వాదివర్ణనము. )
వృద్ధపురుషరూపావిర్భావము.

ఆవేళ శ్రీకాంచికాధీశుఁ డైన
భావజాతునితండ్రి భక్తవత్సలుఁడు
హరియష్టభుజకరుండును నృసింహుండు
కరుణించి భక్తునాఁకలిఁ దీర్పఁబూని
నరవగడ్డంబును వరములమెడయు
కరముప్రేలెడు పిడికడుజన్నిదములు 10050
నొలయుపెన్నెలనవ్వు నూర్ధ్వపుండ్రంబు
మలయునిగ్గుల తిరుమణిపడంబులును
ప్రాలినబొమలు లోవంగినవీఁపు
ప్రేలాడుతోళ్లతో వెలయునెమ్మేను
నదరుడెందము లాలనసలారుచున్న
వదనంబు వడవడవడఁకనొదలయు
వదలుపింజల నిడువాలుధోవతియు
నొదవిన వలకేలియూఁతకోలయును
బోలఁగాఁ జుట్టినపాత్తిపాగయును
దూలగట్టిన వెడతోఁపుపచ్చడము 10060
సంకెడా కేలిపంచాంగంబు ముష్టి
చంక ప్రేలెడుతాళి చలిదిమూటయును

దగనలపడఁ జేరి తనుజూచువారు
మొగిద్వాపరమునాఁటి ముసలి వీఁ డనఁగఁ
దడబాటు నడల నత్తఱి వచ్చివచ్చి
బడలినగతి గురుపదము లెన్నుచును
ఉరుభక్తి చెంతవా రొకయింత వినఁగ
నరవిలో ద్వయ మనుసంధించుకొనుచు
సిద్ధానురాగుఁడై యిట్లు భాగవత
వృద్ధభావముఁ దాల్చి వేదవేద్యుండు 10070

( 704. పరకాలయోగికృతవృద్ధవైష్ణవపాదపూజాక్రమము. )

నాతోఁటలోనికి నరుదెంచి సుమిత
చూతంబుక్రింద నిల్చుట విలోకించి
పరకాలుఁ డప్పు డాపరమవైష్ణవుని
చరణాబ్జముల చక్కఁ జాగిలి వ్రాలి
యుల కేలిముష్టి పంచాంగంబు గాఁగ
దెలిసి నాకిప్పుడు తిథివారసరణి
దినయోగములు తేటతెల్లంబు గాఁగ
ననయంబుఁ బరికించి యానతీవలయుఁ
గడుదవ్వు నడచి యాఁకలిగొని యెండ
వడఁ జెందినాఁడ దేవరదాసునకును

దిరిచి మీరిప్పుడు తెచ్చినచంక
చరిదిలో నింత ప్రసాదింపవలయు
నన నవ్వి యావైష్ణవాగ్రణి కరుణ
దనరార నాపరాంతకున కిట్లనియె

( 705. వృద్ధపురుషకథితతిథివారనక్షత్రశుభఫలత్త్వనిరూపణము. )

శ్రీవిష్ణువారంబు శ్రీవిష్ణుతార
శ్రీవిష్ణుతిథియు సందేహింపవలదు

వాకొన నీకు సర్వగ్రహంబులును
నేకాదశమునందె యొసగియున్నారు
వాకొన నేల సర్వము భద్ర మింక
నీకోర్కు లీడేరు నీకోరినట్లు 10090

పనుపడ నీకు నీభటులకుఁ జలిది
పెనువొందనేఁ బంచిపెట్టెద ననుచుఁ
దెలివెండి రేకల తేటగిలించు
పొలుపారు ననుపోఁకపాత్తిలోపలను
సలలితదివ్యాతి సౌరభ భూజ
ఫలచిత్రరుచులఁ జూపట్టి యెంతయును
నమృతాంశుమీఁది చాయల గేలికొనుచు
నమృతమయం బై నయట్టియాచలిది
పరికరములఁ బెనుపడునూరుగాయ
పరిమళంబుల వారిబడలిక ల్వాయ 10100

( 708. వరదానసంతోషకథనాది. )

నమరవర్గమునకు నమృతంబుఁ బెట్టు
కమలాక్షుగతి హస్తకమలంబుఁ దొడికి
పరకాలునకు మున్ను భక్తి దైవాఱఁ
గరమున నొకపిడికడు ప్రసాదించి
కడమభద్భటులకుఁ గ్రమమేరుపడఁగఁ
బిడికెడు పిడికెడు పెట్టఁ బెట్టుటయు
నలసుధారసపాను లైనదేవతల
తెలివి నందఱుఁ బరితృప్తులై రపుడు
పరకాలుఁ డలరి యాభక్తవత్సలుని
చరణపద్మములకుఁ జాగిలి మ్రొక్కి 10110
యెయ్యది మానామ మెందుండి యిటకు
నయ్య! వేంచేసితి రానతిం డనఁగ

## సప్తమాశ్వాసము

( 707. హారిసల్లాపనక్రమము. నరసింహమూర్తికాతిరోధానప్రకారము. )

వనిశంబు కాంచికి నపరభాగమున
నునికిగా నెలకొని యుండుదు నేను
ననుసాష్టభుజకర నరసింహుఁ డందు
రనుచు నంతర్హితుం డయ్యె వాకరణిఁ
గని పరకాలుఁ డక్కజ మంది యితఁడు
ననుఁ బ్రోవవచ్చిన నలినలోచనుఁడు
కాని వేఱొక్కఁడు గాఁ డంచుఁ బొగడి
యానందబాష్పాకులాత్ముఁడై పొంగి 10120
కరుణ నాడై నయాఁకలి చూడలేక
యరుదెంచి నా కమృతాన్నంబు పెట్టెఁ

( 708. పరకాలయోగికృతనరసింహసేవాప్రకారము. )

దననామ మగిడిన దయతోడ నవ్వి
పునుగ కెప్పుడు సాష్టభుజకరుఁ డైన
హతహేమకశిపుండ ననియె నేవేలు
పతఁడె పంచేషు పంచాయుధాబ్జములు
ధరియించి యసురడెందము విదారించి
శిరముఁ జేరిన నరసింహవిగ్రహుఁడు
నతఁడె శ్రీవాసునుఁ డతఁడె విష్ణుండు
నతఁడె యందిమకిటి యగువాఁడు నతఁడె 10130
యతఁడె నాకులదైవ మనుసర్థ మొదవఁ
బ్రతిలేని యొకపది పాటచేఁ బాడి

( 709. కాంచీనగరవైభవవర్ణనము. శేషాచలయాత్రాకలనము.
ఉత్తుంగవేంకటాచలారోహణక్రమము. )

పయనంబుగతి కతిపయదినంబులకు
నయకరం బైన శేషాద్రిచెంగటికిఁ

జని సంతసించి యాశైలరాజంబుఁ
గని శ్రీనివాసునికరణిఁ జూపట్టి
నాయద్రిరాజంబు నారోహణంబు
సేయంగఁ జంకించి చిరభక్తిపరత
మొనయంగఁ దత్పాదమూలంబునందు
ననురక్తి దివసత్రయంబు వసింప 10140

( 710. శ్రీవేంకటేశపాదాదిసౌందర్యవిశేషవర్ణనము. )

నాసర్వమయుఁడు శేషాచలేశ్వరుఁడు
దాసునిమదిలోనితాత్పర్య మెఱిఁగి
కనకాంఘ్రికింకిణీ కనకజాలుండు
ఘనతరోజ్జ్వలదివ్యకనకచేలుండు
ధృతరత్నరుచిల్లరీదీపితహేతి
తతచిత్రమేఖలాదామాళిధారి
వరదానకటిదేశవర్తితకరుఁడు
కరపల్లవాగ్రసంగతచక్రదరుఁడు
హారకేయూర భూషాదిధరుండు
చారుమౌక్తికకంఠ సరసకంధరుఁడు 10150

తులసికాదామకౌస్తుభవిభాసితుఁడు
వలితవిగ్రహుఁడు శ్రీవత్సలాంఛనుఁడు
ఘటితాలమేలుమంగా వక్షస్థలుఁడు
కుటిల నీలాయతకుంతలోజ్జ్వలుఁడు
సరసిజపత్రవిశాలలోచనుఁడు
నిరుపమసాంద్ర వనీరనేచనుఁడు
వరదరస్మితశోభివదనమండలుఁడు
మరకతమాణిక్య మకరకుండలుఁడు
ధారితరత్నచిత్రకలలాటుండు
నీరజమిత్రసన్నిభకిరీటుండు 10160

( 711. శ్రీవేంకటేశప్రసన్నత్వకథనము. భక్తిపరవశసేవాప్రకారము. )

నగునట్టి శ్రీవేంకటాద్రినాయకుఁడు
జగదేకనాథుఁ డాశ్రితపాలునకుఁ
బొడకట్టి తనకరముల మేను నిమిరి
వడదేర్చి లాలించి వరదుఁడై పలుక
నావేల్పువేల్పు రెప్పార్పక చూచి
భావించి సేవించి ప్రణుతి గావించి
యాదేవదేవుని యనుమతిఁ గూడ

( 712. శ్రీరంగరాజసేవాసక్తిక్రమము, హరిసేవాప్రకారము. )

నాదండ శోభిల్లు నతనిమూర్తులను
సేవించి యాపరజిత్తు క్రమ్మఱను
వేవేగ శ్రీరంగవిభుని సేవింప  10170
నరుగుచు సకలదేశాధినాయకులుఁ
గరమర్థి నిచ్చలుం గానుక లొసఁగు
వరసువర్ణాదివస్తువుల్గొనుచు

( 718. కావేరీమందిరనిర్మాణప్రకారాది. నానావిధశిల్పచాతుర్యరచన. విశ్వకర్మనిర్మాణరీతిప్రదర్శనము. )

నరవి రంగమునకుఁ జనుదెంచె నప్పు
డావేల్పురాయని యడుగుదామరలు
సేవించి ప్రణమిల్లి చిరతరభక్తి
లలిమించువేల్పు నీలపుచందరాల
నలుపారు నల్లసేనపుజంగరాల
నలఘువై భవముల నట రెండుసాల
ములును వంటిల్లును మొదలుగాఁ గలుగు  10180
కావేరినిలయుకైంకర్యంబు లాఱు
గావింతు ననుచు సంకల్పంబు చేసి

గట్టిగా సాలయుగ్మము మహానసముఁ
గట్టించి నాల్గవకలుకోటఁ దీర్ప
సవరింప దొరఁకొనుసమయంబునందు
భువి నెన్నఁదగినశిల్పులు ననిశంబు
ఘనులైన మఱి తక్కుఁ గలిగినమేటి
పనులవారల బడి పనులవారలును
పరువడిఁ దమతమపనులకు నమరి
దొరఁకొని సేయంగఁ దొడరున త్తఱిని 10190

బలువుకొండలు రేకబడ నింత మలఁచి
యులువకట్టులువోసి యులు లోలి నాటి
పనలుమించఁగ సూత్ర పట్టినపగిది
విసువక గసివోటు వేయువారలును
గూటంబు లులులుఁ జేకొని యవలీల
గాటంపుకొండ లొక్కట బ్రీలి వ్రాల
ననయంబు వెఱఁ గంది యనిమిషశిల్పి
గని యోటువడుచుండ గనివోటు పైపఁ
గప్పుల దూలముల్ కంబాలు పలుద
చప్పటిరాలు నచ్చంబుజోదియలు 10200

కదరికాద్వారశాఖలు కోణంగెలును
మొదలైన సంపాదములు చిత్రగతులఁ
బడి పనివాండ్రు నిబ్బరమున నన్న
బడియలుపూని సంభ్రమము రెట్టింప

( 714. జలాంతశిలాంతశోధనపూర్వక నిర్మాణస్థాపనక్రమము. )

లావునం గదిసి పేల్లల్ల యటంచు
మేపీది వడి బండ్లమీఁది కెత్తుచును
ఆరీతిఁ బోవనియట్టిదూలమ్ములు

చేరి మూఁకలు గట్టి చిట్టెలు గట్టి
మొగడిగరవముల పేఁలల్ల యనుచు
నగపడి యవి మోచి యరుదెంచి వారు 10210
ధర జలాంతము శిలాంతముగ శోధించి
వరుసలోపల గుండ్రవక్త్రంబు సేసి
యిసుము జల్లియు వైచి యెనయ గట్టించి
వసిబారి మాకున వశిఁ గూరుకొనుచుఁ
జప్పటి గావించి చదురపానంబు
నొప్పుగావించి మైనొక్కొక్కరాయి
వరుస నిల్పుచు రసవర్గంబుతోడ
బెరయించి యిట్టికె పెట్టజల్లియును
సందడి బొక్కలో సందుసందులను
దండడిగొనఁగ బెండడివేయువారు 10220
పొందికలగు రాయి పొందించి వెరుక
సందుదూరకయుండ సంతన సేసి
సూత్రంబులు నాయశుద్ధులు నెఱిఁగి
చిత్రంబుగాఁ బనిఁ జేయించువారు
నగుచు సీగలిఁ గోటయంతయు గట్టి
తగనొక్కయెడ భూమిఁ ద్రవ్వి శోధింప

( 715. పరకాలయోగప్రాప్తిక్రమము. చింతాప్రకారాది. )

సందులో నొక్కగుహాంతరసీమ
నిందునిభమైకాంతి నెల్లిదం బాడు
చెలువ మొందినయోగిశేఖరుండొప్పు
మలయంగ యోగసమాధితో నుండ 10230
నాలోకవము సేసి హరిదివ్యసాల
మీలీల యీతని యిరవుమై వచ్చె

నేమిసేయుదు నంచు నిచ్చఁ జింతించి
యామీఁద నొకయుపాయముఁ దలపోసి
యతనిఁ జేరఁగ నేగి యాపరకాలుఁ
డతిభక్తితోడ నిట్లనియె యోగీంద్ర !
పరిపూర్ణహృదయ ! యెప్పగిది నిచ్చటికి
నరుగుదెంచితిరి నా కానతీవలయు
నన విని యయ్యోగి యాయోగినాథుఁ
గనుఁగొని ప్రణమిల్లి క్రమ్మఱం బలికె 10240

( 716. అష్టోత్తరశతదివ్యక్షేత్రనివాసిమధుసూదనమూర్తిసేవాక్రమము. )

యోగదృష్టిదర్శనశైలి.

నెనలేనికమలాలయేశ్వరు నూట
యెనుబదితిరుపతు లేను సేవించి
వచ్చి యిచ్చో నిల్చి వనజాక్షుమీఁది
మచ్చిక యోగసమాధి నున్నాఁడఁ
గ్రమమున నిన్ను నేఁ గనుఁగొంటిఁ గానఁ
గమలాక్షు నిప్పుడ కన్నయ ట్లయ్యె
నని యోగదృష్టిచే నాపరకాలు
నునికిఁ గన్గొని వెండియును జాఁగి మ్రొక్క
మ్రొక్కినఁ బరకాలమునికులోత్తంసుఁ
డక్కజపడుచుండ నతని కిట్లనియెఁ 10250

( 717. తుహినాద్రినరసింహసంభాషణక్రమము. )

దుహినాద్రిపై వరదుని నరసింహు
మహితాష్టబాహు నిర్మలగుహావాసి
వేడుకనీవు సేవించితే యతఁడు
తోడ మాటాడు భక్తులఁ గూడి యెపుడు
నన విని వెఱఁగంది యాయోగి మగుడ
ననియెఁ బ్రేముడిమీఱ నరిశమనున్నక్కు

నతఁడు నాతో మాటలాడునా యనిన
నతఁడు నీతో మాటలాడ నాపూట
యని యోగి తుహినాద్రి కనిచిననతఁడుఁ
జని హైమశైలాగ్రసదను నృసింహుఁ 10260

( 718. హరిమందిరప్రాకారనిర్మాణాదిపూర్తికరణవిషయకనరసింహాజ్ఞాప్రకారము. )

గని మ్రొక్క మానవకరివైరి యపుడు
తనభక్తుమాట తథ్యము సేయవలసి
యాయోగితో మాటలాడ నష్మాని
యాయిందిరేశుఁ బోయకయుండె నంతఁ
బరకాలుఁ డాకట్టు ప్రాకార మెల్ల
సరుదారఁ గట్టించి యంతటిమీఁద
ముదము సఖిలమైన మూడవకోట
యదియునుంగట్టింప నాత్మదలంచి
యేమిసేయుదు నింక నీసాలమునకు
హేమంబు చాలంగ నెటనుండి వచ్చు 10270

( 719. ధనసంపాదనవిషయకరహస్యాలోచనాక్రమము. )

నని తనయొద్ద డాయఁగఁ గొల్చియున్న
యనుపములైన యేకాంగవీరులను
రాయదొంగలఁ జౌర్యరసికశేఖరుల
సొరిదం బిల్చి రహస్యంబునందుఁ
బన్ని యీమూడవ ప్రాసాదమింక
నెన్నిలాగులనైన నీడేర్పవలయు
నలవిమీరిన దీనికై యిటమీఁద
బలువైనధనము సంపాదింపవలయుఁ
గాదిదొంగిలితేరఁ గలరె వేవేగ
మీచేత నగునె యిమ్మెయి విచారంబు ? 10280

( 720. చౌర్యకార్యప్రవీణవీరపురుషసామర్థ్యవర్ణనము. )

అన విని యనుచరు లావరాంతకున
కనిరి నేర్పులును సాహసములు మెఱయ
భావించిచూడ నీబంటులసత్త్వ
మీవెఱుంగవె విను మిన్నియు నేల
వదలక మండలేశ్వరునైనఁ గాంచి
కొదుకక తెరువాటు గొట్టనోపుదుము
పగలు చూచినసొమ్ము పగలు తేఁగలము
మిగిలినకడిమినెమ్మెయిఁ దివ్వరాని
తాలముల్ గడియ లుద్ధతి మోప ప్రీలి
వ్రాలించు పైకైకొనబదనిక ల్గలవు 10290

పాతాళమున నున్న బలువిధినైన
జాతిగాఁ జూపునంజనములు గలవు
మహి నెరుసైన రిమ్మల నిద్రవుచ్చు
మహిమలం గలచొక్కుమందులుం గలవు
ఇత్తటి నిరుచేయి నెఱుఁగరాకుండఁ
గత్తెరసొమ్ములు గత్తిరింపుదుము
ఇలలోన నొండొరు నెఱుఁగరాకుండఁ
గలయ నామడదైనఁ గన్నపెట్టుదుము
అని యిట్లు తమదు సాహసములు చెప్పి
యనిరి వెండియు శాత్రవాంతకుతోడఁ 10300

( 721. నాగపట్టణాలయస్థితకనకమయజైనబింబాపహరణోపాయకథనము. )

గడుచిత్రమై తూర్పుకడలికి చక్కఁ
బడమటి యీనాగపట్టణంబునను
అసమాన మగు పదియాఱువన్నియల
పసిఁడిచే జైనులు ప్రమదంబుతోడ

గొప్పగాఁ దమకులగురినిఁ జేయించి
యొప్పుగా నొకగుడియును నభేద్యముగఁ
గట్టించి యందు నొకనకంపుఁబ్రతిమఁ
బెట్టినా రేమి చెప్పెడిది! యాప్రతిమ
యబ్బెనా మన పనులన్నియుఁ దామె
గొబ్బున నీడేరుఁ గొదలేక యనినఁ 10310

( 722. నాగపట్టణస్థబౌద్ధాచార్యనిలయప్రవేశము. కవాటోత్ఘాటనవిషయకచింతాది. )

గడు సంతసిలి పరకాలుఁ డాభటుల
నెడపక కౌఁగిట నిరియంగఁ జేర్చి
తాను వారలు సౌగతప్రకారములు
పూని వేవేగఁ దత్పురమున కరిగి
యచ్చట నున్న బౌద్ధాచార్యవసతిఁ
జొచ్చి యంతయుఁ బారజూఁచి యెల్లెడను
దలుపు వాకిలియును ద్వారబంధమును
దెలియరాకుండ నెంతే చిత్రగతుల
వడుకు లేకుండ నేకాండంబు గాఁగ
నొదవ సంతననేసి యున్న మాగుడికి 10320

( 723. కనకమయజైనబింబవిషయకసల్లాపాది. )

నచ్చుగా లోని హేమాకృతిఁ జూడ
వచ్చువారికిఁ గనవచ్చుమాత్రంబె
కడుఁ జిన్నతోరణ కంతగావించి
యుడరంగఁ బరకాలుఁ డచ్చోటి కరిగి
యాలోనిబింబంబు నాక్రంతగుండ
నాలోకనము నేసి యాత్మఁ జింతించి
తనబంటులును దానుఁ దడయక వెడలి
చనుదెంచి యాపురస్థలి కొంకిఁ జేసి

యనుచరవర్గంబు ననురక్తిఁ బిలిచి
యనియె నేకాంతంబునం దొక్కనాఁడు 10330

( 724. అతివిస్మయకరజైనాలయభేదనవిషయకాలోచనాక్రమము. )

పోలింపఁ గుచ్ఛ్రితములకెల్ల మిగుల
నాలయం బైన యీయాలయంబిప్పు
డేదెసఁ దుదమొద లెఱుఁగంగరాక
భేదింపరాక యభేద్యమైనదియుఁ
గటకటా! భూమిలోఁ గంటిమి కాని
యిటువంటిసదనంబు లెందైనఁ గలవె
యేపాపజాతి బా నిది చేసె నొక్కొ
చూపట్టె దింతయుఁ జొరవచ్చుత్రోవ
పసుపడునట్టి యుపాయ మింకేది
యనుచుఁ గొండొకతడ వాత్మఁ జింతించి 10340

( 725. ద్వీపాంతరనివాసిశిల్పిరచితజైనాలయచిత్రసూత్రనిర్మాణప్రస్తావము. )

క్రచ్చఱదీపాంతరంబున నుండి
వచ్చినయట్టి కువాడివడ్రంగి
యవగడం బైన యీయాలయం బిట్లు
నవరించె నని పవనవ గాఁగ వింటి
నే నెదురఁగఁగల నీసూత్రమహిమ
మానుగా నెఱిఁగి క్రమ్మఱ నత్తు ననుచు
నేవచ్చునందాఁక నిచ్చోట మీర
లేవయావంతయే యెడపీడకుఁడని

( 726. ద్వీపాంతరగమనప్రస్తావము. )

ముదమునం దద్వీపమున కేగి యందుఁ
జదురులై పెనుసాధుచందంబుఁ బూని 10350

సారెకు నచటి పంచాణంబువారిఁ
జేరి యయ్యో యని శిర మింత యూఁచి
కడుపెద్దయైన సౌగతహేమగురుని
గుడి చొచ్చి చోరులు గొంపోయి రకట!
యనుచుఁ గంసాలివా రనిశంబునను వినఁగ
ననుచుండుసమయంబునను దొక్కనాఁడు
ఆమేటిగుడిఁ గట్టినట్టి యాశిల్పి
యామాట విని వెఱఁ గంది పొక్కుచును

( 727. జైనమందిరశిఖరస్థసూత్రఖండనవాక్యకథనము. )

చిత్రమైనట్టి యాశిఖరంబుమీఁద
సూత్ర మేగతిఁ గాంచి చొచ్చెనో దొంగ 10360

యన విని పరకాలుఁ డరయనివాని
యనువున నతని కిట్లనియె నవ్వుచును
జెలువార గుళ్ళకు శిఖరంబులందుఁ
గలవె సూత్రంబు లాగడములు గాక.
యన విని శిల్పి లేదనునెట్లు శిఖర
మున నేమనో సూత్రమును నిల్పినాఁడ
నిరుచుట్లు శిఖరంబు నేడేడుమార్లు
తిరమొందఁ ద్రిప్పినఁ దివియంగవచ్చు
నన విని మోదించి యరిదండధరుఁడు
చని నిజభటుల కీచందంబు దెలిపి 10370

( 728. జైనాలయశిఖరారోహణప్రస్తావము. )

పనిపడి యాయత్తపడి వారుఁ దాను
నొనఁగూడి క్రకచమ్ము నొకనాఁటిరాత్రి
గ్రక్కున నరిగి సౌగతగురునిలయ
మెక్కి యాశిఖరంబు నేడేడుమార్లు

త్రిప్పినంతనె యది తెరలినం బట్టి
చప్పుడు సేయక జగతిపై డించి
యాలోనఁ దనచెలి యలిప్రాణనాథు
నాలోని కనిచిన నతఁ డేగి మఱియు
దడయక నంతరాంతరముల నిడిన
గడియలు బీగము ల్గదలింపలేక 10880

( 729. ఆర్తినివారక హరిధ్యానాదిప్రకారము )

యావిధం బెఱిఁగింప నరిదండధరుఁడు
శ్రీవరుఁ దలఁపులోఁ జేర్చి నుతించి
యరుదుమీఱంగ దశావతారములఁ
బరఁగిన శ్రీరంగభర్తపై యాన
నిడినంతలోన నయ్యినుపబీగములు
తడయక గడియలు తముదామె తెఱచెఁ
దెఱచి నమిగు లమోదించి యాబావ
మఱఁది నెన్న డుమ నుమ్మలిక రెట్టింప
ననఁతి నవ్వుచు నిడుపగు పెద్దయినుప
గొలుసు గీల్కొలిపి యాకుహరంబు వెంట 10890

( 730. కనకమయజైనబేరస్వరూపకథనము. )

డించినఁ జక్కఁగా డిగ్గి యాపేటి
కాంచనరచితసౌగతమూర్తిఁ జూడ
నాసరి మఱియు లోహంబున రాగి
సీసబిచ్చడములఁ జేసియున్నట్టి
సుగతబింబంబు లాశూరు నీక్షించి
బెగడొంది పలికె నభేద్యవిక్రముఁడు!
తముఁ జూడఁగా లోహతనువుల మరయఁ
దమవంకవచ్చు నాదాయంబు గలదె

యదివో కాంచనమయం బైనట్టిరూప
మదయతం దమ కిడినట్టియున్నంబు 10400

( 731. శ్రీరంగనాథమందిరనిర్మాణపూర్తివిషయకధనప్రాప్తిప్రస్తావము. )

కొమరార జైనులగురుపు డా నరుచుఁ
దమనోరు గట్టి యంతయుఁ దానె తినును
దానిసే గై కొమ్ము తడయక రత్న
మానిత భూషణమయ మైనదాని
ననినఁ దత్కనకబింబాప్త మైనట్టి
ఘనశక్తి బెగడి దిగ్గన మింటి కరిగె
పరకాలు సోదరిపని యంత బాధ
గురు హేమబింబంబుఁ గొలుసునం గట్టి
కదలింవ నాసన్నఁ గని మీఁదివార
లది యందుకొని యంత నతని గ్రమ్మఱను 10410
అలగొలుసునఁ దొంటియట్ల నెన్నడుమ
బలసి చేదుకొనంగఁ బరకాలుమఱిఁ
తలదాఁటి చిక్కనఁ దనువు తచ్ఛిఖర
బిలము పట్టుకయున్న బెనఁకునసేయఁ

( 732. పరకాలయోగిచింతాప్రకారము. )

బరమభాగవతుఁ డాపరకాలుమఱిఁది
యరిదండధరున కిట్లనిరొ నవ్వేళఁ
గనకచేలాంకుకై ఒకర్య మీఁదేరె
ననుసంతసముపఁ గాయము పోంగెఁ దనకుఁ
బలుమరు నింత నిర్బంధంబు సేయు
వలవదు శ్రీరంగవరదునిసేవ 10420
మెన్నిచందముల నీడేరవలయు
నున్నవిచారంబు లొండేమి వలదు

తను మీఱ లిచట నిత్తఱి డించిపోవఁ
గనిన బౌద్ధులు మిమ్ముఁ గఱిమి చెండాడి

( 783. హరికైంకర్య విఘ్నాచరణకథనము. )

కైంకర్యమునకు విఘ్నము సేయఁదలఁతు
రింకఁ గొంకఁగ నేల నిదె వేగ వచ్చె
పరయనర్థంబుఁ బ్రాణాభిమానములు
వరుసతో నేలినవారివిగానఁ
బతి నాకు శ్రీరంగఫణిరాజశాయి
యతనివే తనదు ప్రాణాభిమానములు 10430

పతికార్యమునకు నై ప్రాణంబు లొసఁగు
నతఁడుఁ సద్గతిఁ గాంచునని యండ్రు బుధులు
ఒకగువ్వకై తను వొసఁగి రాసుతుండు

( 784. పరతత్త్వప్రాశస్త్యాదివిషయవర్ణనము. )

సకలలోకంబుల సన్నుతిఁ బడసెఁ
బరతత్త్వమునకుఁ గాఁ బ్రాణంబు లొసఁగ
నరయ నందుల భాగ్య మది చెప్ప నేల
తనతలఁ గొట్టి యిత్తఱి నుండనీక
కొనిపొండు వట్టిబాగులు మాని మీరు
అన విని పరకాలుఁడౌరౌర యనుచు
ననుజాతపతిమాట కందంద మెచ్చి
యోలి సోభాగవతోత్తంస! నీవు
పోలింప నిహపరంబులు చూఱఁగొంటి
వని వాలు గైకొని యతనికంఠంబుఁ
దునిమి యాశిరముఁ బొందుగ గేలఁ బూని 10440

( 735. కనకమయజైనబింబశిబికాగ్రహణకథనము. )

బలువైన యాజైనభర్మరూపంబు
బలువిడి నాగుడిపై నొయ్య డించి
పట్టిమంచపుఁ బెనుపల్లకిమీఁదఁ
బెట్టి ముసుంగిడి పెద్దయు నగచి
శవముఁ గైకొనిపోవుసరవి నామంచ
మువిరలబలవంతు లగువారు మోవఁ 10450

దలలు వీడంగఁ గొందఱు రెండుగడలఁ
బలుదెఱంగులఁ బాడి పాడి శోకింపఁ
గొందఱు కాష్ఠము ల్గొని యేగుచుండఁ
గొంద ఱింగలము గైకొని చనుచుండ

( 736. పరకాలభృత్యకృతజైనబేరాపహరణము. )

నీరీతి భృత్యు లాహేమబింబంబు
దూరంబు గొనిపోవఁ దొఱఁగురక్తమున
మలయుచుఁ జేనున్న మఱిది మస్తకము
కలయంగఁ జూచి రక్తముజాడవట్టి
వత్తురో యనుచు నవ్వలఁ బరకాలుఁ
డత్తఱిం గడుబట్ట మగుపొదలోన 10460

నాతల డాఁచి హేమాకృతిఁ గొనుచు
నాతలఁ గడచి తా నరుగు నత్తఱిని
శ్రీరంగనాథుఁ డాశ్రితవత్సలుండు
కూరిమితోఁ దనకొఱకుఁ గా వచ్చి

( 737. పరకాలయోగిభక్తివిషయకాశ్చర్యప్రస్తావము. )

భక్తుఁడీకైవడిఁ బ్రాణంబు లొసఁగు
భక్తికి నాశ్చర్యపడి సంతసించి
కంటిరే నాభక్తు ఘనతరభక్తి

వింటిరే యొండ్రైన వివరించి మున్ను
అని నిత్యవరులతో నందంద బొగడి
వినతాతనూభవు వీక్షించి పలికె 10470

నాకొఱ కిపుడు ప్రాణము లిచ్చినట్టి
నాకేశసుతుని వైష్ణవశిరోమణిని
బొందితో మస్తంబుఁ బొందుగా మగుడ

( 788. లోకోపకారరచనాపణాసము. )

బొందించి నీముఖాంబుజసుధాధార
నొనయించి ప్రాణంబు లొసఁగింపతోడి
కోసరమ్ము వేగ సద్గురుభక్తినిరతు
నసఁ జని విహగేంద్రుఁ డరియముముటి ది
తనువున మస్త మత్తఱిఁ బొందుపఱచి
తనమహత్త్వము మహీస్థలిఁ గానుపింప
ఘనతరామృతమూర్తి గాఁన నెంతయును 10480

బొలుపారు నిజముఖాంబుజసుధారసముఁ
జిలికించి ప్రతికించి చెలఁగించి యతని
గురుభక్తి వేగఁ దోకొనివచ్చి రంగ
నరునిపాదములక్రేవల నిల్పెఁ బ్రేమ

( 789. కృష్ణపురీప్రాప్తిక్రమము. )

నరిదండధరుఁ డంత నాహేమగౌద్ధ
గురుబింబ మీరీతిఁ గొనిపోయి పోయి
కడుబూర మరిగి చీఁకటివిరిచుక్క
పొడుచువేళకుఁ గృష్ణపురిఁ జేరవచ్చి
యనుచరముఖులకు ననిచె దూరంబు
ననుదెంచితిమి వ్రజ చాల నాకొనిచె 10490

బలువైన రేపటిపయనంబు సాగ
వలయు నేఁ డిచ్చోట వసియించు టొప్పు
దీనికై యందఱు దిట్టగాఁ గట్టి
పూని యొక్కెడ నిల్వఁ బోల దిచ్చోట
నుండరా దిఁకఁ దలాయొకదిక్కు చెదరి
యుండంగవలయు సూర్యుఁడు గ్రుంకుదనుక

( 740. జైనమతస్థకోపావేశకథనము. )

నని వేదబాహ్యమతాసక్తు డగుట
కనయంబుఁ గోపించి యాజ్ఞఁ గావించు
వడువున సౌగతవరమూర్తి రొంపి
మడియుండ వండు నుమ్మలి లోనఁ ద్రొక్కు — 10500

ననుచరవర్గంబు నాయూరిలోని
కనిచి తా నట నుండె నది చూచికొనుచు
నప్పు డామడి సేయు నాయూరికాఁపు
ముప్పిరిగొను పగ్గముల చుట్టతోడఁ
గ్రుచ్చిన మునికోల గొంగడిముసుఁగు
మచ్చల మచ్చల మట్టికాశయును
బలువైన కేలియంబటికుండ తనకు
నలవడ నడగొండ లననొప్పుచున్న
మీఁజైనయెద్దుల మెడకాడిమీఁద
గోటీరు వైచి నెక్కొని రొప్పికొనుచుఁ — 10510

( 741. పరకాలయోగివరాలోచనాప్రకారము. సదుపాయనిర్ణయము. )

జనుదెంచి యామడిచక్కి నాగేలు
పనుపడఁ గట్టి చొప్పడ దున్నవరుగ
నదిగని పరకాలుఁ డాత్మఁ జింతించి
యిది గానబడుఁ దున్ననిచ్చిన వీని

నని యంత నొక్కఁ డుపాయ మూహించి
యొనయ దున్నుచు నెదు రేతెంచువాని
నెడపక త్రిప్పుచు నెద్దుల మెడలు
విడిచి లో శంకలు విడిచి యిట్లనియె
దున్నినఁ జోళనాథునియాన నీకు
నిన్నాళ్ళు తేరసా మ్మిటు లిచ్చెందగునె  10540

( 742. మాన్యవిస్మయకప్రస్తావము. )

ప్రథమి వారల నెల్లఁ బ్రోచి మాతాత
గడియించినట్టి దీకాణాచి నేల
యన్యాయ మేటికి వడుగుము నాదు
మాన్యంబు గాని సామాన్యంబు గాదు
తుదిని యీ యూరను దొరకెడ్డి వేరె
మది గొంక కొండారుమాన్య మీరీతి
దున్నెడిలా గెట్లు తొలఁగు నీపనులు
విన్నార మేల క్రొవ్విరి కాఁపువాఁడ
కేనమేటికిఁ గందిగి:జను గాఁపు
వానిని వేచ కెవ్వలఁ జవి గాద  10580

యనుమాట నిజమయ్యె నని వాఁడుఁ దాను
ననయంబు గనిసి వా దడచి యామీఁదఁ
దగవున కొప్పి యిద్దఱు నేగుదెంచి
తగవువారలతోడఁ దమపను లొప్పిడిపి

( 743. సభాజనకలితవిచారణాప్రకారము. )

కట్టకానుక లిడి కడపట నిలువ
గట్టిగా నాకార్యగతి విచారించి
యలయున్న సభవార లాయిరుపురను
బిలిచి పరాంతకుఁ బిలిచి యిట్లనిరి

అతనికిఁ బాలుఁ బాయస మప్పములును
హితమతితోడ నీవిచ్చి రమ్మనిన
జానుగా వాని సర్చనుఁడు మస్తమునఁ
బూని తత్త్వేరణంబునఁ గొనిపోయి
కేదారభూమిచక్కిన గాచియున్న
యాదేవసుతునకు నది యిచ్చుటయును
బరివారమును దానుఁ బరకాలుఁ డంతె
పరిపూర్ణముగఁ బసాపడి సంతసించి 10570

( 746. ద్రావిడభాషారూపదశపద్యగ్రథనసమర్పణక్రమము. )

త్రిదశేంద్రవంద్యుని దేవదేవేశుఁ
బదిపద్యములచేతఁ బ్రణుతిఁ గావించె
మడిలోని యలహేమమయవిగ్రహంబు
వెడలంగఁ దిగిచి వేవేగంబ కడిగి
మునురాత్రిఁ గొనివచ్చునుదురున మఱియుఁ
బనుపడ మంచపుఁబల్లకిలోన
నీరవొందఁ బెట్టి మిన్నేరసేకరి
దరిత్రోవ నరుగుచుం దన్మార్గమునకు
సరస నొప్పెడు శౌరిసదనంబులందు
నిరవొందఁ బగలెల్ల నీరీతి నిలిచి 10580

( 747. మురారిప్రసాదస్వీకరణవర్ణనము. )

యాయాయిమూర్తుల ననువొంద నుతులు
సేయుచు వెండియుఁ జీఁకటిపడిన
మునుబోలె పుత్తడి మురిరూపు వేగఁ
గొనిపోవుచును దవ్వుగొని యేగుదెంచి
ఘనతరం బైన సంగమపురంబునకుఁ
జని ప్రొద్దుగ్రుంకెడిసమయంబునందు
నాపురవరనాథుఁ డై యొప్పుచున్న
శ్రీపతి యారగించినప్రసాదంబు

ననుచరసంయుతుం డై యారగించి
ననయంబు గ్రక్కున నయ్యారిత్రోవఁ 10590

( 748. హరికృతసహాయకార్యకథనము. )

తెలియక యాయూరితీర్పరిం గూర్మిఁ
బిలిపించి త్రోవఁ దెల్పెడువాని నొకని
ననుపుము సూర్యోదయం బైనదనక
ననిన నా డారీతి ననిపెద ననుచు
నరిగి మదోన్మత్తుఁ డై మఱచుటయు
నరిదండధరుఁ డంత నచ్చోటఁ గదలి
చనుచుండఁ దత్పురీశ్వరుఁ డై నయట్టి
వనజోదరుఁడు భక్తవత్సలుఁ డపుడు
బాణకృపాణచాపంబులునుభయ
తూణీరములుఁ దాల్చి తోడనే నడువఁ 10600

దెలతెలవార నేతేర నామేటి
విలుకానిఁ బరకాలవిభుఁడు వీక్షించి

( 749. భగవదంతర్ధానప్రకారవర్ణనము. )

మొయ్యది నీనామ మెద్ది నీయునికి
యియ్యెడ నాతోడ నెఱిఁగింపు మనిన
నరయంగ నను జగదభిరక్ష యండ్రు
పురుడింప సంగమపురితలవరిని
బూనిక మీ రొంటిఁ బోయెద రనుచుఁ
దోవ యేనును మీకుఁ దోడువచ్చితిని
అనుచు నంతర్హితుం డైన డెందమున
ననయంబు వెఱఁగంది యాపరాంతకుఁడు 10610

( 750. పరకాలయోగిసంతోషప్రక్రమము. శ్రీరంగనగరప్రాప్తివర్ణనము. )
కనకమయబుద్ధవిగ్రహప్రాప్తధనవ్యయద్వారా హరిమందిర నిర్మాణప్రకారము.

ఆనందబాష్పంబు లడరంగఁ బొగడి
శ్రీనాథుఁ డని యిచ్చఁ జింతించి యెఱిఁగి
దశరథసుతుని నాతనిహృద్యపద్య
దశకంబుచేత నెంతయు సన్నుతించి
మునుకొని శ్రీరంగమున కేగుదెంచి
కొనివచ్చు నలబౌద్ధగురుమూర్తిలోన
గొనప్రవేలిమాత్రంబు గొట్టించి డాఁచి
ఘనమైన కాంచనగాత్ర మంతయును
నజిరించి కరఁగించి నాణెంబు సేసి
కొఅదీర మూడవకోటఁ గట్టింప 10620

( 751. భక్తాంఘ్రిరేణునామకయోగికృతపుష్పకైంకర్యమహిమ. )

నాకాలమునను భక్తాంఘ్రిరేణుండు
శ్రీకాంతుఁ డైన యాశ్రీరంగపతికిఁ
దనరుప్రేముడి సుమదామకైంకర్య
మొనరింపుచుండెడి యొకమందిరంబు
చాయం బ్రహారంబు చనుదేరఁ జూచి
యాయెడఁ బరకాలు డాత్మ భావించి
కడిఁది సూత్రంబునంగతి సాల మిప్పుడు
నడిచాయువచ్చె వైష్ణవగృహంబునకు
వివరింప నితనినివేశ మిందులకుఁ
దివియకుండఁగరాదు తివియంగరాదు 10630

( 752. భాగవతకైంకర్యవైభవాధిక్యవర్ణనము. )

కమలలోచనుని కైంకర్యంబుకంటెఁ
గమలేశుభక్తుకైంకర్యంబు ఘనము

వేసర కలుగదిది వేలేండ్లు భక్తి
నేసేత హరిపూజ సేయుటకంటె
నొకభాగవతునకు నొకమాఱు పూజ
యకలంకమతిఁ జేయ నదియు మిక్కుటము
అనుచు నేకతమున హరుఁడు పార్వతికి
నొనరఁ బద్మంబున నుపదేశ మొసఁగెఁ
గావునఁ బరమభాగవతగేహమున
కీవలఁ జుట్టిరానిత్తు నీకోట 10640

( 753. హరిభక్తగేహావరణరూపప్రాకారనిర్మాణకథనము. పుష్పకైంకర్య నిరతత్త్వప్రశంస. )

యనుచు నావరణంబు నాగేహమునకు
ఘనతరావరణంబు గాఁగఁ గట్టించె
నావిధం బెల్లభక్తాంఘ్రిరేణుండు
భావించి వైష్ణవభక్తికి మెచ్చి
యిప్పు డీపరకాలుఁ డిట చేయునట్టి
యుపకారమునకుఁ బ్రత్యుపకారముగను
బెనుపొందఁగాఁ బిడ్డ పేరిడవలయు
ననిమాని మది నెంచి యాత్మజుభాతి
యనిశంబు దామంబు లర్పించునట్టి
తనముపువ్వులనారఁ దరగుకత్తికిని 10650

( 754. పరకాలయోగికృత శ్రీరంగగోపురమహానసాదినిర్మాణము. )

అరిదండధరునాము మనువొందఁ బెట్టి
పరమానురక్తుఁడై పరకాలుఁ డంత
వరగోపురంబును వంటసాలయును
గరమర్థి గణజంబుఁ గట్టింపఁ దలఁచి
కలయ నాచార్యులఁ గాసీల నపుడు
బిలిపింప వారలు పెనుజన్నిదములు

చంకల శిల్పశాస్త్రములపుస్తములు
నంకవోఁ జుట్టిన వలుదపాగలును
గొలదిరేఖలు వడిఁ గోసినయట్టి
మెలమించి వలకేలి యినుపకమ్ములును 10660

( 755. నానావిధకైంకర్య పరిపూర్తిక్రమవర్ణనము. )

నలవడ శిల్పశాస్త్రాగమవేత్త
లలపరాంతకునకు హస్తము ల్మోగిచి
చేరువ నిలువ నీక్షించి భాగవత
పారిజాతంబు చొప్పడఁగ నిట్లనియె
నడుఁగక మీర లిన్నాళ్ళు ప్రయాస
పడితిరి శ్రీరంగఫణిశాయికొఱకుఁ
బడిన నేమయ్యె మీపడుపాటులెల్ల
నెడపక రంగేశుఁ డీడేర్పఁగలఁడు
ఒప్పగా మీధనం బొప్పింతు మీఁద
నప్పగా గణజంబు నాగోపురంబు 10670

( 756. శిల్పివరకృతనిజకైంకర్య స్వీకరణవిషయకప్రార్థన. )

ననువొంద రెండవయుమ్మహానసము
నొనరించుఁ డని పల్కి యుడుగర లొసఁగ
వేవేగ వారు నవ్విధి నన్నిపనులుఁ
గావింతు మని యొప్పి క్రమ్మఱ వచ్చి
తమకు నీవలయునర్థము వేఁడునపుడు
తమకించి యందుఁ గొందఱు తమ్ముఁ జూచి
తమచేతికాను లిందనుకను మెసవి
క్రమమున నీయూడిగములు సేసితిమి
అలవడఁ దముసేయునట్టియాపనులు
కొలుపలే వనిమొప్పుగొనుటయు లేదు 10680

( 757. నానావిధచిత్రరచనాసంయోజన రీతివర్ణనము. )

విదితంబుగా మాకు వెనకకు మీరు
మొదలవెట్టెడు లెక్క మొదలవెట్టించు
చేకొని యేముసేసినయందుఁ గడమ
లేకుండఁ జూచి పాలించు మోసామి
చప్పటికుముదంబు చదరపానంబు
కప్పుచూరులు కంబకాళ్ళు పద్మకము
నొగి మహాజగతియు నుపజగతియును
దగినగట్టను గపోతము సంతనయును
మొదలైన తమపని మొగములలోను
గొదవ చీమంత చేకూరకయుండ 10690
నీసునం దవిలి దా రీతిఁ బనులు
చేసేతఁ దనుచేతఁ జేయింపుచున్న

( 758. పరకాలయోగికృతశిల్పివిషయదయాప్రసారాది. )

కాసిడు తమకొక్క కాసిడు సరికి
జేసికి గొట్లాడి పెనఁగిచూచితిమి
అన విని పరకాలుఁ డాశిల్పివరులఁ
గనుఁగొని యెంతయుఁ గరుణ వాటించి
సారసభవముఖుల్ సవరింపలేని
శ్రీరంగవిభుసేవఁ జేయువీరలకు
వ్యర్థంబు మిగుల ననర్థంబు నైన
యర్థమిచ్చుట కొంత యని విచారించి 10700

( 759. నావికాహ్వానప్రకారవర్ణనము. )

పరమార్థముగనింకఁ బరమార్థ మిచ్చు
టరయఁ బ్రత్యుపకార మనుచుఁ గావేరి
ఘనవేగమున రెండుగడ్డలుం జమరు
కొని పార నొకనావికుని రహస్యముగఁ

బిలిచి కాంచనములు పెక్కుగా నొసఁగి
యలవిమీఁజినధనం బది తెమ్మటంచుఁ
గాసింపుచున్నయాకాసీల నెల్ల
నాసమ్మతమున నీనావ యెక్కించి
కొంచక నట్టేటఁ గొనిపోయి పుట్టి
ముంచి నీవిందిచే ముంచిరమ్మనుచు 10710

( 760. పరకాలయోగికృతశిల్పిప్రముఖభక్తజనోపకారక్రమాలోచన. )

సమకట్టి తత్తకజనఃను వీక్షించి
క్రమమున మీకు నీఁగలధనం బెల్ల
సవరింతు లెక్కతో సవరి నయ్యేటి
యవల శ్రీసీపతీర్థాంతరంబునను
ఉరుతరనిక్షేప మున్నది తనది
వరుసతో నావెంట వచ్చెదరేని
యని వారి నందఱి నాపుట్టిమీఁద
ఘనమైన యొకమూఁక గాఁగ నెక్కించి
తామున్నయవలికి దాఁటి కాసీల
నామహాసింధుమధ్యమున ముంపించి 10720

( 761. హరిప్రార్థనాప్రకారము. సంసారసాగరతరణోపాయరూప ప్రపత్తికలనము. )
భక్తజనమోక్షప్రాప్తిక్రమవర్ణనము.

ముకుళితహస్తుఁడై మురవైరిఁ దలఁచి
సకలలోకేశ ! కంజదళాయతాక్ష !
భవదీయకైంకర్యపరులైన వీరి
భవముక్తులుగఁ జేసి పరమపదంబు
చేరునట్లుగఁ గృపసేయు మటంచుఁ
బారమార్థముగఁ బ్రపత్తిఁ గావింప

లోకంబులెల్ల నాలోకించుచుండ
నాకసంబున వచ్చి యాదివాహనులు
పక్కన వారి విమానంబులందు
నెక్కించుకొని ముక్తి కేగి రంతటను 10730

( 762. పరకాలయోగి కైంకర్యనిరతత్వ వర్ణనము, నాగపురిజైన బింబాదర్శనాశ్చర్యకథ. )

బరకాలయోగి యెప్పటియట్ల మగుడ
నరిగి తా రంగవిహారి సైయుండె
నట నాగపురిబౌద్ధు లాగుడిలోనఁ
బటుతర హేమబింబము లేకయున్నఁ
బొగులుచు నాశ్చర్యమును జెంది సదన
మెగున బంగరుకుండ యెడయుటఁ జూచి
వడిసినరక్తంబువడువు నచ్చోటి
యడుగులఁ బొడఁగాంచి యావీట నున్న
ఇల నీటిలోఁజాడ లెత్తంగఁ జాలు
తలవరులను బిల్చి తచ్ఛాయఁ జూప 10740

( 763. చోరాగమనచిహ్నదర్శనప్రకారము. )

జలజ తోమర శంఖ చక్ర దంభోళి
హలచిహ్నితము లైన యరిదండధరుని
యడుగులఁ బొడ గాంచి యచ్చట కడను
యడుగులు గని కడు నాశ్చర్య మంది
యలవి నల్పుఁడె యట నలవెన్నదొంగ
బనిము వాటించిన బలుదొంగ యనుచుఁ
గొలఁది కనుంగొని గుఱి వ్రాసి మఱియుఁ
గొలిచి చూచుచు జాడగూడ నెత్తుచును

( 764. చోరాగమనచిహ్నదర్శనోహాది ప్రస్తావము. )

శ్రీరంగపట్టణప్రాప్తిక్రమము.

గుడిపడమటఁ జోరకులు డిగినట్టి
వడువుఁ జూపుచు బౌద్ధవారంబు మునుపు 10750

చోరులు సనినట్టిచొప్పు జూచుచును
బోరున నటు పోయి పోయి యొక్కెడను
సుడిగాలి వాని నించుక మాసి మడుసు
పడియున్న నొండొరుఁ బరికించి కాంచి
గురులు వ్రాయుచు నడుగులు గొల్చుకొనుచుఁ
బెరచోటఁ జొప్పు దీపింప నెత్తుచును
ఘనమైనచట్టునం గానరాకున్న
బునుకగ వీపునఁ బారలియెత్తుచును
అలపరకాలుని యడుగని తెలిసి
బలువిడి శ్రీరంగపట్టణంబునకుఁ 10760

( 765. కనకమయబుద్ధబింబాహరణ విషయక ప్రశ్నాది. )

జనుదెంచి యటనున్న శాత్రవాంతకుని
గని కోపమునను సౌగతు లిట్టు లనిరి
తెచ్చినతమవంశదేశికు మరల
నిచ్చెదో నొచ్చెదో యేమికావలయు
ననినఁ బరాంతకుఁ డాశ్చర్యపడుచుఁ
దనుగానివానిచందమున నిట్లనియె
నెచ్చటిమీగురుం డేటివాఁ డాతఁ
డెచ్చట నుండు నా కెఱిఁగింపుఁ డనిన
నలనాగపురి నున్న హైమబింబంబుఁ
దెలియవే చేచేతఁ దెచ్చిన దొంగ 10770

అలవిరివారల నణ కించినట్లు
పులిమిపుచ్చిన నిన్నుఁ బోనీము నేఁడు
నడుగక మాసామ్మునకు నొప్పఁజెప్ప
వెడఁగ! రాజ్యమువారు విన్న మాటాడవు
వలవదు చెడిపోవవలదు నీమనసు
కొలఁదిఁ జెప్పితిమి యీగొంటుబాగేల
యెడపక తమమూర్తి నిచ్చితివేని
తడవము నిను దాఁకి తలఁపము తుదిని
ఈవ తెచ్చితి వని యేబాసయైనఁ
గావించెదము నెంత కట్టుమడ్డునను 10780

కితవ! నీవిటకు దొంగిలితెచ్చి తనుచు
నతివెతలకు నిల్చి యాడెద మిపుడు
అని తనకొంగు చయ్యనఁ జుట్టిపట్టి
కొని పోకు మని కసిగుంపుఁ గావింపఁ
దన తెచ్చు టెఱిఁగి రిత్తతి నంచుఁ దెలిసి
యనియె వారలతోడ నాపరాంతకుఁడు
పదర నేటికిఁ గొంగు పట్టంగనలదు
వదలుండ యది దొడ్డవారిచేఁ బడియె
నాసామ్ముఁ దెచ్చు టేనరయుదుం గాని
చేసేత నేను దెచ్చినవాఁడ గాను 10790

( 768. బొద్ధబింబచ్ఛేదనకార్యవిషయకప్రశ్నాది. )

ఎఱుఁగను నను మీర లీరీతిఁ బఱచు
టెఱిఁగిన యది గని యిట తెచ్చువారు
గ్రన్ననఁ బ్రతిమ భంగముసేయఁ జూతు
రెన్నిచందంబుల నీరంతు వలదు
ఫలమువారలో కాక పనిమాలినట్టి

చలమువారలొ ష్టట్టి జగజోలి యేల
పిసిఁడి బాగేదిచెప్పిన బులుగునకుఁ
బసిఁడి నాచెప్పినపగిది నిచ్చినను
గైకొని యేఁ జిటుకన్నవేలు గడమ
కాకుండ మీకొప్పు గావింతు ననిన 10800
జైనులామాటసూక్ష్మముగాన లేక
యూనినగురుభక్తి గొమొదవ నిట్లనిరి
ఈనడిగినవెల్ల నిచ్చెద మిప్పు
డినతలం బత్ర మిచ్చెదవేని జెప్పు
మన సమ్మతించెఁ బరాంతకుం డపుడు
ఘనులఁ గొందఱ సభగాఁ గూడఁబెట్టి
తనవాగిపనులచందముఁ జెప్పి కొన్ని
దినములు గడు విడి తేటతెల్లముగ

( 767. పరకాలయోగిప్రదత్తపత్రరీతివర్ణనము. )

సమమాసతిథివారసరణు లేర్పఱచి
ప్రమదంబుతోడ శ్రీపరదండధరుఁడు 10810
అమరజైనుల కిచ్చినట్టిపత్రంబు
క్రమమెట్టిదనిన మీగడువు నాఁటికిని
పిసిఁడి బాగేదిచెప్పిన పులుఁగునకుఁ
బసిఁడి నేఁ జెప్పినపగిదిమీరొసఁగఁ
గైకొనితుదిఁ జిటుకన్నవేలుగడమ
గాకుండ మీకొప్పుగావింతుననుచు
స్వరుచిమరియొడఁ బడిసవరించుపత్ర
మరయునిందుల పత్రహస్తునొప్పంబు

( 768. శ్రీరంగనాథసాక్షికరణప్రస్తావము. )

ఆరంగపతి సాక్షులగువారిరొప్ప
మారంగపతియంచు నపుడువ్రాయించి 10820

యలపత్రమంది తానాసౌగతులకుఁ
జెలరేగియిచ్చె నిచ్చినబౌద్ధులపుడు
తమపురి కరిగి యాధనము గైకొనుచుఁ
గ్రమమొప్ప మగిడి యాగడువునాఁటికిని
అరుదెంచి యీఁదగు నర్థంబు లోసఁగి
పరకాలు నిజగురుప్రతిమ వేఁడినను
మునుపు దాఁచినబౌద్ధముఖ్యుని బొందిఁ
గనుపట్టు నలచిటికెనప్రేలు గొనుచు
నేతెంచి వారల కీవచ్చునంత
నాతతశోకార్తు లగుచు నెంతయును 10830

( 769. జైనగణకోపావేశాదిప్రకారవర్ణనము. )

గనలిజైనులు పరకాలునిం జూచి
యనిరి నీమాట సత్యం బని నమ్మి
మునుప దొంగిలినసొమ్మును నీకు నుండ
ధనమిచ్చితిమి మంచితనమున మఱియు
నిచ్చిన తమగురు నీక యీప్రేలు
దెచ్చి యీవచ్చె దేతెఱఁగునం దమకు
నిదె మున్ను నీవు మా కిచ్చినపత్ర
మదె సాక్షు లున్నార లోగాములకును
అనినఁ బరాంతకుడనియె వారలకుఁ

( 770. పత్రప్రదర్శనప్రకారము. )

బనిలేని యీ వట్టివలుమాట లేల 1C840

పన్ని నేనిచ్చిన పత్రంబులోన
నున్నచందంబున నొప్పింతు మీకుఁ
బదర కాపత్ర మీప్రజలముందరను
జదివించు డందు నేనరవినున్నదియు

నందు నున్నందుల కావగింజంత
చిందుసేసిన నోరసేసిన వైన
నినుమడిగా నిత్తు నిప్పుడు నీసొమ్ము
కినియక తగవునం గెలిచి కైకొనుఁడు
అనిన వా రాపత్త్ర మాసాక్షి వారు
వినుచుండ వడిఁ జదివింప వారలును 10850

గైకొని తుదిఁ జిటికెనవ్రేలు కడమ
గాకుండ మీ కొప్పు గావింతు ననుచు
నా కులో నున్నది యంతియేకాని
యాకాంచనాకృతియంతయు మీకు
నొప్పింతు ననుట లేకుండుటం జేసి
తప్పు గైకొని పట్టి తగ వేది మీకు
నన విని తగవున హైన్యంబు నంది
చని సౌగతులు చోళజననాథుఁ గాంచి

( 771. చోళరాజకృతవిచారణాప్రకారము. మహాద్రోహదోషారోపణకథనము. )

తమ హేమగురుఁ బరాంతకుఁడు గైకొన్న
క్రమ మెఱింగించి వెగ్గలముగా లోనఁ 10860

బరిభావ మీ నొడంబడిన భూవిభుఁడు
కర ముగ్రమునఁ బరకాలు రావించి
యేమోయి పరకాల ! యింతయధర్మ
మీ మెయిం గావింప నిది నీకుఁ దగునె
యే నెంతచెప్పిన నిట్టి నీయోజ
మానకపోయితి మాటిమాటికిని
గుఱుతైన సౌగతగురుముఖ్యు నీతి
దొఱఁగి తెచ్చుట మహాద్రోహంబు గాదె
యన విని పరకాలుఁ డవనీశుతోడ
ననియె రాజని నిన్ను ననరాదుగాక 10870

( 772. పరకాలయోగికృతప్రత్యుత్తరరీతివర్ణనము )

యాగమబాహ్యులరై యున్నయట్టి
సౌగతముఖుల నెక్కడఁ బొడఁగన్న
గతము సేయఁగఁ దగుఁ గాక భూపతికిఁ
బ్రతిఁ బెట్టి యవి తుది౯ బాలింపఁ దగునె
మును త్రిపురాసురమోహార్థముగను
దనుజారి యట్టిమతంబుఁ గల్పించి
తుదిఁ దానె తన్మతస్థుల నెచ్చనీక
పదివేలవిధముల భంజింపవలయు

( 773. పరకాలబుద్ధజనపరస్పరవాదాచరణప్రస్తావము. )
పరకాలయోగివిజయక్రమము.

నని యుపన్యసించినాఁ డటుగాని బౌద్ధ
జనగురుహరణంబు సలిపితి నేను 10880
దొడరి యందులకు నాతోడ వాదింప
విడువుము బౌద్ధుల వెస నింటిలోన
జాడతో నాగమసరణి వాదించి
యోడినవారల నోసరింపు మాజ్ఞ
యనిన భూవిభుఁడు పరాంతకబౌద్ధ
జనులతో వాదింప సమకట్టుటయును
బరకాలుఁ డప్పు డాపరవాదిబలము
నురుతరానంతవేదోక్తఖడ్గముల
నలినలిఁ జేసి యెంతయు వీఁగఁదోలి
గెలిచిన నరుదంది క్షితినాథుఁ డప్పు 10890

( 774. చోళరాజకృతనమస్కారసంమాననాదిక్రమము. జైనగణదండనరీతి. )
శ్రీరంగనగరప్రాప్తివర్ణనము.

డరిదండధరునకు నవనతుం డగుచుఁ
బరమనస్తువుల సంభావించి యపుడు

హీనవాదులఁ జేసి యెదిరించి నట్టి
జైనుల దండించి జగములు వొగడ
మక్కువ బరకాలు మదదంతిరాజు
నెక్కించి పురమెల్ల నేగించి పొగడి
యుల పట్టభద్రున కెన్నిచిహ్నములు
గల వన్నిచిహ్నముల్ కడఁకమై నొసఁగి
యనిచినఁ బరకాలుఁ డారాజు వీడు
కొని రంగపురికి నేగుచునున్నతఱిని 10900

( 775, షణ్ముఖాంశభాసురసంబంధనామక శైవాచార్యకృతపరకాలయోగికవిత్వ-
బిరుదాసహిష్ణుత్వవర్ణనము. పరస్పరవాద ప్రస్తావము. )

ధరలోనఁ ద్రికవినా దనరినయట్టి
హరభక్తుఁ డగు షణ్ముఖాంశసంభవుఁడు
సమ్మదం డనుపేరి శైవమతార్యుఁ
డన్మహాత్మున కెదురై డాయవచ్చి
ధర నాశుమధురవిస్తారచిత్రముల
నిరవొందుకవిత కధీశ్వరుం డనుచు
గరమర్థి వాయిదకాండ్రముంగలిని
బిరుదుకాళియలచేఁ బెల్లునాదింపఁ
బలుదెఱంగులవానిపజ్జనె శవణి
మలహరిఢక్కాదిమహితవాద్యములు 10910

వాయింప సమదంతివాహనారూఢుఁ
డై యేగుదెంచు నయ్యారిదండధరుని
గనుఁగొని తనయున్నఘనపురంబునకుఁ
జనుదేర వలయు నోసర్వజ్ఞ యిప్పు
డన విని పరకాలుఁ డనియె నాతనికి
వనజాతనేత్రునివాసంబు లేని

గ్రామంబుఁ జొరనిక దొరకఁ బ్రతిన
యే మెట్లవచ్చెద మీపురంబునకు
నన విని త్రికవి యయ్యారిశేమునకు
ననియె ముందర మదీయంబై నవీటఁ 10920

గలదు నారాయణాగార మీవేళఁ
గలియుగంబున నది కనుపట్టలేదు
రవివంశతిలకుండు రాముండు తొల్లి
యవనిరక్కసుల వేఁటాడుచు నచట

( 776. శైవవైష్ణవమతాచార్యపరస్పరవాదచాతుర్యక్రమవర్ణనము. )

నెలకొన్నకతముఁ న నిఖిలలోకముల
నలపీడు రామవియత్పురం బనఁగఁ
బరగె నావుడు విని పరకాలుఁ డటకుఁ
గరమర్థి నడుగ వేడ్కల శైవగురుఁడు
సకలోపచారము ల్సవరించి యతని
యకలంకసామర్థ్య మరయంగఁ దలఁచి 10930

ఘనతమై భువి సర్వకవితావిభుండ
ననిపించుకొను టెట్టులైన నీ విపుడు
కడలిశంఖంబు లెక్కడకు రాఁ గవిత
యొడఁగూర్చి శేనినీకొప్పు నాబిరుద
మన విని పరకాలుఁ డాశైవగురుని
గనుఁగొన లేనవ్వు గనుగొర గదుర
నన్నేలినట్టి క్రొన్ననవిల్తు తండ్రి
సన్నిధిఁ గాని యే సవరింపఁ గవిత

( 777. పరకాలశిష్యకక్షితవాదిప్రతివాదితారతమ్యరీతివర్ణనము. )

నావుఁడుఁ బరకాలు నంచిన శిష్యుఁ
డీవేళ దేవరకే మింద రుండ 10940

శ్రీపతికృపను నీశిష్యప్రశిష్యుఁ
డోపఁడే యీమూఁడు నోడించుపనికిఁ
దుది పీని నేలినధూర్జటి వచ్చి
యెదిరిన నీవేల యేమె చాలుదుము
కొండతోఁ దగరు డీకొనినచందమున
నందజాధిపుతోడ నహి పోరునట్లు
మఱి నభోమణిఁ గీటమణిఁ జంకసేయు
తెఱఁగున నీదైన తెఱఁ గెఱుంగమిని
గడుతామసుం డైన కతన మీతోడఁ
దొడరె నింతియకాని తుది నెన్నిచూడ 10950
నతనికి మీకును నంతరాంతరము
మతి నెన్నఁచో హస్తిమశకాంతరంబ

( 778. హరిమూర్తిసంపాదనయత్నక్రమకథనము. )

యనిన శిష్యులఁ జూచి యాపరకాలుఁ
డనియె నెన్నిన మీర లంతటివార
లైన నీతనిగర్వ మడఁచుట కిప్పు
డేనేమి మీరేమి యీపురిలోన
వేచని యిందిరావిభునియావాస
మేచక్కి నుండునో యెఱిఁగిరం డనినఁ
బూనిక శిష్యు లాపురమెల్ల వెదకి
కానక పరకాలుఁ గాంచి యిట్లనిరి 10960
వెదకితిమయ్య యీపీటమందునకు
వెదకినలేదయ్య విష్ణుమందిరము

( 779. పరకాలయోగదృష్టిప్రసారనిర్ధారితహరిమూర్తిస్థితిక్రమకథనము. )

అన విని పరకాలుఁ డాపురం బెల్లఁ
దనదివ్యయోగవిద్యాదృష్టిఁ జూచి

ముదుకగుల్లలలోన ముత్తియం బున్న
చదురునం బెక్కుపాషండులలోన
మకరకుండలధారు మదిఁబాదుకొలిపి
యొకవైష్ణవీమణియుడివోనికూర్మి
ననయంబు పాషండులగు తమవారు
గనకుండ దొంతులకడ నుట్టికుండ 10970
ముద్దుగారెడు వెన్నముద్ద కృష్ణయ్యఁ
దద్దయుభక్తి వస్త్రముచుట్టి దాఁచి
పగలెల్ల వారిలోపలఁ దాను నొకతె
యగుచు వారాడినయట్ల యాడుచును

( 780. శ్రీకృష్ణస్వరూపవైభవము. )

దమవారు నిద్రించుతఱిఁ బుండరీక
విమలాక్షు పరానులవిందు గోవిందు
సలలితాంబువుల మజ్జనము నొనర్చి
ఫలపుష్పధూపదీపముల నర్పించి
తొంటిచందమున నందునిజవరాలి
చంటిపాపని నిడి సతతంబు నిట్లు 10980
హరిభక్తిపరమతి యైన యాసాధ్వి
సరవి యంతయు మానసంబునఁ దెలిసి
తెలయంగ్గఁ దనకన్నవిధము శిష్యులకుఁ
దెలిపి మీరి పుడు సందేహింప కరిగి
యలకృష్ణతోఁగూడ నాకాంత నేను
బిలిచెద ననిచెప్పి పిలిచి తోతెండు
అన విని పరిజనులట్లకా కనుచుఁ
జని యటనున్న వైష్ణవిఁ జేరవచ్చి
కనుఁగొని యాపరకాలువాక్యములు
వినుపించి రమ్మన వెఱఁ గందికొనుచు 10990

సతతంబు నీకలశములోనినంద
సుతు నర్చనముసేయుచొప్ప నాతలఁపు
నేనెఱుంగుదు గాని యింటిలోవారు
గాన రీగతి యెట్లు కనియెనో ఘనుఁడు
మానుగా నతఁడు నిర్మలుఁ డైనయోగి
కాని సామాన్యుండు గాఁడు భావింప
న్వైష్ణవోత్తము నంఘ్రిపద్మములు
సేవించి యభిమతసిద్ధిఁ బొందెదను

( 781. వాసుదేవసాన్నిధ్యవైభవసంతోషప్రకారము. )

అని కుండలో నున్న యావాసుదేవుఁ
గొని కూర్మితోడ నక్కునఁ జేర్చికొనుచుఁ 11000

గరమర్థితోఁ బరకాలుసన్నిధికి
నరుదెంచి శ్రీకృష్ణు నతని చేనొసఁగి
ముదమున నడుగుదమ్ములమీఁద వ్రాలి
పదివేల తెఱఁగులఁ బ్రస్తుతింపుచును
ఆలోలసంసారమనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్నదానఁ
బరకాల! తావకపదపద్మభక్తి
తరణిచేతను నొక్కదరిఁ జేర్పు మనుఁడుఁ
బరమసంతుష్టుఁడై పరకాలుఁ డంతఁ
బరమకృపారసభరితగాఁ జేసి 11010

( 782. పరకాలకృతసంబంధనామకశైవాచార్య వాదాహ్వనక్రియము. )
చిత్రకావ్యముకుటబంధరచనాదిప్రకారము,
తత్సమపరీక్షణరీతివర్ణనము.

చలము ముప్పిరిఁ గొన్న సంబంధుఁ జేరఁ
బిలిచి యప్పుడు ప్రతాపించి యిట్లనియెఁ

దలఁపోయ నాకవిత్వములోని మేలు
దలఁపోయ నీరమాధవుఁ డొండు దక్క
నెఱుఁగంగలేరు బ్రహ్మేంద్రాదులైన
నెఱిఁగిన నీమూర్తి యెఱుఁగంగ వలయు
ననుచుఁ గాళియభేది కభిముఖుం డగుచుఁ
దననేర్పు మెఱసి యెంతయుఁ జిత్రగతుల
నలశౌరిమీఁదట నంకితంబుగను
జలధిశంఖంబు లచ్చటికి నేతేరఁ 11020

బదిమూట నొక్కప్రబంధంబుఁ జేసి
హృదయంబులోఁ గన్న యాశార్ఙ్గపాణి
ననువొంద నేఁడు ప్రత్యక్షంబు గంటి
ననుసర్గములతోడ నలవడి యొప్పఁ
దగ ముకుటాఖ్యబంధంబుచే భేద్య
మగునట్టి చిత్రకావ్యముఁ బ్రకటింప

33. (శైవాచార్యసంతోషప్రశంసనాది, తత్కృతపరకాలయోగివైభవవర్ణనము. )
నిజాపరాధక్షమాపణప్రార్థనాక్రమము.

విని శైవగురు డంత నెఱఁగంది పొగడి
కనుఁగవ బాష్పము ల్గడలుకొనంగ
నరిదండధరుని పాదాంబుజాతములఁ
గరమర్థి బ్రాలి మై గరుపాఱ నిలిచి 11030

మురవైరి యవతారమూర్తిని నిన్నుఁ
బరుఁ డని తలపోసి పామరబుద్ధిఁ
దొడరిన యిమ్మహాద్రోహంబు నీవ
కడతేర్చి క్షమియించి కావవే తండ్రి!
యని పెక్కుభంగుల నభినుతి సేసి

( 784. పరకాలయోగిప్రాప్తచతుష్కవిత్వబిరుదావళి. రాజసంమానాది. )

వాసుదేవసపర్యాక్రమవర్ణనము.

పెనుపొందఁ బరకాలుబిరుదుకాహళికఁ
గొని భూమిఁ ద్రికవులకును జతుష్కవుల
కును రాజ వనుచు నెక్కొనఁగఁ బూజింపఁ
గరము వేడుకఁ బరకాలుఁ డావేళఁ
గరమర్థి నతఁ డిచ్చుకనకాంబరముల 11040
నలనందసుతునకు నర్పించి యచటి
కలధౌతమణిమయాగారంబునందు
వరవైభవముల నవ్వాసుదేవతనయుఁ
దిరమొందుప్రేమఁ బ్రతిష్ఠఁ గావించి
జనులెల్ల వినుతింప సంబంధు వీడు
కొని కవిశేఖరు ల్గొలిచి యేతేర
పరకాలు మిగుల సంభావించి రంగ
పురమున కనిచె నప్పుడు పరాంతకుఁడు
శ్రీరంగమున కేగి శ్రితకల్పతరువు
శ్రీరంగనాథుని సేవించి యంత 11050

( 785. శ్రీరంగక్షేత్రప్రాప్తిక్రమము. రంగనాథకైంకర్యప్రశంసాది. )

గట్టిగాఁ దా మున్ను గరశాసనములను
గట్టించినట్టిప్రాకారముల్ చూచి
నలువార నల్లసేనపుజంగరాల
నెలమి నీసాలంబు లేను గట్టింతు
నని విన్నవించి యే నట్ల యీడేర్చి
తనయంబుఁ గరుణించి యప్పుడ యేను
గట్టిగా మంచిబంగరునీలమణులఁ
గట్టింతు ననిన యాగతిన యీడేర్తు

నీరీతి విన్నపం బేలకో యపుడె
శ్రీరంగనాయక సేయలేనైతి 11060

( 786. శ్రీరంగనాథప్రత్యక్షవైభవము. పరకాలయోగి భక్తిపారవశ్యప్రశంస. )
తత్కృతహరిమందిర నిర్మాణ కైంకర్య క్రమము.

నని భక్తిపరవశుం డగుచు శోకింప
ననయంబు మెచ్చి శ్రీహరిరంగవిభుఁడు
పరకాలునకు వేగఁ బ్రత్యక్ష మగుచుఁ
బరమానురక్తితోఁ బలికె యోగీంద్ర!
పాటిమీఱిన భక్తిపరత నీకట్టు
కోట లెన్నినరాతికోటలేవయ్య!
వనజభవాదులు వాసవాదులును
దినకరచంద్రాదిదివిజులుం గూడి
నెట్టన జాలిమానికములు చరులఁ
గట్టిరాళులనెన్ని గట్టి రన్నియును 11070
నీవు గట్టించుమన్నియలసాలముల
కావగింజంతకు నవి యీడు రావు
అనుచుఁ గౌఁగిటఁ జేర్చి నరిదండధరుఁడు
వినతుఁడై వేవేలవిధములఁ బొగడి
తనసేయువిజయమంతయు నేర్పుతోడఁ
దనదేవి కెఱిఁగించి తదనంతరంబ

( 787. పరకాల యోగికృత భద్రాశ్రమవాసక్రమము. భాగవతపూజావైభవాధిక్య కథనము. )

పరమేశుఁ డగురంగపతియనుమతిని
బరమవిరక్తుఁడై పత్నియుం దాను
నరిగి కురంగేశు నావాస మగుచుఁ
బరమపావన మైన భద్రాశ్రమమునఁ 11080

దనరెండవమున రంగధవ్రుఁ బాదుకొల్పి
యనుపమయోగవిద్యాసక్తి నుండెఁ
గావున నెన్నిసంగతుల భాగవత
సేవ సేసినవాఁడె శ్రీవైష్ణవుండు
హరిపూజకంటె శ్రీహరిభక్తపూజ
పరికింప నధిక మెప్పాటున నైనఁ
బరకాలయోగి యాభద్రాశ్రమమున
నురుయోగసక్తుఁడై యుండె నేఁటికిని
నీఱజి లోకములెల్ల మెచ్చఁజేసినవి
యాఱుకైంకర్యంబు లాఱుకబ్బములు 11090

(768. పరకాలయోగిరచితద్రవిడభాషారూపగ్రంథచతుష్కరసగీతిగాంభీర్యాదివైభవము.)

నల మహాశ్రీవచనాభిధానమున
నలవడఁ గృతియందు నాదికావ్యంబు
తిరుపతులందు వర్తిలుభాగవతుల
యరయఁగాఁ గృతకృత్యు లనునర్థ మొదవ
నెనసి రెండవకృతి యిరువది పాట
దనరార ఘటియించె దంటకం బనఁగ
ఘనచిత్రకావ్యభాగస్థితి యనఁగ
ననువొందుచుండ మూఁడవప్రబంధంబు
తలఁప మహాతనుదళము లనంగ
నలరె నాలవకృతి యైదవకృతియు 11100
ధరణి నెన్నఁగ నీదుదండకం బనఁగ
గర మొప్ప నాల్గవకావ్యంబు చేసెఁ
బరమపావనమైన పరకాలుచరిత
ధర నెవ్వరేని తద్భక్తిపూర్వముగ
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను
దనర వారలకుఁ బ్రత్యక్షమౌ శౌరి

యకలంకసిద్ధులు నభిమతార్థములు
సకలసిద్ధులుఁ గరస్థలి నుండుననుచు

( 789. గ్రంథసమర్పణక్రమము. కవివంశమహిమ. )

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని 11110

అతిలోకమతికి శేషాచలరాజ
సతికి సరోముఖ్యభక్త సంతతికి
సంకేతంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందనరత్న శుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ

( 790. నిజకవితాప్రశంస. సప్తమాశ్వాసనిగమనము.)

సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ 11120

కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగ సప్తమాశ్వాస మయ్యె.



# పరమయోగి విలాసము.

## అష్టమాశ్వాసము.



(791. శ్రీదేవీవైభవకథనము, శ్రీవేంకటేశస్మరణాది. శ్రీరంగరాజమాసోత్సవాదివర్ణనము.)

[ ద్విపద ]

శ్యామసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి!
వనమాలి! యనఘారువరదానశీలి!
జలధికన్యాముఖ్యజలజలోచనలఁ
గలసి విచిత్రవైఖరులు దీపింప
సంతతోత్సవములు జరగ శ్రీరంగ
కాంతుఁ డెంతయును బ్రకాశించుచుండె 11130

నలపరాంకుశముఖ్యు లగుయోగివరులు
పలికిన దివ్యప్రబంధరత్నములు
వినుచువారల గారవింపుచు భక్త
జనపోషణైకదక్షత నుండె నంత

(792. వీరనారాయణాఖ్యగ్రహారప్రాశస్త్యము. తన్నగరస్థభాగవతవైభవకథనము.)

విమలమైయొప్పు కావేరిచెంగటను
రమణమై వీరనారాయణం బనఁగ
గ్రామ మొప్పును శ్రుతిగ్రామప్రవీణు
లామహానగరంబునందు నుండుదురు
వీరనారాయణవిభుఁ డనువేరి
శౌరితనూజుఁ డచ్చటఁ బెన్నుమిగులు 11140

నమృతసంకాశంబు లై నతోయములఁ
గోమరారుసరసి యాకుఱఁగట వెలయుఁ
బరమభాగవతులు పరతత్త్వవిదులు
కరుణాపయోనిధుల్ కమనీయమతులు
నగణితవేదవేదాంగపారగులు
జగతీసురుల్ చతుస్సాహస్రసంఖ్య

( 793. ఈశ్వరభట్టాఖ్యవైష్ణవోత్తమస్థితికథనము. విష్వక్సేనముఖ్యసచివగణనాయకాంశ భాసురశ్రీనాథమునియోగిప్రాదుర్భావము. తద్గానవిద్యాప్రశంసాది. )

నలవడియుండుదు రందుఁ బెంపార
నలరుశోట్టకుల్యాం బొకులంబునను
ననఘుఁ డీశ్వరభట్టుఁ డనువైష్ణవునకు
ననుపమశౌరి సేనాధినాయకుని 11150

యాదిమమంత్రి గజాస్యునియంశ
మాదటం బొడమి యోగాసక్తుఁ డగుచు
ననుపమ గానవిద్యా విచక్షణుఁడు
మునుకొని శ్రీనాథముని యనఁబరఁగి
తనసేయుగీతవిద్యకు నారదుండు
తనువున శుభ్రతం దాల్చియుండఁగను

( 794. తద్విద్యాభ్యాసక్రమము. యోగాచరణమహిమ. ప్రశ్నిగర్భాంశభాసుర సత్పుత్రజననక్రమము. )

అఖిలకళావేత్తయై సొంపు మిగిలి
యఖిలేశు యోగవిద్యాప్రభావమునఁ
దనరుధ్యానమునఁ బ్రత్యక్షంబ చేరి
కొని డెందమున నిడికొని యటమీఁద 11160

నరయంగఁ బృశ్నిగర్భాంశ మైనట్టి
వరపుత్త్రునీశ్వరాహ్వయమౌనిఁ గాంచె

నతఁడు దానును గూడి యష్టాంగయోగ
చతురకేళీవిలాసములఁ దేలింప

( 795. నాథమునిపుత్రాఖ్యేశ్వరమునివరాష్టాంగయోగవృద్ధిప్రకారాది. )
పుణ్యతీర్థయాత్రావిషయకప్రార్థనాక్రమము.

సారసమందిరాసహితుఁ డైనట్టి
నారాయణుండు ముందర వచ్చి నిల్చి
కనుఁగొని యొకకొంతకాలంబు జనఁగ
దనయుండు దాను నెంతయుఁ బ్రేమతోడ
నావీరనారాయణాధీశుఁ డైన
శ్రీనరునమతి క్షితిమీఁదఁ గలుగు 11170

హరిమందిరంబులు నచటితీర్థములుఁ
గరమర్థి సేవింపఁగాఁ గోరి కదలి
దనుజారిసదనతీర్థముల మూఁడేసి
దినములు నిలిచి వర్తించుచు నచటఁ

( 796. భూమిప్రదక్షిణయాత్రాద్వారా బృందావన-గోవర్ధనాదిపుణ్యస్థలప్రాప్తిక్రమము. )
శ్రీకృష్ణసేవాప్రకారము.

చెలువొందుమూర్తుల సేవించికొనుచుఁ
జెలఁగి భూమికిఁ బ్రదక్షిణము గావించి
కనకసారసజాత కమలావ్రజాతఁ
గనుఁగొని తత్తటాంగణసీమయందుఁ
బొలుచుగోవర్ధనపురి బాలకృష్ణు
జలజాక్షు దేవకిచంటిబిడ్డనిని 11180

సేవించి భక్తి నాశ్రీకృష్ణుపూజఁ
గావించుకొని పెక్కుకాల మున్నంత
నరసఖుం డగువీరనారాయణేశ
హరి నారితో విరహము సైఁపలేక

( 797. వీరనారాయణాఖ్యహరికలితాజ్ఞాప్రకారము. )

కలలోన వచ్చి యక్కడ నున్న మౌని
తిలకుల ననుజూడఁ దిగి రమ్మనిన
రమణతో వీరనారాయణపురికిఁ
గ్రమమున నయ్యోగిరాజు తేతెంచి
యసమానులై యుండి రటమీఁద కురుక
వసియించి యుండెడి వైష్ణవోత్తములు 11190

అటఁ గొంద తేతెంచి యలపరాంకుశుని
పటుతరదివ్యప్రబంధంబులోనఁ

( 798. నాథమునిదర్శనక్రమము, దివ్యప్రబంధవైభవవర్ణనాది. )

బదిపాట వినుపింపఁ బదివేలగతుల
ముదమంది యానాథముని వారిఁ జూచి
యమృతపానోత్కృష్టమైన యీకావ్య
మమర నంతయు మీర లానతీవలయు
నావుఁ డీకృతి యోగినాయకోత్తముఁడు
కావించి కడుఁ బెక్కుకాలంబు సనియెఁ
బరికింపఁగా నీప్రబంధంబు ముక్తి
కరమైనకతన లోకములోన మునుపు 11200

యంతయుం జదివి నీయంతమాత్రంబె
యొంతయు ముక్తికి నేగుచుండుదురు
కావునఖిల మయ్యెఁ గడమవృత్తములు

( 799. నాథమునియోగికృతకురుకానగరప్రాప్తిక్రమము. )
ద్వాదశసహస్రావృత్తిదివ్యప్రబంధపఠనాదివృత్తాంతము.

రావయ్యె ననిన నరసి నాథమౌని

కురుకకు నరిగి యాంకురు కేశుఁ గాంచి
వరభక్తిని దురవోపనిచింతక్రింద
నెలకొని శఠకోపనిజమూర్తిఁ గాన
వలయును సాయంబు వరుసఁ జింతించి
మెలమితో మధురకవీంద్రుండు మున్ను
పలికిన దివ్యప్రబంధ మంతయును 11210

దాలిమితోడ నాదటం బదిరెండు
వేలుచందమున నావృత్తిగావింప

( 800. శఠకోపమునిప్రత్యక్షదర్శనక్రమము. పరమసంతోషప్రాప్తిప్రకారము. )
దివ్యప్రబంధార్థప్రకటనద్వారా లోకోపకారరచనాశైలి

దాకొన్న కరుణలో దరువులు వెట్ట
నైకుంఠముననుండి వచ్చి శఠారి
యతనికిఁ బ్రత్యక్ష మయ్యె నావేళ
నతిభక్తినిరతుఁడై యానాథమౌని
యానందబాష్పంబు లడర శఠారి
మౌనీంద్రపాదపద్మములమై వ్రాలి
వినుతింప నయ్యోగివిభుఁడు మోదించి
యనఘ నీవలసినయర్థంబు వేఁడు 11220

మన విని ముకుళితహస్తుఁడై నాథ
ముని పల్కె శఠకోపమునివర్యతోడ
భవదీయదివ్యప్రబంధరత్నములు
నవముగా నీదాసునకుఁ బ్రసాదించి
యిది దొరఁకొని దేవ యే ప్రబంధములు
జదువువారలకు విచారింప నెంత
యాయువుం గలిగిన యన్నిళ్ళుజగతిఁ
బాయకయుండ నాపై ముక్తి గలుగ

వరముఁ బ్రసాదింప వలయు నావుడును
బరికింప నయ్యోగిపతి సంతసమున 11230

( 801. దివ్యప్రబంధోపదేశక్రమవర్ణనము. )

జలజాక్షు నిజ మానసంబున నిల్పి
పొలుపార ద్వయమంత్రపూతంబు గాఁగఁ
దనదుదివ్యప్రబంధంబు లన్నియును
నొనర సార్థమ్ముగా నుపదేశ మొసఁగి
యావరంబును నిచ్చి యనురాగ మెసఁగ
నావేళఁ దనయున్నయచటికి నరిగె
నానాథమునినాథుఁ డాచింతక్రింద
నానన్యకాన్యంబు లామోద మెసఁగ

( 802. వీరనారాయణహరికలితస్వప్నప్రత్యక్షవర్ణనము,
నిజశిష్యవర్గోపదేశక్రమము. )

వెలసి తానును దదావృత్తి గావింప
నలవీరనారాయణాధీశుఁ డైన 11240

శౌరి స్వప్నంబునఁ జనుదెంచి మనము
గూరిమిఁతో జోడుగూడి యిద్దఱము
నావృత్తిసేయుద మటకు రమ్మనిన
వేవేగ మరలి యావీటికి నరిగి
యాదేవుతోఁగూడ నాప్రబంధములు
సాదరభావుఁడై యావృత్తిఁ జేసి
దివిజగానమునఁ దద్దివ్యప్రబంధ
నివహంబు తాళమానితముగాఁ బాడి
తనశిష్యవరుల కందఱకు నాకృతులు
నొనర సవ్విధమున నుపదేశ మొసఁగె 11250

( 803. గానవిద్యాప్రదర్శనప్రకారము. గానవైఖరీప్రశంస. )

నటుగాన నీద్రావిడాగమాంతములు
పటుగతిఁ దద్వంశపాలురచేత
వినుచుండు నపుడు శ్రీవేంకటేశ్వరుఁడు
ననవేల వేయును నట నొక్కనాఁడు
మతివిశేషంబున మానవగాన
పతియు మానవగానపతియుఁ జర్చించి
తమగానవిద్యలతారతమ్యములు
క్రమమేరుపడఁ జోళకాంతుముందరికిఁ
జనుదెంచి గానంబు సవరింపునపుడు
విని సభవారెల్ల విబుధగానంబు 11260

దెలియక మనుజప్రతీతిగానంబు
సలిపెడువాని మెచ్చకయున్నఁ గనలి
దేవగానము సేయుతెఱఁగు వేవేగ
భూవిభుతోడ నప్పుడు విన్నవించెఁ

( 804. చోళరాజకృతసంమానాదికథనము. )

దనవిద్య యెఱిఁగిన ధరలోన నాథ
ముని దక్కఁగాఁ బరమును తెఱుంగుదురె
యన విని భూనాథుఁ డానాథమౌని
వినయ మేర్పడఁగ రావించి తా నరిగి
యనుపమసింహాసనాసీనుఁ జేసి
యనియె వీరలపాటలందలిమేలు 11270

దేవర విని వాదు దేర్పంగవలయు
నాథుఁడు విని మౌనినాయకోత్తముఁడు
వెలయ వారలపాట విని దేవగీతి
సలిపెడి వాని మెచ్చఁగఁజేయు నప్పుడు

(805. సామాజికసందేహోత్పత్తి కథనము. నిజతాళవిద్యాప్రకటనరీతి.)

సామాజికులు కొంత సందేహపడిన
నామాట విని నవ్వి యానాథమౌని
యాయెడఁ బంచలోహంబులై నయట్టి
వేయుతాళములు వేవేగఁ దెప్పించి
యాయెడ నొక్కమాట న్నితాళములు
వాయించు మనుచు నావాద మాలించి 11280

( 806. నిజనగర ప్రాప్తిక్రమము. దివ్యప్రబంధద్వయగానవిద్యాది శాస్త్రోపదేశక్రమము. )

తలకొని యొక్కొక్కతాళమిన్నేసి
పలములటంచుఁ జొప్పడఁగ జెప్పుటయు
సరియైన నరుదంది సభ్యులతోడ
ధరణీవిభుండు పాదములకు నెరగి
పరమవస్తువుల సంభావింపఁ దనదు
పురమున కరుదెంచి పొలుపు దెప్పించి
తగ జయత్సేనాంశధారియై యనఘుఁ
డగుపుండరీకాక్షుఁ డనుశిష్యునకును
సరవి కాళాంశసంజాతుఁడై భక్తి
నరుదారు కురుకేశుఁ డనుశిష్యునకును 11290
ద్వయము దివ్యప్రబంధములు శాస్త్రములు
నయకరయోగవిద్యయును సాంగముగ
నేపార నుపదేశ మిచ్చి యిచ్చుటయు
నాపుండరీకాక్షుఁ డలఘువై భవుఁడు
తనశిష్యసమితికిం దత్ప్రబంధములు
ననుపనుగానవిద్యయుఁ బ్రసాదించి

( 807. నాథమునికృత వాసుదేవధ్యానాది. చోళరాజాగమనము. )

యంతరసాంతరహారి యైనట్టి
కంతుతంత్రిని గోపికామనోహరుని

యన్నాథముని మది ధ్యానంబు సేయు
చున్నయత్తఱిఁ జోళుఁ డొకనాఁడు కూర్మి 11800

తనపట్టమహిషులుఁ దాను నేతెంచి
ననవిల్తుఁగురువీరనారాయణేశు
సేవించి పోవ నాక్షితిపాలవరుని
భావించి గోపికాభామలతోడ
నరుదెంచినట్టి శ్రీహరి యంచుఁ దలఁపఁ
బరువడి నాభూమిపాలుని వెంటఁ
బురముఁ జొచ్చినదాఁకఁ జోవ డెందముల
నరుదంద నిజశిష్యు లామౌనిఁ జేరి
దేవ ! మీ రిటకు నేతెంచినకార్య
మేమెర నది యానతిమ్ము నావుండు 11810

నావల్లకీకమలాననాసహితుఁ
డై వచ్చు శ్రీకృష్ణుఁ డని విచారించి

( 808. శిష్యప్రశిష్యద్వారా ద్రావిడాగమ ప్రచారాదిక్రమము. )
నాథముని యోగాభ్యాస క్రమవర్ణనము.

వచ్చితి నన శిష్యవరులు మోదించి
రచ్చోట వీడ్కొని యానాథమౌని
మరలి వేగమె నిజమందిరంబునకు
నరుదెంచి సకలశిష్యావృతుం డగుచు
నీరీతి నేడునూఱేఁడులు గడపి
కూరిమిఁ దనశిష్యకులము నీక్షించి
ప్రీతిగా శ్రీపుండరీకాక్షుఁ బిలిచి
యాంతతద్రవిడవేదాంతశాస్త్రముల 11820

వసుధ నెల్లెడలఁ బ్రవర్తింపు మనుచుఁ
గిసలయాధరుఁగురుకేశతారాఖ్యుఁ

గనుఁగొని యోగమార్గము నీవు పూని
యనయ మేమఱక తదాసక్తి నుండు

( 809. సత్పుత్రావతార-వరప్రదానకథనము. )

మని కుమారునిఁ జూచి యనియె వెండియును
ఘనతరుం డై నీదుగర్భంబునందు
సరవి సింహాసనాంశజుఁ డై నయట్టి
యురుతరయోగీంద్రుఁ డుదయింపఁగలఁడు
అతనికి యామునాహ్వయ మిడు మనుచు
నతిభక్తిఁ బుండరీకాక్షు సన్మౌని 11330

నలకురుకేశతారాఖ్యునిం బిలిచి
యెలమి మీరిరువురు నిటమీఁదఁబోడము
తనపౌత్రునకుఁ గులోత్తమునకే మునుప
నొనర మీ కుపదేశ మొసఁగినయట్టి
యనుపమసకలరహస్యార్థవితతి
యును యోగమును గూడ నుపదేశ మిందు

( 810. యోగవైభవప్రశంస. శ్రీరామసీతాగమనదర్శనాదివృత్తాంతము. )

అని వారి నియమించి యట నొక్కనాఁడు
ననవిల్తుజనకు నన్నలినలోచనుని
సేవించి గానంబు సేయుచునున్న
నావేళ నిజపుత్రి యరిమురి వచ్చి 11340

వినవె యిద్దఱు పెద్దవిండులఁ బూని
వనితతోఁ గూడ క్రేవల నొక్కకోఁతిఁ
బాయకుండఁగఁ దాట బంధించిపట్టి
యీయెడ మనయింటి కేతెంచి రనిన
నామాననినియె సీత యాయిరువురును
రామసౌమిత్రు లారయ వానరంబె

హనుమంతుఁ డనుచు నిజావాసమునకుఁ
జనుదెంచి వారి నచ్చటఁ గనుంగొనక
వెదకి వారలు వేరి వేరి యటంచుఁ
గొదుకక యడుగుచుఁ గొంత దవ్వరిగి 11850

( 811. పరమపురుషాగమనవిషయకాన్వేషణాది. )
నాథములయోగి పరమపదప్రాప్తిక్రమము.

యొకకొండఱను గాంచి యొక్కపూఁబోఁడి
యొకయిద్దఱను గ్రోఁతియును గూడి యింత
నిపుడు వచ్చిరి గానరే యన్న వార
లపు డెవ్వరిని గానమన్న మోహించె
నదియొకారణముగ నటఁ బరంధాము
పదపట్టబద్ధుఁడై పరఁగె నమ్మౌని
యది విని తనుజాతుఁ డాశిష్యవరులు
గుదిగొన్నవగతోడ గుబ్బున వచ్చి

( 812. బ్రహ్మమేధసంస్కారాశౌచ్యోర్ధ్వదైహికకార్యాచరణము. )
నాథమునియోగిశిష్య జనవైభవము.

యానాథమునివిగ్రహంబు సేవించి
యానాథసుతునిచే నాశిష్యవరులు 11860
మెలుపుమీఱఁగ బ్రహ్మమేధసంస్కార
ములవరింపించి పర్యాయంబుతోడ
నుచితకృత్యంబుల నొనరఁ జేయించి
రచలుఁడై కురుకేశుఁ డనుశిష్యుఁ డంత
గురుని సంస్కారంబు గొలిపినచోట
నిరవొంద నొకచిన్నయిల్లు గావించి
బాగుగా గురుపాదపద్మముల్ తలఁచి
యోగవిద్యాభ్యాస మొనరింపుచుండె

నాపుండరీకాక్షుఁడానాథయోగి
శ్రీపాద మాశ్రయించినవారి నెల్ల    11370

నొనఁగూర్చుకొని దర్శనోద్ధరణంబు
నొనరింపుచుండె సర్వోపచారములు
పనుపడఁజేయఁ బొల్పడి కుముదాక్షుఁ
డనుశూరియంశంబునం దుదయించి

( 813. శ్రీరామమిశ్రాఖ్యగురువరవైభవకథనాది. )

శ్రీరామమిశ్రాఖ్యఁ జెలఁగుశిష్యునకు
గారవం బెసఁగ నాగమరహస్యములు
కృపచేసి యటమీఁద నీశ్వరమునికి
నపరిమితౌదార్యుఁ డగుకుమారకుఁడు
యామునేయుం డనునతఁ డుదయించు
నామహాత్మునకు నేఁ ననువొంద నీకు    11380

నవరించినట్టి యాసర్వార్థములును
వివరంబుగా నీవు వేసట లేక
యనువర్తనము సేసితివైన నీవొసఁగు
మన విని రామమిశ్రాహ్వయుం డంత
నలయీశ్వరమునికి నాత్మజుం డెపుడు
గలుగునో యని కోరికలు గోరుకొనుచుఁ

( 814. ఈశ్వరమునికుమారావిర్భావము. యామునాచార్యనామధేయప్రదానక్రమము. )
ఉపనయనాచరణాదివైఖరి.

దనగురుఁ డొసగిన తత్త్వరహస్య
మనుభవింపుచు నుండె ననురక్తితోడ
నటమీఁద సింహాముఖాంశసంభవుఁడు
పటుసత్త్వమయుఁడు శ్రీపతి కృపాయుతుఁడు    11390

నీశ్వరముని కుదయించి తా శాశ్వ
తైశ్వర్యనంతుఁడై యామునాహ్వయము
నొనరంగ ధరియించి యుపనీతుఁ డగుచు
జనకుండు వేదంబు చదువంగ నిడినఁ
జనకుండు వేదంబు చదువంగ నిడినఁ
జదువుచుఁ దొలినాఁడు చదివించుచదువె
చదువుమటన్న నాచార్యు నవ్వుచును

( 815. ఏకసంథాధారణాదిబుద్ధిచాతుర్యమహిమ. వేదశాస్త్రాభ్యాసక్రమము. )
యామునాచార్య పరిణయాది.

జదువక యింటికిం జనుదేర జనకుఁ
డదలించి చదువలేదా యని యనిన
నిన్నఁ జెప్పినయదే నేఁడుఁ జెప్పెడిని
యన్న ! నే నటఁ బోవ నన్న నాతండ్రి ! 11400

అట్లయిన నిన్న నీ కాతండు చెప్పి
నట్టివేదము వచ్చునా చెప్పు మనినఁ
గ్రన్నన నింతయుం గడమలేకుండఁ
జెన్నార నంతయుఁ జెప్పెఁ జెప్పుటయు
విని తండ్రి మిక్కిలి వెఱఁ గందుకొనుచుఁ
దనయుని కఖిలవేదములుఁ జెప్పించి
పరిణయం బొనరించి పటుతరబుద్ధి
సరవి శాస్త్రంబులు చదివింపవలసి

( 816. చోళరాజపండితవైదుష్యమహిమ. కాణికధనప్రదానార్థకపత్రికాప్రేషణము. )

కోరి మహాభాష్యగురుఁ డనుపేరి
సూరిపన్నిధిఁ గూర్మి చూలి శాస్త్రములు 11410
చదువుచుండఁగఁ జోళజనవరేణ్యునకు
విదితశాస్త్రంబులు వివరించుకొనుచు

హితుఁడైన నిజపురోహితుఁడైన సూరి
ధృతి తనతోడ వాదింపంగలేక
యున్న విద్వాంసుల నొండొండఁ బట్టి
పన్నుఁ గైకొనుచుఁ దద్భాష్యదేశికుని
పై పన్నుఁ దెమ్మని భటులచే బిరుద
దీపితం బైనపత్రికఁ బంపుటయును
నది చూచుకొనుచు మహాభాష్యగురుఁడు
కిదుకుచు నెంతయు ఖిన్నుఁడై యుండె    11420

818 యామునసూరికృతప్రతివాదిపండితబిరుదప్రతికాఖండనతుండనాది. )

నాఁడెడం జనుదెంచి యామునసూరి
యాయనచే పత్ర మలవోకఁ జూచె
పెలుచ గోపించి యాబిరుదపత్రంబు
బలిమిఁ గైకొని చించి పాఱంగవైచి
తనదైన బిరుదుపత్రము న లిఖించి[1]
పనివడి వారిచేఁ బంపెఁ బంపుటయు
నది చూచి కోపించి యాపురోహితుఁడు
క్షుదమేది చోళునిముందరం బెట్టి
యామాట తెటేఁగింప నరుదంది రాజు
యామునేయుని వేగ నటకు రప్పించి    11430

---

Note 1:—యామునాచార్యలిఖిత నిజబిరుద పత్రము :—

న వయం కవయస్తు కేవలం
న వయం కేవలతంత్రపారగాః ।
అపితు ప్రతివాదివారణ-
ప్రకటాటోపవిపాటనక్షమాః ॥

( 818. యామునిసూరి సాహసకార్య నివేదనక్రమము. )

యమరంగ సప్త పూర్వాద్రుల నడుమ [1]
హిమసేతువులలోన నిద్ధరలోన
వదలని కడకతో వాదించి నన్ను
నెదిరెడు విద్వాంసుఁ డెవ్వఁడు లేఁడు
అనునర్థ మొదవఁ బత్రాలంబనంబు
జననాథు వాకిట సవరించి యపుడు
హితమతి హితపురోహిత యుతుండైన
క్షితినాథుకడకు వేంచేసినఁ జూచి
యీవిధి బిరుదంబు లెన్నినవాఁడ
వీవేళఁ దన పురోహితునితో నీవు 11440

( 819. చోళరాజకృత పరస్పర వాదాధరణరచనాశైలి. )

వాదించి గెలువంగవలయు నాపుఁడును
మోదించియున్న యామునుజూచి నృపతి
యావేళఁ విద్వాంసులైన సభ్యులను
రావించి పట్టపురాణితోఁ గూడ
నరుదార సింహాసనారూఢుఁ డగుచు
వరుస నా యిరువుర వాదింపుఁ డనిన
యామునేయుని జూచి యా పట్టమహిషి
యా మహీపతితోడ ననియె నీ ఘనుఁడు

---

Note 1 :—యామునాచార్య లిఖిత నిజవైభవద్యోతకశ్లోకము :—

ఆశైలాదద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకంఠా-
దారక్షోనీతసీతాముఖకమల సముల్లాస హేతోశ్చ సేతోః ।
ఆచ ప్రాచ్యప్రతీచ్యక్షితిధరయుగళాదర్క-చంద్రావతంసా -
న్మీమాంసాశాస్త్రయుగ్మశ్రమవిమలమనా మృగ్యతాం మాదృశోఽన్యః ॥

గెలుచు నవశ్యంబు గెలువక యున్నఁ  
గలయ నీనగరికుక్కలకెల్ల వండి 11450

( 820. చోళరాజకృత ప్రతిజ్ఞాప్రకారము. )

పెట్టెద ననిన నాబింబోష్ఠిఁ జూచి  
గట్టిగా ననిమె భూకాంతుఁ డవ్వేళ  
నీ మెయిఁదనపురోహితుఁ డోడెనేని  
సామిత్తు నాదురాజ్యములోన నీకు  
నని ప్రతిజ్ఞలు చేసి నాపురోహితుఁడు  
మునుకొని యాశ్వరమునిసూనుఁ బలికె  
నగపడి నీవుగావన్నవి యెల్ల  
నగునని నిలిపెద నదియునుంగాక  
యూవల నీ వగునన్నవి యెల్ల  
కా పని నిలుపంగఁగలవాఁడ నిపుడు 11460

కాకున్న నీపాదుకను దననోరు  
వేకొని వైవు మీవిభుఁడు వీక్షింప

( 821. యామునసూరికృతాశ్చర్యజనకప్రశ్నకథనవైఖరి. )

నన విని తప్పకు మని యామునేయుఁ  
డనిరె నిన్ను నుగన్నయంబ యవంధ్య  
యెన్నఁ బతివ్రత యీపట్టమహిషి  
పన్నిచూచిన సార్వభౌముఁ డీరాజు  
అని యుత్తరము లిందు కనుఁగొందఁ జెప్పు  
మని వాని నోడించి యంతటఁ బోక  
యలఘుశాస్త్రోక్తుల నాపురోహితుని  
గెలిచిన మెచ్చి యాక్షితినాథుదేవి 11470

యలయామునేయుఁ జయ్యన నెత్తుకొనుచు
వలనొప్ప నన్నేల వచ్చి తోతండ్రి !

( 822. చోళరాజపట్టమహిషీసమర్పిత-ఆళవందార్-నామక నామాంతర శైలి. )

యనియె నాకతముచ నాళవందారు
లనుపేరు కలిగె నయ్యాము నాథ్యునకు
నాపురోహితుఁ జూచి యామునాచార్యుఁ
డేపార గెలిచితి నిన్ను నే నిపుడు
పట్టి నీనోరు నాపాదుకచేతఁ
గొట్టుమంటివి నిన్నుఁ గొట్ట నేమిటికి
నినుఁ గాచి మెచ్చితి నృపపురోహితుఁడ
వని యన్న సభవార లగ్గించి రతని

( 823. చోళరాజపురోహితాపజయాది. చోళరాజ్ఞీ ప్రదత్తార్ధరాజ్యక్రమవర్ణనము. )

నామహీపతి కడు నచ్చెరు వంది
యామునాచార్యున కవనతుం డగుచుఁ
దనపురోహితుఁ దెచ్చి తచ్ఛిష్యుఁ గాఁగ
నొనరించి యెంతయు నుపచరింపుచును
మును తనదేవి కిన్ముల నిత్తు ననుచుఁ
దనసీమలోన నర్ధము పంచి యొసఁగ
నాదేవి తనసీమ యామునేయునకు
నాదట నిచ్చె నెయ్యమునం బూజించి
యనిపినం గ్రమ్మట యామునేయుండు
చనుదెంచి నిజనివాసంబున నిలిచి 11490

( 824. శ్రీరామమిశ్రాఖ్యగురువరకలితోపాయనక్రమవర్ణనము. )

యాలేమ యొసఁగినయర్ధరాజ్యంబు
నేలుచు నుండె ననేకవైభవుల

ఈరీతి నంతయు నెఱిఁగి మోదించి
శ్రీరామమిశ్రుఁ డంచితభక్తితోడ
యామునేయునకు రహస్యార్థవితతి
తా నుపదేశింపఁ దలఁచి వేంచేసి
యామ్యైశ్వర్యంబునందుఁ బెంపొందు
యామునార్యునికొలు వచ్చికయున్న

( 825. యామునసూరిప్రీతివర్ధకశాకప్రదానక్రమము. )

ఈతనిం బొడఁగాన నెద్ది యుపాయ
మీతఱి యని తనయిచ్ఛ నూహించి 11500

యతనిపాచకులతో యామునేయునకు
నిత్యమైనశాకంబు లెవ్వి నాఫుండు
నలరి మిక్కిలిప్రియం బైనది యుండ్ల
నులిచితకూర నామోదించి యతఁడు
చని వారిచేతి కాశాకంబు వెదకి
దినదినంబును గోసి తెచ్చి యిచ్చుచును
నెమ్మి నీగతి నాఱునెలలు వాటించి
కిమ్మల మఱియునుం గేలి లేకున్న
నాకు నాగురునియానతి ద్రోయరాదు
చేకొని యిఁక నేమిసేయుదు ననుచు 11510

( 826. ప్రతిదినసమర్పితశాకానవాప్తివిషయకప్రశ్నాది. )

ననయంబుఁ దాఁ దెచ్చునట్టిశాకంబు
కొనిరాకయుండె నెక్కొని యొక్కనాఁడు
యామునేయాచార్యుఁ డట యారగింప
నామనోహరశాక మపుడు లేకున్న
లాలితం బైన యలర్కశాకంబు
నేల కావింప రియ్యెడ నన్న వారు

వనిశంబు నొకవృద్ధుఁ డగువైష్ణవుండు
కొనివచ్చు నేఁడు దా కొనిరాకపోయె
సరవిమై నాఁఱుమాసములనుండియును
గరమర్థిఁ దెచ్చు నీగతి రాక యనిన 11520

( 827. పరమభాగవతాగమనఫలప్రశ్నకథనము. )

నతఁ డెవ్వఁ డేటికి నరుదెంచె నతని
గుతుకంబుతోఁ దోడుకొని రండు రేపు
అన విని వా రేగి యారామమిశ్రుఁ
గని మఱునాఁడు వేగంబె తోతేరఁ
బదముల కెరఁగి యాపరమభాగవతు
మది యిగురొత్తఁ బ్రేమమున నిట్లనియె
నీమెయి దేవర యిటకు వేంచేయు
టేమికారణము నా కెఱిఁగింపు మనిన

( 828. గీతారహస్యోపదేశక్రమము. ప్రపత్తిమార్గప్రవర్తనవైఖరి. )

ననువొంద మీవార లర్థనిక్షేప
మునిచిరి నాయొద్ద నున్నది నీకుఁ 11530

దెలిపెద నని వచ్చితిని గాని యొండు
వలనుమీఱఁగఁ గోరి వచ్చుట లేదు
అనిన నామునివర్యుఁ డానతి మ్మనిన
దినదినక్రమమునఁ దేటపడంగ
నన్నియు శ్రీగీత లానతిచ్చుటయుఁ
జెన్నార విని మదిఁ జిగురించుకూర్మి
నే విజ్ఞుఁ బొందుట కెద్ది యుపాయ
మీవేళ మీ రానతిండు నావుడును
బలుమఱుఁ బొంగి ప్రపత్తిమార్గంబుఁ
దెలిపిన యామునదేశికుం డపుడు 11540

(829. శ్రీరంగనాథసేవాప్రకారము. ద్వయరహస్యాదిపరమమంత్రోపదేశక్రమము.)

పరమవిరక్తిఁ జొప్పడెఁ; రామమిశ్ర
గురుఁడు యామును దోడుకొని సంతసమున
శ్రీరంగమునకు వేంచేసి యాదేవు
శ్రీరంగనాథుని సేవింపఁ జేసి
యామూర్తి మీఁదాత లిడిన నిక్షేప
మేమి యాగుఱుతుంగా నెఱుఁగుకొ మ్మనుచు
నపుడు ద్వయంబు రహస్యార్థములను
నుపదేశ మొనఁగె నయ్యరుసత్త్వనిధియు
సంత సన్న్యాసియై యచ్చట రంగ
కాంతుని హృదయసంగతుని గావించి 11550

(830. యామునమునికృత-సిద్ధిత్రయ-హరిస్తోత్ర-గీతార్థసంగ్రహాది-గ్రంథరచనాక్రమము.)

సిద్ధార్థుఁడై జ్ఞానసిద్ధియు నాత్మ
సిద్ధియు నీశ్వరసిద్ధియు నపఁగఁ
జెలువారుకృతులను శ్రీహరిస్తోత్ర
ములును శ్రీగీతార్థములసంగ్రహంబు
భాగురునుతమైన పురుషనిర్ణయము
నాగమప్రమితియు నను ప్రబంధములు
వివరించి కుముదాక్షవిమలాంశ మగుచు
నరయ మహాపూర్ణుఁ డగుశిష్యవరుఁడు
నలశంఖకర్ణునియంశమై మిగులఁ
జెలువార రంగికుశీలవాఖ్యుండు 11560

(831. కాంచీనగరవాసి-తిరుక్కచ్చినంబినామక-గురువరమహిమ.)

నాయమానసమూర్తియై హస్తిశైల
నాయకుతోడ నెంతయు మాటలాడు

స్థిరభక్తినిరతుండు తిరుక్కచ్చినంబి
కరయంగ నలవాయనాంశ మనంగఁ
జెలువారుచుండు గోష్ఠీపురీశుఁడును
గొందలైన నిజశిష్యముఖుల కందఱకు
ముదమున సర్వార్థములుఁ బ్రసాదించి
యలవిమిఁజినయట్టి యఖిలశాస్త్రములుఁ
జెలఁగి వ్యాఖ్యానంబు సేయుచున్నెడల
నలరామమిశ్రుఁ డాయామునార్యునకుఁ 11570

( 832. యోగవిద్యారహస్యార్థప్రాప్తిక్రమము. )

బలికె నేకతమునఁ బ్రముదంబుతోడ
మును నాథమునిశిష్యముఖుల కందఱకు
ననువొంద సకలరహస్యార్థములును
నుపదేశమొనరించి యోగరహస్య
మప్పు డిచ్చె కురుభావ లప్పనిం బలిచి
యాదివ్యయోగవిద్యారహస్యంబు
తే చెప్పరికి నొకలేశమంతయును
గరమర్థి నతఁడు గంగాహారనగరి
నిరుపమతద్యోగనిరతి నున్నాఁడు
అది నీవు సాధింపు మటఁ బోయి యనిన 11580

( 833. యోగసమాధిప్రాప్తిక్రమవర్ణనము. )

ముదమంది యామునముని వేగ వెడలి
యొకజీర్ణవసతిలో యోగసమాధి
నంలంకగతినున్న యయోగికడకుఁ
జని యామునీంద్రునిశ్చలయోగభావ
మునకు విఘ్నము సేయ మొగమోడి యంతఁ
దనశిష్యులును దాను దద్భాగమునకు

వెనుకటిదెస మానవృత్తి నుండుడయు
గోరియిప్పుడె చోళ్ళకులజాతు లైన
వారెవ్వరైనఁ గ్రేవల నున్నవారె
యనుచు నయోగీంద్రుఁ డానతి యొసఁగ 11590

( 834. గురుశిష్యపరస్పరసంభాషణాది. )

విని యామునేయుండు వేవేగ వచ్చి
వినతుఁడై హస్తారవిందముల్ మోడ్చి
యనిమె నచ్చెరువంది యాయోగితోడఁ
బనిఁబూని మఱుగునం బని వినియున్న
నను నీవు గను టెట్లునా కానతీయు
మనిన నయోగీంద్రుఁ డనియె నాతనికిఁ
గనుఁగవ బాష్పాంబుకణములు దొరఁగ
నీరికూర్మిఁ గౌఁగిటఁ జేర్చుటకంటెఁ
బరమభోగ్యముగ నాపయిఁ గరుణించి
నాసీయు యోగమునకుఁ జిక్కియున్న 11600

శ్రీసతీశుఁడు నేఁడు చెలరేగి నిక్కి
మూపులపైఁ గరముల నూఁది వెనుక
చూపుచునుండంగఁ జూచి యే నిప్పు
డరయంగ నీకృప నలనాథమాని
వరకులమునఁ గల్గువారిపైఁ గాని
లేదని తెలిసి పిల్చితినన్న మిగుల

( 835. యోగావిద్యాప్రదానాహాకాలముహూర్తజానివేదకపత్రప్రదర్శనము. )

మోదించి యామునముని సాగిల్బ్రొక్కి
యురవొంద దేవర యీయోగవిద్య
నరవిమై నాకుఁ బ్రసాదింపు మనిన
నురుతరంబైన యాయోగంబు తనదు 11610

చరమకాలమునఁ బ్రసాదింతు ననుచు
నాకాల మావేళ యామునహార్థంబు
చేకొని యొకచిన్న చీటిపై వ్రాసి
యిచ్చి నీవావేళ కేతెంచితేని
యిచ్చెదఁ గ్రమమున నీయోగవిద్య
యని పనుపుటయును యామునేయుండు
చని రంగవిభునియాస్థానంబులోనఁ
గొలువున్నతఱి శఠకోపప్రబంధ
మలనాథమునివంశుఁ డై నగాయకుఁడు
ఒగి వినిపింపుచునుండినయంత 11620

( 838. శ్రీరంగనాథసంతోషక్రమవర్ణనము. )

నగరేశు శ్రీపద్మనాభుని వేగ
సేవింపుఁ డని తమ్ము చేసేతఁ జూపి
యీవేళ బలుమాఱు నభినయించుటయు
నది గని రంగేశునసుమతి యనుచు
మదిలోన యామునమౌని చింతించి
వేవేగ నాదేవువీటికి నరిగి
సేవించి యచట వేంచేసియున్నపుడు
తమకు నాకురుకేశుతాతముందరను
బ్రమదంబుతో నిచ్చుపత్రికఁ జూపి
యామౌని ముక్తికి నరిగెడువేళ 11630
యామాసమును నాఁడైన బొంకుచును
గటకటా యొకపుష్పకము గల్గెనేని
యటపోవవచ్చుఁగా యని యట్ల వగచి
తనశిష్యులును దాను దడయక మగుడి

( 837. తిరుమలైనంబినామకగురువరవైభవప్రశంస. )

చనుదెంచి రంగవాసంబున నిల్చి
శ్రీవేంకటాద్రిగోష్ఠీపురస్థలిని
యీవిధి నొప్పు సర్వేశుధామముల
స్థాపితపటుజయస్తంభంబు లనఁగ
నేపారుశిష్యుల నిద్ధవైభవులఁ
ద్రిదశవందితుఁడైన తిరుమలనంబి 11640

మొదలైన శిష్యుల మునుకొనినిల్పి
యిటమీఁదఁ దమమతం బీడేర్చునట్టి
పటుతరశిష్యుఁ డెప్పుడునం గల్గు
ననుచు వేదాంతవిద్యాలోలుఁ డగుచు
ఘనతరకీర్తిసంకలితుఁడై యుండెఁ

( 838. తుండీరమండలస్థభూతపురీక్షేత్రవైభవము, శేషాంశభాసుర-రామానుజార్య ప్రాదుర్భావవర్ణనము. )

దిలకించుతుండీరదేశంబునందుఁ
బొలుపుమించిన మహాభూదూ రనంగ
రాజిల్లు నగ్రహారంబు వనాగ
రాజాంశజుఁడు లోకరక్షణశాలి
భూసురకులజాతభూషణం బైన 11650

నాసురి కేశవాహ్వయవైష్ణవునకు
సలలితచిత్రమాసంబున నార్ద్ర
జలజాప్తకోటితేజము నగ్గలించి
జనియించి రామానుజఖ్యాతిఁ దాల్చి

( 839. కేశవాచార్యకృతపంచసంస్కారోపనయనాదివర్ణనము. )

పెనుపొందఁ గ్రమమునం బెరుఁగుచు నుండె
జనకుండు పంచసంస్కారముల్ సేసి

ననుపార నుపనయనంబు నొనర్చి
యఖిలవేదాధ్యయనుఁడై ననందనుని
నఖిలాగమంబులు నటఁ జదివించి
వరుసై భవముల వివాహంబు సేసి 11660
పరమానురాగసంభరితుఁడై యుండె
నామహాయోగి రామానుజార్యుండు

( 840. రామానుజాయఁ కృతశాస్త్రాభ్యాసవైఖరి. )
శ్రీకృష్ణసాందీపినిగురుదృష్టాంతము.

తా మహాశాస్త్రవిద్యల నెఱింగియును
దేవకీసుతుఁడు సాందీపునియొద్ద
వేవచ్చి తాఁ జదివినరీతి నంతఁ
గాంచికిఁనరిగి యాశరిరాజవరమఁ
గాంచనాంబరుని శ్రీకరుని సేవించి
వరుస నచ్చో యాదవప్రకాశాఖ్యఁ
బరఁగిన సన్యాసిపజ్జ నిచ్చలును
విదితమై యొప్పెడు వేదాంతవిద్య 11670

( 841. కాంచీనగరస్థయాదవయతిప్రకటితవేదాంతశాస్త్ర పఠనాది. )

చదువుచో యాదవసంయమీశ్వరుఁడు
అలఘుశిష్యులకు వేదాంతశాస్త్రంబు
చెలఁగి వ్యాఖ్యానంబు సేయుచు నుండె
నాతఁడె నద్వైత మనువదించుటయు
ద్వైతయుక్తుల వానిఁ దరలఁగట్టుచును
అతనితోఁ జదివినయట్లుండఁ దుదకు
నతనికిఁ బ్రతివాది యగుచు వాదించు
నొనర నాసంయమియొద్ద నీరీతిఁ
బనివడి వేదాంతపఠన సేయంగ
నిరతంబు గాంచిలో నెలకొనియున్న 11680

(842. రామానుజార్యవేదాంతపఠనవైభవకథనము.)

పరమభాగవతులు భక్తిమీఱంగ
శ్రీరంగమునను వేంచేసి పల్మఱు
నారూఢి రామానుజార్యుఁ డొక్కరుఁడు
ననిశంబు యాదవుఁ డనుయతియొద్ద
ననువొంద వేదాంత మధికరింపుచును
అతని యద్వైతవాక్యంబులనెల్ల
నతులితద్వైతవాక్యములఁ గొట్టుచును
అచ్చట నున్నవాఁ డన విని పొంగి

(843. యామునార్యకృతరామానుజానుగ్రహసమాలోచన.)

మచ్చిక యామునమౌని శేఖరుఁడు
నతనిఁ గటాక్షింప నాత్మఁ జింతించి
ప్రతిలేని శిష్యపారంబు సేవింపఁ 11690

గాంచి కేతెంచి యక్కడనున్న శిష్యుఁ
గాంచీశుతోఁగూడఁ గదిసి మాటాడు
నయవేది తిరుకచ్చినంబినిం బిలిచి
దయతోడ నతనికై దండ గాఁబట్టి
దేవనాథుని మహాదేవుని నంత
సేవించి యటఁ బ్రదక్షిణము వచ్చుచును

(844. శ్రీరామానుజశరీరసౌష్ఠవసద్గుణాదివర్ణనము)

వలనొప్పు శేషనివాస నల్మీక
మలవడ సేవించి యాచెంత నిలిచి
తనశిష్యవరులును దాను యాదవుఁడు
చనుదెంచి యాహస్తిశైలవాసునకు 11700

వలచుట్టి రాఁగ యాళ్వందారు వారిఁ
జెలియంగఁ గన్గొని తిరుకచ్చినంబి
కవి వారిలోన లక్ష్మణసూరిపేరి
ఘనుఁ డిటువంటియాకారంబువాఁడు
అన విని యట్ల వారందఱకంటె
ఘనమైనవాఁ  చక్కనివాఁడు మిగుల
నించుబాహువులవాఁ డెఱ్ఱనివాఁడు
కాంచనాంబరుభక్తి గలిగినవాఁడు

( 845. యామునాచార్యకటాక్షమహిమ. రామానుజాచార్యవైభవాతిశయము. )
యామునాచార్యప్రత్యాగమనము.

నలవాఁడె యనఁ గాంచి యామునాచార్యుఁ
డలలక్ష్మణాఖ్యు దయాదృష్టిఁ జూచి 11710

తావకదర్శనోద్ధారకుం డితఁడు
గావలయును దేవ కరిరాజవరద
యనుచుఁ బ్రార్థించి యాహస్తిశైలేంద్రు
మనసిజగురుని బ్రేమమున సేవించి
తిరముగా మది మెచ్చి తిరుకచ్చినంబి
కరిరాజవరదుకైంకర్యార్థ మచట
నునిచి శిష్యులతోడ నొనఁగూడి మగుడి
చనియె శ్రీరంగవాసమునకు నంత
నాదేవుఁ డఖిలశిష్యావృతుం డగుచు
సాదరుం డగుచు వ్యాఖ్యానంబు సేయ 11720

( 846. చోళరాజకుమారశరీరాధిష్ఠితబ్రహ్మరాక్షసవృత్తాంతము. )

నాతఁడే చోళనాయకుని హితాత్మ
జాతుని బ్రహ్మరాక్షసుఁ డావహింప

మంత్రవాదులు మహామహులు నేతెంచి
మంత్రయంత్రములఁ బల్మిజు గాసించి
విడిపింపలేక నివ్వెఱపడి పాట్లఁ
బడి తుది యేమిటం బనికిరాకున్నఁ
దొలఁగిన చోళనాథుఁడు విచారించి
యిల మహామంత్రికు లెట లేరె యనిన
నఖిలవేదాంతవిన్యాసి సన్యాసి
నిఖిలప్రశస్తుండు నిర్జితేంద్రియుఁడు 11780

(847. చోళరాజకృతబ్రహ్మరాక్షసనివారణప్రయత్నాది.)
యాదవప్రకాశాఖ్యయతివరవైభవము, తదాహ్వానము.

నతులమాంత్రికుఁ డైన యాదవాహ్వయుఁడు
సతతంబు గాంచికాస్థలి నుండు ననిన
విని రాజు పిలిపింప వేవేగఁ గదలి
తనశిష్యముఖ్యు లెంతయుఁ జేరి కొల్వ
యాదవుం డాలక్ష్మణార్యుతోఁ గూడి
యాదటం జోళనాయకపురంబునకుఁ

(848. ఉగ్రతరమంత్రజపాదిపఠనప్రకారము.)

జని మున్ను బ్రహ్మరాక్షసుఁ డావహిలిన
జననాథసుతునివజ్జకు నేగుదెంచి
కడగి ధిక్కారహుంకారంబు లెసఁగఁ
దడయక యుగ్రమంత్రము జపియింప 11740

రాజనందనగతరాక్షసుం డప్పు
డోజ దప్పక యింతయును లెక్కఁగొనక
తనరెండుకాళ్ళు యాదవుదిక్కు చాఁచి
యనియె నీకిట్టి యహంకృతి యేల

( 849. బ్రహ్మరాక్షసకృతప్రశ్నక్రమము. )

నిను నెఱుంగుదు నోరి! నీవు జపించు
మను వెఱుంగుదు నోరి మామకంబైన
జననంబు నెఱుఁగుదు చల మేటి కిపుడు
వనరక తలగు మివ్వల నుండ కనుచు
నాతఱి నీవు మహామాంత్రికుండ
వై తేని దొంటి నీదైనపుట్టువును 11750
వినుపింపు తానైన విశదంబు గాఁగఁ
దనపూర్వజన్మమంతయు నెఱింగింతు
తొలఁగు నీచేతఁ బోదు నె పట్టిచలము
వలవ దిచ్చో నుండవలదు పొమ్మనిన
అన విని యాదవుం డనువందివిప్ర
మనుజాసనునితోడ మఱియు నిట్లనియె
నైన నీదగు తనదైనజన్మంబు
పూని వచింప నీపోవుచందంబు
వినుపింపు మనిన నవ్వేళ యాదవుని
గనుఁగొని పలికె రాక్షసుఁ డేపు మిగిలి 11760

( 850. బ్రహ్మరాక్షసవర్ణితయాదవయతిపూర్వజన్మవృత్తాంతము. )

యోరి యాదవ విను యొగి నీవు మునుప
అరయ మధురాంతకాగ్రహారంబు
కడ నొప్పు ఘనతటాకముకట్టమీఁద
నుడుమువై యుండుదు వొకపుట్టలోన
నారీతి నుండి సర్వావనీ స్థలుల
వారును బరుపగా వచ్చునత్తఱిని
శ్రీవేంకటేశ్వరు సేవింపవచ్చు
శ్రీవైష్ణవాళి భుజింప నచ్చోటఁ

జెందిన మెదుకులు చెలువార నొసఁగి
తండులకతన నీవందితి విట్టి 11770

( 851. యాగమంత్రభ్రంశదోషప్రాప్తహీనజన్మక్రమకథనము. )

జననంబు తనపూర్వజన్మంబు వినుము
మునుపు దాఁ గ్రతువు ప్రేముడిఁ జేయఁ బూని
పటుమంత్రతంత్రలోపము సేయ వచ్చె
నిటువంటిపుట్టు విం కేమిటం బోను
ఇలనెల్ల నీడేర్ప నేతెంచినట్టి
యలమహాత్ముండు శేషావతారుండు
ననుపముండైన రామానుజార్యుండు
తను నేగు మనిన నీధరణీశసుతుని
విడిచి యీపుట్టువు విడిచి ముక్తికిని
నడచెద నంచు గ్రన్నవ లేచి వచ్చి 11780
యాదట రామానుజాచార్యవర్యు
పాదపద్మములపైఁ బ్రణమిల్ల పొగడఁ

( 852. రామానుజార్యరచితబ్రహ్మరాక్షసనిరాసనక్రమము. )
తన్నిగమననిశ్చయప్రకారాది.

గనియాదవుండు భూకాంతుండు నట్ల
యనుమని వేఁడ రామానుజార్యుండు
భూవిభుసుతుఁ బాసి పొమ్ము నీ వట్ల
పోవు నందులకు నిప్పుడు గుఱు తొకటి
ఘనయంగ నిందఱ కెఱుఁగంగఁ జూపి
చనుమన్న బ్రహ్మరాక్షసుఁడు మోదించి
యాయున్న రావి యాయతశాఖ విఱిచి
పోయెద నని చెప్పి భూపాలసుతుని 11790
వదలి యాచెంత నశ్వత్థంబునందుఁ
బొదలిని యొకమహాద్భుతశాఖ విఱిచి

రామానుజుని పరిగ్రహవిశేషమునఁ
దా ముక్తిపదము నిత్తఁడెఁ బ్రవేశింతు

( ౮౫౩. చోళరాజకృతరామానుజపూజాక్రమము. ఉత్తమద్రవ్యసమర్పణరీతి. )

నని చెప్పి యరిగిన నాలక్ష్మణార్యుఁ
గని వెలుఁ గంది యాకాంతుఁ డెంతయును
ననయంబు వినుతించి యాదవునెదుట
వినుతవస్తువుల బల్విడిఁ బూజ సేయ
రామానుజుండు తద్రవ్యవస్తువులు
తాము గైకొనక యాదవునకు నిచ్చి 11800

( 854. కాంచీనగరప్రాప్తిక్రమము. యాదవయతికృతవేదాంతోపాధ్యక్రమము. )

జగతీశు వీడ్కొని సంయమితోడ
మగుడఁ గాంచికి వచ్చి మఱియొకనాఁడు
అనురాగమున లక్ష్మణార్యుండు చెలఁగి
యనుమోందఁగాఁ దల యంటుచునుండు
యాదవుం డుప్పొంగి యఖిలశిష్యులకు
నాదట వేదవాక్యం బెన్ని యొకటి
జలజనికాశలోచనయుగళంబు
గలిగినయట్టి శ్రీకామినీవిభుని
వనచరాసనవర్ణ వలితాక్షయుక్తుఁ
డనుచు నీరీతి నపార్థంబుఁ జెప్ప[1] 11810

---

Note [1] :-తస్యయథా కప్యాసంపుండరీకమేవమక్షిణీ[ఛాందోగ్యోపనిషత్ 1,6,7,]
శ్రీరామానుజార్యప్రతిపాదిత వేదవాక్యస్వారస్యార్థక్రమవర్ణనము:—

కపిస్త్వాదిత్యః కం పిబతి కిరణై రిత్యపి కపిః
గభస్తీత్యామ్నాతస్స కపిరమునాస్తం యదిహ తత్ ।
ప్రతీమః కప్యాసం దివసకరతేజోవికసితం
సుపద్మం శ్రీమత్త్వాదగణి భగవచ్చక్షురుపమా ॥

( 855. రామానుజమనః ఖేదవర్ణనము. )

విని యది చెవులకు వేఁడియైయున్న
ననయంబు నగచు రామానుజార్యునకుఁ

గన్నుల బాష్పముల్గ్రిమ్మ నం దొక్క-
కన్నీటిబొట్టు దిగ్గన జాఱి వచ్చి
యప్పు డాయతితొడ యందుఁబై ఁ జిందె
నిప్పు సోఁకినరీతి నెరయంగ నులికి
తలయంటుచున్న యాతనియాననంబు

( 856. యాదవయతికోపకార్యాదిక్రమవర్ణనము. )

తలయెత్తి చూచి యాదవుఁడు కోపించి
తనయొద్దఁ జదువ కింతటినుండి నీవు
చను మెట్కైన నిచ్చట నుండవలవ 11820

దన విని రామానుజార్యుఁ డవ్వేళ
మనమునఁ జెలఁగి దుర్మద మింక వినఁగ
వలదు న న్నీసహవాసంబు సేయ
వల దని మాన్పె నీవరదుండ యనుచుఁ
దనయింటి కరిగి మాతకు నివ్విధంబు
వినుపింపఁ దనయుని వీక్షించి పలికెఁ
జాలు ముందర నీవు చలిపినచదువె

( 857. కాంచీనగరవాసితిరుక్క-చ్చినంబినామకగురువరశ్లాఘనము. )

యాలస్య ముడిగి శ్రీహస్తిగిరీంద్ర
దానవాంతకున కెంతయుఁ బరమాప్తుఁ
డైన సర్వోత్తము నఖిలపావనుని 11830

దేవతాసము నలతిరుకచ్చినంబి
సేవించి యానతిచ్చినవాక్యసరణి

నలవరింపుచునుండు మునిన డెందమునఁ
దిలకింపుచును వచ్చి తిరుకచ్చినంబిఁ
గని మ్రొక్కి తనవచ్చుక్రమము తెల్లముగ
వినిపించి నా కెద్ది వెఱ వని యనినఁ

( ,రామానుజకృతశ్రీవరదరాజతీర్థసమర్పణాదికైంకర్యప్రకారము. )

తెలిసి యెంతయు మెచ్చి తిరుకచ్చినంబి
యులలక్ష్మణార్యున కనియె నింపొదవ
ననిశంబు దేవరాయనికి నీచేర్వ
మొనయుశాలాకూపమున సలిలములు 11840

ముదమున నర్చనంబున కొకబిందె
డొదవ దెమ్మనుచు నియోగించుటయును
ననయుంబు చెలఁగి తోయంబు కైంకర్య
మొనరింపుచుండె శ్రీయుతుఁడు నాకరణి
నాయాదవుని బాసి హస్తిశైలేంద్రు
తోయకైంకర్యంబుఁ దొడరిసేయుచును
ననురక్తి నున్నవాఁ డని విని మదిని

( 859. యామునాచార్యకృతమహాపూర్ణాఖ్యగురువరప్రేషణము. )

ననయంబు రాగిల్లి యామునేయుండు
పొదరి శిష్యుని మహాపూర్ణునిం బిలిచి
సదయుఁడై కాంచికాస్థలి కేగి నీవు 11850

నచ్చటిరామానుజార్యవర్యునకు
మచ్చిక నీ స్తవమణి వినుపింపు
మతం డెందునిల్చిన నచ్చోట నిలిచి
సతతంబు నీవిది చదువుమటంచుఁ
బనిచిన చని గురుపదపద్మములకు
వినతుఁడై కాంచికి వేవేగవచ్చి

వరదరాజున కనవరత మంబువులు
కరమర్థితోడ లక్ష్మణదేశికుండు
కొనివచ్చుత్రోవ నెక్కొని యామునేయ
ముని వచించినస్తోత్రములు నచించుటయు 11860

( 860. ఉత్తమస్తోత్రశ్రవణానందక్రమము. యామునాచార్యపదాశ్రయణాసక్తి ప్రాదుర్భావక్రమము. )

నది విని రామానుజార్యుం డెంతయును
ముదమొంది యమ్మహాత్మునకు వందనము
నవరించి యమ్మహాస్తవమణి యిట్లు
నవరించినట్టి యాచార్యుం డెవ్వాండు
అన విని యపుడు మహాపూర్ణుం డతని
కనియె నీనుతి యామునార్యశేఖరుండ
యొనరించె నమ్మహాయోగిపుంగవుండు
మునుకొని శ్రీరంగమున నున్నవాండు
అనిన రామానుజుం డనియె నన్నిప్పు
డనఘాత్మ యాయామునాచార్యవర్యు 11870
పాదంబు లాశ్రయింపంగంజేసెదవె
నీదయ నామీంద నిగుడించి యిప్పు
డనుటయు మెచ్చి మహాపూర్ణుం డట్ల
యొనరింతు రమ్మని యొడంగూడం బలికి

( 861. యామునాచార్యపరమపదప్రాప్తిక్రమము. రామానుజమనఃఖేదసంతాపాదిః )

యారామ సోదరు నపుడు దోకొనుచు
శ్రీరంగమునకు వేంచేసి కావేరి
దరి చేరంజోయి యత్తటిం బురిలోన
నరుదైన సకలకలంబైన నాలించి
యరు దెంచువారల నరసిన లోక
గురుడైన యొకముని గురు శేఖరుండు 11880

చనియె వైకుంఠవాసమునకు ననిన
విని మూర్ఛఁ జెంది యుర్వీస్థలి వ్రాలి

( 862. రామానుజార్యకృతయామునాచార్యదివ్యవిగ్రహసేవాప్రకారము. )

పొరలుచుండిరి మహాపూర్ణుఁ డవ్వేళఁ
దిరమొంది ధీరతఁ దెలిసి పల్మాఱు
భూమిపై నందంద పొరలుచున్న
రామానుజార్యు చేరఁగఁ బోయి తెలిపి
యతనితోఁ గొని వేగ నరిగి కావేరి
సుతటంబునం గడు సొంపారుచున్న
యామునాచార్యుని యమలవిగ్రహము
వేమఱు సేవించి వెఱఁగందుచున్న 11890

మునుప నాయామునమునిలోకనాథుఁ
డనువొందఁ బట్టిన వ్యాఖ్యానముద్ర
యడలకు మీఁక సకలార్థముల్ నీకు
నెడపక యీవేళ నిచ్చితి ననిన
ననువున విడువ రామానుజార్యుండు
కని వెండియును నమస్కారంబుఁ జేసి

( 863. కాంచీనగరప్రాప్తిక్రమము. హరికైంకర్యనిరతత్త్వశైలీకథనము. )

యామునాచార్యపాదాబ్జముల్ చేరి
యామహానిచే సకలార్థంబుఁ దెలియ
వచ్చిన నీగురువరుఁ డను నిట్లు
చెచ్చెర నెఱనేసి శ్రీరంగవిభుఁడు 11900

ప్రల్లదంబున సిగ్గుపడక యే నింకఁ
జెల్లఁబో యేమని సేవింతు ననుచుఁ
బంచిన నగలఁ జొప్పడుచు నాపెరియ
నంబికి మ్రొక్కి విన్నపముఁ గావించి

శ్రీరంగనాథుని సేవింపకపుడు
భోరునఁ గాంచికిఁ బోయి యచ్చోట
మనసిజగురునకు మచ్చిక మురువ
నొనరించి కైంకర్య మొనరింపుచుండె

( 884. తిరుకచ్చినంబిగురునరకృతహస్తిగిరిశాగప్రార్థనాప్రకారాది. )

నలవడ నీక నిశ్చితార్థంబులెల్లఁ
దెలిసెద నని నిచ్చి తిరుకచ్చినంబిఁ 11910
గనుఁగొని పాదపద్మములకు మ్రొక్కి
వినవె యాకరిగిరివిభుచెలికాఁడ
తలఁపులోఁ గొన్ని యర్థంబు లీవేళఁ
దలఁచితి రే నిట్లు తలఁచితిననుచు
శ్రీకాంతుఁ డగుహస్తిశిఖరశేఖరున
కేకాంత మగునట్టియెడ విన్నవించి

( 885. శ్రీహస్తిగిరీశరాత్ర్యారాధన-సదుపచారాదిసముపణాక్రమము. )

పూనికమీఱ నాపుండరీకాక్షుఁ
డానతిచ్చినరీతి నానతీనలయు
నన విని యట్లకా కనుచు నయ్యోగి
యనువొంద మూఁపుపై యాలవట్టంబు 11920
హరి విహరించు దేహంపుమేడయందు
సిరిమించఁ జేర్చువిచ్చె లననొప్పు
నురుతరాయతధవళోర్ధ్వపుండ్రంబు
కరమొప్పఁ బచ్చల కనకపొంగళ్ళు
సలలితవస్త్రభూషణజాలములును
మలయుపొంపులతిరుమణివడంబులును

నలర నేకాంతపాయస మారగించి
యలహస్తిశైల నాయకుఁ డింపుతోడ
నేకాంతమున నున్న యెడ నేగి నిలిచి
చేకొని వీననఁ జెన్నార వినరి 11930

( 888. రామానుజవిషయక ప్రార్థనా క్రమము. )

యుపచార మొనరింపుచున్న నా యోగి
కృపఁజూచి యాహస్తిగిరినాథుఁ డనియె
నొనరంగ విన్నపం బొకటి మా కిప్పు
డొనరింపఁదలఁచిన ట్లున్నాఁడ వీవు
కలదె యేమైన నిక్కము సెప్పు మనిన
నలవరు దనకు నిట్లని విన్నవించె
స్వామి! తావకపదాసక్తుఁ డై నట్టి
రామానుజుండు గారవము దీపింపఁ
దలపులోఁ గొన్ని యర్థంబులు దలఁచి
నలువొంద మీకు విన్నపము గావించి 11940

యిరవొంద మీ రానతిచ్చినసరణిఁ
దిరుగంగఁ దనతోడఁ దెలుపుమటన్న
నా విన్నపమ్ము సేయఁగఁ బూనినాఁడ
నీవేళ నవి యాన తిమ్ము నావుఁడును
చిన్నారిమోముపైఁ జిఱునవ్వు నెరయఁ
గన్నుఁగొనల నిండి కరుణ దైవాఱ
సేవింపుచున్న కాంచీపూర్ణుతోడ
నా వేల్పురాయఁ డిట్లని యానతిచ్చె
నతఁ డెఱుంగనియట్టి యర్థము గలవె?
యతఁడు సర్వజ్ఞుఁ డీయవనిలోపలను 11950

( 887. సత్సంప్రదాయస్థాపనవిషయకప్రార్థనాప్రకారము. )

ఇటువలెఁ దాను నీయిందఱకరణి
నటియింపఁగాఁ గోరి నను వేఁడినాఁడు
ఐన నే మయ్య రామానుజార్యుండు
తా నాత్మలోపలఁ దలఁచునర్థమ్ము
లెవ్వరు తనగురు డెద్ది యుపాయ
మెవ్వఁడు పరతత్త్వ మెద్ది సన్మతము
అని యెన్ని నాఁడు మహాపూర్ణగురుఁడె[1]
తనగురుం డలప్రపదనముపాయంబు
తత్త్వంబు నేను సద్వైతంబ మతము
తత్త్వార్థ మిది ప్రపదనమున కరయ 11960
నంతిమస్మృతి వల దని చెప్పు మనిన
నంతట నరిగి రామానుజార్యునకు
నావిధం బంతయు నానతిచ్చుటయు
భావించి యాశ్చర్యపడి ముద మంది
చెలువుమీఱంగఁ గాంచీపూర్ణుపాద
ముల వ్రాలి యమ్మహాముని సమ్మదమున
నలమహాపూర్ణుని నాశ్రయింపంగఁ
దలఁచి డెందమున సంతస మిగురొత్తఁ

( 888. రామానుజకృతశ్రీరంగయాత్రాప్రకారము. మధురాంతకనగరప్రాప్తిక్రమము. )
మహాపూర్ణాఖ్యగురువరసంమేళనము.

బరువడి శ్రీరంగపట్టణంబునకు
నరుగుచు మధురాంతకాగ్రహారమున 11970

Note :— కాంచీ శ్రీ వరదరాజప్రదత్తప్రత్యుత్తరక్రమము:—

"అహమేవ పరం తత్త్వం దర్శనం భేదమేవ చ ।
ఉపాయేషు ప్రపత్తిఃస్యాదంతిమస్మృతివర్జనమ్ ॥
దేహావసానమోక్షం చ మహాపూర్ణం సమాశ్రయ॥ "

నలసి తటాకనాయకుఁ డను నచటి
జలజలోచనునివాసముఁ జేర వేగి
దైవయోగమున న త్తటి మహాపూర్ణుఁ
డావేళ పనుటంబుఁ దై యేగుదెంచి
యిటమీఁదఁ దను గాంచి యీడేర్తు ననుచు
నటవచ్చివచ్చి యాహాగిమందిరమున

( 869, రామానుజకృతప్రార్థనాప్రకారము. కాంచీక్షేత్రవైభవకథనము. )

నున్నట్టి యాదేశికోత్తముఁ గాంచి
వెన్నెలఁ బొడఁగన్న వెన్నెలపులుఁగు
నరవి భానుని గన్న జలజంబుకరణిఁ
గర మర్థి పాదపంకజముల వ్రాలి 11980
యున్న రామానుజు నొగి కౌఁగిలించి
కన్నీరు దుడిచి యంగములెల్ల నివుర
నామహాపూర్ణున కాలత్కృపాచార్యుఁ
డామోద మొసఁగ నిట్లని విన్నవించె
నుపదేష్ట మగుచు హితోపదేశంబుఁ
గృపఁజేసి నను గటాక్షింపంగవలయు
నన విని శ్రీకాంచి యల్లదే యింక
ననతిదూరము మన మటఁ బోయినపుడు
శేవగాఁ బుణ్యకోటిచ్ఛాయ నచట
దేవనాథునిసన్నిధిని సకలములు 11990
నలయామునాచార్యు నన్నియు మీరు
తెలివిమీఱఁగఁ బ్రసాదించెద రనినఁ

( 870, యామునాచార్యదృష్టాంతకథనము. దేహానిత్యత్వప్రదర్శనము. )
ద్వయమంత్రార్థోపదేశక్రమము.

గటకటా మున్నె యుంగరె యామునార్య
నటఁ బోయి కనియెద మని పోయినప్పు

క్షేమయ్యె దేహంబు లెన్న నిత్యములై
యీమెయి మీ రానతిత్తురే యిపుడు
కృపసేయు మనిన నాకృతి లక్ష్మణునకు
నపు డారమాపతి యగ్రభాగమున
వకుళమూలమున నాళ్వందారుమదిని
ప్రకటించి గురుపరంపరమూలమనువు 12000

ద్వయముఖ్యములను నర్థముతోడఁగూడ
దయసేసి రామపోదరున కిట్లనియెఁ
దొలుత రాముఁడు భరతునకుఁ బాదుకల
నిలఁ బ్రోవఁ దా నిచ్చి యేగినకరణి
నాకీతి నను బ్రోవ యామునేయుండు
సారంబు లగు తమచరణపద్మములు
మనుమణియునుగూడ మాయందుఁ బెట్టి
మునుకొని యరిగిరి ముక్తి భూస్థలికి
సామంతమునకు వాచ్యంబై సదాని
క్షేమమై నీకుఁ జూపెద రమ్మటంచు 12010

( 871. రామానుజార్యప్రత్యాగమనము. )

నంచితంబుగ లక్ష్మణార్యుండుఁ దాను
గాంచికి నేతెంచి కాంచీపురీశు
నతిభక్తిఁ గాంచి రామానుజార్యునకు
మతినెన్న పేఁడై తన్మంత్రవాచ్యుండు
అనుచు నానతియిచ్చి యాఁఋమాసంబు
లనురక్తి శిష్యుతో నచ్చోట నుండి
సకలహితోపదేశములు ఛాత్రునకుఁ
బ్రకటింపుచుండె నాపై నొక్కనాఁడు

(872. కూపజలాహరణగురుపత్నివిషయకవృత్తాంతము)

తమదేవి రామసోదరుని దేవియును
గోమరారఁ జని యొకకూపంబునందు 12020

పొరిది నీళ్లను జేదుచును జేదకుండ
లిరువుర నొరయ నయ్యెడ లక్ష్మణార్య
కాంత కులంబులక్రమ మేర్పఱించి
కాంతాళమునఁ జేతికలశంబుఁ గొట్టి
తనయింటి కరిగె నత్తఱి మహాపూర్ణు
వనిత యేతెంచి యవ్విధమ్ము చెల్వునకుఁ
దెలిపిన నాలోకదేశికుం డాత్మ
నలికి యెక్కడ వైష్ణవాపచారంబు
వచ్చునో యని శిష్యవరుతోడఁ జెప్ప
కచ్చోటు వాసి చయ్యన రంగపురికిఁ 12030

(873. శ్రీరంగనగరప్రాప్తిక్రమము. నిజాగమనకారణకథనము.)

జనియె నామై ననుష్ఠానంబు సేసి
యనురక్తితోడ రామానుజార్యుండు
చనుదెంచి గురునివాసమునకు నరిగి
యనుపొందుభక్తి నిజాచార్యునడుగఁ
గోరి యచ్చోట దెలకొనియున్నవారు
శ్రీరంగమునకు వేంచేసిరి యనిన
నాతోడఁ బిల్చి యానతియీక యిట్టు
లీతఱి నరుగుట కేమికారణమొ?
యన విని వారు మహాపూర్ణగురుని
వనిత మీవనితయు వాకిటిబావి 12040

జలములు చేఁదంగఁ జని చేఁదుచున్న
బలువిడి నొండొరుభాండము లోసెకఁ

దమకుండ మీఁకుండ తాఁకుబెట్లనుచుఁ
దమకించి యాభిజాత్యంబులు దలఁచి
గ్రక్కున మీఁకొమ్మ కనలి చేకుండ
వ్రక్కలు సేయు నవ్వడువు దా నెఱిఁగి

( 874. శ్రీవైష్ణవాపచారభీతికథనము. సదుపాయాలోచనాది. )

కలఁగి మిక్కిలి దమకాంతఁ గోపించి
యలుకుచు శ్రీవైష్ణవాపచారంబు
లోనఁగూడదు నిచ్చోట నున్న నిం కనుచుఁ
జని తన్నుఁ గనలి లక్ష్మణదేకుండు 12050

నేమిసేయుదు నింక నియ్యపచార
మేమిటం బెడఁబాయు నిట్లు రాఁదగునె
యరయంగఁ బ్రతికూల యగుభార్య విడుచు
టిరవొందఁగా శాస్త్రహితమే తలంపఁ
బెనఁటిదైనట్టి సంసృతి యింత రోఁత
యని యాత్మ నొకయుపాయంబుఁ జింతించి

( 875. రామానుజార్యస్వీకృతసన్న్యాసాశ్రమక్రమవర్ణనము. )

యసురక్తిఁ దనదేవి నటఁ బుట్టినింటి
కనిపెదుకై వడి ననిపి గొబ్బునను
జెన్నొందు నాహస్తిశిఖరమందిరుని
సన్నిధానంబున జనులెల్ల వినఁగఁ 12060

దక్కక సోదరీతనయు దాశరథి
దక్కఁ దా సకలబాంధవుల డించితిని
అని హస్తిశైలనాయకునిచే సర్వ
జనులు సన్నుతి సేయ సన్న్యాస మంది
తనగురుం డగుహస్తిధరణీధరేశు
ననుమతి మతమున కరుదెంచినంత

నాశ్రితసురభూజ మగువేల్పుచేత
నాశ్రమస్వీకార మలవడం జేసి

( 876. రామానుజార్యమహావైభవరీతివర్ణనము. )

యలలక్ష్మణాచార్యుఁ డని సర్వజనులుఁ
బలుక రామానుజభక్తమందారు
చెలియలికొమరుఁ డాశ్రితపారిజాత 12070
మలఘుప్రతిష్ఠితునంశ మైనట్టి
సలలితగురుఁడు దాశరథి యవ్వేళఁ
దను నొందు దక్కఁగఁ దక్కినబంధు
జనము డించితి వని సన్న్యసించుటయు
విని యమ్మహాత్ముఁ డెవ్విధి నన్ను విడువ
నని యెఁ గృతార్థుండ నైతిఁ బొమ్మనుచు

( 877. శ్రీవత్సచిహ్నాఖ్యగురువరప్రాదుర్భావక్రమము. )

నాసమీపమునఁ గూరాగ్రహారమున
భాసిల్లు లోకైకపావనమూర్తి
యలసర్వనేత్రునియంశమై మిగులఁ
జెలువారు శ్రీవత్సచిహ్నదేశికుని 12080
ననురక్తిఁ దోఁకొని యతఁడును దాను
జని కాంచినున్న లక్ష్మణమౌనివర్యు
సేవించి పాదరాజీవయుగ్మంబు
తావిఁ జొక్కుచు షట్పదంబులై వ్రాలి
కృపచేసి మముఁ గటాక్షింపంగవలయు
నిపు డని వినుతింప నెంతయుఁ బ్రీతిఁ
బంచసంస్కృతులుఁ జొప్పడఁజేసి వారి
కంచితపరమరహస్యంబు లొసఁగి

శరధిగంభీరు దాశరథి గూరేశు
గురుని నిర్జితదేవగురుని నెంతయును 12090

( 878. శిఖాయజ్ఞోపవీతత్యజనాయుక్తత్వప్రతిపాదనము. )

ప్రేముడి నేసి రాప్రియశిష్యవర్యు
లామానిచంద్రుని యఖిలసేనలను
రమణఁ జేయుచు నంతరంగులై యుండి
రమలవిద్యామనోహరమూర్తు లగుచు
నంత యాదవమాత యాత్మజుఁ జూచి
యెంతయు వగచి నీ కిట్లుండఁ దగునె [1]
యఖిలకర్మములకు నధికార మొసఁగు
శిఖయు జన్నిదమును జెల్లఁబోవిడిచి

---

Note 1:—యాదవప్రకాశకృతయతిధర్మసముచ్చయే సన్న్యాసలక్షణప్రకరణే:—

"త్రిదండం వైష్ణవం లింగం విప్రాణాం ముక్తిసాధనమ్ ।
నిర్వాణం సర్వధర్మాణామితి వేదానుశాసనమ్ ॥
త్రిదండముపవీతం చ వాసః కౌపీనవేష్టనమ్ ।
శిక్యం కవచమిత్యేతత్ బిభృయాద్యావదాయుషమ్ ॥

హీనో యజ్ఞోపవీతేన యది స్యాత్ ధ్యానభిక్షుకః ।
తస్య క్రియా నిష్ఫలాః స్యుః ప్రాయశ్చిత్తం విధీయతే ॥
గాయత్రీసహితానేవ ప్రాజాపత్యాన్ సమాచరేత్ ।
పునః సంస్కారమాహృత్య ధార్యం యజ్ఞోపవీతకమ్ ॥

ప్రధార్యం వాసససంస్కారం వైష్ణవం మునిభిః స్మృతమ్ ।
సర్వాశ్రమేషు వసతాం స్త్రీశూద్రాణాం ద్విజోత్తమ ! ॥
ఉపవీతం త్రిదండం చ పాత్రం జలపవిత్రకమ్ ।
కౌపీనం కటిసూత్రం చ న త్యాజ్యం యావదాయుషమ్ ॥"

యీమెయి నుండుట యిది శాస్త్రవిహితమె
రామానుజార్యగౌరవమున నీవు 12100

( 879. తత్ప్రాయశ్చిత్తవిషయనిర్ణయాది. )

సురుగతి శిఖయు యజ్ఞోపవీతమును
ధరియింపు మనిన నాతల్లి నీక్షించి
దండి నిన్నా త్రైకదండినై యిట్టు
లుండితి శిఖయు యజ్ఞోపవీతమును
నేరీతి ధరియింతు నివి పూనుకొఱకు
నారయ నింకఁ బ్రాయశ్చిత్తముగను
వలగొనవలయు భూవలయుంబు తనకు
బలము లేదని యార్తిఁ బడి కను మూయఁ
గలలోనఁ జనుదెంచి కరిరాజవరదుఁ
డిలచుట్టి రాకున్న నేమయ్యె వలదు 12110

( 880. రామానుజార్యప్రదక్షిణవైభవము. యాదవప్రకాశసన్యాసప్రాప్తిక్రమకథనము )

రమణతో నీవు మారామానుజార్యుఁ
దమకంబు డిగ్గి ప్రదక్షిణం బొకటి
చేసిన భూప్రదక్షిణము సాంగముగఁ
జేసినవాఁడవేఁ జెప్పినకరణి
నొనరించి లక్ష్మణార్యునియొద్ద నాతఁ
డొనరించు సన్న్యాస మొనరింపు మనినఁ
గల మేలుకాంచి యక్కల విశ్వసింప
కలకాంచిపూర్ణుని నావేళఁ గాంచి
యీడెఱం గంతయు నెఱిఁగించి మీర
లీతెఱం గిభశైలహేమాంబరునకు 12120

నెఱిఁగించి యతఁ డానతిచ్చినరీతి
నెఱిఁగింపవలయు నా కిటమీఁద ననినఁ

( 881. శ్రీవరదరాజస్వప్నవృత్తాంతకథనము. రామానుజసేవాప్రణామము. )

దడయక శ్రీహస్తిధరణీశు నట్ల
నడిగి యేతెంచి యిట్లనియె నాఘనుఁడు
జలజలోచనుఁడు నీస్వప్నంబునందు
నెలమితో మును పానతిచ్చినకరణి
సవరింపు మనియెఁ దోంచక యని యనిన
వివరించి యంతయు వెటఁ గందుకొనుచు
యాదవుఁ డరిగి రామానుజమౌని
పాదపద్మములకుఁ బ్రణమిల్లి పొగడి 12130

( 882. యాదవప్రకాశప్రాప్తపునరుపనయనక్రమము. )
త్రిదండధారణాది.

సేవించి వడిఁ బ్రదక్షిణముగా వచ్చి
యీవిధం బంతయు నెఱిఁగింప నతఁడు
కరుణ దైవాఱ లక్ష్మణదేశికుండు
నురుతరం బైన వేదోక్తమార్గమున
నయమారఁ బునరుపనయనంబు సేసి
యయుకరం బగు త్రిదండాశ్రమం బొసఁగి
యతని గోవిందనామాంకితుం జేసి
యతులితసకలరహస్యంబు లొసఁగి
నిజశిష్యుగాఁగ మన్నించి యచ్చోటఁ
ద్విజగంబు లెఱుఁగ వర్తిఁలుచుండె నంత 12140

యామునాచార్యపాదాసక్తమతులు
రామానుజార్యు చర్యలు విని యలరి

( 883. శ్రీరంగప్రవేశావశ్యకతానిరూపణము. )

శ్రీరంగమున రంగశేషపర్యంకుఁ
జేరి విన్నపములు చేసి యగ్గించి

రామానుజుండు దర్శనగురుం డగుచు
స్వామి యెల్లపుడు నిచ్చట నుండవలయు
నన విని రంగనాయకుఁడు సంతసము
మునుకొని శ్రీనాథమునివంశుఁ డైన
రంగనాయకుని చేరఁగఁబిల్చి మిగుల
నంగవింపుచుఁ గాంచి కరిగి వేవేగ 12150
ననుఁగొంద నేయుపాయంబున నైనఁ
గొనిరమ్ము లక్ష్మణగురుని నిక్కడికి

( 884. గురుపరగానభైభవప్రదర్శనాది. )

నన విని ప్రణమిల్లి యాగాయకేశుఁ
డనురక్తిఁ గాంచికి నరుదెంచి యంత
వరదుఁడు పరిజనస్పైభవస్ఫూర్తి
యరుదారఁ గొలువున్నయత్తఱి వచ్చి
ఘనమైన తనదివ్యగానంబు సొగయ
వినుపించి యానాదవేదిఁ జొక్కింప
వలనుగా మెచ్చి యావరదుఁడు కొంక
వలదు వేఁడుము నీకు వలయు నర్థమ్ము 12160
లన విని రామానుజార్యుని నాకు
వనమాలి వరద యీవలయు నావుఁడును
వరదుం డీతఁడు దక్క వలయునర్థంబు
లరుదార నిచ్చెద ననిన గాయకుఁడు

( 885. శ్రీరంగనగరప్రాప్తిక్రమము. )

రామావతార వారక రెండుమాట
లీమెయి మీ రానతీ నెట్లు వచ్చు
ననిన నేమరితి మే మప్పుడే యనుచుఁ
గనకాంబరుండు లక్ష్మణమానివరుని

నిచ్చినఁ బొంగి రంగేశుగాయకుఁడు
మచ్చికతోడ నమ్మౌనిఁ దోకొనుచు 12170
శ్రీరంగమునకు వేంచేయు నవ్వేళ
శ్రీరంగపతి తనసేనానితోడఁ
బరమభాగవతులు పరిచరజనము
నరుదార నెదురుగా ననిపి వెండియును
నాపూని తమకడ కరుదెంచువేళఁ
బ్రేమమై నెదు రేగి పెక్కుచందములఁ

( 886. శ్రీరంగనాథాజ్ఞాప్రకారకథనము. )

ముదమున నడుగుఁదమ్ములఁ బ్రసాదించి
తుదలేనివేడ్కతోఁ దోకొనివచ్చి
నాలక్ష్మణార్యుండు నఖిలభాగవత
జాలంబుతోఁగూడఁ జనుదెంచి భక్తి 12180
శ్రీరంగనాథుని చెలువంబు కన్ను
లారంగ మఱియు నందంద సేవించ
నారంగవిభుఁడు రామానుజాచార్యుఁ
జేరంగఁ బిలిచి మచ్చికసేసి నీవు
నొగి నేనె పాలింపుచున్న విభూతి
యుగము నీకిచ్చితి నొకకొంత లేదు
పన్ని మామకగృహపరికరాదులకు
నన్నిటికిని గర్తవై యుండు మనిన
నామెడ రంగనాయకుని దివ్యాజ్ఞ
త్రోయక యమ్మౌనితోయజతరణి 12190

( 887. రామానుజార్యస్వీకృతశ్రీరంగమందిరధర్మకర్తృత్వక్రమము. )
తత్పరిపాలనపై ఖరి.

నిఖిలేశుఁ డగురంగనిలయుకోవెలకు
నఖిలంబునకు గర్తయై తాను నిలిచి

యగు ననువారల నగు నంచు మెచ్చి
తగ దనువారలఁ దగ దంచుఁ దిగిచి
యామీఁద నిజశిష్యుఁ డగునకలంక
భూమీశుఁ డనురాజపుంగవు నొకని
నారంగపురమున కధికారిఁ జేసి
శ్రీరంగపతి సమంచితవై భవముల
నెప్పటికంటెఁ దా నినుమడి గాఁగఁ
దప్పక నడుచుచుచందంబు సేయించి 12200

( 888. యామునాచార్యకథితతత్త్వార్థోపదేశక్రమము. )

యట నొక్కనాఁడు మహాపూర్ణగురుని
బటుభక్తి సేవించి పదముల కెరగి
యనురక్తి మీకు నయ్యామునాచార్యుఁ
డొనరంగ నుపదేశ మొసఁగినయట్టి
ఘనరహస్యము లింకఁ గలిగినఁ దనకుఁ
జనువు మీఱంగఁ బ్రసాదింపవలయు
నన విని యతిపూర్ణుఁ డాయామునేయ
ముని యొసంగినయర్థములు మున్నున్న
కల వెల్ల నీ కలకాంచిలోపలనె
తెలిపితి మిందు సందేహంబు లేదు 12210

అని తమసుతుని రామానుజార్యునకు
వినుతశిష్యుని జేసి వెండియుఁ బలికె
యామునమానిరహస్యముల్గొన్ని
ప్రేమమై నెంతయుం బ్రియశిష్యులైన

( 889. గోష్ఠీపురక్షేత్రయాత్రాప్రకారము. )

యలతిరుమలనంబి కలదామధరుని
కలగోష్ఠిపూర్ణున కనఘుఁ డైనట్టి

యలరంగనాథ గాయకునకు నెలమిఁ
దెలిపినా రవి నీవు దెలిసికొ మ్మనిన
ఘనమైన శిష్యసంఘముతోడఁగూడ
ననురక్తి రామానుజాచార్యుఁ డంత 12220

శ్రీగోష్ఠిపూర్ణుని సేవించుకొఱకు
శ్రీగోష్ఠిపురికి వేంచేసి యాగురుని
గని భక్తి పాదపంకజముల వ్రాలి
మనమార నలచరమశ్లోకమునకుఁ
జనునర్థ మెద్ది ప్రసాదింపవలయు
ననిన నాగురువరుం డట్లు కా కనుచు

( 890. గోష్ఠీపూర్ణాచార్యగురునకు రామానుజభక్తిశోధనక్రమవర్ణనము. )

రామానుజునిమనోరాగంబుఁ దెలియు
నీమాటు పోయి రమ్మొకఁగింతు ననిన
నీరీతి ముని పదియేడువారములు
సారెకుఁ దిరిగి వేసారక మదిని 12230

జింతింపుచుండంగ శ్రీరంగమునకు
నంత శ్రీగోష్ఠిపూర్ణాఖ్యశిష్యుండు
చను దేర నపుడు లక్ష్మణమౌనివరుఁడు
తనలోనియార్తియంతయుఁ దోఁచునట్లు
తెలిపి యాఘనుని కిత్తెఱఁగెల్ల మీరు
చెలువార వేగి గోష్ఠిపూర్ణునకును

( 891. రామానుజకృతవిజ్ఞాపనప్రకారము. పునరాగమనక్రమము. )

నెఱఁగించి తలఁపులో నిరవొందువగపుఁ
దరలంగఁ జేయు మిత్తఱి నని పనుప
నరిగి యాఘనుఁ డంత నలగోష్ఠిపూర్ణు
గురున కీతెఱఁగు సేకొని విన్నవింప 12240

ననయంబు హర్షించి యాదేశికుండు
తనశిష్యుఁ బిలిచి యుత్తటి నీవు వోయి
తనదు పవిత్రంబు దండంబుఁ దాల్చి
కొని పెరవారిఁ దోకొనిరాక తాన
యేతెంచెనేని నేనిత్తు నటంచుఁ
దోతెమ్ము మానిచంద్రుని వేగ ననుచు
ననిపిన నరిగి రామానుజార్యునకు
నానర నవ్విధమంతయుం దేటపఱిచి
రమ్మన్న నుప్పొంగి రామానుజుండు
సమ్మదం బెసఁగ దాశరథిఁ గూరేశుఁ 12250

( 892. పునరాగమనప్రార్థనాప్రకారాది. )

దోకొని యాతనితోడ నేతెంచి
యాకరుణానిధి నాచార్యవర్యు
సేవింప నపుడు గోష్ఠీపూర్ణుఁడనియె
నావేళ చెంత రామానుజుతోడఁ
గరమర్థి నిన్ను నొక్కనినె రమ్మనిన
నిరువుర నీవెంట నిటకుఁ దేఁ దగునె
యనినఁ బవిత్రంబు నలఘుదండంబుఁ
గొని పని విను మనం గోరి యేనట్ల
యీవేళ మీరానతిచ్చినయట్ల
వేవేగ నిల పని వింటి నాపుడును 12260

( 893. గురూపదిష్టమంత్రరత్నరహస్యార్థప్రకారము. )

నిండారుకూరిమి నీ కిందులోన
దండ మెవ్వరు పవిత్రం బెవ్వ రనిన
దండ దాశరథియే దండంబు గూర
మండలేశ్వరుండె నామకపవిత్రంబు

నన విని మోదించి యాంగోష్ఠిపూర్ణుఁ
డనియె నే నొసఁగు రహస్యార్థ మీవు
నీయిరువురుఁ దక్క నెవ్వరితోడ
మాయానఁ జెప్పకు మఱి మానివర్య
యని రహస్యంబున నాపరమార్థ
మొనర మానీంద్రున కుపదేశ మొసఁగి 12270

( 894. రామానుజకృతమంత్రరత్నప్రకటనపరిపాటి. ఆచార్యవాక్యోల్లంఘనదోష-
ప్రదర్శనము. )

యనిపిన యతిపతి యామఱునాఁడు
ఘనతరశ్రీగోష్ఠి కానాథుఁ డైన
శ్రీవరుతిరునాళ్లు సేవించుకొఱకు
శ్రీవైష్ణవాళి వేంచేసియుండంగ
నందఱు వినుచుండ నాచరమార్థ
మందంబుగాఁ జెట్టి యానతిచ్చుటయు
నామాట విని యప్డు డాగోష్ఠిపూర్ణుఁ
డామౌనిఁ జేరంగ నఱిముఱి వచ్చి
యేమోయి యిటకు మీ రిరువురుఁ దక్క
నీమహనీయార్థ మెవ్వరితోడఁ 12280

జెప్పకు మని బుద్ధి చెప్పితి నానఁ
దప్పి యీగతి సేయఁ దగునె నీ కిపుడు
క్షితిగురుతోడ బొంకినవాని కరయ
గతి యెద్ది తుది నరకమె కాక యనిన

( 895. రామానుజార్యప్రత్యుత్తరక్రమశైలి. గురువరసంతోషాతిశయము.
యతిరాజనామప్రదానక్రమము. ద్రవిడప్రబంధోపదేశాదిక్రమకథనము. )

ననిడు రామానుజుం డాగోష్ఠిపూర్ణుఁ
గని రెండుక్కురుఁడు నరకముఁ బొంద నేమి

యిందఱు మీకృప నిడేరి శౌరిఁ
జెందుదు రని యేను జెప్పితి ననినఁ
గౌఁగిటఁ జేర్చి లక్ష్మణమానివర్యు
వీఁగనికూర్మితో వినుతులు చేసి 12290

యిల సర్వలోకుల నీడేర్పవచ్చు
నలవాఁడ వీ వని యందంద పొగడి
యిటమీఁద దొరఁకొని యీదర్శనంబు
పటుగతి నీపేరఁ బరఁగు నెల్లెడల
నని నరం బిచ్చి నిజాత్మజు శిష్యు
నొనరించె నప్పు డయ్యోగిచంద్రునకు
యతిపురందరుఁ డంత నాగోష్ఠిపూర్ణు
నతిభక్తి వీడ్కొని యరిగె సంతటను
శ్రీమాలికాధరుచే ద్రవిడాగ
మామోదకరరహస్యంబు లెఱింగి 12300

( 896. శ్రీరంగనగరప్రాప్తిక్రమము. ఏకదండియతికృతశాస్త్రవాదప్రచారము. )

కరమర్థి శ్రీరంగగాయకుచేతఁ
బరిపూర్ణతద్గానభంగులు దెలిసి
శ్రీరంగమున నిట్లు శిష్యశేఖరుల
కారూఢి వేదాంత మానతియిచ్చు
చున్నయత్తఱి దండ నొక యేకదండి
క్రన్నన గంగసంగడినుండి వచ్చి
తనతోడ శాస్త్రవాదము సేయుమనుచు
ననయంబు గర్వించి యతిరాజుఁ జూచి
యెుండొరు వాదింప నోడినవారు
దండిమైఁ గొల్చు నాతనిశిష్యవరుఁడు 12310

గానలయునడన్నఁ గని లక్ష్మణార్యుఁ
డావాక్యమున కంతె యంగీకరించి

( 897. సప్తదశదినపర్యంతపరస్పరశాస్త్రవివాదప్రకారము. )

సొలయక యుద్బాహుసుందరనామ
దళితహిరణ్యుముందరి కేగుదెంచి
నిండారుకణఁకతో నిలిచి. యస్యైక
దండితోఁ దొడరి యుద్దండుఁడై పేర్చి
పదియేడుదినములు పట్టినచలము
వదలక వాదించి వాదించి మదిని
వేసరి యతిరాజు వెడఁగన్న మాయ
నాసమయమున రంగాధీశ్వరుండు 12320

( 898. ప్రతివాదినిరసనసాధనాయుక్తివిశేషప్రాప్తిక్రమము. ఏకదండియతిపరాజయము. పునరుపనయనత్రిదండకాషాయధరణక్రమవర్ణనము. రామానుజార్యరచితవేదాంతదీప-వేదాంతసార-గద్యత్రయ-గీతావివరణాదిగ్రంథరత్నవైభవము. రామానుజమునిశిష్యగణమహిమ. )

చనుదెంచి ప్రతివాదిజయహేతియుక్తి
నొసరంగ నుపదేశ మొసఁగ మేల్కాంచి
యామఱునాఁడు రామానుజాచార్యుఁ
డామహాప్రతివాది నలవోక గెలిచి
దయతోడ నయ్యేకదండి కవ్వేళ
నయమారఁ బునరుపనయనంబు చేసి
మగుడ ద్రిదండాశ్రమముఁ బ్రసాదించి
తగశిష్యవరుల కెంతయు ముఖ్యుఁ జేసి
సాదరుం డగుచు వేదాంతదీపంబు
వేదాంతసారము వేద్య మైనట్టి 12330
అరవిందదళలోచనార్చనాక్రమముఁ
గర మొప్పు సొబగుల గద్యత్రయంబుఁ
దళుకొత్తుచున్న గీతావివరణము
నలవడఁజేసి వ్యాఖ్యానంబు చేసి

చుక్కలలో నొప్పు సోముచందమున
నొక్కటఁ బరమశిష్యులతోడఁ గూడి
దెసలకు వెంచేసి తిమిరసంతతుల
పసగరగొనియెడు భానుచందమునఁ
బరమతవాదులఁ బరపి యచ్చోటి
ధరణీశ్వరుల శిష్యతములఁ జేయుచును 12840

( 899. శిష్యసంఘసహితరామానుజార్యదిగ్విజయప్రకారము. )
కాశ్మీరదేశశారదాపీఠభాసురశారదాదేవీసల్లాపనక్రమము.

భాయనికడఁక నుద్భటశిష్యనరుల
నాయాయితిరుపతు లందునిల్పుచును
వెలయ నీరీతి దిగ్విజయంబు చేసి
యిల వలగొని యిట్టు లేతెంచుచుండ
సార కాశ్మీరదేశమునందునున్న
శారదాపీఠదేశమున కేతేర
శారదనీరదసంకాశ యైన
శారద యప్పు డాసంయమీంద్రునకు
నెదురేగి పదముల కెరగి నుతించి
ముదమున నిజవాసమునకు నేతేర 12850

రామానుజుండు శారదఁ జూచి యేమి
నామీఁద నీ వింత నంటుజేసెదవు

( 900. శంకరకృతవేదాపార్థక్రమము. రామానుజార్యకృతసదర్థప్రకారవర్ణనము. )
శారదాదేవీసంతోషక్రమము.

అన విని వాణి యిట్లనియె నోమౌని
వినవయ్య జగదేకవిఖ్యాతచరిత!
మునుపొక శ్రుతివాక్యమునకు శంకరుఁడు
ననమాలి కపిగుదవర్ణ నేత్రుండు

అని యథార్థముఁ జెప్ప నది తప్పటంచు
దనుజారి పంకజదళనేత్రుఁ డనుచు[1]
నీవంబు పార్థ నెన్నితి వందుకొఱకు
భావించి సంతోష భరితనై యిప్పు 12360

డారీతి నిన్నుఁగన్నంత నుప్పొంగి
యీరీతిఁ జేసితి నేను నీయెడను
సన్నుతనిఖిలశాస్త్రంబులన్నియును
నున్నవి యచ్చోట యోగీంద్రచంద్ర!
చేకొని నీవలసినశాస్త్ర మిపుడు
కైకొను మనిన లక్ష్మణయోగివరుఁడు
భువనంబులన్నియుఁ బొగడఁ దా మున్ను
పవరించు వేదాంతసంగ్రహం బెత్తి
యేమునేసినశాస్త్ర మిది దీనఁదప్పు
లేమేనిఁ గల్గిన నెఱిఁగింపు మనుచుఁ 12370

దనకేల నున్నపుస్తకము పంకేజ
తనుజాతరాణిహస్తములకు నొసఁగ
ధరలోన సకలశాస్త్రముల కెల్లపుడు
సరకు గైకొనక మెచ్చక యుండువాణి
యిరవొంద నాథునుఁ డిచ్చుశాస్త్రంబు
శిరసావహించి మెచ్చినవాణివరుఁడు

( 901. బోధాయనవృత్తినామకసద్గ్రంథప్రాప్తిక్రమము. రామానుజమునికృతోత్తమ
గ్రంథమహిమ, పురుషోత్తమక్షేత్ర-వేంకటాహోబిలాదిభగవన్మందిరమంగళాశాసనక్రమము.
విఠ్ఠలరాజవిషయకానుగ్రహప్రకారము. )

సత్తటీ బోధాయనాఖ్యనిర్మాణ
వృత్తి శారదచేత వేగఁ గైకొనుచుఁ

---

Note 1 :-[రామానుజార్యప్రతిపాదిత సదర్థశ్లోకము 502 పుటే ముద్రితము.]

గడుఁ బెక్కువిధములఁ గంజాతసూను
పడఁతుక నంత సంభావించి కదలి 12380

యంత శ్రీపురుషోత్తమాధీశుఁ గాంచి
సంతసంబునఁ గూర్మశైలేశుఁ జూచి
యలసింహశైలనాయకుఁ బొడగాంచి
సలలితాహోబలేశ్వరుని సేవించి
శ్రీవేంకటాధీశు సేవింపఁగోరి
శ్రీవేంకటాగంబు చేర నేతెంచి
శ్రీపురంబునకు వేంచేసి నెయ్యమున
నాపురిఁ బాలించు నలవిఠ్ఠలేంద్రు
క్షితినాయకుని గృప సేసి యచ్చోట
నతనిచే నొకయగ్రహారంబుఁ గొనుచు 12390

( 902. చతుస్సప్తతిసంఖ్యాక-శ్రీవైష్ణవకుల-సింహాసనాదిస్థాపనక్రమము. )
అనంతార్యశిష్యవరప్రాప్తిక్రమము. రామానుజకృతవేంకటాద్రిక్షేత్రప్రాప్తిక్రమము.

నఖిలశాస్త్రజ్ఞులు ననుపమేయులును
నిఖిలసన్నుతులును నిజశిష్యు లగుచు
చెలఁగి డెబ్బదినాల్గుసింహాసనముల
నలవడువారిలో నందుఁ గొందఱను
బరమానురక్తి ముప్పదిమందిఁ బిలిచి
తిరమొంద నందుఁ బ్రతిష్ఠఁ గావించు
నప్పు డయ్యతివరుఁ డా శేషనగము
తప్పక సేవింపఁ దద్దయుఁగూర్మిఁ
బరమపావనుఁ డైన పరకాలముఖ్యు
లరుదెంచి శేషాంశ మనుచు నగ్గిరిని 12400

ద్రొక్కనోడిరి తాము దొడిబడ నింకఁ
ద్రొక్కరా దన విని తుందుడుఁగొనుచు

నతుల శేషాంశ మైనట్టి యనంత
పతిశిష్యముఖ్యు లేర్పడఁగ నిట్లనిరి
యీవేళ మీ రిది యెక్కకయున్న
దేవ మీశిష్యులు దిక్కులవారు
నారోహణము సేయ రగ్గిరిమీఁద
నీరీతి తగవు గా దేవేళ మీరు

( 903. తిరుమలనంబిసామాశగురువరరచితానుగ్రహప్రకారము. )

నాగేంద్రశైలేంద్రనాథు సేవింప
వేగ నవశ్యంబు వేంచేయవలయు 12410

ననిన రామానుజం డాశైల మెక్క
చనువేళ నావచ్చుచందంబుఁ దెలిసి
యలతిరుమలనంబి యనురక్తిఁ బంపి
వలనొప్ప వేంకటేశ్వరుఁ డారగించి
దయసేయు తత్ప్రసాదము గైకొనుచు
రయమున నరిగి శ్రీరామానుజులకు
నెదురుగాఁ జనిన మౌనీంద్రుఁ డావేళఁ
ద్రిదశవందితుఁ డైన తిరుమలనంబిఁ
గనిభక్తిఁ బాదపంకజముల వ్రాలి
తనరారఁ దత్ప్రసాదము స్వీకరించి 12420

యారయ సర్వలోకాచార్యులైన
మీ రీప్రసాద మిమ్మెయి దేరవలెన
పనిఁ బూని యొకపిన్నపాపనిచేత
ననిపినం జాలదే యనిర నాథునుఁడు
నిప్పుడు మీ రానతిచ్చినకరణి
తప్పక నగర మెంతయు వెదకితిని

( 904. శ్రీవైష్ణవస్వరూపవైభవప్రదర్శనము. )

అకడ వైష్ణవు లగువారిలోన
నాకన్న నెన్న చిన్నలు లేరు గానఁ
దెచ్చితినన్ను నాదేశికుమాట
మచ్చిక వేదాంతమార్గమై యున్న 12430

వినయంబు మోదించి యామునివరుఁడు
తనశిష్యవరుల నందఱ విలోకించి
కంటిరే యిపుడు వేంకటపూర్ణుమహిమ
గెంటక మది నహంకృతిలేశమైన
నరయక పెద్దవారైన నైచ్యంబు
దొరయంగ భాగవతులమెడాటమున
రూపించుచున్న స్వరూప మందఱకు
దీపింపఁ జేసి తాదేశికుం డయ్యె
నరుసతో శ్రీవైష్ణవస్వరూపంబు
లరయనిగతి నుండు నని నుతింపుచును 12440

( 905. వేంకటశైలారోహణక్రమము. రామానుజార్యకృతస్వామిపుష్కరిణీ
తీర్థస్నానాచరణాది. )

గాముధేనువులు గల్పభూజములు
కామితార్థము లిచ్చుకమనీయమణులు
సిద్ధరసంబులు సిద్ధమూలికలు
సిద్ధమునీంద్రులచేఁ జెన్నుమిగులు
నన్నగరాజంబు నహిరాజమూర్తి
కన్నులపండువు గాఁగఁ జూచుచును
దిరుమలనంబితోఁ దిరమొందఁ బ్రేమఁ
దిరుమలమీఁది కేతెంచి కోవెలకు
నలచుట్టివచ్చి పావనతలభరణి
నిఖిలసంసారతమిస్రౌఘతరణి 12450

ననుపమసుకృత సంహతిజన్మధరణి
జననుతయును నైన స్వామిపుష్కరిణి
స్నానంబుఁ జేసి యాచక్కిఁ జెన్నొందు
భూసతి సాక్షినోంపునఁ గౌఁగిలించి

( 906. శ్రీవరాహస్వామిసేవాప్రణమనాది, వైకుంఠగోపురద్వారప్రాప్తిక్రమము. )
శ్రీవేంకటేశదేవాలయప్రదక్షిణప్రణామాచరణాది.

ఫణిరాజుపై నొక్కపద మూఁది దివ్య
మణిమయభూషణమండితుం డగుచు
దైవాలు పుడమిపై దలిమోముదమ్మి
తావులు గ్రోలెడుధరణీవరాహు
సేవించి యటఁ బ్రదక్షిణముగా వచ్చి
యావరణంబుల కాదియై మిగుల 12460
గామరారు వైకుంఠ గోపురంబునకుఁ
బ్రమదంబుతో మున్న ప్రణమిల్లి యంతఁ
జనుదెంచి గారుడస్తంభంబుచక్కి
వినతుఁడై చెంత గ్రొవ్విరిసాల కేగి
వలనొప్పు చంపకావరణంబు వేగ
వలచుట్టి వచ్చి యాస్వామిపుష్కరిణి
తోయంబు లోని యుత్తుంగభాగమున
నాయమహీకులపతియవతార మగుచు
దిరుగనిచింతలుం దెరలించునీడ
దిరుగనిచింత కెంతేభక్తి మొక్కి 12470

( 907. ఆనందనిలయవిమానదర్శనప్రకారము, మహామణిమంటపప్రాప్తిక్రమము,
నరసింహపాదసేవాప్రణామాది. )

రమణ రెండవగోపురము దాఁటి లోని
కమలమహానసాగార సేవించి

నెలకొని యానందనిలయాఖ్య మగుచు
నలువొందు మణివిమానంబు సేవించి
పటుమహామణి మంటపంబు సేవించి
యట వచ్చి తురగతార్క్ష్యాహినాయకుల
సేవించి దనుజారి సేనాధినాథు
సేవించి నరసింహు సేవించి తార్క్ష్యు
సేవించి నిత్యుల సేవించి కూల్మి
నావేళ లోనికి నరుదెంచి యచటి　　　　12480

( 908. శ్రీవేంకటేశపాదాదికిరీటపర్యంతదివ్యసౌందర్యభూషణాదివర్ణనము. )

పంచాస్త్రకోటుల భాసంబు మించి
పంచవిగ్రహముల భాసిల్లి పసిండి
గజ్జలు నందియల్ కనకాంబరంబు
గొజ్జంగిముత్యాలకుచ్చుకటారి
బెడఁగుగాఁ గటిమీఁద బెరసిన కేల
నుడుగక వరముల నొసఁగు కెంగేలు
నుదరబంధంబు కేయూరహారములుఁ
బొదలుతావులుతట్టు పునుఁగుపై పూఁత
కుడిరొమ్మునమచ్చ యక్కునవెలకొన్న
కడలికన్నియదివ్యకంఠసరంబు　　　　12490

ధళధళఁ దుళగించు దరము, చక్రంబు
బలసిచూపట్టెడు పాణిపద్మములు
బింబాధరమ్మ నొప్పెడుకపోలములు
కంబుపోతంబు నెక్కొన మూఁడుగళము
మకరకుండలములు మణికిరీటంబు
వికసితధవళారవిందనేత్రములు

చల్లనిచూపును జారునాసికయుఁ
దెల్లనిమెఱుగుము త్రియపునామమును
గలిగి యొంతయును శృంగారభావంబు
మలయునయ్యలమేలుమంగామనోజ్ఞ 12500

( 909. రామానుజార్యవర్ణితశ్రీవేంకటేశపరతత్త్వవైభవాది. )

సేవించి ప్రణమిల్లి చేరి సన్నుతులు
గావించి పులకితగాత్రుఁడై చెలఁగి
శ్రీరంగమున నున్న శేషపర్యంకుఁ
డీరూపమున వచ్చి యిటఁ బొడచూపెఁ
బరతత్త్వ మీతండె పరయోగిహృదయ
పరిపూర్ణుఁ డితఁడె శ్రీపతియును నితఁడె
పరమకారుణికుండు భక్తవత్సలుఁడు
పరవాసుదేవుఁ డీపంకజాక్షుండె
జగములు వొడమింప సమయింపఁ బ్రోవఁ
దగువాఁడు నితఁడె యీధరణీధరంబె 12510

( 910. దినత్రయపర్యంతవేంకటక్షేత్రనివాసక్రమము. ఆకాశగంగాతీర్థస్నానాది. )
ఏకాంగిసామకహరికింకరవరస్థాపనక్రమము.

వైకుంఠ మితని కెవ్వరు సరి గలరె?
యీకమనీయనగేంద్రరాజునకు
సరి లేరటంచు వేసరణుల వేద
శిరముల సన్నుతి చేసి సద్భక్తి
తనరఁ దీర్థప్రసాదము లన్వయించి
యనురక్తి దివసత్రయంబు వసించి
యాకాశగంగాదు లైనతీర్థములు
చేకొన్నభక్తితో సేవించి యంతఁ

గరమర్థి శౌరికై ంకర్యంబు సలుప
నిరువదినలువుర నేకాంగివరుల 12520

( 911. పుష్పమాలాసమర్పణాదికై ంకర్యప్రకారము. యతిద్వయపట్టాభిషేక స్థాపనక్రమము. శ్రీ వేంకటేశదేవాలయముద్రాప్రదానాది. )

సలవడ శ్రీమాలికాదికై ంకర్య
ములు సేయ నిలిపెఁ బ్రేముడి పెచ్చు పెఱుగఁ
దనమాఱు గాఁగ నిద్దఱయతీశ్వరులఁ
గ్రమమునఁ బట్టంబుఁ గట్టి యావేళ
నిఖిలేశుఁ డైన శ్రీనిలయునివసతి
కఖిలంబునకుఁ గర్తవై యుండు మనుచుఁ
గపిరాజరూపసంకలితముద్రికలు
కృపచేసి శ్రీవేంకటేశున కెరగి
మగుడి యంతటఁ దిరుమలనంబి తాను
దగువేడ్క నమ్మహీధ్రము డిగ్గి వచ్చి 12530

( 912. తిరుపతినగరప్రాప్తిక్రమము. రామాయణోపదేశస్వీకరణము. )
శిష్యజనపరివృతరామానుజమునికృతరామసేతుసేవాప్రకారాది. స్నానావిధహరి-
మందిరసేవాప్రకారాది

శ్రీపతిపురికి వేంచేసి యచ్చోట
నేపారు శేషాచలేశ్వరపూర్ణ
వాసంబునందు నివాసంబు చేసి
భాసిల్లు వేంకటపతిపూర్ణుచేత
ననురక్తి రామాయణార్థమంతయును
విని తాను మును పు గావించినయట్టి
సలలితవేదాంతసంగ్రహముఖ్య
ములు వినుపింప నామోదించి యతఁడు

తనయుని రామసోదరమహానిశిష్యు
నొనరింప నప్పు డయ్యోగిచంద్రుండు 12540

మహితాత్ము నలతిరుమలనంబిశిష్యు
సహజు విద్యోదయసంపన్ను ననఘు
గోవిందుఁ డనుదేశికుని గాంచి యతఁడు
గావించు నాచార్యకైంకర్యమునకు
నరుదంది శ్రీవేంకటాచలపూర్ణుఁ
గరమర్థి వేఁడి యాఘనుఁ దోడ్కొనుచు
సేతువుదనుక వేంచేసి శ్రీవిభున
కాతతనిజనిలయము లైనయట్టి
యాయాతిరుపతు లచట శోభిల్లు
తోయజనాభుమూర్తులును సేవించి 12550

( 913. శ్రీరంగనగరప్రాప్తిక్రమము. బోధాయనసూత్ర శ్రీభాష్యాదివేదాంతా
ర్థోపదేశరూపశిష్యానుగ్రహప్రకారము. )

మరలి రంగాధీశుమందిరంబునకు
నరుదెంచి యచట బోధాయనవృత్తిఁ
గనుఁగొని శ్రుతులవాక్యముల కైక్యముగఁ
బనుపడి యొప్ప శ్రీభాష్యంబు చేసి
యలఘుశిష్యులకు వేదాంత మంతయును
దెలఁగి వ్యాఖ్యానంబు సేయుచునుండె

( 914. హరిద్వేషపూర్ణచోళరాజవృత్తాంతము. శివపరతత్త్వకథనము. )

నంతటఁ గులపాంసుఁ డైనట్టిచోళ
కాంతవంశజుఁడు దుష్కర్మపుంజంబు
భవపాదమతి యైన పరమపామండుఁ
డవిరళదుష్టసాహసకృత్యపరుఁడు 12560

వారనితనకర్మవాసనవలన
ధారుణిపై నచ్యుతద్వేషి యగుచు
హరుఁడే పరబ్రహ్మ మనియెడుభ్రాంతి
కరము డెందమ్మునఁ గడలుకొనఁగఁ
దలకొని జగతి విద్వాంసులనెల్లఁ
బలువిడి భటులచేఁ బట్టితెప్పించి
పనుపడఁగా "శివాత్పరతరంనాస్తి"
యని వ్రాలు వెట్టుండ యనుచుఁ బెట్టింప
నపుడు చతుర్గ్రామి యనువైష్ణవుండు
కపటాత్ముఁ డగుచోళకాంతునిఁ జూచి 12570

( 915. రామానుజయతివరాశ్చర్యవైభవము. చోళరాజకోపప్రకారము. )

యురయ సవైదిక లగువారు గాఁగ
నిరవొంద నిట్టివ్రా లిడిరిగా కరయఁ
జూచియావేద పదప్రతిష్ఠాప
నాచార్యుఁ డైన రామానుజార్యుండు
నీరీతిఁ జేయునే ? యిందిరావిభుఁడె
నారయఁ బరతత్త్వ మని నిల్పుఁగాక
యన నేయిచల్లినయనలంబుకరణిఁ
గనలి చోళుండు కింకరుల రావించి
యరిగి శ్రీరంగంబునం దున్నయట్టి
హరిభక్తు రామానుజార్యుని వేగఁ 12580
బట్టి తెండని చెప్పి పనిచిన భటులు
పట్టినకడఁకతో బలువిడివచ్చి
గట్టిగా నేగి లక్ష్మణమానిమఠముఁ
జుట్టి పిల్చెదు మిమ్ము చోళుఁ డీవేళ

డన విని వాకిట నడరి వైష్ణవులు
చని లోననున్న లక్ష్మణమౌనిఁ గాంచి
యీవార్తనంతయు నెఱిఁగింప నంతఁ
బోవుద మని మౌనిపుంగవుఁ డనిన
నాకూరనాథుఁ డిట్లనియె మౌనీంద్ర!
నీకార్య మంతయు నెఱుఁగరు మీరు 12590

పరమపాషండియై భ్రాంతియై వాఁడు
హరుఁడె దైవం బని యందఱిచేత
వ్రాలు వెట్టింపుచు వరుస మీచేత
వ్రాలు వెట్టింప నీవడువున భటుల
దేవర నటకుఁ దోతెమ్మని కదలి
యీవేళఁ బుత్తెంచె నీవేలఁ దుదిని
వేదశాస్త్రంబులు విభజించి గెలుచు
వాదంబు గాదు వివాదంబు గాని
విలసిల్ల నిలలోన విత్తులకొల్పు
గలుగఁ దక్కినవెల్లఁ గలిగింపవచ్చు 12600

( 916. చోళరాజకృతకూరనాథస్వరూపనిర్ణయప్రశ్నము. )

గావున దేవర కలిగినఁ జాలు
మావంటివారల మఱియుఁ దేవచ్చు
వాఁ డతిక్రూరుండు వానికి గురుఁడు
లేఁడు దేవుండును లేఁడు మౌనీంద్ర!
తావకవేషంబుఁ దాల్చి యేనిపుడు
వేవేగ నరిగెద వివరించిచూడ
నిట నుండఁ దగవు! గాదీవేళ మీర
లెట కేని వేంచేయుఁ డితరవేషమున
నన విని రామానుజార్యుండు శిష్యుఁ
గనుగొని యెంతయు గారవం బెసఁగ 12610

వాని గెల్చుటకు శ్రీవత్సాంకగురుని
చే నగు ననుచు నిశ్చితబుద్ధితోడఁ
దను కమండలమును దండకాటులును
బ్రమదంబుతోఁ గూరపతికిఁ దా మొసఁగ
నని పూని రెండవ యతినాథుఁ డగుచు
వివరింప నాకూరవిభుఁడు వేవేగఁ
జనుదేర చోళరాజన్యునిభటులు
గనుఁగొని యితఁడె లక్ష్మణమౌని యనుచుఁ
గొనిపోయి యప్పు డాక్రూరునియెదుట
నునుప నాపాపాత్ముఁడుగ్రతం బిలిచి 12620

( 917. "శివాత్పరతరం నాస్తి ద్రోణమస్తి తతఃపర" మిత్యాదిప్రతికక్షివాక్యప్రకటనము. )

పనునడఁగా "శివాత్పరతరం నాస్తి"
యనుచు వ్రాలిడు మని యాను గంటంబు
చేకొని తాన యిచ్చిన జంకు లేక
కైకొని వైష్ణవకల్పభూజంబు
తగఁ "ద్రోణమస్తి తతః పరం" బనుచు
బెగడ కందున వ్రాలు వెట్టెఁ బెట్టుటయు
నని చూచి యుగ్రుఁడై యాజ్ఞయు సేయఁ
దివిరిన యాధరాధిపుఁ జూచి హితులు
ఇతఁడు రామానుజుఁడే కాఁ డటన్న
నతనిఁ దోతెండని యనిచిన భటులు 12630

( 918. శ్రీరంగపట్టణప్రాప్తిక్రమము. వేంకటేశస్తుతిరూపపద్యరచనానుక్రమము. )
రామానుజమునిరచితాద్భుతకార్యాదాది.

సరువడి శ్రీరంగపట్టణంబునకు
నరిగెడిసమయంబునందు ముందుగను

సరవిగా వెల్లలజాతిగృహస్థు
కరణి వేవేగ లక్ష్మణదేశికుండు
పురము వెల్వడిపోవ భోరన భూమి
వరభటవర్గంబు వడి మీఱి కదియ
నావేళ శ్రీలక్ష్మణాచార్యవర్యుఁ
డావచ్చు కెఱఁగి సయ్యనఁ జెంతనున్న
యిసుము గై కొని వేంకటేశ్వరుమీఁద
నసమానగతిఁ దొల్లి హరిచి త్తయోగి  12640

యొసఁగించు నొకపద్య మెన్ని లోలోనె
మసలక యట నభిమంత్రించి వైవ
నది రాజభటులకు నడ్డమై పొదలి
కదలక పర్వతాకారమై యుండె
నాకొండవలె నున్న యది చూచి భటుల
మూకఁ రానోడుచు మొనచెడి యరిగి

( 919. యాదవాచలప్రాప్తిక్రమము. చోళరాజకృతకూరేశనేత్రాపహరణరూపా-
జ్ఞాక్రమము. కూరనాథధైర్యసాహసకార్యాది. )

సొదట వేగ రామానుజమౌని
యాదవాచలమున కరిగె నంతటను
నడుగక గపటసన్యాసియై తనదు
కడకు వచ్చుట యని కడుఁ గోపగించి  12650

తివిరి చోళుఁడుకూరతిలకునేత్రములు
తివియుండ యని పల్కఁ ధీరుఁడై యాతఁ
డనియె విష్ణుద్రోహి వగునిన్ను నిపుడు
గనుఁగొన్న యిటువంటికన్ను లేమిటికి
నని తమగోళ్ళతో సపుడు రాఁ దిగిచి
కొనుచు నచ్చో నెలకొనియుండలేక

సరగున నిజశిష్యసహితుఁడై రంగ
పురమున కరిగి యాపోయివచ్చుటయు
వడిమీఱ నొకశిష్యవరు లక్ష్మణార్యు
కడకుఁ బంపుడయు శీఘ్రమె యేగి యతఁడు 12660

( 920. క్రమికణ్ఠచోళవృత్తాంతకథనము. రామానుజసంతోషప్రకారము. )

వినుపింప నంతయు విన్ననై వగచి
కనలి శ్రీవేంకటగ్రావేశుఁ దలఁచి
జగతీశ చోళపాషండి నిర్మూల
మగుఁ గాక యని యొకయర్ఘ్య మిచ్చుటయు
వెలయుప్రహ్లాద విద్వేషిపైఁ గనలు
నలనరసింహునియనువున నింగి
శ్రీవేంకటేశుండు శితఖడ్గధార
నావేళ కలలోన నరుదెంచి వాని
గళనాళపార్శ్వంబు ఖండింప నందు
విలవిల మనుచుఁ బర్వినకంపుతోడ 12670

బెడిదంపుఁబు రువులు ఛేదించి పుచ్చి
వెడలంగఁ జోళుండు విడిచెఁ బ్రాణమ్ము
లదిమొదల్ క్రిమికంఠుఁ డనుపేర వాఁడు
విదితుఁడై యుండెఁ దద్వృత్తాంత మెల్ల
రామానుజార్యుఁ డారసి సంతసించి
యామోదవార్ధి నోలాడి యామీఁద

( 921. శ్రీరామానుజకృత-శ్రీనారాయణప్రతిష్ఠాప్రకారము. రామానుజార్యప్రదత్త-
స్వకీయార్చావిగ్రహక్రమకథనము. )

నారాయణాచలనాథు శ్రీనాథు
నారాయణుని భక్తి నాట సేవించి

యతనియుత్సవచేరమయొన్నదగిన
జితకాము శతరూప శ్రీమనోహరుని 12680

యదుగిరీశ్వరు సంపదాత్మజాహ్వయుని
త్రిదశవందితుని బ్రతిష్ఠ గావించి
శ్రీరంగమునకు వేంచేయ నుంకింప
నారసి యట నున్న యఖిలవైష్ణవులు
నేతెంచి మిముఁ బాసి యచ్చోట నుండ
నేర్తుమే మౌనీంద్ర! నీరూపు గాఁగ
నొకవిగ్రహము నిట నునిచిన మాకు
నకలంక! యొకమనసై యుండు ననినఁ
దమవిగ్రహంబు చందమున కెంతయును
నమర నర్చావిగ్రహంబుఁ జేయించి 12690

( 922. కూరేశస్వీకృతాప్రాకృతక్షేత్రవైభవప్రశంస. )

యట నిల్పి సకలశిష్యావృతుం డగుచుఁ
బటుగతి శ్రీరంగపట్టణంబునకు
వేంచేసి యాకూరవిభుఁ గౌఁగిలించి
యంచితభక్తిమై నందంద పగచి
వరదుఁడౌ హస్తిపర్వతరాజవాసు
కరమర్థి వినుతించి కరుణ దైవాఱ
నలకూరనాథున కప్రాకృతాత్మ
విలలోన వెలయంగ నిప్పించి యంత
నలకూరనాథుని యాత్మజువంశ
తిలకు శ్రీభట్టరుఁ దిరమొందుప్రేమఁ 12700

దోకొని రంగనాథుని భజియింపఁ
జేకొన్నభక్తి నీ శ్రీరంగనాథుఁ

( 923. శ్రీపరాశరభట్టాఖ్యకూరనాథసుతవైభవము. )

డాకూరనాథుని యాత్మసంభవుని
గై కొని నిజపుత్త్రుఁ గావించుకొనియె
నంతట రామానుజార్యశేఖరుఁడు
సంతసింపుచు నివాసమునకేతెంచి
యమదండదండనం బైన త్రిదండ
మమలవేదత్రయం బన నొప్పమిగుల
మలయక యుభయ మీమాంసానురాగ
ములు తమ్ము మిగులఁ బ్రేముడిఁ జుట్టినట్లు 12710
మలయుచు భూషాయమానకాషాయ
ములు కటితటి శిరములఁ జెన్నుమీఱ

( 924. రామానుజమునిమహిమ. తదీయత్రిదండకాషాయోర్ధ్వపుండ్రవైభవము. )

రామానుజసిద్ధాంతప్రశంస.

గాత్రంబుమీఁద సంకలితసద్బ్రహ్మ
సూత్రమా నలబ్రహ్మసూత్రంబు మెఱయ
హరిజయస్తంబంబు లందుఁ దన్ముద్ర
లిరవొందఁ బెట్టిన యింపు దీపింప
మొనసిన నిజబాహుమూలంబులందు
గనుపట్టు శంఖచక్రములు శోభిల్ల
బాలమున్నీటిలోపల నీదులాడి
బాలుండు మెట్టిన పదపంక్తి యనఁగ 12720
సురుతరాయతధవళోర్ధ్వపుండ్రములు
కరము శోభిలఁగ లక్ష్మణమానివరుఁడు
అజనుతరామానుజార్యసిద్ధాంత
విజయధ్వజంబుల విత్తయె మిగులఁ

దళుకొత్తుచుండు త్రిదండముల్ దాల్చి
యలఘుశాస్త్రాధారు లగుయతీశ్వరులు

( 925. శ్రీవైష్ణవాచార్యస్థాపనప్రకారము. శిష్యప్రశిష్యోపదేశక్రమవర్ణనము. )
ఏకాంగివరస్థాపనప్రస్తావము. ఉభయవేదాంతశాస్త్రప్రవచనాది.

పొందుగా నిజపార్శ్వముల నేడునూఱు
మంది యెంతయు నసమానులై యంత
చెలఁగుడెబ్బదినాల్గుసింహాసనములఁ
కలిగినదేశికాగ్రణు లేడువేలు 12730

నెన్నంగఁదగినట్టి యేకాంగిముఖులు
నున్నతిం గొలువ సర్వోన్నతుం డగుచుఁ
బరమతమదతంతిపంచాస్య మగుచు
నరుదార నుభయవేదాంతశాస్త్రములు
గలిగినశిష్యసంఘములకు నెమ్మి
చెలఁగ వ్యాఖ్యానంబు సేయుచునుండె

( 926. యోగీంద్రచరిత్రశ్రవణపఠనాదిశుభఫలనిరూపణము. )
గ్రంథసమర్పణక్రమము. కవివంశమహిమ. నిజకావ్యప్రశంస.
పరమయోగివిలాసగ్రంథనిగమనము.

నురుభక్తితోడ నియ్యోగీంద్రవరుల
చరిత మొక్కొకమాఱు జను లెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివినఁ బేరుకొనిన
నెనలేనియిష్టంబు లెసఁగించు వనుచు 12740

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి వబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సర్వముఖ్యభక్తసంతతికి

సంకీర్తనంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నకుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ 12750

సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృత మైన పరమయోగివిలాస సుకృతి
నతులితంబుగ నష్టమాశ్వాస మయ్యె.

ఇతి శ్రీతాళ్ళపాక-తిరువెంగళనాథసూరికృతిషు పరమయోగి
విలాసద్విపదకావ్యము సంపూర్ణము.



శ్రీః

# పరమయోగివిలాసప్రతిపాదిత-
# సుప్రసిద్ధపదానుక్రమణిక.

వి=విశేషణము. | ఆ=ఆచార్య.
ఉ=ఉపమానము. | ప్ర=ప్రధాననగర.

సుప్రసిద్ధపదానుక్రమణిక

| పదనామావళి. | పుటసంఖ్య. |
|---|---|

| పదనామావళి. | పుటసంఖ్య. |
|---|---|

## య

| పదనామావళి. | పుటసంఖ్య. |
|---|---|

